# శ్రీ తులసీ రామాయణము

\- మిట్టపల్లి ఆదినారాయణ






తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

# శ్రీ తులసీ రామాయణము

మహాకవి తులసీదాస విరచిత రామచరితమానస్

మహాకావ్యమునకు ఆంధ్రానువాదము


అనువాదకుడు

**మిట్టపల్లి ఆదినారాయణ**

పర్యవేక్షకులు

**కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు**





ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.**

**2014**

**SRI TULASI RAMAYANAMU**

Telugu Translated By

**Mittapalli AadiNarayana**

T.T.D. Religious Publication Series No:1021


*T.T.D First Edition:- 2014*

Copies:1000

Price:

*Published by :*
**M.G. GOPAL**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

***D.T.P:***
Office of the Editor- in- Chief,
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందుమాట

రామాయణమహాకావ్యం జగత్ప్రసిద్ధి పొందినది. ఈ భూమిపై ఆచంద్రతారార్కం, పర్వతాలు, నదులు మొదలగునవి ఉన్నంత కాలం, ప్రజలహృదయాలలో ఈకథ చిరస్థాయిగా నిలిచి వుంటుంది. వ్యక్తులు, కుటుంబము, రాజ్యపరిపాలన, ప్రజాసంక్షేమం, స్నేహం, సోదరప్రేమ, అనుబంధం, ఐకమత్యం, దుష్టశిక్షణ, శిష్టరక్షణ మొదలైన సార్వకాలీన మరియు సార్వజనీన, సత్యాల ఆధారంగా ఈ కావ్యాన్ని రచించడమే దీనికి కారణం. ఈ కావ్యంలోని ప్రతి ఘట్టం, ప్రతి పాత్ర, తమ ఔచిత్యాన్ని నిలుపుకుంటూ, హద్దులను అతిక్రమించకుండా, మర్యాదలను పాటించడం విశేషం.

కనుక మానవులందరికి ఇది ఆదర్శం, ఆచరణీయమైనది.

కాలక్రమేణ దేశ, విదేశభాషలలో అనేకమంది రచయితలు, కవులు, అనేక విధాలుగా ఈ మహాకావ్యాన్ని ప్రజలకు అందించి మన్ననలను పొందారు. పరమభక్తాగ్రేసరుడైన తులసీదాసు హిందీ భాషలో అత్యంత సరళమైన శైలిలో “రామచరిత మానస్” అనే రామాయణ కావ్యాన్ని రచించారు. నేటికిని ఉత్తరభారతదేశంలో ఇంటింటా ఈ కావ్యాన్ని పారాయణచేసి పూజించటం జరుగుతున్నది.

ఇటువంటి మహత్తర కావ్యాన్ని శ్రీ మిట్టపల్లి ఆదినారాయణగారు తెలుగులో అనువదించి సఫలీకృతులైనారు. రామచరిత మానస్ భక్తుల పాలిటి పారిజాతం. భక్తి, జ్ఞాన, వైరాగ్యాల సమన్వయ వాహిని “తులసీరామాయణం”. శ్రీరామచంద్రుని అనుగ్రహంతో సరళమైన, మధురమైన శైలిలో రచించుటమేగాక, అనేక సభలలో, సమాజాలలో,

ఆలయాలలో, ఆశ్రమాలలో పురాణప్రవచనం చేసి భక్తుల మన్నలను పొందారు.

ధార్మిక సాహిత్య ప్రచురణలో భాగంగా, తిరుమల తిరుపతి దేవస్థానం ఈ "తులసీ రామాయణము"ను ప్రచురిస్తున్నది. పాఠకులందరూ చదివి తరించాలని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారి సేవలో....

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి.

# తులసీ సౌరభం

## "కరుణశ్రీ"

మీ కరకమలాలను అలంకరించిన గ్రంథం శ్రీతులసీరామాయణం, ఇది హిందీ భాషలో శ్రీ గోస్వామి తులసీదాస మహాకవి రచించిన "రామచరిత మానసం" అనే మహాగ్రంథానికి తెలుగు అనువాదం. అనువాద కర్తలు శ్రీ మిట్టపల్లి ఆదినారాయణ గుప్తగారు. శ్రీ గుప్తగారు సంపన్నులు మాత్రమే కాక సదాచార సంపన్నులు. సౌజన్యమూర్తులు. శ్రీరామ భక్తులు. నిరాడంబర జీవనులు. సహస్రచంద్ర సందర్శన సౌభాగ్య సమేతులు.

**"చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్**
**ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్."**

శతకోటి శ్లోకాలతో విరాజిల్లే శ్రీరాముని చరిత్రం అంతటి పవిత్రమైనది. అందలి ఒక్కొక్క అక్షరమూ సమస్తపాపాలను పటాపంచలు చేస్తుంది.

**"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,**
**వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా."**

వేదవేద్యుడైన ఆ పరంధాముడు శ్రీరాముడుగా భూమిమీద జన్మించాడు. పురుషోత్తముడు ఉత్తమ పురుషుడుగా ఉర్విపై ఉద్భవించే సరికి నాదాత్మకమైన వేదం ఆదికవి వాల్మీకి సువర్ణ లేఖిని నుండి రసాత్మకమైన రామాయణంగా ఆవిర్భవించింది. ఈ విధంగా ఆధ్యాత్మికమైన పరబ్రహ్మ స్వరూపం ఆదర్శమానవత్వాన్ని అంగీకరించి దివినుండి భువికి దిగివచ్చింది. శ్రుతి రామాయణాకృతితో క్షితిమీద అవతరించింది. వాల్మీకి మహాకవి అనంతరం అనంత కల్యాణ గుణాభిరాముడైన శ్రీరాముణ్ణి నాయకుణ్ణిగా స్వీకరించి ఎందరో మహాకవులు తమతమ భాషల్లో రామాయణాలను రచించారు. అయితే వాల్మీకి రామాయణం తర్వాత మళ్లీ అంతటి ప్రతిష్ఠ సంపాదించిన

మధురాతి మధురమైన మహాగ్రంథం తులసీ రామాయణమే అనుటలో అతిశయోక్తి అణుమాత్రమూలేదు.

తులసీరామాయణం సకలకలికల్మషహరం, సమస్త సౌభాగ్య సంధాయకం, సహృదయ హృదయంగమం, భక్తిజ్ఞాన వైరాగ్యాల త్రివేణీ సంగమం. రఘుకుల తిలకుని రసభరితమైన రమణీయ చరిత మది.

తులసీదాసు రచించినందువల్ల రామచరిత మానసాన్ని "తులసీ రామాయణం" అని కూడా పిలుస్తారు. తెలుగువారికి బమ్మెర పోతన భాగవతం వలె, కన్నడులకు పంప భారతం వలె, తమిళులకు కంబ రామాయణం వలె, హిందీ వారికి తులసీరామాయణం అత్యంత ప్రియమైన నిత్యపారాయణ గ్రంథం.

పార్వతీ పరమేశ్వర సంవాద రూపమైన తన రామాయణానికి తులసీదాసు "రామచరిత మానసం" అని పేరు పెట్టారు. పరమశివుడు భద్రంగా తన మానసంలో నిక్షేపించుకొన్న రామచరితం కనుక "రామ చరిత మానసం" అనే నామం ఉంచబడిందని తులసీదాసు వక్కాణించారు.

అంతేకాక తులసీదాసు దృష్టిలో తాను రచించిన రామచరితం ఒకమానససరోవరం. వేదపురాణాలు సముద్రాలు, సాధుపురుషులు మేఘాలు రాముని సద్యశమే వర్షం. అటువంటి సజ్జన మేఘాలు సముద్రంలో నుంచి కొనివచ్చి వర్షించిన మంగళకర మధుర మనోహర జలాలతో ఈ మానస సరోవరం నిండి ఉన్నది. అలంకారాలే తరంగాలుగా, చౌపాయి దోహా మొదలైన ఛందస్సులే రంగురంగుల కమలాలుగా ఈ సరోవరంలో విరాజిల్లుతున్నవి. ఈ విధంగా కూడా "రామచరిత మానసం" అనే నామం తన గ్రంథానికి సార్థకం అని తులసీదాసు భావించాడు.

తులసీదాసు మహాభక్తుడు, మహా తపస్వి, మహాకవి. కారణజన్ముడు. లోకజ్ఞుడు. ఆ మహానుభావుడు వాల్మీకి రామాయణం, అధ్యాత్మరామాయణం,



ఆనంద రామాయణం– ఇత్యాది మహా గ్రంధాల నుండీ హనుమన్నాటకం, అనర్ఘరాఘవం, ప్రసన్న రాఘవం మొదలైన సంస్కృత నాటకాలనుండీ రసవంతాలూ, రమణీయాలూ అయిన సన్నివేశాలను ఎన్నింటినో ఎన్నుకొని ఏర్చికూర్చి తీర్చి దిద్ది తన రామ చరిత మానసాన్ని రసజ్ఞ మనోజ్ఞంగా రచించాడు. అందుకనే తులసీ రామాయణం ప్రసన్న మధురమై, పరమ పవిత్రమై, భక్తిరసాయనమై, బహుజన ప్రియమై భారతీయులకు పారాయణ గ్రంథమైనది. వాల్మీకి మహర్షి నారాయణునిలోని నరుణ్ణి దర్శిస్తే తులసీదాసు నరునిలోని నారాయణుణ్ణి దర్శించారు.

తులసీరామాయణం అనేక భాషలలోనికి అనువదింపబడింది. సంస్కృతం, మరాఠీ, గుజరాతీ భాషలో తులసీరామాయణానికి అనువాదాలు పెక్కులు వెలువడ్డాయి. ఒరియా భాషలో నాలుగు అనువాదాలు బెంగాలీభాషలో మూడు అనువాదాలూ అవతరించాయి. మనతెలుగుభాషలో ఏడెనిమిదివరకు గద్య పద్యానువాదాలు వెలసినాయి. భారతీయ భాషలలోనే కాకుండా ఇంగ్లీషు భాషలోకి కూడా ఈ మహాగ్రంథం అనూదితమైంది. ఇటీవల రష్యన్ బాషలోకి సైతం రూపాంతరం పొందిందంటే తులసీరామాయణం ఎంత గొప్ప గ్రంథమో, ఎంతటి ప్రజానురాగం చూరగొన్న మహాకావ్యమో మనం తెలుసుకోవచ్చు.

తులసీరామాయణాన్ని భారతదేశీయులు పరదేశీయులు కూడా ఎన్నో విధాల ప్రశంసించారు.

"పరమ పవిత్రమైన తులసీరామాయణం భక్తులపాలిటి పారిజాతం. ఇది హిందువులకు వేదం వంటిది. ముస్లిములకు పవిత్ర ఖురాను వంటిది." అన్నాడు మహాకవి రహీమ్.

"తులసీరామాయణం పండిన పురుషార్థ ఫలాలతో నిండిన కల్పవల్లి. కామధేనువు పొదుగులో నుండి పొంగి ప్రవహించే పాలవెల్లి. దీని మాధుర్యం చక్కెరను వెక్కిరిస్తుంది. కలకండను చూచి కిలకిల నవ్వుతుంది. ఇక్షురసాన్ని

ఎగతాళి చేస్తుంది. అమృతాన్ని సైతం అపహసిస్తుంది.” అన్నాడు మహాకవి రసఖాన్.

“పవిత్రమైన ప్రయాగలో త్రివేణీసంగమం వలె భక్తిజ్ఞాన వైరాగ్యాల సమన్వయ వాహిని తులసీరామాయణం కడచిన నాలుగు శతాబ్దాలుగా కోట్లాది ప్రజలకు పారాయణ గ్రంథమైన ఈ మహాగ్రంథం ప్రపంచం ఉన్నంత వరకు కోటానుకోట్ల భారతీయులకు ఆరాధ్యం అవుతుందనడంలో అణుమాత్రం అనుమానింపవలసిన పనిలేదు.” అన్నాడు మదన మోహన మాలవ్యా.

“తులసీరామాయణం హిందీ సాహిత్య సరస్వతికి కలికితురాయి వంటిది. తులసీదాసుగారి భక్తి విశ్వాసాలు అనన్య సామాన్యమైనవి. ఆ భక్తి విశ్వాసాలే ఇంత గొప్ప గ్రంథాన్ని భారతీయులకు ప్రసాదించాయి. భగవద్గీత, రామచరిత మానసం– రెండూ మానవజాతికి సంప్రాప్తించిన సారస్వత వరప్రసాదాలు” అన్నాడు మహాత్మా గాంధీ.

“తులసీదాసు మధురమైన శైలిలో, సరళమైన భాషలో పల్లె పల్లెనా, వీథి వీథినీ, ఇంటింటా ఏమీతెలియని మూర్ఖుడుకూడా తెలిసికొని తరించే లాగున అనేకమైన పరమార్థ విషయాలను తన రామాయణం నిండా వెదజల్లాడు” అన్నాడు బాబూ రాజేంద్రప్రసాద్.

“సంస్కృతంలో వాల్మీకి మహాకవీ, హిందీలో తులసీదాసూ ఆచంద్రతారార్కం అమృతాన్ని చిందిస్తూ, ఆనందాన్ని అందిస్తూ ఉండే మహా కావ్యాలను మనకు ప్రసాదించారు” అన్నాడు సి. వై. చింతామణి.

“సమకాలపు కవులందరిలో తులసీదాసుదే అగ్రతాంబూలం, ఆయన వంటి సారస్వతతపస్వి న భూతో న భవిష్యతి” అన్నాడు విన్సెంట్ స్మిత్.

“రామచరిత మానసం తులసీదాసుగారి ఉత్తమోత్తమ సృష్టి. ఉత్తర భారత దేశంలోని హిందువులలో ప్రతి ఒక్కరికీ ఈ గ్రంథాన్ని గురించి



తెలిసినంతగా ఆంగ్లేయులకు బైబిలును గురించి కూడా తెలియదు”. అన్నాడు డాక్టర్ గ్రియర్ సన్.

ఈ విధంగా ఎందరెందరో స్వదేశీయులచేత, విదేశీయులచేత విశేషంగా కొనియాడబడిన అమరకృతి తులసీరామాయణం.

ఇటువంటి రామాయణాన్ని రచించిన తులసీదాస మహాకవిని మధుసూదన సరస్వతి అనే మహాపండితుడు ఈ విధంగా ప్రశంసించాడు.

**“ఆనంద కాననే హ్యస్మిన్ జంగమస్తులసీతరుః,**
**కవితామంజరీ యస్య రామభ్రమర భూషితా”.**

ఈ కాశీ మహాక్షేత్రంలో, ఈ ఆనందవనంలో తులసీదాసు నడయాడుతూ ఉన్న తులసీ తరువు. ఈయన కవితా సుమగుచ్ఛము శ్రీరాముడనే భ్రమరముతో అలంకృతమైనది.

ఈ మహా గ్రంథాన్ని ఇంతకు ముందు శ్రీ భాగవతుల నరసింహ శర్మగారు తెలుగులో పద్యకావ్యంగా అనువదించారు. అలాగే శ్రీ మైల వరపు సూర్యనారాయణమూర్తిగారు కూడా పద్యరూపంగానే ఆంధ్రీకరించారు శ్రీమతులు యేలూరిపాటి లక్ష్మీసరస్వతి, నేలనూతల పార్వతీ కృష్ణమూర్తి, శ్రీ శ్రీనివాస శర్మ గద్యంలోకి అనువదించారు. ఇటీవలనే శ్రీశ్రీశ్రీ కేశవతీర్థస్వామి, శ్రీ పాటీలు తిమ్మారెడ్డి– ఉభయులూ కలిసి “శ్రీరామచరిత మానసము” అనే నామంతో తులసీరామాయణాన్ని సర్వాంగ సుందరమైన ద్విపద కావ్యంగా దిద్దితీర్చారు.

ఇక ఇప్పుడు “తులసీరామ” బిరుద విరాజితులు, శ్రీరామ భక్తులు అయిన శ్రీ మిట్టపల్లి ఆదినారాయణ గుప్తగారు సరళ సుందరమైన భాషలో దీనిని తెనిగించి తమజన్మను చరితార్థం చేసుకొన్నారు. శ్రీ గుప్తగారు సేవాపరాయణులు. దీక్షా తత్పరులు. అనేక స్థలములలో, సభలలో, సమాజములలో, దైవ మందిరములలో, ఆశ్రమ వాటికలలో తులసీదాసు

గారు రచించిన “శ్రీరామచరిత మానసము”ను పురాణ ప్రవచనముచేసి వేలాది భక్తుల మన్ననలను పొందినవారు. మహాత్ముల, మహా విద్వాంసుల ఆశీస్సులను అందుకొన్నవారు. వీరు పండిత, పామరులకు అర్థమయ్యేటట్లు సరళ గ్రాంథికంలో ఆంధ్రీకరించి ఈ విధంగా ఈ మహాకృతిని భక్తజనులకు బహూకృతిగా అందించటం అత్యంత ముదావహం.

సకల జగజ్జననీ జనకులైన ఉమామహేశ్వరులు, విశ్వ కల్యాణ దంపతులైన సీతారాములు ఏతత్ కృతి నిర్మాతలైన శ్రీ ఆదినారాయణ దంపతులకూ తులసీరామాయణ ప్రచారకులకూ పౌరాణికులకూ శ్రోతలకూ పాఠకులకూ సమస్త సౌభాగ్యములు కటాక్షింతురుగాక!

**పరమేశ్వరుడు మున్ను పార్వతీదేవికి**
**వినిపించినట్టి పావన చరిత్ర**
**కాకభుశుండి లోగడ గరుత్మంతున**
**కెరిగించినట్టి సుందర చరిత్ర**
**యాజ్ఞవల్క్య మహర్షి అల భరద్వాజున**
**కానతిచ్చిన మనోహర చరిత్ర**
**మోదమ్ముమై తులసీదాస సుకవి భ**
**క్తులకు దెల్పిన మహోజ్జ్వల చరిత్ర**

**త్రిభువన పవిత్రమగు రఘుప్రభు చరిత్ర**
**వ్రాసె నెనుబది రెండేండ్ల వయసు వాడు**
**మేలి గుణముల జాబిల్లి మిట్టవల్లి**
**ఆదినారాయణాఖ్య మహోదయుండు.**

**కల్యాణభారతి,** **కరుణశ్రీ**
రవీంద్రనగరం, గుంటూరు-6 జంధ్యాల పాపయ్యశాస్త్రి

# గోస్వామి తులసీదాసు జీవిత చరిత్రము

పరమ పవిత్రమైన ప్రయాగ క్షేత్రమునకు సమీపమున “రాజపూర్” అను గ్రామము కలదు. ఆ గ్రామములో ఆత్మారామ దూబే హులసీబాయి అను బ్రాహ్మణ దంపతులు నివసించు చుండిరి. ఆ పుణ్యదంపతులకు క్రీ శ. 1497 శ్రావణ శుద్ధ సప్తమినాడు మూలా నక్షత్ర ప్రథమ పాదమున ఒక బాలుడు జన్మించెను.

పుట్టిన బిడ్డ ఏడ్వలేదు. వాని నోటినుండి “రామ రామ” అను ధ్వని మాత్రము విన వచ్చెను. వాని నోటిలో దంతములుండెను. అప్పుడు పుట్టిన శిశువు ఐదు సంవత్సరముల బాలునివలె కన్పించుచుండెను, మూలా నక్షత్ర విషఘటికలలో విచిత్ర లక్షణములతో తల్లి దండ్రి గండమున పుట్టిన ఆ వింత పిల్లవానిని గాంచి తల్లి దండ్రులు తల్లడమందిరి. అమంగళమును శంకించిరి.

మూడవ రోజున ఆ పిల్లవానిని ‘చునియా’ అనే దాసికి అప్పగించి హులసీబాయి పరలోకమున కేగెను. కొలది దినములలో తండ్రి సైతము మరణించెను. తల్లిదండ్రులు కఱవైన ఆ పసిబాలుని చునియా ప్రేమతో పెంచుచుండెను. బాలుడు పంచవర్ష ప్రాయుడు కాగానే చునియా కూడ చనిపోయెను.

దిక్కులేని బాలుడు దీనుడై ఇంటింటికి తిరుగుచుండెను. ఇది చూచి పార్వతీదేవి వంటి ఒక పెద్ద ముత్తైదువ ప్రతిదినము వచ్చి ఆ చిన్న వానికి అన్నముపెట్టి పోవుచుండెను.

ఈశ్వరుని సంకల్పము విచిత్రమైనది. ఎప్పుడు ఏది ఎందులకు జరుగునో ఎవరికిని తెలియదు. అనంతానందులవారి శిష్యుడైన శ్రీ నరహరి స్వామివారు అచ్చటికి వచ్చిరి. ఆ బాలుని చూచి జాలిపడి “రామ బోలా”

యను నామకరణము చేసి వానిని తనవెంట అయోధ్యకు తీసికొని వెళ్ళిరి. క్రీ.శ.1504 మాఘ శుక్ల పంచమీ శుక్రవారమునాడు నరహరిస్వామి ఆ పిల్లవానికి ఉపనయనము చేసిరి. గురూపదేశమునకు ముందే రామబోలా గాయత్రి మంత్ర ముచ్చరించెను. అది విని అచ్చటి వారందరూ అచ్చెరువొందిరి.

అనంతరము స్వామి బాలునకు వైష్ణవసంప్రదాయము ప్రకారము పంచ సంస్కారములు చేయించి శ్రీరామ మంత్రోపదేశము చేసి అచ్చటనే విద్య నభ్యసింపజేసెను. రామబోలా ఏక సంథాగ్రాహి, ఒక్కమారు గురువుగారు చెప్పగానే సమస్త విద్యలు గ్రహించెను. నరహరి స్వామి తన ప్రియ శిష్యునకు రామాయణ గాథ బోధించెను. ఆ రామ బోలాయే అనంతరము తులసీదాసుగా ప్రసిద్ధుడయ్యెను.

కొన్ని నాళ్ళకు సమస్త విద్యా పారంగతుడైన తులసీదాసు శివక్షేత్రమైన వారణాసికి వెళ్ళి శేషసనాతనులనే మహా విద్వాంసుని చెంత పదునైదు సంవత్సరములు వేదాధ్యయనము చేసెను. అనంతరము తులసీదాసు గురువుగారి అనుమతి గైకొని తన గ్రామమైన రాజపూరునకు వచ్చెను అచ్చట తన వారెవ్వరూ జీవించి యుండనందులకు మిక్కిలి విచారించెను. తల్లి దండ్రులకు యథాశాస్త్రముగా పరలోక క్రియలు నిర్వర్తించి స్వగ్రామమునందే సమస్త ప్రజలకు శ్రీరామ చరితమును వినిపించుచుండెను.

క్రీ.శ. 1576 జ్యేష్ట శుద్ధ త్రయోదశి గురువారమునాడు సమీప గ్రామవాసి భారద్వాజ గోత్రుడైన యొక సద్బ్రాహ్మణుడు అందాలరాశియైన తన పుత్రిక రత్నావళిని తులసీదాసున కిచ్చి వివాహము చేసెను.

ఆ నవ దంపతులు అన్యోన్యానురాగముతో అత్యంతానందముగా దినములు గడపుచుండిరి. ఒకనాడు రత్నావళి సోదరుడు అక్కను చూచుటకు వచ్చెను. అప్పుడు తులసీదాసు మరియొక గ్రామమునకు పోయియుండెను.



సోదరుని బలవంతముచే రత్నావళి తల్లిదండ్రులను చూచి వచ్చుటకై పుట్టినింటికి వెళ్ళెను. తులసీదాసు వచ్చిచూడగా ఇంటిలో రత్నావళి లేదు. ఆయన తన ప్రియురాలైన రత్నావళిమీది యనురాగాతి శయముచే ఆమె వియోగమును భరింపలేక తానుకూడ అత్తవారింటికి ప్రయాణమయ్యెను.

అర్ధరాత్రి, జోరుమని వర్షము కురియుచుండెను. తులసీదాసు తడిసి ముద్దయ్యెను. మధ్యమార్గములో పొంగి ప్రవహించుచున్న నది అడ్డము వచ్చెను. తులసీదాసు ఏ మాత్రము సందేహింపక నదిలో దిగి ఈదుకొనుచు ఆవలియొడ్డునకు పోయెను ఆ గాలివానలో ఆ తడసిన వస్త్రములతో చెదరిన జుట్టుతో అతడు అత్తవారింటికి వెళ్ళి తలుపు తట్టెను. రత్నావళి వచ్చి తలుపు తీసెను. అర్ధరాత్రివేళ తనకోసమై కుంభవర్షములో తడిసి వచ్చిన భర్తను చూచి ఆమె చకితురాలయ్యెను.

రత్నావళి తన భర్త సాహసమునకు ఆశ్చర్యపడి “నాథా! రక్తమాంసముల ముద్దయైన ఈ రత్నావళి కోసమై ఈ అర్ధరాత్రి సమయమున ఇంతటి వానలో ఈ విధముగా పరుగెత్తుకొని వచ్చితిరి. నశ్వరమైన నా దేహముపైనున్న ప్రేమలో శతాంశమైనను ఆ భగవంతుని మీద మీకున్న యెడల మీ జన్మము కృతార్థ మగునుకదా” అని పల్కెను. ఆ మాటలు విని తులసీదాసు మనస్సు చివుక్కుమనెను. అతని హృదయములో తళుక్కున ఏదో మెరుపు మెరసెను అతడు గిరుక్కుమని వెనుకకు తిరిగి రత్నావళి “నాథా! నాథా!” యని ఎంత పిలుచుచున్నను ఏ మాత్రము వినిపించుకొనక వెడలిపోయెను.

తులసీదాసు హృదయములో వైరాగ్య జ్యోతి వెలిగెను. ఆయన అజ్ఞానాంధకారము పటాపంచలయ్యెను. సంసార వ్యామోహము దూరమయ్యెను. జ్ఞాన మార్గము సాక్షాత్కరించెను. తులసీదాసు ప్రయాగకు

చేరెను. అచ్చట గృహస్థ వేషమును త్యజించి సాధువేషమును స్వీకరించెను. అచ్చటనుండి పుణ్యక్షేత్రములు దర్శించుచు పరమ పవిత్రమైన కాశీక్షేత్రమునకు వెళ్ళెను మానససరోవరము దగ్గర వారికి వాయస రూపములో నున్న కాకభుశుండి అను మహాయోగి దర్శనమిచ్చెను.

తులసీదాసు తన అనుష్ఠానంతరము ఆ జలమును ఒక చెట్టుమొదట పోయుచుండిరి. అచ్చట ఉన్న బ్రహ్మరాక్షసుడు శాపవిముక్తుడై నిజరూపము ధరించి తులసీదాసునకు హనుమంతుని జాడ తెలిపెను తులసీదాసు సంతోషముతో హనుమంతుని సందర్శించి "శ్రీరామ దర్శన మిప్పించు" మని వాయునందనుని ప్రార్థించెను. అందులకు హనుమంతుడు "నీవు చిత్రకూటమునకు పొమ్ము. అచ్చట నీకు శ్రీరాముడు దర్శన మిచ్చునని" చెప్పెను.

తులసీదాసు చిత్రకూటమునకు వెళ్ళి శ్రీరామ దర్శనము కొఱకై నిరీక్షించుచుండెను. ఒకనాడు రామలక్ష్మణులు రాజ కుమారులవలె ధనుర్బాణములు ధరించి అశ్వారూఢులై తులసీదాసు ముందుగా వెడలిరి. కాని తులసీదాసు వారిని రామలక్ష్మణులుగా గుర్తింపలేక పోయెను. అంత హనుమంతుని వలన ఆ సంగతి తెలిసికొని ఆయన చాల దుఃఖించెను హనుమంతుడు "విచారింపకుము, శ్రీరాముడు మరల త్వరలోనే నీకు దర్శనమిచ్చు" నని తులసీదాసు నోదార్చెను.

క్రీ.శ. 1550 మౌనీ అమావాస్య బుధవారమునాడు భగవదారాధనకై తులసీదాసు గంధము తీయుచుండెను శ్రీరామచంద్రుడు బాలరూపముతో సాక్షాత్కరించి "బాబా! చందనమిమ్ము" అని అర్థించెను. ఈసారికూడ తులసీదాసు పొరబడునేమోనని హనుమంతుడు చిలుక రూపము ధరించి "తులసీదాసా" నీ అదృష్టము పండినది శ్రీరామచంద్రుడు నిన్ను చందనము



అడుగుచున్నాడు". అని పల్కెను శ్రీరామచంద్రుని త్రిభువన మోహనమైన దివ్య సౌందర్యమును సందర్శించి బ్రహ్మానంద పరవశుడైన తులసీదాసు స్వామికి చందన మర్పించెను. శ్రీరాముడు చందనము నందుకొని కొంత తన శిరమున నుంచుకొని, కొంత తులసీదాసు శిరస్సున నుంచి అంతర్హితుడయ్యెను.

తులసీదాసు హనుమంతుని అజ్ఞానుసారముగా అయోధ్యకు బయలుదేరెను. ఆ దినములలో ప్రయాగ క్షేత్రములో మాఘ మేలా మహోత్సవము జరుగుచుండెను. తులసీదాసు అచ్చట కొన్ని దినములుండి ఒకనాడు ఒక వృక్షము క్రిందనున్న భరద్వాజ యాజ్ఞవల్క్య మహామునులను దర్శించెను. అచ్చట తన గురువుగారు చెప్పిన శ్రీరామాయణగాథనే వారుకూడ చెప్పుకొనుచుండిరి.

ఒకనాడు తులసీదాసుకు పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై "నీవు అయోధ్యకు వెళ్ళి శ్రీరామ చరిత్రను రసవంతమైన రమణీయ కావ్యముగా రచింపుము. అది మాకృపచేత సామవేదముతో సమానముగా ప్రశస్తిగాంచును". అని పలికి అంతర్ధానమైరి. తులసీదాసు శివాజ్ఞను శిరసావహించి అయోధ్యకు చేరెను.

క్రీ.శ. 1574 చైత్రమాసమున శ్రీరామ నవమీ పుణ్య పర్వమున ప్రాతః కాలమున తులసీదాసు గణపతికి నమస్కరించి సరస్వతిని ప్రార్థించి ఇష్టదేవతలను స్మరించి "శ్రీరామ చరిత మానస" మహా కావ్యమును ప్రారంభించెను. 2 సంవత్సరముల 7 మాసముల 26 దినములకు గ్రంథము సర్వాంగ సుందరముగా సంపూర్ణమయ్యెను.

అనంతరము తులసీదాసు శ్రీరాముని ఆజ్ఞానుసారము కల్యాణ రాశియైన కాశికి తిరిగివచ్చి అక్కడ అన్నపూర్ణా విశ్వనాథులకు తన

రామాయణమును పూర్తిగా వినిపించెను ఆ రాత్రి మహా గ్రంథమును దేవాలయములో స్వామి చరణ కమలముల సన్నిధిలో నుంచెను. తెల్లవారి చూడగా ఆ గ్రంథముపై "సత్యం శివం సుందరం" అను అక్షరములు వ్రాయబడి యుండెను. క్రింద పరమేశ్వరుని సంతకము కూడ ఉండెను. గుడితలుపులు తెరచునప్పుడు "సత్యం శివం సుందరం" అను శబ్దమును అక్కడి భక్తులందరూ విని ఆనంద తన్మయులైరి.

తులసీదాసు కీర్తి కాశీపట్టణము నలుకెలంకుల వ్యాపించెను. తులసీదాసు "గోస్వామి తులసీదాసు"గా ప్రసిద్ధికెక్కెను. అసూయాపరులైన పండితులు కొందరు తులసీదాసు పేరు ప్రతిష్ఠలను సహించలేక పోయిరి. వారు ఎట్లైనను మానస మహాకావ్యమును అపహరించి ధ్వంసము చేయవలయునని నిశ్చయించుకొని ఇరువురు దొంగలను ప్రేరేపించి పంపిరి. చోరులు తులసీదాసు గృహమును సమీపింపగనే ద్వారము ముందు ఇరువురు బాలవీరులు ధనుర్బాణములు ధరించి నిలచియుండుట చూచిరి. దొంగల మనస్సు మారిపోయెను వారి మనస్సులలో భక్తిభావము ప్రబుద్ధమయ్యెను. అప్పటినుంచి వారు చోరవృత్తికి స్వస్తిచెప్పి భగవద్భక్తులుగా మారిపోయిరి.

పండితులు భక్త శిరోమణియైన తులసీదాసుపై పగ సాధింపదలచి రామచరిత మానసములోని గుణ దోషములను పరీక్షింప వలసినదిగా మహా పండితుడైన మధుసూదనసరస్వతుల వారిని ప్రార్థించిరి. శ్రీ మధుసూదన సరస్వతీస్వామి తులసీ రామాయణమును తిలకించి అందలి కవితా సౌందర్యమునకు పులకించిపోయిరి. ఇంతటి మహత్తర గ్రంథము మరియొకటి లేదని తీర్పు చెప్పిరి. "ఈ పవిత్ర కాశీక్షేత్రములో గోస్వామి తులసీదాసు నడయాడుచున్న తులసీ తరువు వంటివాడు. ఆయన కవితా మంజరిలోని మధుర మకరందము త్రావి శ్రీరాముడనే భ్రమరము మైమరచి పోయినాడు." అని తులసీదాసును, ఆయన రామాయణ కావ్యమును ప్రశంసించిరి.



మధుసూదన సరస్వతి మాటలు పండితులకు బాధ కలిగించెను, వారు తులసీ రామాయణమును మరియొక విధముగా పరీక్షకు పెట్టిరి. విశ్వనాథస్వామి దేవాలయములో అన్నిటికంటె క్రింద తులసీ రామాయణమును పడవైచి ఆపైన పురాణములను వానిపైన శాస్త్రములను వానిపైన వేదములను ఉంచి గుడితలుపులకు తాళము బిగించిరి. ఉదయమున తలుపులు తెరవగా అడుగున నుంచిన తులసీరామాయణము వేదములపైన నుండెను. అదిచూచి భక్తులందరు సంతసించిరి. పండితులు సిగ్గుపడి తులసీదాసు పాదములపైబడి క్షమాపణ కోరిరి. ఈ విధముగా తులసీరామాయణ మహామహిమ దిగంతముల వ్యాపించెను.

క్రీ.శ. 1623 శ్రావణ బహుళ తదియ శనివారమునాడు గోస్వామి తులసీదాసు అస్సీఘాట్ దగ్గర శ్రీరామ నామము జపించుచు తన పాంచభౌతిక శరీరమును వదలి శ్రీరామ సాన్నిధ్యమును చేరిరి.

–ఇతి శివమ్–

# విషయసూచిక

# శ్రీతులసీ రామాయణము

## ప్రథమ సోపానము

# బాలకాండము

అనన్య హరిభక్తిగల భరద్వాజమహర్షి శమదమాది గుణసంపన్నుడైన మహాతపస్వి, దయానిధి. రామభక్తుడు. ప్రయాగ పుణ్యక్షేత్రమందొక ఆశ్రమము నిర్మించుకొని అందు నివసించుచుండెను.

మాఘమాసములో సూర్యుడు మకరరాశి యందున్నప్పుడు అనేకమంది ప్రజలు ప్రయాగ క్షేత్రమునకు వచ్చి త్రివేణి సంగమములో స్నానము చేయుచుందురు. భక్తి శ్రద్ధలతో శ్రీ మాధవస్వామిని పూజించి అక్షయ వటమును స్పృశించి భగవన్నామ సంకీర్తన చేయుచుందురు.

యాజ్ఞవల్క్యమహాముని స్నానాద్యనంతరము తన ఆశ్రమమునకు వెళ్ళుచుండగా భరద్వాజముని నమస్కరించి అర్ఘ్యపాద్యాదులతో పూజించి పవిత్రాసనమందు కూర్చుండజేసి ఆమహామునీంద్రునితో నిట్లు విన్నవించెను.

''మహాత్మా! రామనామ ప్రభావ మనంతమైనదని, అనిర్వచనీయమైనదని, వేదములు, ఋషులు ఉద్ఘోషించిరి. సదాశివుడు సైత మా రామ నామమును నిరంతరము జపించుచుండెను. కాశిలో మరణించువారికి శివుడు రామనామమును ఉపదేశించునని వినియుంటిని. ఋషిసత్తమా! ఆ రాముడెవరు? దశరథరాముడా? లేక మరియొక రాముడా? సర్వజ్ఞులైన మీరు నాయీ సంశయమును నివారించుడు"

భరద్వాజుని మాటలు ఆకర్ణించి యాజ్ఞవల్క్యముని సంతసించి "భరద్వాజా! నీవు త్రికరణశుద్ధిగా రామభక్తుడవు. నీకు తెలియని విషయము లేమున్నవి? అయినను రామచరిత్రను నానుండి వినగోరి అడుగుచున్నావు. పార్వతీదేవికి కూడా ఒకప్పుడు ఈ సందేహమే కలుగగా శివుడు

రామతత్త్వమును ఆమె కుపదేశించి సంశయనివారణ గావించెను. ఆ చరిత్రయే ఇప్పుడు నీకు చెప్పుచున్నాను. సావధానుడవై వినుము.”

త్రేతాయుగములో ఒకసారి పరమేశ్వరుడు తన పత్నియైన సతీదేవితో అగస్త్య మహర్షి ఆశ్రమమునకు వెళ్లెను. పరమశివుని ముల్లోకములకు అధినాథుడని అగస్త్యుడు భావించి గొప్పగా పూజించెను. రామనామ మహిమను భక్తితో కీర్తించెను. శ్రీరామచరిత్రను వర్ణించెను. ఈశ్వరుడు విని మిగుల ఆనందించి అగస్త్యుని ఆశ్రమములో కొన్ని దినములు గడపిన తరువాత మునిచే పూజితుడై కైలాసమునకు వెళ్ళెను.

ఆ కాలమందు భూభారనివారణమునకై శ్రీమహావిష్ణువు అయోధ్యయందు దశరథపుత్రుడుగా నవతరించెను. తండ్రి ఆజ్ఞానుసారము అతడు మునివేషమును ధరించి దండకారణ్యములో తిరుగుచుండెను. పరమశివుడు శ్రీరాముని దర్శించవలెనని ఆరాటపడుచుండెను. కాని శ్రీరాముడు రహస్యముగా అవతరించెననియు, నేను వెళ్ళినచో ఆ రహస్యము భంగమగుననియు ప్రజలెల్లరకు తెలిసిపోగలదనియు తలంచి దూరము నుండియే ప్రభువును స్మరించి కీర్తించి వెళ్ళిపోయెను.

ఆ సమయమున రావణుని ఆజ్ఞానుసారముగా మారీచుడు బంగారు లేడి రూపముతో రాముని ఆశ్రమము సమీపించగా సీతాదేవి ఆ లేడిని చూచి దాని సౌందర్యమునకు ముగ్ధురాలై దానిని ఎటులైనను తెచ్చి తనకిమ్మని శ్రీరామునితో విన్నవించెను. సీతాదేవి మాట కాదనలేక దాశరథి ధనుర్బాణములు ధరించి దానిని వెంబడించెను. అది దగ్గరకు వచ్చినట్లు వచ్చుచు చిక్కక దూరదూరముగా పరుగెత్తుచు శ్రీరామునకు అలసట కలిగించెను. అంతట శ్రీరాముడు విసుగుచెంది దానిపై బాణము వదలెను. అప్పుడు మాయలేడి “హా లక్ష్మణా!” యని బిగ్గరగా అరచుచు నేలగూలెను. ఆ కేకలు సీత విని మిగుల భయపడి లక్ష్మణుని పంపెను. ఆ సమయము కనిపెట్టి రావణుడు సన్యాసి వేషముతో సీతాదేవిని అపహరించి లంకకు



తీసికొని వెళ్ళెను. శ్రీరాముడు ఆశ్రమమునకు చేరికొని పర్ణశాలలో సీతలేకుండుట గాంచి పలుచోట్ల వెదకియు ఆమెను గానక శోక విహ్వలుడయ్యెను. జనన మరణములు సంయోగవియోగములు లేని భగవానుడు విరహవేదనతో మిగుల బాధపడుచు వనములో తిరుగుచుండెను. శ్రీరాముని చరిత్ర చిత్రవిచిత్రమైనది. విజ్ఞానులే దానిని తెలిసికొనగలరు. ఇది యంతయు సతీదేవి చూచి “లోకమంతటికి అధినాథుడు దేవతలు మునులు మొదలగు వారందరిచేత పూజింపబడుచున్న పరమశివుడు ఒక సాధారణ రాజకుమారుని, భగవంతుడని, పరబ్రహ్మమని తన ఇష్టదైవమని స్తుతిచేయుచున్నాడు. ఇది ఏమి చోద్య” మని తన మనస్సులో తలంచుచుండెను. సర్వాంతర్యామి అయిన ఈశ్వరుడు సతీదేవి హృదయమందలి సందేహమును గ్రహించి “ఓ సతీ! నీది స్త్రీ స్వభావము. ఈ విధముగ సందేహించుట సమంజసము కాదు. అతడు సాక్షాత్ పరబ్రహ్మమే” యని పరిపరి విధముల చెప్పెను. అయినను సతీదేవికి సంశయము నివారణ కాలేదు. అది గ్రహించి ఈశ్వరుడు సతీదేవితో ఇట్లనెను. “నీకు నమ్మకము లేదు. కనుక నీవే స్వయముగా వెళ్ళి ఆ రాముని పరీక్షించుము అంతవరకు నేనీ వట వృక్షముక్రింద నుండెదను.” సతీదేవి బయలుదేరి రాముని ఎట్లు పరీక్షించవలెనా యని ఆలోచించుచు సీతాదేవి రూపము ధరించి సీతా వియోగముతో బాధపడుచు వచ్చుచున్న శ్రీరామలక్ష్మణులను సమీపించెను. లక్ష్మణుడు ఆశ్చర్యముతో ఆమెను చూచుచుండెను. శ్రీరాముడు సర్వజ్ఞుడు గాన నవ్వుచు చేతులు జోడించి “అమ్మా! సతీదేవి! ఈ అడవిలో మీరొక్కరే తిరుగుచున్నారేమి? పరమేశ్వరు డెక్కడ?” అని అడుగగా ఆమె నిర్ఘాంతపోయి లజ్జతో తిరిగి శివుని వద్దకు బయలుదేరి వెళ్ళుచుండగా శ్రీరాముడు ఆమెకు తన మహిమను చూపెను.

శ్రీరాముడు సీతాలక్ష్మణులతో సంతోషముతో వెళ్ళుచున్నట్లు సతీదేవికి కన్పించెను. ఆమె ఎటువైపు చూచిన అటువైపు సీతారామలక్ష్మణులే కనపడుచుండిరి. పత్నీవియోగముతో దుఃఖించుచున్న రాముడు ఎచ్చటను

కనిపించలేదు. తన పతి చెప్పినట్లు శ్రీరాముడు సాక్షాత్ పరబ్రహ్మయే యని ఆమెకు దృఢ విశ్వాసము కలిగెను. ఆమె శ్రీరామునకు నమస్కరించి కనులు తెరవగా అచట ఏమియు కనిపించలేదు. ఆమె ఈశ్వరుని సమీపమునకు వెళ్ళెను. ఈశ్వరుడు నవ్వుచు "ఓ సతీ! నీవు రాముని ఎట్లు పరీక్షించితివి?" అని యడుగగా సతీదేవి "నేను రాముని ఏమియు పరీక్షించలేదు." అని అసత్యమాడి నేను మీ వలెనే అతడు పరబ్రహ్మయే యని గుర్తించితినని చెప్పెను. అంత ఈశ్వరుడు దివ్య దృష్టితో అంతయు గ్రహించి "శ్రీరాముడు నాకు తండ్రి. ఈమె సీత వేషము ధరించి నందున నాకు తల్లి అయ్యెను." అని భావించెను. కాని సతీదేవి మాత్రము పవిత్రురాలు. తెలియక చేసిన తప్పుకై ఆమెను విసర్జించుట ధర్మము కాదు. అందులకై సతీదేవి యీ శరీరముతో నున్నంత వరకు ఆమెతో శారీరక సంబంధము వదలి పెట్టుచున్నాను." అని ప్రతిజ్ఞచేసికొనెను. ఆ ప్రతిజ్ఞ నెఱిగి ఆకాశవాణి "ఓ పరమేశ్వరా! ఇంతటిత్యాగముమీరు తప్ప ముల్లోకములలో మరి యెవ్వరు చేయజాలరు" అని పలికెను. సతీదేవి ఆకాశవాణి పల్కులు విని వ్యాకులపడి, "స్వామీ! నన్ను గురించి మీరేమి త్యాగము చేసితిరి?" అని మరలమరల ఈశ్వరు నడిగెను. అందుకు పరమేశ్వరుడు, ఆ మాట యీ మాట చెప్పుచు కైలాసమునకు వెళ్ళెను. ఈశ్వరుడు తన ప్రతిన జ్ఞాపకము చేసికొని ఒక వట వృక్షము క్రింద పద్మాసనాసీనుడై ధ్యాన సమాధి నిమగ్ను డయ్యెను. సతీదేవి శివుని వియోగమును సహింపజాలక, మనస్సులో అమితముగా బాధపడుచుండెను. తాను చేసిన తప్పునకు తగిన ప్రతిఫలము కలిగెనని లోలోపల కుమిలిపోవుచుండెను. ఈ విధముగా వెయ్యి సంవత్సరములు గడచెను.

ఒకనాటి సమయమున ఈశ్వరుడు రామ నామ స్మరణ చేయుచు సమాధి నుండి లేచెను. అది చూచి సతీదేవి ఈశ్వరుని వద్దకు వెళ్ళి నమస్కరించి నిలిచెను. ఆమెను చూచి పరమశివుడు దయార్ద్ర హృదయుడై



దుఃఖముతో నున్న సతీదేవిని సమీపమునకు చేరదీసి భక్తిరస పూరితమైన భగవత్కథలు వినిపించెను.

ఆ కాలమందు దక్షుడు ప్రజాపతి యగుటకు అన్ని విధముల సమర్థుడని బ్రహ్మదేవుడు వానికి ప్రజాపతిపదవి నొసగెను. అధికారగర్వముతో అతనికి ఎక్కడలేని అహంకారము కలిగెను. ఇది లోక సహజమే కదా! ఈ గొప్ప పదవిని పొందిన దక్షుడొక యాగము చేయ సంకల్పించి ఆ యాగమునకు రమ్మని శివునికి తప్ప మిగిలిన దేవ, యక్ష, ఋషి, ముని, గంధర్వాదు లెల్లరకు ఆహ్వానములు పంపెను. వారందరు సతీసమేతులై విమానారూఢులై సంతోషముతో గానము చేయుచు గగన మార్గమున వెళ్ళుచుండిరి. వీరిని చూచి సతీదేవి వీరందరు ఎక్కడి కేగుచున్నారని పరమశివుని అడిగెను. "నీ తండ్రి చేయుచున్న గొప్ప యాగమును చూచుటకు వీరందరు వెళ్ళుచున్నారు" అని శివుడు పల్కెను.

ఆమె సంతసించి "మీరు అనుమతించినచో నేనును మా తండ్రిగారి యజ్ఞమును చూచి వచ్చెదను" అని వేడుకొనెను. అప్పుడు శివుడు "నీవు యజ్ఞమునకు వెళ్ళుట నా కిష్టమే కాని, నీ తండ్రి నిన్ను తప్ప మిగతా కూతుండ్ర నందరిని ఆహ్వానించెను. ఎందుకనగా ఒకప్పుడు బ్రహ్మసభలో నీ తండ్రికిని నాకును వివాదము తటస్థించినది. ఆ కారణమున మనలను పిలువలేదు. ఆడపడుచులు పిలువకపోయినను తమ పుట్టినిండ్లకు వెళ్ళ వచ్చును. అయినను వైరము గల్గిన తర్వాత పిలువని పేరంటమునకు పోవుట క్షేమము గాదు. అచ్చట నీ తండ్రి నిన్ను ఆదరింపడు" అని నచ్చజెప్పెను.

పతి తనను పరిత్యజించిన దుఃఖము వలనను, పుట్టింటిపైన గల ప్రేమవలనను ఆమె పరమేశ్వరుని పట్టుదలతో ప్రార్థించెను. తన కిష్టము లేకపోయినను సతీదేవి అభ్యర్థనను మన్నించి ఈశ్వరుడు శివగణములతో ఆమెను పుట్టింటికి పంపెను.

సతీదేవి యజ్ఞమండపమునకు చేరుకొనినది. కాని దక్షుని భయము వలన అక్కడ ఆమె నెవ్వరు పలుకరించలేదు. కేవలము తల్లిమాత్రము ప్రేమతో కుశల ప్రశ్న లడిగెను. అక్క చెల్లెంద్రు దూరమునుండి చూచి నవ్వి ఊరుకొనిరి. దక్షుడు ఆమెను చూడగానే చురచురలాడుచు వెనుకకు తిరిగిపోయెను. అంతట సతీదేవి యజ్ఞశాలలోనికి వెళ్ళిచూచెను. అచ్చట శివునికి హవిర్భాగము లేకుండెను. అది చూచి ఆమె అమితముగ బాధపడెను.

తన పతి అవమానమును ఆమె సహింపలేకపోయెను. జగత్తులో అనేకవిధముల దుఃఖములు కలవు. జాతి అవమానము అన్నిటికంటె మిక్కుటమైనది. అందువలన ఆమెకు చాల కోపము వచ్చెను. తల్లి అనేక విధముల ఆమెను శాంతింప ప్రయత్నించెను. అంతట సతీదేవి తన పతితనను విడిచిపెట్టుట కంటే తండ్రివలన తనకు జరిగిన అనాదరణకు కోపోద్రిక్తురాలై అచ్చటనున్న సభాసదులతో నిట్లు పలికెను.

“ఓ సభాసదులారా! సురలారా! మునులారా! ఇచ్చట ఈశ్వరనింద జరుగుచున్నది. ఎచ్చట శివకేశవుల నింద జరుగుచున్నదో అచ్చట నిలువరాదు. సమర్థత కలదేని, నిందించువారిని కఠినముగ శిక్షింపవలెను. లేనిచో చెవులు మూసికొని ఆ స్థలమును విడువవలెను. ఈశ్వరుడు లోకమునకు తండ్రి. అందరికి హితముచేయువాడు. మందబుద్ధిచే మా తండ్రి పరమశివుని నిందించుచున్నాడు. నా యీ శరీరము అట్టి తండ్రి వీర్యము వలన ఏర్పడినది. అందుచే నేనీ తుచ్ఛ శరీరమును ఈశ్వరుని స్మరించుచు వదలుచున్నాను” అని సతీదేవి “జన్మజన్మలకు నాకు పరమశివుడె పతియగు గాక” అని పల్కుచు యోగాగ్నిలో తన శరీరమును భస్మము చేసికొనెను. యజ్ఞశాల యందంతటను “హాహా” కారములు చెలరేగెను.

శివగణములు ఆగ్రహావేశముతో దక్షయజ్ఞము ధ్వంసము చేయసాగిరి. భృగుమహర్షి అడ్డుపడి నివారించెను. ఈశ్వరుని కీవార్త తెలియగానే



కోపముతో వీరభద్రుని పంపెను. అతడుగ్రుడై యజ్ఞ మంతయు విధ్వంస మొనర్చి పిమ్మట దక్షుని, దేవతలను, మునులను అందరిని తగురీతిని శిక్షించి వారిని దిక్కులకు పరుగెత్తునట్లు తరిమివేసెను. శివుని నిందించుటవలన జగత్ప్రసిద్ధుడైన దక్షునకే యీ గతి పట్టెను. ఇక ఇతరుల గూర్చి చెప్ప పనిలేదు.

అనంతరము సతీదేవి పర్వతరాజైన హిమవంతునకు పుత్రికగా జన్మించి పార్వతి యను నామముతో వర్ధిల్లుచుండెను. పార్వతి జన్మించగనే హిమవంతునకు సకలైశ్వర్యములు సమకూరెను. అతడు ఋషులకు ఉచితముగ స్థలము నిచ్చెను. అందు వారు ఆశ్రమములు నిర్మించుకొని జప, తపో యజ్ఞాదులు ఒనర్చుచుండిరి. పర్వతములనుండి అమూల్యములైన రత్నములు లభించుచుండెను. వృక్షములు ఫలపుష్పములతో శోభిల్లుచుండెను. క్రూరమృగములు సహితము సహజ వైరభావము విడిచి సాధుస్వభావములతో మెలగుచుండెను. పర్వతరాజు గృహము “నిత్యకల్యాణము పచ్చతోరణము”గ నుండెను.

సతీదేవి హిమవంతుని యింట జన్మించిన దని తెలిసికొని నారదుడు అతని ఇంటికి వచ్చెను. హిమవంతుడు నారదుని సుఖాసీనుని జేసి యథావిధిగా పూజించి మీ రాకచే మా గృహము పావనమైన దనుచు తన ప్రియపుత్రికయగు పార్వతిచే మునికి నమస్కరించప జేసి “మహాత్మా! మీరు త్రికాల వేదులు. సర్వజ్ఞులు. నాయీ పుత్రిక గుణదోషములు వచింపగోరెదను.” అని పల్కెను.

అంతట ముని నవ్వుచు “నీ పుత్రిక గుణనిధి. సౌందర్యవతి. సౌభాగ్యవతి. ఈమె ఉమ అంబిక భవాని నామములతో ప్రసిద్ధిచెందును. పతిభక్తి కలిగియుండును. ఎల్లకాలమును ముత్తయిదువుగా నుండును. తల్లిదండ్రులకు కీర్తి తెచ్చును. విశ్వమంతట పూజింపబడును. స్త్రీ లోక

మంతయు ఈమెను స్మరించి పవిత్రులయ్యెదరు. ఓ పర్వతరాజా! మీ ఈ కన్య సర్వలక్షణ సంపన్నయే కాని కొన్ని దోషములు గలవు. వానిని కూడ వినుము. గుణహీనుడు, మానహీనుడు, తల్లిదండ్రులు లేనివాడు, యోగి, జటాధారి, నిష్కామహృదయుడు, దిగంబరుడు, అమంగళ వేషధారి ఇట్టి లక్షణములు గలవా డీమెకు పతి యగును." అని తెలిపెను. నారదుని వాక్యము లమోఘము లని తలచి గిరిరాజ దంపతులు దుఃఖించిరి. ఇందు కేదైన ఉపాయమున్న సెలవీయ వలసినదిగా నారదుని వేడుకొనిరి. కాని పార్వతి తన మనస్సులో సంతసించెను. ఈశ్వరుడు లభించుట దుర్లభమని తలంచి తన హృద్గత భావ మెవ్వరికిని తెలియపరచక ఎప్పటివలె చెలికత్తెలతో ఆటపాటలతో గడపుచుండెను. తల్లి మైనాదేవి దుఃఖమును చూచి సహింపజాలక హిమవంతుడు నారదుని చేరి "మహాత్మా! నా కుమార్తెకు అర్హుడైన వరుడు లభించుట కింకేదైన ఉపాయము కలదా?" అని వినయముతో అడుగగా "ఓ గిరిరాజా! విధివ్రాత ఎవరు తుడిచిపెట్టగలరు? అయినను నాకొక ఉపాయము తోచుచున్నది. నీ కుమార్తెను ఈశ్వరునికిచ్చి వివాహము గావించిన బాగుండును. అతని యందున్న దోషములు గుణములుగా మారగలవు ఎట్లన! విష్ణుభగవానుడు శేషునిపై శయనించినను పండితులు దోషముగా భావించుటలేదు. మఱియు సూర్యుడు, అగ్ని సర్వము భక్షించెదరు. అయినను వారిని హీనులుగా చూచుటలేదు. గంగానదియం దనేక విధములైన కల్మషములు కలియుచుండును. అంత మాత్రమున గంగాజలము అపవిత్రమగుట లేదుకదా! సూర్యుడు, అగ్ని, గంగవలె సమర్థులకెట్టి దోషము ఉండదు. గంగాజలమునుండి కల్లుసారాయి తయారు చేసినను మహాత్ములు త్రాగరు. కాని ఆ మత్తుపదార్థములు గంగలో కలసిపోయినచో అది అపవిత్రముగా ఎవరును భావింపరు. అట్లే ఈశ్వరునిలోను, జీవులలోను అట్టి భేదము గలదు. సహజముగ ఈశ్వరుడు సమర్థుడు. స్వయం భగవంతుడు. కాన వారితో వివాహము జరిగిన యెడల



సర్వసౌఖ్యములు కల్గును. కాని వారిని సేవించుట మిగుల కష్టతరము. అయినప్పటికి ఆయనను గూర్చి తపించినచో త్వరలోనే సంతుష్టుడగును. లోకములో చాలమంది పెండ్లికుమారులు కలరు. కాని ఈమెకు ఈశ్వరుడు తప్ప ఇంకొకరు భర్తకాజాలరు." అని చెప్పి పార్వతిని ఆశీర్వదించి నారదుడు వెళ్ళిపోయెను. మైనాదేవి నారదుని వచనములందలి గూఢార్థమును తెలియజాలక తన భర్తతో నిట్లనెను. "నాథా! మన అమ్మాయికి అన్నివిధముల తగిన ఉత్తమవరు డున్నచో వివాహము చేయండి, లేనిచో ఆమె ఇష్టపడినచో జీవితాంతము కన్యగానే ఉంచండి. అంతేగాని అయోగ్యునితో అమ్మాయి వివాహము జరిపించుట నాకు ఇష్టములేదు. ఎందుకంటే పార్వతి నాకు ప్రాణముతో సమానము. మీరు వేగిరపడి అయోగ్యుని కిచ్చినయెడల లోకులు మిమ్ములను మూర్ఖులనెదరు. ఈ విషయము బాగా ఆలోచించి వివాహము చేయండి. త్వరపడి చేసినచో తరువాత పశ్చాత్తాప పడవలసివచ్చును." అని చెప్పుచు భర్తపాదములపై వ్రాలెను.

అంతట హిమవంతుడు "ప్రేయసీ! ఎవరెన్ని చెప్పినను నారదముని వాక్యములు అసత్యములు కావు. కావున సంశయములు విడిచి దేవదేవుని స్మరించుము. పుట్టించిన ఆ పరమేశ్వరుడే సకల సుఖములు చేకూర్చగలడు. పార్వతిపై నీకు ప్రేమ యున్నచో శివుని గురించి తపస్సు చేయుటకై పంపుము. ఈశ్వరుడు అన్ని విధముల కళంక రహితుడు. అంతేగాక సకల సద్గుణములు గల మహానుభావుడు కావున నీవు సందేహములను విడిచి పెట్టుము". అని పలికెను. పతి పలుకలు విని మైనాదేవి సతి వద్దకు వెళ్ళెను. పార్వతిని ఒడిలో కూర్చుండ బెట్టుకొనెను. తల్లి మనోవ్యాకులతను గమనించి పార్వతి "అమ్మా! రాత్రి నాకు స్వప్నములో వృద్ధబ్రాహ్మణుడు కనపడి "నారదుని మాటలు నిజముగా నమ్మి శివునికై తపస్సు చేయుము. తపస్సు సుఖముల నిచ్చును. దుఃఖ దోషములను హరించును. తపోబలము చేతనే త్రిమూర్తులు సృష్టి స్థితిలయములను చేయ గల్గుచున్నారు. తపోబలము

చేతనే ఆదిశేషుడు భూభారమును మోయుచున్నాడు. వేయేల లోకములన్నియు తపోబలముననే నిలచియున్నవి.” అని చెప్పెను. పార్వతి చెప్పిన ఈ మాటలు మైనాదేవి తన భర్తకు విన్నవించెను. పార్వతిని తపసునకు పంపుటకు తల్లిదండ్రులకు బంధువులకు దుఃఖము కల్గుటవలన నోట మాట రాలేదు. అంతట వేదశిరుడను ముని ఏతెంచి పార్వతి మహిమను తెలిపి అందరి సంశయములను తీర్చెను. ఆమె వనమున కేగి తపస్సు చేయసాగెను. వేయి సంవత్సరములు కందమూలములను ఆహారముగను, నూఱు సంవత్సరములు ఆకుకూరలను భుజించుచు, కొన్ని దినములు జలముతోనూ, కొన్ని దినములు వాయువుతోనూ, కొంత కాలము నిరాహారయై తపస్సు చేసెను. తపస్సుచే ఆమె శరీరమంతయు కృశించిపోయెను. అది చూచి ఆకాశవాణి గంభీరముగా ఇట్లనెను. “ఓ పర్వత రాజకుమారీ! మునులు, జ్ఞానులు ఎందరో చేయలేని ఘోర తపమును నీవు చేసితివి. నీకోర్కె ఫలించినది. ఇక తపము చాలించుము. నీ తండ్రి వచ్చి పిలిచినచో కాదని పట్టు పట్టక ఇంటికి వెళ్ళుము. సప్తఋషులు నీ వద్దకు వచ్చెదరు. అప్పుడు నా మాటలు నిజమని నీవు తెలిసికొన గలవు.” ఆ వాక్యములు విని పార్వతి యెంతయో ఉప్పొంగిపోయెను.

“ఓ భరద్వాజా! నేను ఇంతవరకు పార్వతి కథ చెప్పితిని. ఇక ఈశ్వరుని చరిత్ర వినుము. దక్ష యజ్ఞమందు సతీదేవి శరీర త్యాగము చేసినప్పటి నుండి ఈశ్వరుడు వైరాగ్యము కలిగి రాముని స్మరించుచు, రామచరిత్రను వినుచు లోకమున తిరుగుచుండెను. ఇట్లు చాల కాలము గడచిపోయెను. ఆయనకు రామభక్తి దినదినాభివృద్ధి అగుచుండెను. ఆయన స్థితి చూచి భక్తవత్సలుడైన రామచంద్రుడు ప్రత్యక్షమై ఆయనను అనేక విధముల ప్రశంసించి “మీరు తప్ప ఇంతటి కఠిన వ్రతమును ఎవరు పాటించగలరు? అని చెప్పి పార్వతి పవిత్ర శీలము గుర్తించి మీకు నా యందు ప్రేమ యున్నచో వెంటనే పార్వతీ దేవిని వివాహమాడుడు.” అని చెప్పెను. అంత



ఈశ్వరుడు “శ్రీరామచంద్రా! మీరు చెప్పినది నాకు ఇష్టము కానప్పటికి నేను మీ ఆజ్ఞను శిరసా వహించెదను.” అని పలుకగా రామచంద్రుడు ఎంతయో సంతసిల్లి “ఈశ్వరా! మీ ప్రతిజ్ఞ పూర్తియైనది. నా మాటలు మీ హృదయమందు జ్ఞప్తియందుంచుకొనుడు” అని చెప్పి అంతర్ధానమయ్యెను. ఆ సమయమున సప్తఋషులు ఈశ్వరుని వద్దకు వచ్చిరి. శివుడు వారికి ఉచిత మర్యాదలు చేసి “మహాత్ములారా! పార్వతి వద్దకు వెళ్ళి నాయందు ఆమెకు ఎంత ప్రేమ యున్నదో పరీక్షించుడు మీరు హిమవంతుని వద్దకేగి పార్వతిని వెళ్ళిన తర్వాత ఆమె సందేహమును నివృత్తి చేయుడు.” అని వచించెను. వెంటనే సప్తఋషులు పార్వతి వద్దకు వెళ్ళి “అమ్మా! నీ వెందుకు ఇంత కఠిన తపస్సు చేయుచున్నావు?” అని అడుగగా పార్వతి “చెప్పవలెనంటే నా మనస్సు సంకోచపడుచున్నది. నా మూర్ఖత్వమునకు మీరు నవ్వెదరు. నేను నారదుని మాటలయందు విశ్వాసముంచి దుర్లభుడైన ఈశ్వరునే పతిగా కోరి తపస్సు చేయుచున్నాను.” అని చెప్పగా సప్తఋషులు నవ్వి, “అమ్మా! నీవు శైలరాజ తనయవు. నారదుని ఉపదేశములు విని ఇంతవరకు లోకములో ఎవరైనా బాగుపడిరా? దక్షుని పుత్రులు చిత్రకేతువు, హిరణ్యకశిపుడు నారదుని మాటలు నమ్మి సర్వమును పోగొట్టుకొనిరి. నారదుని శరీరమెంత స్వచ్ఛమో హృదయమంత కపటమైనది. ఇట్టి నారదుని మాటలు విని నీవేల చెడెదవు? అతని మాటలు విని శివుని పెండ్లాడిన సతీదేవి కెట్టి దుర్గతి పట్టినదో తెలియదా? అతడు అమంగళ వేషధారి. శ్మశానవాసి. నరకపాలములు హారముగా ధరించువాడు. భయంకరములైన సర్పములే భూషణములుగా కలవాడు. ఇట్టి వానిని పెండ్లాడి నీవేమి సుఖించెదవు? ఇప్పుడు అతడు ఊరూర తిరుగుచు భిక్షమెత్తుకొనుచు ఏ చెట్టు క్రిందనో కాలము గడుపుచున్నాడు. ఇట్టివాని వద్ద ఏ స్త్రీ స్థిరపడగలదు? మా మాట వినుము. నీకు తగిన మంచి వరుని కూర్చెదము. అతడు అతి సౌందర్యవంతుడు. సుగుణరాశి, దోషరహితుడు. లక్ష్మీపతి. ఇట్టి వరునితో నీకు వివాహము చేసెద” మని వారు చెప్పగా పార్వతి నవ్వుచు

"మీరుచెప్పినట్లు నేను పర్వత రాజు వలన జన్మించితిని. కాన నా మనస్సు కఠినమైనదే. శరీరము వీడినను పట్టుదల విడువను. నారదుని వచనములయందు నాకు అచంచల విశ్వాసము గలదు గురు వాక్యముల యందు విశ్వాసము లేని వారికి స్వప్నములో కూడా సుఖము ఉండదు. శివుడు గుణరహితుడే కానిమ్ము. విష్ణువు సద్గుణ భరితుడే కానిమ్ము. నా మనస్సు మాత్రము శివుని యందే లగ్నమైయున్నది. ఇది ముమ్మాటికి నిశ్చయము. లోకమున ఎందరో కన్యలున్నారు. వరులూ ఉన్నారు. మీరు వారలకు సంబంధము కుదుర్చుడు. మహాత్ములారా! వేయి మాట లేల? శివునే భర్తగా నేను పొందుటయో లేక శాశ్వతముగా కన్యగానే ఉండుటయో ఇదే కోటి జన్మలకైనా నా పట్టుదల. స్వయముగా శివుడు వచ్చి వందసార్లు చెప్పినను నారదుని ఉపదేశములను అనుసరించకమానను. ఇక మీరు మీ స్థానముల కేగుడు. వచ్చి చాల సేపు అయినది." అని బదులు చెప్పగా శివుని యందు ఆమెకుగల అపార ప్రేమను గ్రహించిన ఋషులు సంతోషముతో "హే జగన్మాతా! భవానీ! నీకు జయమగు గాక! నీవు మాయాదేవివి. శివుడు భగవానుడు. మీరిరువురు సమస్తలోకములకు తల్లిదండ్రులు" అని చెప్పి ఆమెకు వినయముతో నమస్కరించి హిమవంతుని వద్దకు వెళ్ళిరి.

వారు పార్వతీదేవిని ఇంటికి తీసికొని వెళ్ళవలసినదిగా హిమవంతునితో చెప్పి వెంటనే శివుని వద్దకు వెళ్ళి జరిగిన సమస్త వృత్తాంతమును విన్నవించిరి. ఆయన తనయందు పార్వతికి గల ప్రగాఢప్రేమను గ్రహించి మిక్కిలి సంతసించెను. పిమ్మట సప్తఋషులు బ్రహ్మలోకమున కేగిరి. అంతట శివుడు స్థిరచిత్తుడై రామనామము స్మరించుచు వివాహము నిశ్చయపరచుకొనెను.

ఆ సమయమున తారకుడను రాక్షసుడు తన భుజబల పరాక్రమముచే సకల లోకపాలురను జయించెను. దేవతల సంపదలన్నియు కొల్లగొట్టెను. లోకకంటకుడయ్యెను. వాడు వార్ధక్యము రాకుండ అమరత్వము తనకు



కలుగునట్లు వరములు పొందినందున దేవతలు వానితో అనేక పర్యాయములు యుద్ధము చేసియు వానిని సంహరింపజాలక ఓడిపోయిరి. వాని బాధలు సహింపజాలక వారందరు బ్రహ్మవద్దకేగి తమ కష్టములను విన్నవించుకొనిరి. అంతట బ్రహ్మదేవుడు వారలతో "దేవతలారా! శంభువీర్యమున జన్మించినవాడు గాని వీనిని జయింపజాలడు. ఇప్పుడు పార్వతీ పరమేశ్వరులు వేరు వేరుగానున్నారు. వారి కలయిక వలనగాని ఈ కార్యము నెఱవేరదు. ఇప్పుడు ఈ పని జరుగుట అసంభవము. వీరిరువురిని కలుపుటకు నాకొక ఉపాయము తోచుచున్నది. మీరందరు వెళ్ళి పార్వతీ పరమేశ్వరులను కలుపుటకై మన్మథుని ప్రార్థించుడు. అతడు సహాయపడిన యెడల మీ కోరిక నెరవేరును. అప్పుడు పార్వతిని పరిణయమాడుటకై నేను పరమేశ్వరుని ప్రార్థించెదను". అని పల్కెను.

బ్రహ్మ అజ్ఞానుసారము దేవతలందరు మన్మథుని వేడుకొనిరి. ఈశ్వరునితో వైరము తనకు క్షేమదాయకము కాదని తలంచియు 'పరోపకారము పరమధర్మమని వేదములు చెప్పుచున్నవని నిశ్చయించి ధనుర్ధారియై మన్మథుడు వసంతాది అనుచరులతో బయలుదేరి తన ప్రభావముచే చరాచర ప్రపంచము నంతయు నమ్మోహింపజేసెను. బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్న్యాసులు మొదలైన వారందరూ తమ తమ నియమ, నిగ్రహములను కోల్పోయిరి. స్త్రీ పురుషులెల్లరు కామపీడితులై స్త్రీలు జగమంతయు పురుషమయముగాను, పురుషులు జగమంతయు స్త్రీ మయముగాను చూచుచుండిరి. రెండు గడియలవరకు సమస్త బ్రహ్మాండములు కాముని మహిమచే నిండియుండెను. విషసర్పములు, భూత పిశాచములన్నియు కామవశములై పరితపించుచుండెను. శ్రీరామచంద్రుని దయ ఎవరిమీద నుండెనో వారు మాత్రము కాముని బారినుండి తప్పించుకొనిరి.

మన్మథుడు శివునియొద్ద కేగెను. ఆతనిని చూచి భయపడెను. అంత వరకు పురమశివుడు సమాధినిమగ్నుడైయుండెను. శివుని భయంకర రౌద్ర

రూపమును చూచి మన్మథుడు భయకంపితుడై వెనుకకు తిరిగి వెళ్ళుటకు సిగ్గుపడుచు ముందుకేగుటకు ధైర్యము చాలక ఎట్టకేలకు మరణమే నిశ్చయమని తలంచి వసంత ఋతువును సృష్టించెను. చెట్లు ఫలపుష్పములతో శోభిల్లుచుండెను. అప్సరసలచే నృత్యగానములను చేయించెను. వాయువును శీతలమందసుగంధిలముగ మార్చివేసెను. సరోవరములలో అనేక పుష్పములను వికసింపచేసెను. ఎన్ని రకములుగ కళానైపుణ్యమును ప్రదర్శించినను మన్మథుడు శివుని సమాధినుండి చలింపచేయజాలక పోయెను.

అంతట కామదేవుడు క్రోధోన్మత్తుడై మామిడిచెట్టు కొమ్మపైనెక్కి చెఱకు విల్లెక్కుపెట్టి రుద్రుని హృదయమునకు గురిపెట్టి ఐదుబాణములను వదలెను. నిర్మలముగానున్న ఈశ్వరుని మనస్సునకు ఆ బాణములు తగులగనే అతని సమాధి భగ్నమయ్యెను. వెంటనే మేల్కొని నలుదిశల చూచెను. మామిడి ఆకులమధ్య దాగియున్న మన్మథుని చూడగానే శివుడు అత్యంత కోపోద్దీపితుడయ్యెను. అంతలోనే లోకమంతయు కంపించెను. రుద్రుడు మూడవ నేత్రము తెరువగనే మన్మథుడు భస్మీభూతుడయ్యెను లోకమంతయు హాహాకారము చేసెను. దేవతలు భయపడిరి. రాక్షసులు ఆనందించిరి. తాపసులు నిష్కంటకులైరి. రతీదేవి ఈ ఘోర దుష్టవార్త వినగానే మూర్ఛిల్లెను. ఆమె అనేకవిధములుగా చింతించుచు ఈశ్వరుని వద్దకువెళ్ళి భక్తితో పతిభిక్ష పెట్టుమని ప్రార్థించెను.

భక్తసులభుడైన పరమేశ్వరుడు ఆమె ప్రార్థనను విని మృదుమధుర వచనములతో నిట్లనెను "అమ్మా! రతీదేవి! నేటినుండి నీ పతి అనంగుడుగా పిలువబడును. శరీరరహితుడైనను జగమంతయు వ్యాపింపగలడు. నీవు నీ భర్తతో ఎప్పుడు కలసెదవో చెప్పెదను వినుము. భూభార నివారణార్థము భగవానుడు ద్వాపరయుగమున యదువంశమునందు కృష్ణనామముతో



అవతరించును. అతనికి నీ భర్త పుత్రుడుగా జన్మించును. ప్రద్యుమ్న నామముతో పెరుగును". ఈ మాటలువిని రతీదేవి సంతోషిత స్వాంతయై వెళ్ళిపోయెను.

బ్రహ్మాదిదేవతలు ఈ సమాచారమును విని వైకుంఠమునకు పోయి విష్ణుభగవానుని తీసుకొని ఈశ్వరుని వద్దకు వెళ్ళిరి, వారందరు ఈశ్వరుని అనేక విధములుగ స్తుతించి జగద్రక్షణార్థమై పార్వతిని పరిణయమాడగలందులకు ప్రార్థించిరి. వారి ప్రార్థన విని పూర్వము శ్రీరామచంద్రుడు చెప్పిన వాక్యములను గుర్తుచేసుకొని ప్రసన్నతతో శివుడు అంగీకరించెను. దేవదుందుభులు మ్రోగెను. కుసుమవర్షములు కురిసెను. జయ జయ ధ్వనులు చెలరేగెను. సప్తఋషులు ఏతెంచగానే బ్రహ్మావారిని హిమవంతుని వద్దకు పంపెను.

మొదట వారు పార్వతి యున్నచోటునకు వెళ్ళిరి. "అమ్మా! పార్వతీదేవీ! నారదుని ఉపదేశమువలన మీరు అప్పుడు మా మాట వినలేదు. మీ ప్రతిజ్ఞ భంగమైనది. ఏలయన మహాదేవుడు మన్మథుణ్ణి భస్మమొనర్చెను". అని పల్కిరి. అది విని పార్వతి మందహాసమొనర్చి "విజ్ఞాన నిధులైన మునులారా! మీరు చెప్పినది ఉచితమే కాని పరమశివుడు కాముకు డనియా మీరు ఇంతవరకు తలంచితిరి? కాని అతడు ఎల్లప్పుడు యోగి అనియే నా తలంపు. జనన మరణాది వికార రహితుడు. అనింద్యుడు. భోగరహితుడనియే భావించి మనోవాక్కాయ కర్మలచే అతనిని భక్తితో ఆరాధించితిని. భక్తవత్సలుడైన అతడు నా ప్రతిన తప్పక నెఱవేర్చును. శివుడు అగ్ని వంటివాడు. మన్మథుడు మంచువంటివాడు. మంచు ఎన్నడైన నిప్పును సమీపించినచో అది తప్పక నాశనమగును. శివ మన్మథుల సంబంధము అట్టిది." అనెను. ఈ వాక్యములచే శివునియం దామెకు గల అచంచల ప్రేమను మునులు గ్రహించి అంతరంగమం దెంతయో సంతసించిరి. భవానికి వినయముతో నమస్కరించి హిమవంతుని యొద్ద కేగి వృత్తాంత మంతయు అతనికి

విన్నవించిరి. మన్మథుడు భస్మమగుట తెలిసికొని హిమవంతుడు ఎంతయో దుఃఖించెను. పిమ్మట రతీదేవికి పరమేశ్వరు డొసగిన వరమును తెలిసికొని మిగుల సంతసించెను. పరమేశ్వరుని మహిమను మనసునందు ఊహించి, ఆదర పూర్వకముగా పెద్దల నాహ్వానించి, వేదోక్తముగా శుభముహూర్తము నిర్ణయించి, లగ్న పత్రిక వ్రాయించెను. సప్తఋషులకు అది యిచ్చి దానిని బ్రహ్మ కొసగ వేడుకొనెను. సప్తఋషులు ఆ లగ్న పత్రికను బ్రహ్మకీయగా అతడు ఈశ్వరుని పరిణయవార్తకు మిగుల సంతసించి ఆ విషయమును అందరికి వినిపించెను. మునులు, దేవతలు హర్షించిరి. ఆకాశము నుండి దేవదుందుభులు మ్రోగెను. దేవతలందరు తమతమ వాహనముల నలంకరించిరి. అప్సరసలు గానము చేసిరి. శివగణములు పెండ్లి కుమారుని అలంకరించ నారంభించిరి జడలు ముడిగా చుట్టి ఆ ముడి మీద సర్పములను బాసికముగాను, సర్పములే కుండలములు గాను, కంకణములు గాను అలంకరించిరి. శరీర మంతయు విభూతి పూసిరి. మొలకు పులిచర్మము వస్త్రముగా కట్టిరి. సుందరమైన శివుని శిరస్సునందు చంద్రుడు గంగ అలరుచుండెను. లలాటము నందు మూడవ నేత్రము ప్రకాశించుచుండెను. సర్పములనే యజ్ఞోపవీతముగా వేసిరి. కంఠ మందు హాలాహలము వక్షమందు నరకపాలమాల ఈ విధముగా శివుని వేషము అమంగళముగా కనబడినను ఆయన కల్యాణమయుడు, దయాళుడు. పరమశివుడు ఒక హస్తమున త్రిశూలము మరొక హస్తమున డమరుకము పట్టుకొని వృషభవాహనారూఢుడై సకల మంగళ వాద్యములు మ్రోగుచుండగా బయలుదేరెను.

ఈ వింత పెండ్లికొడుకును చూచి దేవకాంతలు నవ్వుకొనుచు "ఇట్టి పెండ్లికొడుకును లోకమున కనివిని యుండలేదు" అనుకొనిరి. బ్రహ్మ విష్ణుమూర్తి మున్నగు దేవతలు తమ తమ వాహనములను అధిష్ఠించి పెండ్లి వారితో బయలుదేరిరి. వారందరు పరమసుందరులు. కాని పెండ్లికొడుకు



ఆయన వెంట ఉన్న సమూహము మాత్రము తగినట్లులేరు. వారిని చూచి విష్ణువు నవ్వుచు చమత్కారముగా "మన మందరము పెండ్లికుమారుని సమూహముతో కలియకుండ వేరువేరుగా బయలు దేరుదుము. వారు తగినట్లుగా లేరు. వరుడెంత చక్కగా నున్నాడో పెండ్లివారు కూడ ఆదే విధముగా ఉన్నారు. మనము వరాయి నగరమునకు వెళ్ళి నవ్వులపాలయ్యెదము" అని దిక్పాలురతో పలికెను.

ఈశ్వరుడు ఆ పలుకులు విని మనస్సులోనే నవ్వుకొనెను. విష్ణువు కూడ ఎగతాళి మాటలు విడిచిపెట్టలేదే అని అనుకొనెను. ఆయన తన భక్తుడైన భృంగీశ్వరుని పంపి శివగణములను పిలిపించెను. శివుని ఆజ్ఞ వినగానే అందరు వచ్చిరి. రకరకాల వేషములతో వచ్చిన వారెల్లరను చూచి ఈశ్వరుడు నవ్వుకొనెను. అందు కొందరికి ముఖమే లేదు. కొందరికి అనేక ముఖములు. కొందరికి కాళ్ళు చేతులు లేవు. కొందరికి అనేకములైన కాళ్ళు చేతులు. కొందరికి అనేక నేత్రములు. కొందరికి ఒక కన్నూ లేదు, కొందరు సన్నగా, మరికొందరు మిక్కిలి లావుగా, కొందరు అపవిత్రముగా కొందరు పవిత్రముగా వేషములు వేసికొనిరి. భయంకర ఆభరణములు ధరించి చేతిలో కపాలములు పట్టుకొని యుండిరి. గాడిదలు, కుక్కలు, నక్కలు, మొదలగు వాని ముఖములు గల్గియుండిరి. లెక్కలేని ఈ గణముల వేషములు ఎవరు లెక్కించగలరు? అనేక ప్రకారములయిన భూత, ప్రేత, పిశాచముల సమూహమది. వారిని వర్ణింపజాలము. భూత, ప్రేత, పిశాచములు నాట్యము చేయుచు పాటలు పాడుచుండినవి. పెండ్లికొడు కెట్టివాడో పెండ్లివారు కూడ అట్టివారే.

హిమవంతుడు వర్ణింప నలవిగాని వైభవోపేతమైన మండపమును తయారు చేసెను. జగత్తులో కల పర్వతములన్నింటికి, నదులకు, వనములకు, సముద్రములకు, తటాకములకు ఆహ్వానములు పంపెను. వారెల్లరు సుందర వేషములు ధరించి కుటుంబసమేతముగా హిమవంతుని ఇంటికి వెళ్ళిరి.

హిమవంతుడు అనేక గృహములను అలంకారము చేయించి యుంచెను. వారి వారి యోగ్యతానుసారముగా విడిది ఇండ్లలో దిగిరి. దేవతల సమూహమును, విష్ణుభగవానుని చూచి అందరు ఆనందించిరి.

ఈశ్వరుని ప్రమథ గణములను చూడగానే అందరి వాహనములు ఏనుగులు, గుఱ్ఱములు, ఎద్దులు భయపడి పారిపోయినవి. పెద్ద వయస్సులో నున్న ప్రజలు ధైర్యము వహించి నిలిచిరి. పిల్లలందరు ప్రాణము అరచేతిలో పెట్టుకొని పారిపోయి ఇండ్లకు చేరగానే వారిని తల్లిదండ్రులు భయపడి పారిపోయి వచ్చుటకు కారణ మడుగగా భయకంపితులై "ఏమి చెప్పగలము. అది పెండ్లిగాదు. యమధర్మరాజు సైన్యము. పెండ్లికొడుకు వట్టి పిచ్చివాడు. ఎద్దుపై ఎక్కి బూడిద రాచుకొని, పాములు, కపాలములు ఆభరణములుగా ధరించియున్నాడు. ఆయన వెంట భయంకర ముఖములుగల భూత, ప్రేత, పిశాచములు, యోగినులు, రాక్షసులు ఉన్నారు. ఈ పెండ్లివారిని చూచి బ్రతికి బయటపడిన వారే పార్వతీదేవి వివాహము చూడగల ధన్యులు." అని చెప్పిరి. శివుని యొక్క సమూహములని పిల్లల తల్లిదండ్రులు గ్రహించి నవ్వుకొనిరి. "భయపడ నక్కరలేదు." అని వారు పిల్లలకు నచ్చ చెప్పిరి.

మైనాదేవి హారతి ఈయగా వెంట నున్న స్త్రీలు మంగళ గీతములు పాడిరి. ఈశ్వరుని యొక్క భయంకర రూపమును చూచి స్త్రీలు భయపడి పరుగెత్తి ఇండ్లలోనికి వెళ్ళిపోయిరి. ఇది చూచి మైనాదేవి దుఃఖించెను. పార్వతిని తన వద్దకు పిలిపించుకొనెను.

ఆమె కుమార్తెను ఒడిలో కూర్చుండ బెట్టుకొని కన్నీరు కార్చుచు ఇట్లనెను. "నీ కింత సౌందర్యము నిచ్చిన బ్రహ్మ మూఢుడై నీ కిటువంటి పిచ్చివానిని భర్తగా ఎట్లు సమకూర్చెను? కల్పవృక్షమునకు ఉండవలసిన ఫలము తుమ్మచెట్టుకు బలవంతముగా కట్టివేయబడుచున్నది. ఏది ఏమైనను నా కంఠములో ప్రాణము లున్నంతవరకు ఈ పిచ్చివానికి నిన్నీయను.



నిన్ను సందిట నిడుకొని కొండమీద నుండి క్రిందకు దూకెదను. అగ్నిలో దుమికి భస్మమయ్యెదను. కపటియైన నారదుడు మనలను వంచించి బైరాగులుగా చేయ తలంచినాడు. అతనికి నేనేమి చెడు తలపెట్టితిని? ఇటువంటి పిచ్చివాని కొరకేనా నిన్ను తపస్సు చేయించెను? అవునులే! వానికి మోహములేదు, ఇల్లు లేదు, ధనము లేదు, భార్య లేదు, ఇతరులను కూడ తన వలెనే పాడుచేయుచున్నాడు. గొడ్రాలుకు ప్రసవవేదన ఏలాగు తెలియును?" అని పరిపరి విధముల శోకించెను. అది చూచి నగరస్త్రీలు గగ్గోలుపడి "ఈ వరునకు రూపము లేదు, ధనము లేదు, గృహము లేదు, దేనియందును మోహము లేదు." అని చెప్పికొనిరి.

తల్లి బాధను గ్రహించి పార్వతి వినయముతో "అమ్మా! నాకై ఏల ఇట్లు శోకించెదవు? ఇది దుఃఖ పడవలసిన సమయము కాదు. పిచ్చి వానికి భార్యగా నన్ను విధి నిర్ణయించినచో అది తప్పింప నెవరి తరము? నా భాగ్యములో వ్రాయబడిన సుఖ దుఃఖములు ఎచ్చటికి వెళ్ళినను అను భవింపక తప్పదు. కనుక ఏడ్చుట కట్టి పెట్టుము" అని పల్కెను. పార్వతి వాక్యములు విని స్త్రీలందరు విచారించిరి. నారదుడును ఋషులను వెంట నిడికొని ఆ ప్రదేశమునకు వచ్చిరి. నారదుడు పార్వతి జన్మరహస్యమును ఇట్లు వివరించెను.

"పూర్వజన్మలో ఈమె దక్షుని పుత్రికగా సతీదేవి పేరుతో జన్మించెను. అప్పుడు కూడ ఈశ్వరుడే యీమె భర్త. సీతా వియోగముతో విలపించుచు పిచ్చివాని వలె తిరుగుచున్న రామచంద్రుని పరీక్షించుటకు ఈమె సీతవేషము ధరించినందున ఈమెను తల్లిగా భావించి ఈశ్వరుడు పరిత్యజించెను. అంతట తన తండ్రి దక్షుని యింట జరిగిన యజ్ఞములో ఈమె పాల్గొనగా అచ్చట తన భర్తను అవమానపరచుట వలన అసలే భర్తృవియోగముతో కుమిలి పోవుచున్న ఈమెకు భరింపరాని దుఃఖము పొంగి పొరలిరాగా

యోగాగ్నిలో పడి భస్మమయ్యెను. ఆమెయే పార్వతీదేవి. కనుకనే ఆమె ఈశ్వరుని భర్తగా పొందగోరి ఘోర తప మాచరించెను".

"నారదుడు వెల్లడించిన ఈ వృత్తాంత మంతయు విని అందరు విషాదమును విడిచిరి. క్షణములో నగర మంతట ఇంటింట ఈ వార్త వ్యాపించెను. హిమవంతుడు పాక శాస్త్రములో ప్రవీణులైన వంట వారిచే రక రకముల పిండి వంటలు చేయించి అనేకపంక్తులలో బ్రహ్మ విష్ణువు మొదలైన దేవతలకు భోజనములు పెట్టించెను.

పుణ్యాంగనలు వివాహ మంగళ గానములు చేయుచు పెండ్లికుమార్తెను వివాహ మండపమునకు తోడ్కొని వచ్చిరి. లగ్న పత్రికను చదివి వినిపించిరి. అది విని అందరు ఆనందించిరి. అంతట ఈశ్వరుడు శ్రీరాముని తన హృదయము నందు స్మరించు కొనుచు సభకు నమస్కరించి బ్రహ్మ స్వయముగా తయారు చేసిన రత్నసింహాసనముపై ఆసీనుడయ్యెను. తన చెలికత్తెలతో సిగ్గుపడుచు పార్వతీదేవి వచ్చి శివుని ఎడమభాగమున కూర్చుండెను సభలో నలుమూలల జయ జయ ధ్వనులు చెలరేగెను. బ్రాహ్మణులు వేద మంత్రములను శ్రావ్యముగా ఉచ్చరించుచుండిరి. మంగళ వాద్యములు మ్రోగుచుండెను. జగజ్జనని పార్వతీదేవి సౌందర్యమును కోటి ముఖములతో నైనను ఏ కవి వర్ణింపగలడు? మునీంద్రుల అనుమతిపై పార్వతీ పరమేశ్వరులు విఘ్నేశ్వరపూజ చేసిరి. వేద విహితముగా వివాహము జరుపబడెను. హిమవంతుడు దర్భతో కూడిన కన్య హస్తములను ఈశ్వరుని హస్తములకు అప్పగించెను.

ఇంద్రాది సకల దేవతలు ఈ వివాహమును కన్నుల పండువుగా గాంచి మహానందభరితులైరి. బ్రహ్మాండ మంతయు బ్రహ్మానందములో మునిగిపోయెను. విలువైన అనేక వస్తువులను హిమవంతుడు వరకట్నముగా అల్లునికి సమర్పించి చేతులు జోడించి "మీరు పరిపూర్ణులు! మీకు నేను



ఏమి అర్పించగలను?" అని విన్నవించెను. మైనాదేవి ఈశ్వరునితో "ప్రభూ! ఈ పార్వతి నాకు ప్రాణ సమానురాలు. ఇంతవరకు ఎంతో ప్రేమతో పెంచియుంటిని. ఈమె ఏమైనా తెలియక అపరాధములు చేసినచో క్షమింపుడు." అని చెప్పగా ఈశ్వరుడు ఆమెను మంచి మాటలతో. సమాధాన పరచెను.

మైనాదేవి పార్వతిని పిలిచి తన ఒడియందు కూర్చుండ బెట్టుకొని భర్తవద్ద ఎట్లు మెలగవలయునో, ఆ నారీ ధర్మములన్నియు బోధించెను. పుత్రిక ఎడబాటుకు దుఃఖము పొంగి వచ్చుచున్నను ఇట్టి శుభసమయములో దుఃఖపడుట సమంజసము కాదని భావించి మైనాదేవి ధైర్యము వహించెను. అందరి స్త్రీల వద్ద సెలవు తీసికొని వారిని, తల్లిని, విడువలేక విడిచి పార్వతీదేవి భర్తవెంట బయలుదేరెను. హిమవంతుడు అల్లుని కొంత దూరము వరకు సాగనంపి ఆయన అనుమతిపై స్వగృహానికి వచ్చి పెండ్లికి వచ్చిన బంధుమిత్రు లెల్లరకు యథోచిత సత్కారములు చేసి వారి వారి స్థానములకు పంపెను.

పార్వతీ పరమేశ్వరులు కైలాసము చేరుకొని అచ్చట సకల సుఖములతో ఆనందముగా కాలము గడపుచుండిరి. వారు ఆది దంపతులు గాన లోకాలకు తల్లిదండ్రులు. కనుక వారి శృంగార చేష్టలను వర్ణించుట ఉచితము కాదని తులసీదాసు చెప్పుచున్నారు. కొంతకాలానికి వారికి కుమారస్వామి ఆరుముఖములతో జన్మించెను. అతడు పెద్దవాడై సకలశక్తి సమన్వితుడై జగత్కంటకుడైన తారకాసురుని వధించి లోకములకు శాంతి చేకూర్చెను. ఈ కథ చదివినవారికి, వినిన వారికి సకల శుభములు లభించును.

భరద్వాజముని యాజ్ఞవల్క్య మహామునిని గాంచి తనకు శ్రీరామచరిత్ర వినిపించుమని ప్రార్థించెను అంతట యాజ్ఞవల్క్య మహాముని ఇట్లు చెప్ప నారంభించెను.

ఒక పర్యాయము పార్వతీదేవి ఈశ్వరుని సమీపించి వినయముతో నమస్కరించి ''నాథా! చిరకాలము నుండి నన్నొక సంశయము బాధించుచున్నది. మీరు ఎంతో భక్తితో ఆరాధించుచున్న రాముడు దశరథపుత్రుడా? లేక నిర్గుణ, నిరాకారుడైన ఆత్మారాముడా? రఘురామునే మీరు ఆరాధించుచున్నచో మానవుడైన అతడు దేవుడెట్లు కాగలడు? పత్నీ వియోగముచే అతడు ఎందుకు పిచ్చివాడైనట్లు? నిర్గుణ బ్రహ్మ సగుణముగా ఎట్లు మారును? దయయుంచి నా సందేహములను నివారించి శ్రీరామచరిత్రను పూర్తిగా వినిపించి నన్ను ధన్యురాలిని చేయుడు. అని అడుగగా ఈశ్వరుడు మిగుల సంతసించి తన హృదయ కమల మందు శ్రీరాముని స్మరించుకొని "పార్వతీ! నీవు లోకహితము దృష్టిలో పెట్టుకొని చక్కని ప్రశ్న వేసితివి. ధన్యురాలవు" అని ప్రశంసించి ఇట్లు చెప్ప నారంభించెను.

పార్వతీ! రఘురాముని మహిమ అనంతము. అది సకల కల్మషములను నివారించును. దశరథ రాముడే పరబ్రహ్మయైన రాముడు. ఈ రహస్యము అజ్ఞాను లెరుగరు ఇద్దరు వేర్వేరు రాములు ఉన్నా రనెడి భావమును విడనాడుము.

అని పరమేశ్వరుడు చెప్పగా పార్వతీ దేవికి గల సందేహము పటాపంచలై పోయెను. రాముడు మానవుడుగా జన్మించుటకు గల కారణములు తెలుపుమని ఆమె శివుని ప్రార్థించెను. అంతట ఈశ్వరుడు ప్రసన్నచిత్తుడై పూర్వము కాకభుశుండుడు గరుత్మంతునకు చెప్పిన ఈ దిగువ కథను వినిపించెదను. సావధాన చిత్తవై వినుము.

ధర్మము క్షీణించి అధర్మము వృద్ధియగునప్పుడు, దుష్టులు చెలరేగి శిష్టులను బాధించునప్పుడు, దుష్ట శిక్షణార్థము, శిష్టరక్షణార్థము నిర్గుణుడైన పరబ్రహ్మ అనేక అవతారములు ఎత్తుచుండును. శ్రీరామావతారమునకు అనేక కారణములు కలవు.



ఒకానొక సమయమున వైకుంఠమున శ్రీహరిని సందర్శించుటకై బాలుర రూపములో దిగంబరులుగా వచ్చిన సనకసనందనులను జయ విజయులనే ద్వారపాలకులు వారింపగా వారు కోపించి భూలోకములో రాక్షసులుగా జన్మించుడని ఆ ద్వారపాలకులను శపించిరి. వారు హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడుగా జన్మించిరి. హిరణ్యాక్షుని వరాహావతారము ధరించి భగవానుడు సంహరించెను. నరసింహావతారము నెత్తి హిరణ్యకశిపుడను వానిని వధించి తన భక్తుడైన ప్రహ్లాదుని కీర్తిని వ్యాపింపచేసెను. భగవానునిచే వధింపబడినను మూడు జన్మముల వరకు రాక్షసులుగా జన్మింపవలెనని బ్రాహ్మణ శాప ముండుట వలన వారు మోక్షమును పొందలేక పోయిరి. వారే రావణ కుంభకర్ణులుగా జన్మించిరి. వారి సంహారమునకై కౌసల్యా దశరథులకు భగవానుడు రాముడుగా అవతరించెను.

ఒక కల్పములో జలంధరుడనే రాక్షసుడు దేవతల నందరిని యుద్ధములో ఓడించెను. ఈశ్వరుడు అతనితో ఘోరముగా యుద్ధము చేసెను. వాని భార్య పాతివ్రత్య బలము వలన జలంధరుని ఓడించుట ఈశ్వరునకు దుర్లభమయ్యెను. అంతట శ్రీ మహావిష్ణువు జలంధరుని వేషముతో అతని భార్య వద్దకు వెళ్ళి ఆమె యొక్క వ్రతాన్ని భంగపరచి దేవతలకు సహాయపడెను. ఆమెకు తర్వాత ఈ రహస్యము తెలియగా ఆమె క్రుద్ధురాలై భగవానుని శపించెను. ఆ శాపము వలన భగవానుడు శ్రీరాముడుగా అవతారమెత్తవలసివచ్చెను. జలంధరుడే రావణుడుగా జన్మించెను. శ్రీరాముడు యుద్ధములో అతనిని హతమార్చెను.

శ్రీరాముడు మనుష్యుడుగా అవతరించుటకు మరొక కారణము కూడా కలదు. భరద్వాజమునీ! ప్రతి అవతార కథను కవులు అనేక విధాలుగా వర్ణించియున్నారు.

ఒక పర్యాయము నారదుని శాపము వలన భగవానుడు అవతారమెత్తవలసి వచ్చెను." ఈ మాట వినగానే పార్వతి చకితురాలై "విష్ణుభక్తుడు, జ్ఞానియైన నారదముని ఏ కారణము వలన భగవానుని శపించెను? భగవానుడు అతనికి చేసిన అపకారమేమిటి?" అని అడుగగా ఈశ్వరుడు నవ్వి లోకములో ఎవరును జ్ఞానులును కాదు, మూర్ఖులును కాదు, శ్రీరాముడు ఎవరిని ఎప్పుడు ఏ విధముగా చేయదలచునో ఆ క్షణముననే వారు అట్లు కాగలరు.

హిమాలయపర్వతములో ఒక విశాలమైన పవిత్రమైన గుహ కలదు. దాని సమీపముననే గంగానది ప్రవహించుచుండెను. అచ్చట గల పరమ పవిత్రమైన సుందరమైన ఆశ్రమమును చూడగనే నారదుడు పరమానందభరితుడై శ్రీహరి పాద పద్మములయందు ప్రేమ వృద్ధికాగా భగవానుని స్మరించుచు సమాధినిష్ఠుడయ్యెను.

ఇంద్రుడు తన పదవి కొరకు నారదుడు తపస్సు చేయుచున్నాడని భ్రమించి అతని తపస్సు భంగము చేయుమని మన్మథుని కోరెను. అంతట మన్మథుడు వసంతాది పరివారముతో అచ్చటకు వెళ్ళెను. వసంతుడు లోకమంతటను వాయువును శీతల మంద సుగంధిలముగా మార్చి వేసెను. వివిధ వృక్షములు చక్కని పుష్పములతో పరిమళించుచు, ఫలములతో శోభిల్లుచుండెను. గంధర్వులు గానము చేయుచుండిరి. అప్సరసలు నాట్యమాడుచుండిరి. ఇట్లు మన్మథుడు అనేక విధములుగా ప్రయత్నించినను నారదముని తపస్సును భంగ పరచలేకపోయెను. అంతట మన్మథుడు భయపడి ముని వద్దకు వెళ్ళి నమస్కరించి తాను వచ్చిన కథ అంతయు విన్నవించి క్షమాపణ వేడుకొనగా ముని కోపము తెచ్చుకొనకుండ ప్రియ వచనములు పలికి మన్మథుని భయరహితునిగా చేసెను. ముని పాదములకు నమస్కరించి సెలవు గైకొని అతడు సపరివారముగా వెళ్ళిపోయెను. అతడు



ఇంద్రుని సభలో పాల్గొని అందరకు నారదముని యొక్క నిగ్రహశక్తిని చెప్పగా అందరు ఆశ్చర్యపడి ముని యొక్క గొప్పతనమును ప్రశంసించిరి.

అంతట తాను కాముని జయించినట్లు గర్వము చెంది నారదుడు కైలాసమునకు వెళ్ళి ఈశ్వరునితో ప్రగల్భములు పలుకగా ఈశ్వరుడు "మునీశ్వరా! నాతో చెప్పినట్లు విష్ణువుతో చెప్పవద్దు" అని పలికెను. కాని నారదుడు ఆ హెచ్చరికను లెక్కచేయక వైకుంఠమునకు వెళ్ళి విష్ణువును సందర్శించి తాను కామదేవుని పరాజితుని గావించిన సంగతి సగర్వముగా వెల్లడించెను.

విష్ణువు "మునిరాజా! మీ నామస్మరణ చేతనే మోహము, కామము, మదము, అభిమానము పటాపంచలు కాగలవు. ఇక మీ విషయమున చెప్పవలసిన పని ఏమున్నది? ఎవనిలో జ్ఞాన వైరాగ్యములు ఉండవో వారే మోహితు లగుచుందురు. మీరు బ్రహ్మచర్య వ్రతతత్పరులు. ధీరులు. మిమ్ములను కామదేవుడు ఏ విధముగా బాధింపగలడు?" అని ప్రశంసించెను. ఈ మాటలకు మరింత గర్వము చెంది అహంకారముతో "ఇది యంతయు మీ కృపాఫలితమే" అని నారదముని పలికెను. కరుణానిధియైన భగవానుడు ముని మనస్సులో గల అహంకారమును గ్రహించి ఈ గర్వాంకురమును వెంటనే త్రుంచివేయవలెనని భావించెను.

నారదుడు భగవానునికి నమస్కరించి వెళ్ళిపోయెను. అతని మనస్సులో గర్వము, అహంకారము ఇతోధికముగా వృద్ధి కాసాగెను. త్రోవలో విష్ణుమాయచే అతనికి అతి సుందరమైన నాలుగు వందల క్రోసుల విస్తీర్ణము గల నగర మొకటి కన్పించెను.

ఆ నగరమునకు శీలనిధి అను రాజు అధిపతి. అతనికి విశ్వమోహిని అనే పేరుగల రూపవతి అయిన పుత్రిక గలదు. ఆ రాకుమారి స్వయంవరము జరుగుచున్నందున అనేక రాజులు, రాకుమారులు అచ్చటకు విచ్చేసియుండిరి. నారదుడు ఇది యంతయు గాంచి "ఏమిటిది" యని

అచ్చటి వారిని అడిగి వివరములు తెలిసికొని తాను కూడ రాజమహలులో ప్రవేశించెను. రాజు మునిని పూజించి సుఖాసనముపై కూర్చుండ జేసెను. పిమ్మట తన పుత్రికను మునికి చూపించి ఈమె గుణదోషములు చెప్పుమని రాజు అడిగెను.

ఆమె సౌందర్యమును చూడగానే నారదముని వైరాగ్యము దూరమైపోయెను. ఆయన చాలసేపు ఆమె వైపు చూచుచు అట్లే ఉండిపోయెను. ఆమె లక్షణములు చూచి తన్ను తాను మరచిపోయెను. హృదయములో ఆనందించెను. కాని ఆ లక్షణములను వెల్లడిచేయలేదు. "ఆమెను ఎవరు వివాహ మాడెదరో వారికి మరణము ఉండదు. అంతేగాక అతనిని యుద్ధరంగములో ఎవరును జయించలేరు. ఇంతియేగాక సకల చరాచర జీవులు అతనికి సేవ చేయగలవు. ఈమె సకలశుభ లక్షణములు గల కన్య" అని రాజుతో చెప్పి నారదుడు బయలుదేరెను. కాని మనస్సులో ఆ కన్య తనను ఎట్లు వరించునా అని చింతిల్లుచుండెను. "జపతపాల వలన ఇది సిద్ధించునా! రాకుమారి తనను వరించుటకు చక్కని అందమైన రూపము తనకు ఎట్లు లభించును?" అని ఆలోచించుచు పరమేశ్వరునే అతని సౌందర్యమును తనకిమ్మని అడుగుటకు నిశ్చయించుకొనెను. కాని అతని వద్దకు వెళ్ళుటకు చాల సమయము పట్టునని భావించి అనేక రీతుల భగవానుని ప్రార్థించెను.

అంతట భగవానుడు నారదుని ముందు ప్రత్యక్షమయ్యెను. తన పని నెరవేరుచున్నందుకు లోలోన ఆనందపడుచుండెను. నారదుడు చాల దీనముగా కథ యంతయు విన్నవించి ప్రభువును అతని సౌందర్యమును తనకు ఇమ్మని, లేనిచో రాజకన్య తనను వరించదని మిక్కిలి వినయముతో వేడుకొనెను. అంతట ప్రభువు "మునీంద్రా! ఏది మేలో నీకు అట్లే చేయగలను. రోగి అపథ్య మడిగినను వైద్యుడు అది ఇవ్వడు గదా!" అని చెప్పి



అంతర్ధానమయ్యెను. మాయా వశీభూతుడైన కారణముగా భగవానుని మాటలలోని భావమును ముని అర్థము చేసికొనలేకపోయెను.

స్వయంవరము జరుగుచున్న స్థలానికి నారదముని చేరుకొనెను. రాజులు అందరును బాగుగా అలంకరించుకొని తమతమ ఆసనములపై ఆసీనులైరి. "నా సౌందర్యమును చూచి కన్య మరొకరిని పొరపాటునకూడా వరించ" దని నారదుడు తనలో తాను నిశ్చయించుకొని సంతోషపడుచుండెను. దయానిధి అయిన పరమేశ్వరుడు మునియొక్క శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని వర్ణించ వీలు పడని కురూపమును నారదునకు ప్రసాదించెను. కాని ఎవరును ఇది తెలిసి కొనక అందరు అతనిని నారదునిగా భావించి నమస్కరించిరి.

అచ్చట శివగణములు ఇద్దరు కూర్చుండి యుండిరి. వారు బ్రాహ్మణ వేషములు ధరించి అది అంతయు పరికించుచుండిరి. తన రూపమును తలచుకొని గర్వించి ముని కూర్చున్న సంక్తిలోనే వారును వచ్చి కూర్చుండిరి. బ్రాహ్మణ వేషములో నున్నందున వారిని ఎవరును గుర్తించలేక పోయిరి. వారు నారదునితో "భగవానుడు మీకు గొప్ప సౌందర్యము నిచ్చియున్నాడు. మీ శోభను చూచి తప్పక రాకుమారి మిమ్ములను సాక్షాత్తు హరి (కోతి)గా తలంచి మిమ్ములనే వివాహమాడగల" దని వ్యంగ్యముగా పలికిరి.

వారి మాటలను వాస్తవముగానే భావించి నారదుడు ఆనందపడుచుండెను. శివ గణములు కూడా తమ మాటలలోని గూఢార్థము ముని తెలిసికొనక ఆనందించుచుండుట గాంచి తమలో తాము నవ్వుకొనుచుండిరి. వారెంతయో స్పష్టముగా హేళన చేయుచు మాటాడినను ఆ ముని బుద్ధి భ్రమలో పడియున్నందున వానిని అర్థము చేసికొనలేక వారి వ్యంగ్యోక్తులను ప్రశంసగానే భావించుచుండెను. రాకుమారి నారదుని రూపమును, కోతి ముఖము వంటి ముఖమును, భయంకర శరీరమును చూచి కోపోద్రిక్తురాలయ్యెను. జయమాలను చేత పట్టుకొని అచ్చట నున్న రాజులను చూచుచు ఇటు నటు తిరుగుచుండెను. విష్ణువు రాజకుమారుని

వేషము ధరించుకొని అచ్చటకు చేరుకొనెను. రాకుమారి అతనిని చూచి సంతోషముతో ఆతని మెడలో పూలమాలను వైచెను. విష్ణుభగవానుడు పెండ్లి కుమార్తెను వెంట బెట్టుకొని పోయెను. అచటనున్న రాజు లెల్లరు నిరాశ చెందిరి. మోహవశముచే బుద్ధి మారుట వలన రాకుమారి తనను వరించక వెళ్ళి పోయినదని ముని ఖిన్నమనస్కుడయ్యెను. "నీ రూపమును అద్దములో చూచుకొ"మ్మని శివగుణములు నవ్వుచూ చెప్పి పారిపోయిరి. అంతట ముని జలములో తన ముఖమును తొంగి చూచి తన రూపానికి తానే కోపగించుకొనెను.

శివగణములను రాక్షసులు కండని కోపముతో ముని శపించెను. అయినప్పటికి విష్ణువుపై అతని కోపము తగ్గలేదు. అతనిని శపించడమో లేక ప్రాణాలను విడిచిపెట్టడమో చేయవలెనని నిశ్చయించుకొని విష్ణువు వద్దకు వెళ్ళెను. త్రోవలోనే శ్రీహరి లక్ష్మీసమేతుడై రాకుమారితో కూడి ప్రత్యక్షమయ్యెను. ''మునీంద్రా! ఇంత వ్యాకులపాటుతో ఎచటకు వెళ్ళుచున్నావు?" అని నారదుని ప్రశ్నించెను.

ముని మరింత కోపోద్రిక్తుడై "నీవు ఇతరుల సంపత్తిచూచి ఓర్వలేవు. నీవు ఈర్ష్యాళుడవు. సముద్రమును మథించునప్పుడు శివుని పిచ్చివానిని చేసి విషపానము చేయించి యుంటివి. అసురులకు మద్యమును, శివునకు హాలాహలమును ఇచ్చి నీవు మాత్రము లక్ష్మీదేవిని సుందరమైన కౌస్తుభమణిని చేపట్టితివి. నీవు నిరంకుశుడవు. మంచిని చెడుగాను, చెడును మంచిగాను చేయుదువు. నీవు అందరిని మోసము చేయుదువు. ఇంతవరకు నిన్నెవరును సరియైన మార్గాన పెట్టలేదు. కాని నావంటి వానితో వైరము పెట్టుకొన్నావు. కాన దానికి తగిన ఫలము అనుభవించగలవు. నీవు నన్ను కోతిగా చేసి యుంటివిగాన నీకు కోతులే సాయపడగలవు. నేను ఏ స్త్రీని కోరియుంటినో ఆమెను నాకు దూరము చేసి నాకు చాల కీడు చేసితివి. నీవు కూడ స్త్రీ వియోగంతోనే దుఃఖించెదవు" అని శపించెను.



నారదుని శాపము విని విష్ణువు హర్షించెను. ఆయన తన మాయను తొలగించెను. అచట రాకుమారి లేదు. లక్ష్మీదేవి లేదు. ముని ఇది చూచి భయవిహ్వలుడై శ్రీహరి పాదములపై బడి శాపము పెట్టినందులకు తనను క్షమించుమని అత్యంత వినయముతో వేడుకొనెను. ఇది అంతయు నా ఇచ్ఛానుసారముగానే జరిగిన దని భగవానుడు చెప్పగా "మిమ్ములను అనేక విధాలుగా దూషించితిని. నా పాపమెట్లు పోగలదు" అని ముని అడుగగా "శంకర నామమును నూఱు పర్యాయములు జపించుము. దానివల్ల వెంటనే నీకు మనశ్శాంతి కలుగగలదు. శివుని కంటే ప్రియమైన వాడు నాకు మరొకడు లేదు. ఈశ్వరుని కృప ఎవడు పొందడో వాడు నా భక్తుడు కాజాలడు. ఇటువంటి విశ్వాసముతో లోకములో ఎచ్చట తిరిగినను నా మాయ నీ సమీపమునకు చేరదు" అని చెప్పి భగవానుడు అదృశ్యుడయ్యెను.

నారదుడు ప్రసన్న చిత్తముతో వెళ్ళుటను గాంచి శివగణములు త్రోవలో ఎదురై "మునీశ్వరా! మేము బ్రాహ్మణులము కాము. శివగణములము. మేము పెద్ద అపరాధము చేసితిమి. దానికి తగిన ఫలము పొంది యుంటిమి. దయ యుంచి శాపమును దూరము చేయుడు" అని వేడుకొనగా ముని "మీరు ఇద్దరును రాక్షసులుగా జన్మించుడు. ఐశ్వర్యము బలము, తేజస్సు మీకు లభించగలవు. మీ భుజబలముతో విశ్వమంతయును మీరు జయించిన రోజున విష్ణుభగవానుడు మనుష్య రూపము ధరించి యుద్ధములో మిమ్ములను వధించును అప్పుడు మీరు ముక్తిపొందగలరు" అని చెప్పగా వారు మునికి నమస్కరించి వెళ్ళిపోయిరి. కొన్నేండ్లకు వారు రాక్షసులుగా జన్మించిరి. భూ భారనివారణకై భగవానుడు ఒక కల్పములో ఈ కారణముచేతనే మనుష్యావతారమెత్తెను.

"ఓ పార్వతీ! భగవానుడు అవతరించుటకు మరియొక కారణము కూడ చెప్పుచున్నాను. నిర్గుణ నిరాకారుడైన పరబ్రహ్మ అయోధ్య రాజుగా అగుటకు కారణము వివరముగా చప్పుచున్నాను. వినుము అని ఈశ్వరుడు

పర్వతరాజుపుత్రికి చెప్పినట్లు యాజ్ఞవల్క్య మహాముని భరద్వాజమునికి చెప్పెను.

ఓ మునీ! శ్రీరామచంద్రుని చరిత్ర కలి కల్మషములను హరించి కల్యాణము చేకూర్చును. మనవజాతిని సృష్టించిన స్వాయంభువ మనువు అతని పత్ని శతరూప ఇరువురును ధర్మ పరాయణులు. వారికి ఉత్తానపాదుడను పుత్రుడు జన్మించెను. అతనికి సుప్రసిద్ధ హరిభక్తుడైన ధ్రువుడు పుత్రుడు. ఆ మనువు చిన్న కుమారుడు ప్రియవ్రతుడు. మరియు దేవహూతి యను కుమార్తె కూడ కలదు. ఆమెను కర్దమ మునికి ఇచ్చి పెండ్లిచేసెను. వారికి కపిలమహాముని జన్మించెను. ఆయన తత్త్వ విచారణ యందు మిగుల ప్రవీణుడై సాంఖ్య శాస్త్రమును రచించెను.

ఆ స్వాయంభువ మనువు చాల వత్సరములు రాజ్య పరిపాలన చేసెను వార్ధక్యము వచ్చినను వారికి వైరాగ్యము కలుగనందున మిగుల చింతించుచు శ్రీహరి యందు భక్తి కలుగవలెనని భావించెను. తన పుత్రునకు బలవంతముగా రాజ్యము నప్పగించి భార్యాసమేతుడై వనమునకు వెళ్ళెను. ఆ దంపతులు గోమతీనదిలో స్నానము చేసి పుణ్యతీర్థములన్నియు సేవించిరి. "ఓం నమో భగవతే వాసుదేవాయ" యను ద్వాదశాక్షర మంత్రమును భక్తితో జపించుచుండిరి. వారికి వాసుదేవుని యందు అమిత భక్తి చేకూరెను. కొన్నేండ్లు కందమూల ఫలములు భుజించుచు మరి కొన్నేండ్లు వానిని వదలి కేవలము జలపానము చేయుచు తపస్సు చేసిరి.

ఇట్లు వారు ఆరువేల సంవత్సరములు శ్రీహరి దర్శనమునకై తపమాచరించిరి. కేవలము వాయు భక్షణతో ఏడువేల సంవత్సరములు తపస్సు చేసిరి. "ఆ ప్రభువును ఎట్లు చూడగల్గుదుమా!" అనే అభిలాష వారిలో అంతకంతకు అభివృద్ధి కాజొచ్చెను. వాయుభక్షణము సైతము విడిచి పదివేల సంవత్సరములు ఇరువురు ఒకే కాలిపై నిలువబడి తపస్సు చేసిరి.



వారి అపార తపస్సుకు మెచ్చి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పలు పర్యాయములు మనువు వద్దకు వచ్చి ఏదైనా వరము కోరుకొనవలసినదిగా ఎంతగా చెప్పినను వారేమియు కోరలేదు. శరీరము ఎముకలగూడు అయినను వారి మనస్సులో ఏ కొలదిగానైనను బాధలేదు. ప్రభువునందు అనన్య భక్తి గలవారును తపస్సంపన్నులునైన వారిరువురను స్వామి సొంత సేవకులుగా గుర్తించెను.

అంతట వరమడుగుమని ఆకాశవాణి పలికెను. ఆ వాక్యమునకు వారి శరీరములు పులకితములయ్యెను. భగవానుని దేదీప్యమానమైన స్వరూపమును చూడ వలెనని కోర్కె వెలిపుచ్చిరి, అంతట పరమేశ్వరుడు ప్రత్యక్షము కాగా అతని రూప సౌందర్యాదులను రెప్ప వాల్చకుండ తదేక దీక్షతో చూచుచు మంత్ర మగ్ధులై భగవానుని పాదములపై వ్రాలిరి. భగవానుడు తన కోమల హస్తములతో వారి మస్తకములను స్పృశించి లేవదీసెను. మీకు కావలసినది ఏ వరమైనా కోరుకొండని భగవానుడు పలుకగా "మిమ్ములను చూడగానే మా మనస్సులోని కోర్కెలన్నియు ఫలించెను. అయినను మీరు అడుగుమన్నారు గాన విన్నవించు కొనుచున్నాము. "మీ వంటి పుత్రుడు మాకు కావలెను" అని కోరగా నా వంటి వ్యక్తిని ఎచ్చట వెదకి తీసుకరాగలను? నేనే మీకు పుత్రుడుగా జన్మించగలను." అని చెప్పి "నీవు కూడ, ఏదైనా వరము అడుగుము" అని శతరూపతో స్వామి పలుకగా "రాజు కోరిన కోర్కెయే నా కోరిక" అని ఆమె విన్నవించెను. స్వర్గలోకములో పెక్కేండ్లు అనేకభోగము లనుభవించిన పిమ్మట మీరు అయోధ్యా నగరమున రాజదంపతులుగా జన్మించెదరు. అప్పుడు మీకు నేను పుత్రుడనై జన్మింపగలనని చెప్పి భగవాను డదృశ్యుడయ్యెను.

అంత వారు కొన్నేండ్లపాటు భగవద్భక్తితో ఆశ్రమవాసము చేసి అనాయాసముగానే శరీరమును త్యజించి ఇంద్రపురియైన అమరావతిలో వసించిరి. అత్యంత పవిత్రమైన యీ చరిత్రమును ఈశ్వరుడు పార్వతికి

చెప్పెను అని యాజ్ఞవల్క్య మహాముని భరద్వాజ మునికి చెప్పి శ్రీరామావతారమునకు మరొక కారణమును ఇట్లు వివరించెను.

భూమండలములో ప్రసిద్ధమైన కేకయదేశమును ధర్మాత్ముడు, సత్యసంధుడు, మహాతేజశ్శాలియైన "సత్యకేతుడు" అను రాజు పాలించుచుండెను. అతనికి ప్రతాప భానుడు, అరిమర్దనుండను నిర్వురు అతి బలశాలులైన పుత్రులు గలరు. సత్యకేతుడు తన పెద్ద కుమారునికి రాజ్యపాలన అప్పచెప్పి వనమున కేగి తపస్సు చేసుకొనుచుండెను. ప్రతాపభానుడు తమ్ముని సహాయముతో రాజ్యమును ధర్మబద్ధముగా పరిపాలించుచుండెను. చతురంగ బల సమేతుడై సకలరాజన్యులను తన పాదాక్రాంతులను చేసుకొనెను. అతని పరిపాలనలో సకలజను లెట్టి కష్టములు లేక మిక్కిలి సుఖించుచుండిరి. ఆ భూపతి వేద పురాణాలలో వివరించబడిన వివిధ యజ్ఞయాగములను ఒక్కొక్కటి వెయ్యి పర్యాయములు కోరిక లేకుండ చేసెను. యాగఫలితమును వాసుదేవునికే అర్పించెను.

ఒక దినము రాజు మంచి గుఱ్ఱము నెక్కి అనుచరులతో వింధ్యాచల ప్రాంతము నందలి అరణ్యమున కేగి అనేక పక్షులను, మృగములను వేటాడెను. ఇట్లు వేటాడుచు వెళ్ళుచుండగా అతనికి ఒక బలిష్ఠమైన అడవి పంది కనిపించెను. గుఱ్ఱము యొక్క చప్పుడు విని రాజు ఉలికిపడి దాని వైపు చూచి విల్లు నందుకొని బాణము సంధించగా అదిచూచి ఆ పంది వాయువేగముతో పరుగెత్తిపోయెను. అంత రాజు బాణము విడిచెను. ఆ బాణమును చూడగనే ఆ వనవరాహము చెట్టుచాటున నక్కెను. రాజు వదలక బాణములను వేయసాగెను. అది తప్పించుకొని దట్టమైన అడవిలో ప్రవేశించెను.

అచ్చుటకు గుఱ్ఱము పోవుటకు వీలులేక పోయినను రాజు ఆ వరాహమును వదలక వెంటబడెను. అంత ఆ పంది తప్పించుకొనిపోయి ఒక పర్వత గుహలో జొరబడెను. ఆ గుహలోపలకు వెళ్ళుటకు వీలులేక రాజు వెనుకకు మరలెను. వచ్చిన దారి మరచెను. అడవిలో తిరుగుట



వలన చాల అలసిపోయెను. అతనికి దప్పిక అయ్యెను. నీటి కొఱకు రాజు వనమంతయు వెదకెను. కాని ఎచ్చటను జలము లభించక బాధపడుచుండెను. వనమంతయు తిరుగుచు ఒక ఆశ్రమమును చూచెను. అచ్చట నొక రాజు కపట ముని వేషముతో నివసించుచుండెను. ఆ రాజు రాజ్యమును ప్రతాపభానుడు యుద్ధములో జయించి స్వాధీనము చేసుకొనగా అతడు యుద్ధము నుండి పారిపోయి వచ్చి ఈ వనములో ఒక కుటీరమును నిర్మించుకొని కాలము గడుపుచుండెను. అతడు అభిమానముచేత ప్రతాపభానుని ఆశ్రయింపక మనస్సులోని క్రోధమును తగ్గించుకొని తాపస వేషముతో మంచిరోజుల కొఱకు ఎదురు చూచుచుండెను.

ఆ వచ్చిన వ్యక్తి ప్రతాపభానుడే అని అతడు వెంటనే గుర్తించెను. ప్రతాపభానుడు దాహ బాధలో ఉండుటవలన అతనిని గుర్తించలేదు. అతని వేషమును చూచి రాజు మహామునిగా భావించి గుఱ్ఱము నుండి దిగి అతనికి నమస్కారము చేసెను. కాని చతురు డగుటవలన రాజు తన పేరు చెప్పలేదు. రాజునకు దాహముగా నున్నదని తెలిసికొని అతడు ఒక సరోవరమును చూపించెను. రాజు గుఱ్ఱమును వెంట బెట్టుకొని ఆనందముతో ఆ సరస్సులో దుమికి స్నానము చేసి నీరు త్రాగెను. అలసట తీరిపోయి రాజు సుఖించెను. ఆ కపట ముని అతనిని ఆశ్రమములోనికి తీసుకుని వెళ్ళి ఆసనముపై కూర్చుండబెట్టి ఇట్లు పలికెను. "అయ్యా! ఎవరు మీరు? సుందరమైన యౌవనములో నుండియు జీవితము పట్ల లక్ష్యము లేక వనములో ఒంటరిగా ఎందుకు తిరుగుచున్నారు? మీ యందు చక్రవర్తి లక్షణములు చూచి నాకు చాల దయకల్గుచున్నది" అని ప్రశ్నింపగా రాజు "ఓ మునీశ్వరా! ప్రతాప భానుడనే రాజుకు నేను మంత్రిని. వేటకై వచ్చి తిరుగుచు దారి దప్పితిని. భాగ్యవశమున ఇక్కడకువచ్చి మీ పాదములను దర్శించుకో గల్గితిని. మీ దర్శనము దుర్లభమైనది. కనుక నాకు ఏదైనా మేలు కలుగ కలదని తోచుచున్నది." అని పలికెను.

అంతట ముని "రాజా! ఇప్పుడు చీకటి పడినది. మీ నగరము ఇచ్చట నుండి దెబ్బది యోజనముల దూరములో నున్నది. ఇంత కటిక చీకటిలో సరియైన దారిలేని దట్టమైన అడవిలో వెళ్ళుట మంచిది కాదు. కనుక ఇక్కడనే రాత్రి అంతయును గడపి ఉదయమే బయలుదేరుము." అనెను.

అంతట మహారాజు చాల మంచిదని చెప్పి గుఱ్ఱమును ఒక చెట్టుకు కట్టి ముని వద్దకు వచ్చి అతనిని అనేక విధములుగా పొగడి అతని పాదాలకు వందనములు చేసి తన యదృష్టమును మెచ్చుకొను చుండెను. రాజు ఆ దొంగ మునిని గుర్తించనే లేదు, కాని రాజును అతడు గుర్తించెను. ఆ కపట మునికి ఈ రాజు విరోధి, పైగా అతడు క్షత్రియుడు, అంతేగాక రాజు. దొంగముని కపటముతో తన పనిని పూర్తిచేయగోరుచుండెను. అతడు యుక్తిగా ఇట్లు పలికెను "ఇప్పుడు నా పేరు భిక్షుకుడు. ఎందులకంటే నేను నిర్ధనుడను. గృహము లేనివాడను,"

ముని మాటలు విని రాజు " మీ వంటి విజ్ఞానులు ఎప్పుడు అభిమాన రహితులుగానే ఉందురు. వారు తమ స్వరూపమును ఎప్పుడును రహస్యముగానే యుంచెదరు. కనుకనే అహంకార మమకార రహితులే భగవానునికి ప్రియులని వేదములు, మహాత్ములు చెప్పుచున్నారు. మీ వంటి నిర్ధనులను, భిక్షుకులను, గృహహీనులను చూచి బ్రహ్మకు, ఈశ్వరునికి కూడ వీరు నిజముగా భిక్షుకులా? లేక మహాత్ములా! అని సందేహము కలుగుచున్నది. మీ రెవరైన నేమి? మీ చరణములకు నమస్కరించుచున్నాను. స్వామీ! నాపై దయ చూపండి" అని ప్రార్థించెను.

తన పైన రాజుకు గల స్వాభావిక ప్రీతిని గమనించి తనయందు రాజుకు అధిక విశ్వాస ముండుట గ్రహించి ఆ కపటముని అన్ని విధముల రాజును వశపరచుకొని అధిక ప్రేమను చూపుచు ఇట్లు చెప్పెను. "రాజా! నేను ఇచ్చట నుండి ఎంతోకాలము గతించినది. ఇంతవరకు నన్నెవరు



కలుసుకొనలేదు. లోకములో ప్రతిష్ఠ అనునది తపస్సు అనే వనమును భస్మము చేయు అగ్ని వంటిది." అనెను.

లోకములో సుందర వేషమును చూచి మూఢులే కాదు; చతురులు కూడా మోసములో పడెదరు. అందమైన నెమలిని చూడండి. దాని పలుకు ఎంత మధురము! కాని దాని ఆహారము సర్పము అని తులసీదాసు చెప్పుచున్నారు.

కపటముని యింకను ఇట్లు పలుకసాగెను. ప్రతిష్ఠ కలుగ కూడదనే ఉద్దేశ్యముతోనే నేను ఈ విధముగా అరణ్యములో దాగి యున్నాను. శ్రీహరిని విడిచి ఎవరి తోడను ఎట్టి ప్రయోజనము లేదు. ప్రభువునకు అంతయు తెలియును. నీవు మంచి మనస్సు గలవాడవు. కనుకనే నీయందు నాకు ప్రేమ గలుగుచున్నది. నీవంటి వానియొద్ద కూడ నేను ఏమైనా దాచినచో నాకు భయంకర దోషము కలుగును".

ఈ విధమైన మాటలకు రాజుకు మునిపై విశ్వాసము మరింత అధికము కాజొచ్చెను. కొంగవలె దొంగ జపము చేయు ఆ కపట ముని రాజు తనకు పూర్తిగా వశుడైపోయెనని తెలిసికొని యిట్లు పలికెను. "సోదరా! నా పేరు ఏకతనువు. మొట్టమొదట సృష్టి ప్రారంభమైనప్పుడు నేను జన్మించితిని. అప్పటి నుండి నేను తిరిగి పుట్టలేదు. కనుక నాకు "ఏకతనువు" అను పేరు గలిగెను. తపోబలమున ప్రపంచములో సాధ్యము కాని వస్తువు ఏదియును లేదు."

ముని మాటలకు రాజు చాల ఆనందించెను. అంతట ఆ తపస్వి పురాణ గాథలను సృష్టి, స్థితి, లయములకు సంబంధించిన ఆశ్చర్యకరమైన అనేక కథలను విపులముగా వర్ణించుచు చెప్పెను. రాజు అవన్నియు విని అతని మాయలో పడిపోయెను. తన నిజమైన పేరును చెప్పివేసెను.

అంతట ఆ తపస్వి "రాజా! నేను నిన్న ఎరుగుదును. నీవు మారు పేరు చెప్పి మోసము చేసితివి. నాకు అది మంచిదిగానే తోచుచున్నది. నీ

పేరు ప్రతాపభానుడు. నీ తండ్రి సత్యకేతు మహారాజు; గురుకృపవలన నాకు సమస్తము తెలియును. నీ స్వాభావిక సరళత్వము, ప్రేమ, విశ్వాసము చూచి నా మనస్సులో నీ యందు మమత్వ మేర్పడినది. కనుక నీ వడుగగనే నా కథ చెప్పుచున్నాను. నీకు మనస్సులో ఏ కోరిక ఉంటే అది కోరుకొనుము" అని పలికెను.

రాజు అతని పాదములను పట్టుకొని అనేక రీతుల ప్రార్థించెను. "ఓ మునీశ్వరా! మీ దర్శన భాగ్యము వలన ధర్మార్థ కామ మోక్షములు నావశమై పోయినవి. నాకు వృద్ధావస్థ మరణము, దుఃఖము లేకుండా యుద్ధములో నన్నెవ్వడు ఓడించకుండా ఈ భూమండలముపై నూఱు కల్పముల వరకు ఏకచ్ఛత్రాధిపత్యముగా నేను రాజ్యము చేయునట్లువరమిండు" అని రాజు వేడుకొనగా ఆ కపటముని "అట్లేయగుగాక! బ్రాహ్మణ జాతి తప్ప యముడు కూడా నీ చరణములపై శిరస్సు పెట్టును" అని చెప్పెను. తపోబలము వలన బ్రాహ్మణు లెప్పుడును బలవంతులే! వారి కోపానికి గురి అయినచో రక్షించువారు మరెవ్వరును లేరు. నీవు బ్రాహ్మణులను వశము చేసుకొన్నచో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నీ అధీనులగుదురు. బ్రాహ్మణులను దౌర్జన్యముతో స్వాధీనము చేసికొనజాలవు. బ్రాహ్మణ శాపము తప్ప మరి ఎవరి మూలముగా గాని ఏ కాలములో గాని నీవు నాశనము చెందవు. అని పల్కెను. ఆ వచనములు విని ప్రతాపభానుడు పరమానంద భరితుడై "యిక నాకు నాశనము లేదు. మీ ఉపకారము మరువలేను మీ దయ వలన నాకెప్పుడు కల్యాణమే జరుగుచుండును. అని విన్నవించెను. అంతట ఆ కపట ముని నీవు నేను కలుసుకొన్న విషయము, నీవు దారి మరచి పోయిన విషయము ఎవరితో చెప్పరాదని ఆ ప్రసంగము చెప్పినచో నీకు చాల నష్టము వాటిల్లగలదని మూడవవ్యక్తికి ఈ విషయము తెలిసిన వెంటనే నీ నాశము తప్పదని హెచ్చరించెను. "రాజా! ఈ విషయము నీవు చెప్పుట వలన గాని బ్రాహ్మణుల శాపము వలన గాని నీవు నాశన మగుదువు.



బ్రహ్మ, ఈశ్వరుడు ఎంతగా కోపించినను, ఏ యుపాయము పన్నినను నీవు మరణింపవు." అని చెప్పగా రాజు స్వామీ! మునీశ్వరా! మీరు చెప్పినట్లు నేను నడవనిచో నేను నాశనమగుదునుగాక! కాని బ్రాహ్మణుల శాపమన్నచో నాకు చాల భయముగా నున్నది. బ్రాహ్మణులను ఏ విధముగా వశము చేసు కొనవలెనో దయ చేసి ఆ ఉపాయము నాకు చెప్పండి" అని ప్రార్థించెను.

అంతట ఆ ముని "రాజా! ప్రపంచములో అనేక ఉపాయములు గలవు. కాని అవి కష్టసాధ్యములు. అయినప్పటికి అవి సిద్ధించవచ్చు. లేక సిద్ధించక పోవచ్చు. కాని ఒక ఉపాయమున్నది. అది కూడా కఠినమైనదే. అది నా చేతిలో నున్నది. కాని నేను మీ నగరము లోనికి రాజాలను. కాని నేను పుట్టినప్పటి నుండి ఇంతవరకు ఏ గ్రామానికి ఎవరింటికి వెళ్ళలేదు. నీ కార్యము పాడైపోవును. ఇప్పుడు నేను ఏమి చేయవలెను? అనే పెద్ద అసమంజసములో పడియున్నాను." అని చెప్పగా రాజు ఆ కపట ముని పాదములను పట్టుకొని తన పట్ల దయ చూపుమని పరి పరి విధముల ప్రార్థించెను.

అంతట ముని "రాజా! ప్రపంచములో నాకు దుర్లభమైన దేదీలేదు. నీవు మనోవాక్కాయ కర్మములచే భక్తుడవు. కాన నేను తప్పక నీ పని నెఱవేర్చెదను. మంత్రములు, యోగము, యుక్తి, తపస్సు రహస్యముగా చేసిన నాడే అవి ఫలప్రద మగును నేను వంట వండెదను. నీవు దానిని వడ్డించుము. నన్నెవరు గుర్తించకుండ చూడుము. అప్పుడు ఆ అన్నమును భుజించిన ప్రతి ఒక్కరును నీకు విధేయులై మెలగుదురు. వారే కాదు వారి యింట ఎవరు భోజనము చేసినను వారు కూడ నీ అధీనులగుదురు. కనుక ఒక సంవత్సరము పాటు నిత్యము లక్షమంది బ్రాహ్మణులకు కుటుంబసమేతముగా నీవు ప్రతిదినము భోజనము పెట్టించుము. ఆ బ్రాహ్మణులు అందరూ నీకు వశులగుదురు. వారు పూజ్యులు, యజ్ఞములు చేయుచుందురు. కనుక దేవతలు కూడ నీ వశమయ్యెదరు. నేను ఈ

రూపములో రాను. నా మాయ వలన నీ పురోహితుని అపహరించి తీసుకురాగలను తపోబలముచే నేను అతని రూపముతో అన్ని విధముల నీ కార్యము నెరవేర్చెదను. రాజా! రాత్రి చాల సమయము గడచినది. నేటికి మూడవ రోజున నీవు నన్ను కలసికొనుము. నా తపోబలము వలన నిద్రలోనే నీ గుఱ్ఱముతో కూడ నిన్ను నీ యింటికి చేర్పించెదను. నేను పురోహితుని వేషముతో వచ్చెదను. ఏకాంతములో నిన్ను పిలిచి అంతయు చెప్పెదను. అప్పుడు నీవు నన్ను గుర్తించుము." అని చెప్పెను.

రాజు నిద్రపోగా ఆ కపట మునికి నిద్ర పట్టలేదు. ఆ సమయమున కాలకేతు వను రాక్షసు డచటకు వచ్చెను. పంది వేషము ధరించి రాజును మార్గమును తప్పించినవా డతడే. అతడు ఆ కపట మునికి సన్నిహిత మిత్రుడు. యోగములో ఆరితేరినవాడు. అతనికి నూరుగురు పుత్రులు. పదిమంది సోదరులు. అందరూ పరమ దుష్టులే, దేవతలను అనేక విధములుగ బాధించెడి వారు. అందరూ పరమ దుష్టులే, దేవతలను, బ్రాహ్మణులను దుఃఖపెట్టుట చూచి ప్రతాపభానుడు ఆ రాక్షసులను యుద్ధములో సంహరించెను.

దుష్టుడయిన కాలకేతుడు గత జన్మలో గతవైరమును గుర్తు తెచ్చుకొని తాపస వేషములో నున్న రాజును కలుసుకొని శత్రు నాశనమునకు ఉపాయమును పన్నెను. ప్రతాపభానుడు ఇది ఏమియు తెలుసుకొనలేక పోయెను. కపట ముని తన మిత్రుడగు కాలకేతునితో జరిగిన సంగతి నంతయు చెప్పెను. అది విని ఆ రాక్షసుడు ఎంతయో ఆనందించి తప్పక శత్రువును కూకటి వేళ్ళతో నాశనము చేయగలుగుదు నని చెప్పి వెళ్ళిపోయెను.

ప్రతాపభానుడు గుఱ్ఱముతో కూడా క్షణములోనే ఇంటికి చేర్చబడెను. ఆ రాక్షసుడు రాజును రాణిగారి సౌధములో నిద్రబుచ్చి, గుఱ్ఱమును గుఱ్ఱపు శాలలో కట్టివేసెను.



రాజ పురోహితుని తీసికొని వచ్చి పర్వత గుహలో దాచిపెట్టెను. అతడు పురోహితుని వేషము ధరించి అతని మంచము మీద పరుండెను. ఉదయము కాగానే రాజు నిద్రనుండి మేల్కొని తన స్వగృహములోనే తానున్నట్లు తెలిసికొని ఆశ్చర్య చకితుడయ్యెను. అతడు గుఱ్ఱముపై నెక్కి వనమునకు బయలుదేరెను. నగరములో ఎవరును అతనిని గుర్తుపట్టలేకపోయిరి.

మధ్యాహ్నము గడవగానే రాజు వచ్చెను. ఇంటింట జరుగుచున్న ఉత్సవములను చూచెను. రాజుకు కపట ముని యందు విశేష భక్తియుండెను. నిశ్చిత సమయము తెలిసికొని రాక్షసుడు పురోహితుడై వచ్చెను. రాజుతో చేయబడిన రహస్యాలోచన ప్రకారము అతడు అన్ని విషయములు చెప్పెను. పూర్వము రాజుకు చెప్పిన మాటలు గుర్తుపెట్టుకొని గురువు ఆ రూపములో వచ్చెనని రాజు సంతోషించెను. ఇతడు తాపస మునియో, కాలకేతు రాక్షసుడో అతని భ్రమ వలన తెలిసికొనలేక పోయెను.

అతడు ఒక లక్షమంది ఉత్తమ బ్రాహ్మణులను కుటుంబ సమేతముగా ఆహ్వానించెను. మాయావియైన పురోహిత వేషధారి రాక్షసుడు షడ్రసోపేతమైన నాలుగు రకాల భోజములు వండెను. అనేక విధములయిన జంతువుల మాంసమును వండెను. అందు బ్రాహ్మణుల మాంసము కూడ కలిపి వేసెను. భోజనమునకు ఆహ్వానించిన బ్రాహ్మణుల పాదాలు కడిగి సుఖాసీనులను చేసెను.

ఆ వంట పదార్థములను రాజు వడ్డించ మొదలు పెట్టెను. అంతలో ఆ కాలకేతురాక్షసుని మాయ అశరీరవాణిగా ఇట్లు పలికింప జేసెను. "బ్రాహ్మణులారా! వెంటనే లేచి మీ ఇండ్లకు పొండి. ఈ అన్నమును భుజించకండి. ఇందు బ్రాహ్మణుల మాంసము కలిసి యున్నది. భుజించినచో మీకు పెద్ద ముప్పు వాటిల్ల గలదు."

ఈ మాటలు వినగానే బ్రాహ్మణు లందరు లేచి నిలబడిరి. రాజు బహువ్యాకులచిత్తుడై నోట ఒకమాట కూడ పల్కలేక పోయెను. బ్రాహ్మణులు

క్రోధముతో, “ఓ మూర్ఖరాజా! నీవు బ్రాహ్మణులను సపరివారముగా పిలిపించి కులభ్రష్టులుగా చేయగోరితివి. ఈశ్వరుడు ఎటులనో దయ తలచి మమ్ములను రక్షించెను. నీవు నీ పరివార సమేతముగా రాక్షసుడవు కమ్ము! ఒక సంవత్సరములోనే నీవు నాశనమగుదువు. నీ కులములో నీళ్ళు వదలు వారు ఒక్కరు కూడ ఉండరు” అని శపించిరి. ఈ శాపము వినగానే రాజు భయకంపితుడయ్యెను.

అంతట యథార్థమైన ఆకాశవాణి “ఓ బ్రాహ్మణోత్తములారా! మీరు సత్యా సత్యములను సరిగా విచారించక శపించినారు. రాజు నిరపరాధి” అని పలికెను. బ్రాహ్మణులు చకితులైరి. భోజనము తయారుచేసిన స్థలానికి రాజు చేరుకొనగా అచ్చట వండిన పదార్థములు లేవు. వంటచేసిన బ్రాహ్మణుడు లేడు. అన్నియు రాక్షసుని మాయా కల్పితములు గాన మాయమయ్యెను. రాజు బ్రాహ్మణులవద్దకు వచ్చి ఈ వృత్తాంతమంతయు ఎరిగించెను. అంతట బ్రాహ్మణులు, “రాజా! నీ దోషము లేకపోయినను మా శాపము తిరుగులేనిది. బ్రాహ్మణశాపము ఏ విధముగానైనను తప్పించు కొనుటకు వీలుకానంతటి భయంకరమైనది” అని చెప్పి వెళ్ళిపోయిరి, నగరవాసులు ఇది విని “ఉత్తముడైన రాజునకు ఎట్టి ఆపద సంభవించిన” దని బాధపడిరి.

కాలకేతు రాక్షసుడు పురోహితుని తన ఇంటికి పంపి కపట మునికి వార్త ఎరింగించెను. ఆ దుష్టుడు రాజుకు విరోధులయిన రాజులెల్లరకు లేఖలు పంపగా వారెల్లరు నగరముపై దండెత్తిరి. ప్రతిరోజు ఘోరమైన యుద్ధము జరుగ నారంభించెను. ప్రతాపభానుని వీరు లెల్లరు యద్దములో హతులైరి. సోదర సమేతముగా రాజుకూడ పరాజితుడయ్యెను. సత్యకేతుని రాజ్యములో ఏ ఒక్కడూ మిగులలేదు. శత్రువైన ప్రతాపభానుని పూర్తిగా నశింపజేసి రాజులు వారి వారి నగరములకు వెళ్ళిపోయిరి.

విధాత ఎవనికి వ్యతిరేకముగా నుండునో అతనిని ధూళి కూడ సుమేరు



పర్వతమువలె త్రొక్కివేయును. రక్షకుడైన తండ్రి యమునివలె మారును. త్రాడే పాముగా పరిణమించును.

ఆ ప్రతాపభానుమహారాజే రావణుడుగను, అతని తమ్ముడు అరిమర్దనుడు కుంభకర్ణుడుగను, అతని మంత్రి ధర్మరుచి విభీషణుడుగను, రాజు వంశమువారును, అతని సేవకులును రాక్షసులుగను జన్మించిరి. వారెల్లరు తోచిన రూపమును ధరింపగలిగినవారు. దుష్టులు, కుటిలాత్ములు, భయంకరులు, వివేకరహితులు, నిర్దయులు, పాపులు, హింస్రకులు, లోక కంటకులుగా అయిరి. పులస్త్యమునియొక్క పవిత్రమైన వంశములో జన్మించినను బ్రాహ్మణశాపవలన వారెల్లరును పాపాత్ములైరి. ఆ ముప్పురు సోదరులు కఠోరమైన తపస్సుచేసిరి. వారి తపస్సుకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై వరము కోరుకొమ్మని అడుగగా “వానరులచేతను, మనుష్యులచేతను తప్ప తదితరులైన ఎవరిచేతను చావకుండునట్లు వరమును రావణుడు కోరుకొనెను.

“తథాస్తు” అని చెప్పి బ్రహ్మ కుంభకర్ణుని వద్దకు వెళ్ళెను. అతనిని గాంచి బ్రహ్మ మిక్కిలి ఆశ్చర్యచకితుడయ్యెను. నిర్దయ కొరకు అతడు ఉగ్రతపము చేయుచున్నాడు. ఆ వరమిచ్చినచో నిత్యము అతడు మనుష్యులనే ఆహారముగా తీసుకొనును. అప్పుడు జగత్తు అంతయు కొన్నేండ్లలోనే నాశనమగును. అని భావించి సరస్వతిని ప్రేరేపించగా ఆమె అతనినోటిలో ప్రవేశించి బ్రహ్మవరము కోరుకొమ్మని అడుగగానే “నిర్దయ”కు బదులు ‘నిద్ర’ కావలెనని పలికెను. బ్రహ్మ “తథాస్తు” అనెను. ఎప్పుడును నిద్రిస్తూ ఉండుట మంచిదికాదని అతడు వేడుకొనగా ఆరునెలలపాటు నిద్రించుచుండునట్లు వరమును మార్చెను. పిమ్మట బ్రహ్మ విభీషణుని వద్దకు వెళ్ళి వరము కోరుకొమ్మని పలుకగా అతడు భగవచ్చరణములయందు అనన్యభక్తి ఎప్పుడు కల్గియుండునట్లు వరమును కోరెను. అతనికి వరమిచ్చి బ్రహ్మ తన లోకమునకు వెళ్ళిపోయెను. ముగ్గురు సోదరులు సంతోషముతో తమ తమ యిండ్లకు వచ్చివేసిరి.

మయదానవునకు మండోదరి అనే అందమైన అమ్మాయి గలదు. ఆమె స్త్రీలలో శ్రేష్ఠురాలు. రావణుడు రాక్షసులరాజు కాగలడని తలచి మయుడు ఆమెను అతని కిచ్చి పెండ్లి చేసెను. అతడు తన సోదరు లిరువురకు వివాహములు చేయించెను.

సముద్ర మధ్యమున గల చిత్రకూట మను పర్వతము పైన బ్రహ్మచే బ్రహ్మాండమైన కోట సృష్టింపబడెను. దానిని మయ రాక్షసుడు మరింత అలంకరించెను. లెక్కలేనన్ని మణులు పొదిగిన మేడలు కలవు. పాతాళ లోకములో నాగులు నివసించే భోగవతీ పురము కంటె, స్వర్గలోకములో ఇంద్రుడు వసించే అమరావతీపురి కంటే, అత్యంత సౌందర్యముతో ఆ దుర్గము శోభాయమానముగా నుండెను. దాని పేరే లంకానగరము. అచ్చట బలశాలులైన రాక్షసులు నివసించెడివారు. దేవతలు వారందరిని యుద్ధములో చంపివేసిరి.

ఇంద్రుని ప్రోత్సాహముతో కుబేరునికి సంబంధించిన ఒక కోటిమంది యక్షులు ఆ లంకలో నివసించుచుండిరి. రావణుడు ఈ వార్త తెలియగనే సైన్యమును వెంట పెట్టుకొని ఆ కోటను ముట్టడించెను. విశాలమైన ఆ సేనను భయంకరుడైన ఆ వీరుని చూచి యక్షులు పారిపోయిరి. రావణుడు అంతటను తిరిగి నగరమంతయు పరికించిచూచెను. దానినే తన రాజధానిగా ఏర్పాటు చేసికొనెను. యోగ్యతానుసారముగా రాక్షసు లందరుకు ఇండ్ల నిచ్చి సుఖింపచేసెను.

ఒక పర్యాయము అతడు కుబేరునిపై దాడి చేసి జయించి పుష్పక విమానమును తీసికొని వచ్చెను. ఒక పర్యాయము ఆటతనముగా కైలాస పర్వతమును ఎత్తి తన భుజబలమును పరీక్షించుకొని ఆనందముతో వెళ్ళిపోయెను. సుఖము, సంపత్తి, పుత్రులు, సహాయకులు, బుద్ధి, బలము ఇవన్నియుకూడ నిత్యము అతనికి అభివృద్ధి కాజొచ్చెను. అతని సోదరుడు కుంభకర్ణుడు. అత్యంత బలశాలి. ప్రపంచములో అతనితో దీటైన మరొక వీరుడు పుట్టనేలేదు. అతడు మత్తు పానీయములను సేవించి, ఆఱు నెలలు నిద్ర పోవుచుండును. అతడు మేల్కొన్న సమయమున ముల్లోకములు భయపడుచుండెను. ప్రతిదినము అతడు భోజనము చేసినచో లోకము లన్నియు శీఘ్రముగనే జీవరహితములగును. అటువంటి అసంఖ్యాక వీరులు ప్రపంచములో ఎందరో కలరు.



రావణుని పెద్ద కుమారుడు మేఘనాదుడు. జగత్తులోని సమరయోధులలో అతని స్థానము మొదటిది. యుద్ధములో అతని నెవరును ఎదుర్కొనలేక పోయేవారు. స్వర్గములో కూడ ఆయన యొక్క భయము వలన నిత్యము ఆందోళన కలుగుచుండెడిది. వీరే కాక ప్రపంచమును ఒంటరిగానే జయింపగల దుర్ముఖుడు, అకంపనుడు, వజ్రదంతుడు, ధూమకేతువు, అతికాయుడు మున్నగు అనేక మంది యోధులు రావణుని వద్ద ఉండిరి. ఆ రాక్షసు లెల్లరు తాము కోరిన రూపములను ధరింప గలుగుచుండిరి. వారికి దయ, ధర్మము స్వప్నమందు కూడ లేకుండెను.

ఒక పర్యాయము రావణుడు సభలో కూర్చొని అపారమైన తన పరివారమును, పుత్రులను, పౌత్రులను, సేవకులను, సేనలను చూచి మిగుల గర్వము చెంది యిట్లు పలికెను. "రాక్షస వీరులారా! దేవతలు మనకు శత్రువులు. ఎదురుగా వచ్చి వారు యుద్ధము చేయరు. బలమైన శత్రువులను చూచి వారు పారిపోవుదురు. వారిని వధించవలెనంటే ఒకే ఉపాయముగలదు. బ్రాహ్మణ భోజనములు, యజ్ఞములు, హవనములు, శ్రాద్ధములు, ఇవి జరిగేచోట్లకు వెళ్ళి బాధ కలిగించండి. ఆకలిచే దుర్బలులై దేవతలు వచ్చి నన్ను కలసికొనెదరు. అప్పుడు నేను వారిని చంపివేయుదును. లేదా వారిని పూర్తిగా స్వాధీనము చేసికొని విడిచిపెట్టెదను.

తన కుమారుడైన మేఘనాదునకు విద్యాబుద్ధులు బాగుగా నేర్పించి ఒకనాడు రావణుడు వానితో నిట్లు చెప్పెను. "కుమారా! యుద్ధములో

బలవంతులైన దేవతలను యుద్ధము చేయవలయునను అభిమానము కలవారిని, గర్వము కలవారిని నీవు జయించి బంధించి తీసికొనిరమ్ము".

కుమారుడు తండ్రి ఆజ్ఞ శిరోధార్యమని భావించెను. ఈ విధముగానే రావణుడు అందరికి ఆజ్ఞ యిచ్చి తానుకూడా గద తీసికొని బయలుదేరెను.

రావణుడు నడచివచ్చునప్పుడు భూమి కంపించిపోయెను. అతని గర్జనవలన దేవతాస్త్రీల గర్భములలోని పిండములు పడిపోయెను. క్రోధముతో రావణుడు వచ్చుచున్నట్లు విని దేవతలు భయపడి పరుగెత్తి సుమేరు పర్వతపు గుహలను ఆశ్రయించిరి. దిక్పాలకులకు చెందిన అందరి సుందర లోకములను రావణుడు నిర్మానుష్యముగా నొనరించెను. అతడు మాటిమాటికి సింహగర్జనచేస్తూ దేవతలను కయ్యమునకు రమ్మని పిలుచుచూ దూషించుచుండెను. యుద్ధమదముతో ఉన్మత్తుడై అతడు తనకు సమానులైన వీరులకొఱకు ప్రపంచ మంతయు తిరిగెను. కానీ ఎక్కడ అటువంటి వీరుడు తనకు తటస్థపడలేదు.

సూర్యుడు, చంద్రుడు, వాయువు, కుబేరుడు, అగ్ని, యముడు, కిన్నరులు, సిద్ధులు, దేవతలు, మనుష్యులు, నాగులు, వీరెవ్వరికి కూడ అతడు శాంతి లేకుండా జేసెను.

బ్రహ్మసృష్టిలో శరీరధారులైన స్త్రీ, పురుషులందరు రావణునికి అధీనులైరి. భయమువలన అతని ఆజ్ఞలను పాలించుచుండిరి. నిత్యము అతని వద్దకు వచ్చి నమ్రతతో అతని పాదములపై శిరస్సు పెట్టుచుండిరి. రావణుడు తన భుజబలమువలన విశ్వ మంతటిని వశము చేసుకొనెను. ఈ విధముగా సార్వభౌముడుగా సమ్రాట్టుగా రావణుడు తన యిచ్ఛానుసారము రాజ్యపాలన చేయ ప్రారంభించెను. దేవతలు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, నాగులు మున్నగువారి కన్నెలను మరియు సౌందర్య వతులైన ఉత్తమ రమణీమణులను తన భుజబలముతో విజయవంతముగ వివాహమాడెను.



రావణుడు చెప్పుటయే ఆలస్యము, మేఘనాదుడు తండ్రి ఆజ్ఞలను పాటించుటలో ఏ మాత్రము ఆలస్యము చేయువాడు కాడు. ఆ రాక్షసు లెల్లరు వేద విరుద్ధమగు పనులే చేయసాగిరి. గోవులు, బ్రాహ్మణులు ఏయే నగరములలో ఉండెడివారో ఆయా నగరములను అగ్నికి ఆహుతి చేయుచుండిరి. వాని భయము వలన ఎవరును బ్రాహ్మణ భోజనములను, యజ్ఞములను చేయలేక పోవుచుండిరి. దేవతలను, బ్రాహ్మణులను, గురువులను గౌరవించలేకపోవుచుండిరి. వేద పురాణములను స్వప్నములో కూడా వినుటకు వీలులేకుండెను. యజ్ఞ యాగాదులలో దేవతలకు హవిర్భాగములు ఇచ్చుచున్న వార్త రావణుని చెవిలో పడిన వెంటనే అతడు స్వయముగా పరుగెత్తుకొని వెళ్ళి అట్లు జరుగకుండ వారల నెల్లరును బంధించి యజ్ఞములను విధ్వంసము చేయుచుండెను. వేద పురాణములను చెప్పే వారిని అనేక విధములుగా యాతనలకు గురిచేసి దేశము నుండి వెళ్ళగొట్టుచుండెను. ఈ విధముగా రాక్షసులు ఘోరమైన అత్యాచారములు చేయుచుండిరి.

హింసా పద్ధతుల యందు ప్రీతి గలవారు చేసే పాపాలకు హద్దు ఉండదు కదా! పరుల ధనమును, పరాయి స్త్రీలను ఎత్తుకొని పోయేవారు, దుష్టులు, దొంగలు, జూదరులు ఎక్కువైరి. ప్రజలు తల్లిదండ్రులను, దేవతలను గౌరవించుట విడిచిపెట్టిరి. సాధువులకు సేవ చేయుటకు బదులు వారి చేతనే సేవలు చేయించుకొనుచుండిరి.

ఈశ్వరుడు పార్వతితో ఇట్లు చెప్పుచున్నారు. "ఎవరు పైవిధముగా ఆచరింతురో వారిని రాక్షసులని తెలిసికొనుము. ఇటువంటి వారివలన భూదేవి మిగుల భయ భీతురాలై వ్యాకుల పడజొచ్చెను. తనలో ఆమె ఇట్లు ఆలోచించెను. పర్వతములు, నదులు, సముద్రములు నా కంత భారము కాదు. కాని ఇతరులకు కీడు చేసే వాడొక్కడైన నున్న నాకు అదే ఎక్కువ బరువు. అన్ని ధర్మములకు విపరీతముగా ఇంత జరుగుచుండుట

చూచుచుండినను రావణుని భయమువలన భూదేవి ఏమీ పలుకలేకపోయెను. చివరకు దేవతలు, మునులు, గంధర్వులు అందరూ గోరూపమును ధరించిన భూదేవితో కలసి బ్రహ్మవద్దకు వెళ్ళిరి. బ్రహ్మ అంతా తెలిసికొనెను. ఈ విషయములో తాను ఏమీ చేయజాలనని మనస్సులోనే భావించెను. భూదేవితో "ఓ దేవీ! ధైర్యము వహించి శ్రీహరిని స్మరించుము. ప్రభువుకు తన భక్తుల బాధలు తెలుసును. నీకు గల విపత్తును అతడు నివర్తనము చేయును." అని పల్కెను.

దేవత లందరు కూర్చొని, ఆ ప్రభువు ఎచ్చట గలడా యని ఆలోచింపసాగిరి. కొందరు వైకుంఠపురములో నున్నాడని, మరికొందరు క్షీరసముద్రములో నున్నాడని చెప్పిరి. ఎవరి హృదయములో ఎట్టి భక్తి ఉండునో ప్రభువు వారికి ఆ రీతిలోనే ప్రత్యక్ష మగుచుండును. పార్వతీ! అప్పుడు నేనుకూడ అక్కడనే ఉంటిని. నేను ఈ మాట చెప్పియుంటిని. "భగవంతుడు అంతట సమానముగా వ్యాపించి యున్నాడు. దేశకాల దిశలలో ప్రభువు లేని చోటే లేదు. చరాచరముల యందు అంతట నిండియున్నను అతడు ఏదీ లేని వాడు. విరక్తుడు. దేని మీద ఆసక్తిలేని వాడు. అగ్ని సర్వత్ర అవ్యక్త రూపముతో వ్యాప్తమైయుండును. కానీ మథించిన చోట అది ప్రకటితమగును. అట్లే సర్వ వ్యాపకుడైన పరమేశ్వరుడు కూడ ప్రేమయున్న చోటనే ప్రకటితమగును."

ఈ నా మాట అందరకు ఆనందము కలిగించెను. బ్రహ్మ నామాట విని ఎంతయో సంతోషించెను. అతడు చేతులు జోడించి శరణాగత రక్షకా! నీకు జయమగుగాక! గో బ్రాహ్మణులకు హితము చేయువాడా! నీకు జయము అగుగాక! నీ లీలలు అత్యద్భుతములు. వాని భేదములను ఎవరూ తెలిసికొనలేరు. మీరు సహజముగానే కృపాళువులు. మా యందు దయ చూపండి. అందరి హృదయములలో నివసించే అంతర్యాములు. సర్వవ్యాపకులు, పరమానంద స్వరూపులైన మీకు జయము కలుగుగాక!



ఇహలోక, పరలోక భోగము లన్నింటియందు విరక్తిగలిగి మోహము విడిచిన మునులు అత్యంత ప్రేమతో రాత్రింబవళ్ళు ధ్యానించే సచ్చిదానంద స్వరూపులైన మీకు జయము కలుగుగాక! మేము భక్తిగాని పూజలుగాని ఎరుగము. విపత్తులను నాశనమొనర్చే ఆ భగవానుని శరణు జొచ్చినాము. వేదములు, సరస్వతి, ఋషులు తెలుసుకొనలేని ఆ పరమేశ్వరుడు మాయందు దయగలిగి యుండుగాక! సుందర గుణధాముడవైన పరమేశ్వరా! మీ పాద పద్మములను మునులు, సిద్ధులు, దేవతలెల్లరు నిత్యము ధ్యానించుచుందురు.

దేవతలు, పృథ్వీదేవి భయభీతులైయుండుటను తెలిసికొని వారి ప్రియ వచనములను విని ఆకాశవాణి యిట్లు పలికెను. "మునులారా! సిద్ధులారా! దేవతలారా! భయపడకండి. మీకోసము నేను మనుష్యరూపము ధరించనున్నాను. పవిత్రమైన సూర్యవంశంలో అవతరించెదను. కశ్యపుడు, అదితి, లోగడ గొప్ప తపస్సు చేయగా వారికి మొదట నే వరమిచ్చియుంటిని. వారే దశరథుడు కౌసల్యగా అయోధ్యానగరములో జన్మించెదరు. వారి ఇంట జన్మించు నలుగురు సోదరులలో నేను పెద్దవాని రూపములో అవతరించెదను. నారదుని మాటలు అన్నియు సత్యము చేయుదును. నేను భూభారమును హరించెదను. దేవతలారా! మీరు నిర్భయులుగా ఉండుడు".

ఆకాశములో భగవంతుడు చెప్పినమాటలను విని దేవతలు ఆనందముతో పొంగిపోయిరి. వారి హృదయములు శాంతపడెను. పృథ్వీదేవికి కూడ బ్రహ్మ నచ్చచెప్పగా నిర్భయురాలై ఆమెకూడ వెళ్ళిపోయెను. దేవతలతో "మీరు వానరరూపములు ధరించి భూలోకములో భగవానుని సేవించుచుండుడు". అని చెప్పి బ్రహ్మ తన లోకమునకు వెళ్ళిపోయెను.

దేవతలందరూ వారి వారి లోకములకు వెళ్ళిరి. భూలోకములో వారెల్లరు వానరరూపములతో జన్మించి భగవంతుని రాకకై ఎదురుచూచుచుండిరి.

అయోధ్యాపురములో రఘుకుల శిరోమణి దశరథుడనే రాజు ఉండేవాడు. అతడు ధర్మ ధురంధరుడు. అతనికి కౌసల్య మొదలగు రాణులు కలరు. వారు పవిత్రాచరణము కలిగినట్టివారు. భర్తకు అనుకూలంగా నడచుకొనుచు శ్రీహరి పాదములయందు దృఢభక్తి కల్గియుండువారు.

ఒక పర్యాయము తనకు పుత్రులు లేనందుకు, దశరథమహారాజు మనస్సులో చాల బాధపడెను. అతడు వెంటనే గురువుగారి గృహమునకేగి తన బాధనంతయు విన్నవించెను. వశిష్ఠ మహాముని రాజుగారికి ధైర్యము చెప్పెను. "ముల్లోకములలోకూడ ప్రసిద్ధులై భక్తుల భయమును హరించగల నల్గురు కుమారులు నీకు జన్మించెదరు" అని పలికి ఋశ్యశృంగ మహర్షిని పిలిపించెను. అతనిచే పుత్రాకామేష్టి యాగమును చేయించెను. ముని భక్తితో ఆహుతుల నివ్వగా అగ్నిదేవుడు చేతిలో పాయసముతో ప్రకటితమయ్యెను. వసిష్ఠుడు ఏమి ఆలోచించెనో ఆ పని పూర్తి అయ్యెను. "ఓ రాజా! ఇప్పుడు ఈ పాయసమును తీసికొని ఉచితమగు రీతులలో భాగములుగా చేసి నీ భార్యలకు పంచిపెట్టుము" అని ఋశ్యశృంగుడు చెప్పెను. తదనంతరము అగ్నిదేవుడు అంతర్ధానమయ్యెను. రాజు తన భార్యలను పిలువగా వారు వచ్చియుండిరి. ఆ పాయసమును సగభాగముచేసి కౌసల్య కిచ్చెను. మిగతాభాగమును రెండుభాగములుగా చేసి అందులో ఒక భాగమును కైకేయికి ఇచ్చెను. మిగిలిన భాగము మరల రెండుభాగములుగా చేసి ఒక భాగము కౌసల్యకు ఒక భాగము కైకేయికి ఇచ్చి వారిచే సుమిత్రకు ఇప్పించెను. ఆ పాయసము భుజింపగనే రాణులు ముగ్గురు గర్భవతులైరి.

చైత్రశుక్ల నవమినాడు మధ్యాహ్నపువేళ శ్రీరాముడు కౌసల్యాదేవికి పుత్రుడుగా జన్మించెను. అప్పుడు వాతావరణము అంతా శోభాయమానముగా నుండెను. తల్లి కౌసల్యాదేవి బిడ్డనుచూచి చేతులు జోడించి "నిన్ను ఎట్లు స్తుతింపగలను? నీ ప్రతిరోమములో మాయచే సృష్టింపబడిన అనేక బ్రహ్మాండముల సమూహములు నిండి యున్నట్లు వేదములు చెప్పుచున్నవి. అట్టి నీవు నా గర్భంలో ఉన్న విషయం



హాస్యముగానైన ఈ వాక్యాన్ని విన్న తర్వాత ధీరుల బుద్ధికూడ స్థిరముగా ఉండదు" అని పలికెను.

తల్లికి జ్ఞానము కలుగగానే ప్రభువు నవ్వుకొనెను. అతడు పూర్వజన్మ వృత్తాంతమును తల్లికి ఎరిగింపగా ఆమె బుద్ధి మారిపోయెను. అతనిని పుత్రరూపంలోనే చూచెను. భగవానుడు బాలకరూపంలో ఉండి ఏడ్వనారంభించెను. ఈ చరిత్రను స్మరించువారు సంసారకూపములో పడక శ్రీహరి సన్నిధి చేరగలరని తులసీదాసు చెప్పుచున్నాడు. బాలుని మధుర ధ్వనితో కూడిన ఏడుపు విని రాణులందరు కుతూహలముతో గబగబ పరుగెత్తుకొనివచ్చిరి. పుత్ర జన్మవార్త విని దశరథ మహారాజు బ్రహ్మానందముపొందెను. తన పేరును వినిన మాత్రాన కల్యాణం చేకూర్చే ప్రభువు నా యింట బిడ్డడుగా జన్మించాడని ఉప్పొంగిపోయెను.

గురువైన వశిష్ఠులవారికి కబురుపంపగా వారు బ్రాహ్మణులను వెంట బెట్టుకొనివచ్చిరి. వారు బాలుని రూప సౌందర్యమును చూచి మిగుల ఆనందించిరి. జాత కర్మ సంస్కారాదులు చేయించిరి. దశరథమహారాజు బ్రాహ్మణులకు బంగారమును, గోవులను, మణులను ఇచ్చెను. భిక్షుకులకు అన్నవస్త్రము లొసగెను. మహారాజు అందరకు దాన ధర్మములుచేసెను. నగరంలోని అన్ని వీథులలో కస్తూరి, చందనము, కేసరి వెదచల్లబడెను. కైకేయీ సుమిత్రలకుకూడ సుందరులైన పుత్రులు కల్గిరి. రాజభవనమంతా వేద ధ్వనులతో మిక్కిలి సందడిగా నుండెను. సూర్యుడు ఈ మహోత్సవములను చూచి ఒక నెలవరకు తన గతి మరచిపోయెను. ఒక నెలవరకు రాత్రులు లేవు. ఈ మహోత్సవమును చూచి దేవతలు, మునులు, నాగులు తమ భాగ్యాన్ని కొనియాడుకొనుచు, తమ తమ యిండ్లకు వెళ్ళిపోయిరి.

ఓ పార్వతీ! శ్రీరామునియందు నీకు అగాధభక్తి యున్నందున నీకు మరొక రహస్యవిషయము చెప్పుచున్నాను. కాకభుశుండియు నేను అప్పుడు

అచ్చట మనుష్యరూపములో ఉండేవాళ్ళము. అందుచే మమ్ముల నెవరూ గుర్తుపట్టలేదు. పరమానందముతో శరీరము మరచి స్మృతిలేక అయోధ్యానగర వీథులలో తిరుగుచుండేవాళ్ళము. అప్పుడు రాజుగారి దగ్గరకు వచ్చినవారు వారు కోరునవి పొందుచుండేవారు. ఏనుగులు, గుఱ్ఱములు, రథములు, గోవులు, వజ్రములు, రక రకముల వస్త్రములు రాజుగారు దానముచేసి అందరను సంతుష్టులను చేయుచుండిరి. నల్గురు రాకుమారులు దీర్ఘాయువులు కావలెనని అందరు ఆశీర్వదించుచు వెళ్ళుచుండిరి.

ఈ విధంగా కొన్ని దినములు గడచిన తర్వాత నామ కరణము చేయుటకు వశిష్ఠ మునిని పిలువగా వారు వచ్చిరి. "ఇతనికి అనేక నామములు కలవు. అయినా సకల లోకములకు సంపూర్ణ శాంతిని, సుఖమును ఇచ్చేవాడు గాన పెద్ద కుమారునకు "రాముడు" అనియు; ప్రపంచాన్ని భరణ పోషణములు చేయుట వలన రెండవ కుమారునకు "భరతుడు" అనియు; స్మరించిన మాత్రముననే శత్రువులు నాశనమగుట వలన మూడవ వానికి "శత్రుఘ్ను" డనియు శుభలక్షణములతో గూడియుండి రామునికి అత్యంత ప్రియమైన బాలునకు 'లక్ష్మణుడు' అని కులగురువైన వశిష్ఠుడు నామకరణములు చేసెను.

ముని రాజుతో ఇట్లు చెప్పెను. "రాజా! నీ నల్గురు పుత్రులు సాక్షాత్పరమేశ్వరులు. భక్తులకు సర్వస్వము అయిన వారు మీ ప్రేమ వశులై బాలలీలతో సుఖము పొందుచున్నారు. ఈ నల్గురు పుత్రులు శీల, రూప, గుణములకు ఆలవాలములు. శ్రీరాముడు అందరికంటే అధికుడు. సత్యవ్యాపకుడు. నిరంజనుడు. నిర్గుణుడైన పరబ్రహ్మ, ప్రేమ, భక్తి వివశుడై కౌసల్యాదేవి ఒడిలో ఆడుకొను చున్నాడు. శ్రీరామునికి విముఖుడై కోట్లాది ఉపాయములను పన్నినను అతని సంసార బంధనమును ఎవడు



త్రెంపగలడు? సకల చరాచర జీవులను వశం చేసుకున్న మాయ కూడ ప్రభువునకు భయపడుతుంది.

ఒక పర్యాయం తల్లి రామునికి స్నానం చేయించి అలంకరించి ఉయ్యేలలో పరుండపెట్టెను. పిమ్మట తాను స్నానము చేసి తన ఇష్టదైవమునకు నైవేద్యం పెట్టి వంటింటి లోనికి వెళ్ళెను. పిమ్మట తిరిగి పూజా స్థలమునకు రాగా రాముడా నైవేద్యమును భుజించుటను గాంచి ఊయెలలో పరుండ పెట్టిన ఆ పసివానిని పూజా స్థలమునకు ఎవరు తీసుకు వచ్చిరో అని భయపడి ఊయెల వద్దకు వెళ్ళి చూడగా అచ్చట రాముడు నిద్ర పోవుచుండెను. తిరిగి పూజా స్థలమునకు రాగా ఆ పిల్లవాడు అచ్చట భోజనము చేయుచుండెను. ఆమె హృదయం కంపించెను. "నేను అచ్చట నొక బాలుని, ఇచ్చట ఒక బాలుని చూచియుంటిని. ఇది నా బుద్ధి భ్రమయా లేక మరేదైన కారణము ఉన్నదా?" అనుకొనెను. తల్లి పడే ఆవేదనను చూచి రాముడు నవ్వుకొనెను. పిమ్మట తన తల్లికి అత్యద్భుతమైన తన అఖండ రూపమును చూపెను. ఒక్కొక్క రోమంలో కోట్లాది బ్రహ్మాండములు కనబడుచుండెను. లెక్కలేనంతమంది సూర్యులు, చంద్రులు, శివుడు, బ్రహ్మ, పెద్ద పెద్ద పర్వతములు, నదులు, సముద్రములు, భూమి, వనములు మున్నగునవి ఎన్నో ఆమె చూచెను. ఇంతవరకు వినియుండని పదార్థములు కూడా చూచెను. ఇది అంతా చూచి తల్లి శరీరం పులకితమయ్యెను. నోట మాట రాలేదు. కండ్లుమూసి శ్రీరాముని ధ్యానించెను. అతడు తల్లి ఆశ్చర్యమును చూచి మరల పసిబాలుడయ్యెను. జగజ్జనకుని పరాత్పరుని పుత్రునిగా పొందగల్గితి నని తల్లి భయపడెను. తల్లికి అనేక విధముల నచ్చచెప్పి యీ విషయమును ఎచ్చటను చెప్పవద్దని రాముడు పలికెను.

ఈ విధముగా తన బాల్య లీలలచే అందరిని ఆనందింప చేయుచు దిన దిన ప్రవర్ధమాను డయ్యెను. మనో వాక్కాయ కర్మలకు అగోచరుడైన పరమేశ్వరుడు దశరథుని గృహ ప్రాంగణములో విహరిస్తున్నాడు. భోజన

వేళ రాజు పిలుచు నప్పుడు అతడు తన స్నేహితులను విడిచి వచ్చేవాడుకాడు. తల్లి పిల్చినప్పుడు అతడు పరుగులు తీయుచుండెను. పట్టుదలతో అతనిని పట్టుకొనుటకు తల్లి పరుగెత్తుచుండెను. ధూళి ధూసరిత శరీరంతో ఇంటికి రాగా తండ్రి ఒడిలోనికి తీసుకొనుచుండెను. సోదరు లందరకు తల్లిదండ్రులు యజ్ఞోపవీత సంస్కారం చేసిరి.

సోదరులతో కలిసి రాముడు విద్యాభ్యాసమునకు గురువు గారి వద్దకు వెళ్ళి కొద్ది సమయంలోనే సకల విద్యలు నేర్చుకొనెను.

నాల్గు వేదములు తన ఉచ్ఛ్వాస నిశ్వాసములుగా గల ప్రభువు విద్యాభ్యాసం చేసెననెడి వార్త చాలా ఆశ్చర్యకరమైనది. వీథులలో వారు వెళ్ళునప్పుడు వారి శారీరక శోభను చూచి జడచేతనములు కూడ మోహపడుచుండును. స్త్రీ పురుషుల మాట యిక వేరే చెప్పనక్కరలేదు. తమ ప్రాణాల కంటే ప్రియముగా వారతనిని ప్రేమించుచుండిరి. తన సోదరులతో స్నేహితులతో కలిసి అతడు భుజించుచుండును. తల్లిదండ్రుల ఆజ్ఞలను పాటించుచుండును. నగర ప్రజలు ఆనంద పడుటకు వీలుగా లీలలు చేయుచుండును. వేద పురాణములు శ్రద్ధతో వినుచు సోదరులకు చెప్పుచుండును.

ఉదయముననే లేచి తల్లిదండ్రులకు, గురువులకు, నమస్కారములు చేసి వారి ఆజ్ఞపై పనులు చేయుచుండెను. వారి పనిపాటులు చూచి మిగుల ఆనందించుచుండెను. సర్వవ్యాపకుడు, నిర్గుణుడు, నిరాకారుడు అయిన పరమేశ్వరుడు భక్తుల కొఱకు అలౌకిక లీలలు చేయుచున్నాడు.

విశ్వామిత్ర మహాముని వనమును పవిత్ర స్థానముగా భావించి అచ్చట ఒక ఆశ్రమములో నివసించుచుండిరి. అతడు జప, యజ్ఞములను చేయుచుండెను. కాని రాక్షసులైన మారీచ, సుబాహులు చేయు విఘ్నములకు భయపడుచుండెను. యజ్ఞము ప్రారంభింపగానే ఆ రాక్షసులు పరుగెత్తి



వచ్చి ఉపద్రవములు చేయుచుండిరి. దానికి ముని మిక్కిలి వ్యాకులపడుచుండెను. భగవంతుని చేత తప్ప ఈ రాక్షసులు మరొకరిచే వధింపబడరని ఆయన గ్రహించెను. భూభార నివారణార్థము ప్రభువు అవతరించినట్లు తెలుసుకొనెను. మహాముని సరయూనదిలో స్నానముచేసి దశరథరాజేంద్రుని దర్బారుకు వెళ్ళెను.

మునీంద్రుడు వచ్చిన వార్త తెలియగానే దశరథ మహారాజు వేగముగా వచ్చి సాష్టాంగ దండ ప్రణామము చేసి ఉచితాసనముపై కూర్చుండబెట్టెను. మునివరుని పాదములను కడిగి పూజించి నావంటి "ధన్యుడు మరొకడు లేడు" అని మహారాజు సంతోషించెను. మధురములైన పెక్కు పిండివంటలతో భోజనము పెట్టించెను. రాముడు అతని సోదరులు మహామునికి పాదాభివందనము చేసిరి. శ్రీరాముని చూడగానే ముని తన దేహమునే మరచిపోయెను. దశరథుడు "మునీశ్వరా! తమరు మా గృహానికి దయచేసి నన్ను ధన్యుని చేసితిరి. తమరాకకు కారణమేమిటి? చెప్పండి. వెంటనే పూర్తిచేయగలను" అని ప్రార్థించెను.

మహాముని "రాజా రాక్షసులు నన్ను అనేక విధాలుగా బాధించుచున్నారు. శ్రీరాముని అతని సోదరునితో నావెంట పంపుము. వారు రాక్షసులను వధించినచో నా యజ్ఞము సురక్షితమగును. పుత్రవ్యామోహము విడిచి ప్రసన్నచిత్తముతో పంపుము. నీకు కీర్తిపెరుగును. వీరికి పరమ కళ్యాణముచేకూరును" అని పలికెను. ఈ మాటలు వినగానే రాజు హృదయము కంపించిపోయెను. ముఖము కాంతి విహీనమయ్యెను దశరథుడు చేతులు జోడించి "మునీశ్వరా! నా చివరిదశలో ఈ నల్గురు పిల్లలు జన్మించిరి. గోవులు, భూములు, ధనసంపత్తులు మరి ఏమైనా అడగండి. సంతోషముతో నా సర్వస్వము ఇచ్చెదను. శరీరము కంటె ప్రాణముకంటె ప్రీతి అయినది మరొకటి ఉండదు గదా! వానిని అడిగినను కూడ క్షణములో ఇచ్చెదను. నా పుత్రులెల్లరు నాకు ప్రాణ సమానులే. కాన శ్రీరాముని పంపుటకు మనస్సు అంగీకరించుట లేదు. పరమ భయంకరులైన

రాక్షసులు ఎక్కడ? పరమ సుకుమారులైన యీ పిల్లలు ఎక్కడ?" అని ఎన్నియో విధముల విన్నవించుకొనెను.

రాజుగారికి గల గాఢమైన పుత్ర ప్రేమను గాంచి విశ్వామిత్రుడు మిగుల ఆనందించెను. వశిష్ఠ మహాముని అనేక విధాలుగా నచ్చచెప్పి రాజు సందేహమును దూరము చేసెను. ఎట్టకేలకు పుత్రులిరువురను పిల్చి గాఢముగా కౌగిలించుకొనెను. "మునీశ్వరా! ఈ ఇద్దరు బిడ్డలు నాకు ప్రాణాలు ఇక మీరు వీరికి తండ్రి. గ్రహింపుడు! నన్ను అనుగ్రహింపుడు" అని దశరథుడు అనేక విధాలుగా విన్నవించి పుత్రులను ఆశీర్వదించి ఋషికి అప్పగించెను. పిమ్మట శ్రీరాముడు తల్లి వద్దకు వెళ్ళి ఆమె పాదాలకు నమస్కరించి బయలుదేరెను. యజ్ఞమును రక్షించి రాక్షసుల భయమును పోగొట్టుటకు సోదరు లిరువురు విశ్వామిత్రుని వెంట బయలుదేరిరి.

కృపా సముద్రుడగు శ్రీరామచంద్రుడు సంపూర్ణ విశ్వమునకు మూల కారకుడు. విశ్వమోహనులైన రామలక్ష్మణులు విశ్వామిత్రునికి మహానిధి వలె సంప్రాప్తించిరి. ప్రభువు నా కొఱకు తన తల్లిదండ్రులను కూడ వదలి వచ్చుచున్నాడని ముని తలచి పరమానందభరితు డయ్యెను. మార్గమున వెళ్ళుచు మునీంద్రుడు రామచంద్రునకు తాటకను చూపించెను. ఆ రాక్షసి అలికిడి వినగానే క్రోధముతో పరుగెత్తి వారి మీదకురాగా శ్రీరాముడు ఒకే యొక బాణముతో ఆ దానవిని సంహరించి ఆమెకు పరమపదము నిచ్చెను.

ప్రభువు పూర్ణ నిధియని తెలిసి కూడా మునీంద్రుడు లోకాచారము ననుసరించి అతనికి ఆకలి దప్పులు అలసట లేకుండుటకును, బలము, శౌర్యము, తేజస్సు కలుగుటకును మహామంత్రము నుపదేశించి తన ఆశ్రమమునకు తీసుకొని వెళ్ళెను. వారికి భక్తితో కందమూల ఫలములతో అతిథ్యము నిచ్చెను.

ఉదయముననే రాముడు లేచి విశ్వామిత్రునితో "మునీంద్రా మీరు నిర్భయముగా యజ్ఞము నారంభించండి" అనిపల్కెను. మునులు యజ్ఞమును



ఆరంభించిరి. రామలక్ష్మణులు ధనుర్బాణములు ధరించి యజ్ఞమును కాపాడుచుండిరి. అది చూచి మారీచ, సుబాహులు అనుయాయులతో యజ్ఞమును ధ్వంసము చేయుటకు పరుగెత్తుకొని వచ్చిరి. శ్రీరామచంద్రుడు మారీచునిపై సాధారణ బాణము వేయగా వాడు నూఱు యోజనముల దూరమున నేలమీద పడిపోయెను. సుబాహుని మీద అగ్ని బాణము వేయగా అతడు భస్మీభూతుడయ్యెను.

ఇంతలో లక్ష్మణుడు మిగిలిన రాక్షసుల నందరిని సంహరించెను. మునులు నిర్భయులైరి. దేవతలు సంతోషించి రాజకుమారులను స్తుతించిరి. తదనంతరము మిథిలా నగరములో ధనుర్యజ్ఞము జరుగుచున్నట్లు విశ్వామిత్రుడు చెప్పగా, రామలక్ష్మణులు ఆనందముతో ముని వెంట బయలుదేరిరి.

మార్గ మధ్యమున నొక ఆశ్రమము కనపడెను. అచ్చట జీవజంతువు లేమీ లేవు. అది నిర్మానుష్యముగా ఉండెను. అచ్చట నున్న శిలను చూచి అదేమిటవి శ్రీరాముడు అడుగగా "గౌతమ ముని శాపము వలన అతని భార్య శిల అయ్యెను. నీ పాదధూళి కొఱకు ఆమె తపించుచున్నది. ఈమెకు శాప విముక్తిని అనుగ్రహింపుము." అని విశ్వామిత్రముని చెప్పెను. శ్రీరాముని పవిత్ర పాదము ఆ శిలను స్పృశించగనే అది నిజరూపమైన అహల్యగా మారిపోయెను.

అహల్య చేతులు జోడించి "శ్రీరామచంద్రా! నేను అపవిత్రురాలను. నీవు లోకములను పావనము చేయువాడవు. నా పతి నాకు శాపమిచ్చుట మంచిదే అయినది. ఇప్పుడు మిమ్ములను నేత్రానందముగా చూడ గల్గితివి. లోకములను పవిత్రము చేయు గంగానది మీ పాదముల నుండియే ఉద్భవించెను. మీ చరణములను బ్రహ్మ పూజించు చుండును. అట్టి మీ పాదములు నా శిరస్సున పెట్టి యుంటిరి. నే నెంత భాగ్యవంతురాలనో!" అని ఆనందముతో పలువిధముల ప్రభువును ప్రస్తుతించి మీ పాద పద్మముల

యందు నిరంతరము నాకు భక్తి గలిగి యుండు నటుల వరమిమ్మని యడుగగా ప్రభువు ఆమె భక్తికి మెచ్చి "తథాస్తు" అనెను. అంతట ఆమె ఆనందముతో పతి వద్ద కేగెను.

శ్రీరాముడు దీనుల పాలిటి ప్రాణబంధువు. అడుగకుండగనే దయ చూపువాడు. "ఓ మనసా! ఈ సంసార జంజాటమును వదలి రామచంద్రునే భజించుము." అని తులసీదాసు చెప్పుచున్నాడు.

శ్రీ రామలక్ష్మణులు మునులతో గూడి పవిత్రమైన గంగానదిలో స్నానము చేసిరి. పిమ్మట జనకపురమునకు సమీపమునగల మామిడి తోట వద్దకు చేరుకొనిరి. ఆ మిథిలా నగరపు శోభ యింతింత అని వర్ణింపజాలము. జనక భూపాలుని రాజభవన మంతయును రాజులతోను, మంత్రులతోను, మహాజనులతోను నిండియుండెను. ఆ పురమందు గల నదులు, బావులు, తటాకములందలి నీరు అమృతతుల్యముగా నుండెను.

విశ్వామిత్రుడు రామునితో "ఈ మామిడితోట చాల చక్కగానున్నది. ఇచ్చటనే కొంతసేపు విశ్రాంతి గైకొనవలెనని నా మనస్సు కోరుచున్నది." అని పలుకగా రాముడు చిత్తము! చాలా మంచిమాట నాకును ఇష్టముగానే యున్నది" అని చెప్పి అచ్చట ఆగిరి.

విశ్వామిత్రుడు వచ్చెనన్న వార్త తెలిసికొని జనక మహారాజు పండితులను, మంత్రులను, బంధువులను వెంట నిడుకొని ముని వద్దకు వచ్చి మునికి భక్తి పూర్వకముగా నమస్కరించి కుశల మడిగెను. విశ్వామిత్రు ముని జనకుని ఆశీర్వదించెను.

మహారాజు అందరి క్షేమ సమాచారము లడుగుచుండు ఆ సమయమున రామలక్ష్మణులు అచ్చట కేతెంచిరి. వారిని తిలకించి అద్వితీయ సౌందర్యమునకు సభవారందరు ముగ్ధులైరి. విశ్వామిత్రుడు రాముని తన వద్ద కూర్చొండ బెట్టుకొనెను. రామలక్ష్మణులను చూచి విదేహరాజు (జనకుడు) విదేహు (దేహస్మృతిలేనివా) డయ్యెను.



మునీంద్రా! "వీరిద్దరూ ముని బాలకులా? లేక శ్రేష్ఠులైన రాకుమారులా? నా సహజ స్వభావము వైరాగ్యము. కాని వీరిని చూడగానే నాలోని సహజ వైరాగ్యము నశించి మోహము కల్గుచున్నది." అని మహారాజు విశ్వామిత్రునితో పలుకగా ముని నవ్వుచు "మహారాజా! మీరు చెప్పినది యథార్థమే! వీరు జగత్తులోని జీవుల నెల్లరను మోహింప చేయువారు. వీరు దశరథ మహారాజ పుత్రులు. రామలక్ష్మణులు. నా క్షేమము కొఱకు మహారాజు వీరిని నావెంట పంపెను. ఈ సోదరు లిరువురు శీలమునకు, బలమునకు, సౌందర్యమునకు నిధులు. వీరు రాక్షసులను వధించి నా యజ్ఞమును కాపాడిరి" అని చెప్పగా తన రహస్యమును ముని వెల్లడి చేయుచున్నాడని శ్రీరాముడు లోలోపల నవ్వుకొనెను.

మహారాజు అదంతయు విని "మునీంద్రా! మీ దర్శనము వలన నేను ధన్యుడనైతిని. శ్యామల, గౌరవర్ణ శరీరులైన రామలక్ష్మణులను చూడగల భాగ్యము నాకు కల్గెను. ప్రేమ పవిత్రమైనది. అనంతమైనది. వాక్కులచే చెప్పుటకు అలవికానిది. ఇది బ్రహ్మ, జీవుల మధ్య నుండే స్వాభావిక ప్రేమ." అని చెప్పుచు మహారాజు శ్రీరాముని తదేక దృష్టితో చూచి ఉప్పొంగిపోయెను. మహారాజు వారి నందరిని నగరములోనికి తోడ్కొనివచ్చి అన్ని ఋతువులలోను సుఖము నిచ్చెడి సుందర భవనములో వారిని ప్రవేశపెట్టి అనుజ్ఞ పొంది వెళ్ళిపోయెను.

రామలక్ష్మణులు మునులతో మధురాన్నమును భుజించి విశ్రమించిరి. అటుపిమ్మట మిథిలానగరమును చూడవలెనని లక్ష్మణునకు కోరిక కలిగెను. కాని ఆ మాట తెలుపుటకును, రామునికి చెప్పుటకు భయపడుచుండెను. మునిని అనుజ్ఞ అడుగుటకు సంకోచించుచుండెను. అంతర్యామియైన ప్రభువు అది గ్రహించి విశ్వామిత్రునితో ఆ మాట చెప్పెను. ముని సంతోషించి నగరమునకు వెళ్ళి నగరవాసులకు ఆనందము కలిగించి రండని చెప్పగా నమస్కరించి సోదరులు నగర సందర్శనమునకు బయలుదేరిరి.

రామలక్ష్మణుల సౌందర్యమును చూచి నగర ప్రజలు ఆనంద భరితులైరి. వారు ఇండ్లలోని పనిపాటలు వదలి పరుగెత్తుకొని వచ్చి రామలక్ష్మణులు అద్వితీయ సౌందర్యమును గాంచి తమలోతాము ఇట్లు చెప్పు కొనుచుండిరి. "వీరు కోటి మన్మథుల సౌందర్యమును మించిన సుందరులు. ముల్లోకములలో ఇట్టి సుందరులను చూడలేదు విష్ణుమూర్తికి నాలుగు చేతులు ఉన్నవి. బ్రహ్మకు నాలుగు తలలు ఉన్నవి. శివునికి మూడు నేత్రములు, ఐదు తలలున్నవి. భయంకరుడు. ఇతర దేవతలను గూర్చి చెప్పవలసిన పనిలేదు. వీరు చూచుటకు బాలకులేగాని చేసే కార్యములు సాహస కృత్యములు."

ఇంకొకామె "నేను విన్నది చెప్పుచున్నాను. వీరు దశరథుని పుత్రులు. రామలక్ష్మణులు. విశ్వామిత్రుని యజ్ఞమును సంరక్షించుటకు వచ్చియుండిరి. రాక్షసులను హతము చేసిరి. చేతిలో ధనుస్సును ధరించిన బాలుడే కౌసల్యా పుత్రుడైన శ్రీరాముడు. అతని వెంటనున్న చిన్నవాడు లక్ష్మణుడు. వీరు ముని భార్య అహల్యను ఉద్ధరించిరి. ధనుర్యజ్ఞమును చూచుటకు మన నగరమునకు వచ్చి యుండిరి." అనెను. అది విని అందరు ఆనందించిరి.

మరియొక స్త్రీ "ఇతడు జానకికి అన్ని విధముల తగిన వరుడు. రాజు వీనిని చూచినచో తన ప్రతిజ్ఞను వదలి తప్పక సీతను వీని కిచ్చి వివాహము చేయును." అని యనగా మరొకామె "వీరిని జనక మహారాజు  గుర్తించి తీసుకువచ్చెను. కాని రాజు తన ప్రతిజ్ఞను విడుచువాడుకాడు. అవివేకముతో ప్రతిజ్ఞను వదలని మూర్ఖుడు" అని పల్కెను.

మరియొకామె "విధాత మంచివాడని, అందరికి యోగ్యతను బట్టి ఫలము నిచ్చునని వినియుంటిమి. కనుక జానకికి ఇతడే పతి కాగలడు. ఎంత మాత్రము సందేహింపపని లేదు. దైవము సహాయపడినట్లైతే మనమందరము కృతార్థులమయ్యెదము. ఈ సంబంధము ఏర్పడిన యెడల రామచంద్రుడు ఇచ్చటకు వచ్చుచు పోవుచుండును. మనము పలుమారులు ఇతనిని చూడవచ్చును" అని వచించెను.



ఇంకొకామె యిట్లనెను. "నీ వన్నది సత్యమే! అందరికి హితమైనది" అనగా ఇంకొకామె "శివధనుస్సు బహు కఠినమైనది. రాకుమారుడు మిక్కిలి సుకుమారుడు, కనుక ధనుస్సును విరచుట చాలా కష్టము."

ఇంకొకామె అదివిని "చూచుటకు వీరు చిన్నవారే, కాని వీరి శక్తి అమోఘము. వీరి పాదధూళి స్పర్శచే ముని భార్య తరించెను. శివధనుస్సు విరచుట యెంతలోనిది. సీతను సృష్టించిన విధాతయే ఆమెకు వరుడుగా శ్రీరాముని సృష్టించెను" అని నొక్కి పల్కెను.

సోదరులు వెళ్ళు ప్రతిచోట స్త్రీపురుషులు గుమి కూడుచుండిరి. అంత రామలక్ష్మణులు తూర్పుదిశగా వెళ్ళి ధనుర్యజ్ఞశాలను చూచిరి. యజ్ఞశాల చాల విశాలమైనది. అనువైన ప్రాంగణము. నలువైపుల రాజులు కూర్చుండుటకు బంగారు వేదికలు అమర్చబడినవి. దాని వెనుక జనులు కూర్చుండుటకు వసతి యేర్పాట్లుచేసిరి. స్త్రీ పురుషులు విడివిడిగా కూర్చుండుటకు వీలుగా ఈ యేర్పాట్లు చేసిరి. రాజకుమారులు యజ్ఞశాలను, దాని పనితనమును చూచి మెచ్చుకొనిరి. రామచంద్రుడు ఆలస్యమైనదని భయపడుచు గురువుగారి వద్దకు వెళ్ళెను. ఎవరిని చూచి భయము భయపడునో అట్టి రాముడు భయ విహ్వలు డయ్యెను.

తెల్లవారగనే రామలక్ష్మణులు లేచి మునికి నమస్కరించి గురువుగారి అనుజ్ఞ పొంది పుష్పములు తెచ్చుటకు రాజుగారి ఉద్యానవనమునకు వెళ్ళిరి. ఆ తోట అనేక ఫల పుష్పములతో వివిధ వృక్షములతో లతలతో విరాజిల్లుచుండెను. కోకిలలు, చిలుకలు, గోరువంకలు మున్నగు పక్షులు తియ్యని పలుకులు పలుకుచుండెను. రామలక్ష్మణులు మనోహరమైన పుష్పములను తోటమాలికి చెప్పి కోసికొను చుండిరి. ఆ సమయమున చెలికత్తెలతో సీతాదేవి అచ్చటికి వచ్చెను. పార్వతీదేవి పూజ కొఱకు తల్లి సీతమ్మను అచ్చటకు పంపెను. ఒక సరోవరము వద్ద పార్వతీదేవి మందిరము మనోహరముగా ఉండెను. సీత సఖీమణులతో కలిసి స్నానముచేసి

దేవాలయమునకు వెళ్ళెను. ఆమె భక్తితో దేవిని అర్చించి తనకు దగిన పతిని ప్రసాదింపుమని ప్రార్థించెను.

సీత చెలికత్తెలలో ఒకతె వారిని వదలి తోట చూచుటకు వెళ్ళెను. అచ్చట నున్న రాజకుమారులను దర్శించి వారి సౌందర్యమునకు ముగ్ధురాలై తదేక దృష్టితో చూచి ఆనందముతో పరవశురాలై సీతాదేవివద్దకు పరుగిడివచ్చెను. ఆమె యుల్లాసమును చూచి సఖులు ఆదుర్దాతో కారణమడిగిరి.

చెలికత్తె తోడివారితో ఇట్లు పలికెను. "రాకుమారు లిరువురు మన యుద్యాన వనములో ఉన్నారు. వారు యువకులు. సౌందర్యవంతులు. ఒకడు శ్యామవర్ణుడు. మరొకడు హేమవర్ణుడు. వారి చక్కదనము నేను ఏమని చెప్పుదును! చెప్పలేను! ఎందులకనగా వారిని చూచిన కన్నులకు మాటలు రావు. మాటలు వచ్చిన నోటికి కన్నులు లేవు."

అది విని సీతాదేవి మనస్సు రాకుమారుని తప్పక చూడవలెనని తహతహ పడుచుండెను. ఆమెను చూచి చెలికత్తెలు ఆనందించిరి.

ఒకామె యిట్లనెను. "విశ్వామిత్రుని వెంట వచ్చిన వారే వారు. తమ రూప సౌందర్యముచే నగరములోని స్త్రీ పురుషుల నందరిని వశీభూతులను చేసికొనిరి. వారిని తప్పక మనము చూడవలెను". సీతాదేవికి మనస్సులో రాముని చూడవలెనని ఆదుర్దా ఎక్కువయ్యెను.

తన ప్రేమాస్పదురాండ్రైన చెలులను వెంట బెట్టుకొని సీతాదేవి వెళ్ళుచుండెను. రామలక్ష్మణులు ఉన్న తావు చేరగనే ఆమె నారదముని వాక్యములు జ్ఞప్తికి వచ్చి అన్ని వైపుల ఆశ్చర్యముతో చూచుచుండెను. ఆమె అటు నిటు తిరుగుచుండగా ఆమె ధరించిన కంకణములు, గజ్జెలు, అందెలు ఘల్లు ఘల్లున మ్రోగుచుండెను. ఆ ధ్వని రాముని చెవిలో పడెను. అదివిని రాముడు "లక్ష్మణా! ఈ శబ్దము ఎట్లు వచ్చుచున్నది? చూడుము! మన్మథుడు విశ్వమును జయించు సంకల్పముతో ఢంకా మ్రోగించునట్లున్నది" అనెను.



ఇట్లనుచు ధ్వని వచ్చు వైపునకు రాముడు చూచుచుండెను. దేదీప్యమానముగా ప్రకాశించుచున్న సీతాదేవి ముఖ చంద్రుని శ్రీరామచంద్రుడు చకోరపక్షివలె తదేక దృష్టితో రెప్పవాల్పక దర్శించెను. ఆమె సౌందర్యమును చూచి రాముడు బ్రహ్మానందము పొందెను. హృదయములో ఆమె సౌందర్యమును అనేక విధములుగా ప్రశంస చేయసాగెను. నోటితో చెప్పజాలక పోయెను. సీతాదేవి సౌందర్యము సౌందర్యమునకే సౌందర్యమును కలిగించుచుండెను.

రామచంద్రుడు సీత సౌందర్యమునకు ఆనందపడుచు తన స్థితిని తలచుకొని లక్ష్మణునితో ఇట్లనెను. "ఈమె జనకుని కూతురు. ధనుర్యజ్ఞము ఈమె కొఱకు జరుగునున్నది. గౌరీదేవి పూజ కొఱకు చెలులతో ఈమె ఇచ్చటకు వచ్చియున్నది. రమణీయమైన ఈ వనములో విహరించుట ఈ వనమునకే శోభ కలిగించుచున్నది. ఈమె సౌందర్యమును చూచి, చలించని నా మనస్సు నేడు చలించుచున్నది. ఈ సంగతి విధాతకే తెలియును."

"సోదరా! నా కుడి పార్శ్వము అదురు చున్నది. రఘువంశీయుల మనస్సు ఎప్పుడు చెడు దారి తొక్కదు. నేను స్వప్నములో కూడ పరస్త్రీలను చూడలేదు. రణరంగములో భయపడి పారిపోవని వారు, యువతుల కన్నుల చూపుకు లొంగనివారు, యాచకులకు లేదని చెప్పకుండా యుండువారు చాలా తక్కువ మంది గలరు."

రామచంద్రుడు లక్ష్మణునితో మాటాడుచున్నను ఆయన మనస్సు మాత్రము సీతాదేవి యందే లగ్నమై ఉండెను. రాకుమారులు ఎటు వెళ్ళిరాయని చింతించుచు సీతాదేవి చెలులు చూచుచుండిరి. లతలచాటున ఉన్న రాముని చెలికత్తెలు సీతకు చూపించిరి. ఇద్దరు చంద్రులు ఒకేసారి ఉదయించి నట్లు రామలక్ష్మణులు లతాకుంజములు వెలువడి ప్రత్యక్షమైరి.

శ్రీరాముని అలౌకిక దివ్య సౌందర్యమును సీత రెప్ప వాల్చకుండా తనివి తీరా చూచుచుండెను. ఆమె రాముని యందు అమిత ప్రేమచే

పరవశురాలయ్యెను. జానకి తన నేత్రముల ద్వారా రాముని రూపమును తన హృదయములో బంధించుకొని ఱెప్పలనే కవాటములను మూసివేసెను. ఆమె స్థితిని చూచి చెలికత్తెలు సంకోచపడుచుండిరి.

వారిలో ఒకామె సీతతో ఇట్లనెను. "ఉమాదేవి ధ్యానము మరెప్పుడైనా చేయవచ్చును. కాని యిప్పుడు రాకుమారులను బాగా చూచి ఆనందించుము." ఈ మాటలకు పరాకుగా నున్న సీతాదేవి ఉలికిపడి కన్నులు తెరచెను. ఎదుట ప్రత్యక్షమై యున్న శ్రీరాముని నఖశిఖ పర్యంతము చూడగా ప్రేమ అత్యధిక మయ్యెను. తన తండ్రి ప్రతిజ్ఞ జ్ఞాపకము వచ్చి ఆమె మనస్సులో కలవరము చెందెను. అది గాంచి చెలియలు మిగుల భయపడి "మనము వచ్చి చాలాసేపు అయినది. రేపు తిరిగి రావచ్చును." యని నవ్వుచు పలికిరి.

అందు కామె తల్లి యేమనునో యని భయపడి బయలుదేరెను. మృగములను, పక్షులను చూచుచున్న నెపముతో వెనుతిరిగి చూచుచు రాముని హృదయములో ఉంచుకొని తిరిగి భవాని గుడికి వెళ్ళెను. ఆమె చేతులు ముకుళించి దేవిని ఇట్లు ప్రార్థించెను. "ఓ లోకమాతా! జగజ్జననీ! నీకు మరల మరల నమస్కారములు చేయుచున్నాను. నీవు అందరి హృదయములలో నివసించుచుందువు. నా మనోభావము నీకు బాగుగా తెలియును. నేను చెప్పనక్కరలేదు."

ఆమె భక్తికి భవానీదేవి పరవశురాలై పోయెను. దేవి కంఠమునుండి పుష్పమాల జారెను. దానిని సీతాదేవి ఆదరముతో చేతికి తీసికొని కనుల కద్దుకొని శిరమున ధరించెను. దేవి ఈ విధముగా అన్నట్లు ఆమెకు స్ఫురించెను. "సీతా! నా మాట నిజము! నీ మనస్సులోని కోర్కె పూర్తియగును. భయపడకుము. నారదుని వాక్యములు తప్పవు. నీవు కోరిన వ్యక్తియే నీకు వరుడుగా లభించును. నీ హృదయము పవిత్రమైనదని నాకు తెలియును,"



ఈ వాక్యములు విని సీతాదేవి ఆమె చెలికత్తెలు సంతసించి ఉమాదేవికి మరల మరల నమస్కరించి యింటికి బయలుదేరి వెళ్ళిపోయిరి.

సీతాదేవి సౌందర్యమును మెచ్చుకొనుచు రామలక్ష్మణులు గురువు గారి వద్దకు వెళ్ళిరి. శ్రీరాముడు సీతాదేవి పట్ల తనకు మనస్సులో ఏర్పడిన ప్రేమను విశ్వామిత్రునకు పూర్తిగా విన్నవించెను. అది విని ముని రాముని అమాయకత్వమునకు సంతసించెను. నీ మనోవాంఛ తప్పక నెరవేరునని గురువుగారు ప్రియ శిష్యుని ఆశీర్వదించిరి. విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు కొన్ని ప్రాచీన కథలు చెప్పెను. రామలక్ష్మణులు సాయం సంధ్యావందనము చేయుటకు వెళ్ళిరి.

తూర్పు దిశను చంద్రుడు ఉదయించెను. రాముడు సీతాదేవి ముఖమును ఆ చంద్ర బింబముతో పోల్చుకొని మిగుల ఆనందించుచు మరల తన మనస్సులో ఇట్లు తలపోయసాగెను. "ఈ చంద్రుడు సీత ముఖముతో సమానుడు కాడు. ఉప్పు సముద్రములో జన్మించి, విషమును తోబుట్టువుగాపొంది, పగలు శోభాహీనుడుగా ఉండి ఎల్లప్పుడు కళంకముతో కూడియున్న యీ చంద్రుడు హెచ్చు తగ్గులు కలిగి యుండును. విరహముతో నున్న స్త్రీ పురుషులను వ్యాకుల పరచుచుండును. రాహువుచే మ్రింగబడును. ఇతడు పద్మములకు విరోధి. ఇన్ని అవగుణములుగల చంద్రుడు సీత ముఖముతో పోల్చతగడు. కనుక ఏ అవగుణము లేని జానకీదేవి ముఖమును చంద్రునితో పోల్చుట అనుచితము."

రాత్రి గడచెను. "ఉదయమున మేల్కొని రామలక్ష్మణులు గురువు వద్దకు వెళ్ళి నమస్కరించిరి. అప్పుడు జనక మహారాజు శతానందుని పిలచి వెంటనే విశ్వామిత్రుని వద్దకు పంపెను. ఆయన వచ్చి జనకుని యొక్క ఆహ్వానమును విన్నవించెను. విశ్వామిత్రుడు ఆనందించి రామలక్ష్మణులతో "జనకుడు మనల నాహ్వానించి యున్నాడు. మనము మిథిలా నగరమునకు

సీతా స్వయంవరము చూడ వెళ్ళవలసి యున్నది. భగవాను డాభాగ్యము ఎవరికిచ్చునో!" అని అనగానే లక్ష్మణుడు మీ దయకు పాత్రుడైన వాడే ధనుస్సును విరువగల" దని చెప్పెను. ఆ మాటలు విని అచ్చటి వారందరు సంతోషించిరి. ఆశీర్వదించిరి. ముని లెల్లరు రామలక్ష్మణులతో కలసి ధనుర్యజ్ఞశాలను చూచుటకు వెళ్ళిరి.

రామలక్ష్మణులు వచ్చిరని తెలియగానే నగరములో గల ఆ బాలగోపాలము తమ తమ పనిపాటులు విడిచి వారిని చూచుటకు వచ్చిరి. జనులందరు గుంపులు గుంపులుగా ఉండుట చూచి జనకుడు సేవకులను పిల్చి అందరిని సర్ది కూర్చుండ బెట్టుడని చెప్పెను. వారట్లు చేసిరి. ఆ సమయమున రామలక్ష్మణులు అచ్చటకు వచ్చిరి. నక్షత్రముల మధ్య ఇద్దరు పూర్ణ చంద్రులు ప్రకాశించునట్లు రామలక్ష్మణులు రాజులమధ్య శోభిల్లుచుండిరి.

రాముని రూప లావణ్యము ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగా తోచుచుండెను. రాజులకు శరీరము ధరించిన వీరరసము వలెను, కుటిల రాజులకు భయంకరమూర్తిగాను, రాజుల రూపములో కూర్చొని యున్న రాక్షసులకు ప్రత్యక్ష యముడు వలెను, నగరప్రజలకు మానవ భూషణుడుగాను, స్త్రీలకు తమ తమ అభీష్టము ప్రకారము శృంగార రసము మూర్తీభవించిన మన్మథుడుగాను, విద్వాంసులకు విరాట్ స్వరూపుడుగాను, జనకుని కుటుంబమునకు ప్రియబంధువుగాను, జనక చక్రవర్తి సమేతముగా రాణులకు తమ సొంత బిడ్డడు గాను, యోగులకు శుద్ధ శాంత స్వభావం గల పరమాత్మ స్వరూపముగాను, హరి భక్తులకు సకల సుఖములు ప్రసాదించే యిష్ట దేవతగాను శ్రీరాముడు కనపడుచుండెను.

సీతాదేవి శ్రీరాముని ఏ భావముతో చూచెనో ఆ ప్రేమ ఆ సంతోషమును చెప్పుటకు అలవికానివి. స్వయముగా ఆమెయే ఆ విషయము చెప్పజాలదు.



ఇంకేకవి దానిని వర్ణించగలడు! ఈ విధముగా ఎవరు ఏ భావముతో రాముని చూచుచుండిరో వారి కా భావముతో ప్రభువు కనపడుచుండెను.

శ్రీరాముని నఖ శిఖ పర్యంతము అన్ని అవయవములు సౌందర్య మయములుగానే యుండెను. అత్యున్నతమైన సుందర వేదికపై ముని, రామలక్ష్మణులు ఆసీనులైరి. ప్రభువు దివ్య ముఖారవిందమును గాంచి "ఉత్తమ రాజు లెల్లరు ప్రభువు తప్పక శివధనుస్సును విరుచునని అనుకొనుచుండిరి. ధనుస్సు విరువక పోయినను సీతాదేవి రాముని మెడలోనే జయమాల వేయునని వారు నిశ్చయించుకొనిరి." ఇప్పుడే మనము మన రాజ్యములకు వెళ్ళుట ఉత్తమమని తలంచిరి.

గర్విష్ఠులైన రాజులు, "రాముడు ధనుస్సును విరిచినను సీతాదేవితో వివాహము జరుగుటకు మేము అంగీకరింపము. సీత కొఱకు మేము యమునితో నైనను యుద్ధము చేసెదము" అని ప్రగల్భములు పలుకుచుండిరి. యోగ్యులైన రాజులు, హరి భక్తులు అది విని నవ్వుకొని "ధనుస్సును రాముడు తప్ప మరెవ్వరును విరువలేరు. రాముడు సీతను వివాహమాడుట నిశ్చయము. దశరథ మహారాజు పుత్రులను యుద్ధములో ఎవరు జయింపగలరు? సాక్షాత్ జగజ్జనని సీతమ్మను భార్యగా పొందవలెననే కోరికను విడుచుటలెస్స. రామచంద్రుడు విశ్వానికే తండ్రి. శివుని హృదయములో నిరంతరము నివసించేవాడు. అట్టి రాముడు మన సమీపమున నుండగా అతనిని చూచి ఆనందింపక లోకమాత సీతను భార్యగా పొందవలెననే ఆరాట మెందులకు?" అని హితోక్తులు పలికిరి.

ఆ సమయమున సీతాదేవిని పిలిపించిరి. ఆమె సఖులతో కలసి వచ్చెను. సుగుణసుందరియైన జానకి రూపలావణ్యములను వర్ణింపజాలము. ఆమెను లోకములో ఎవరితో పోల్చుటకు వీలుపడదు. సీత సర్వాలంకార భూషితురాలై స్వయంవర మండపమున ప్రవేశించెను. దేవతలు సంతోషముతో విజయదుందుభులు మ్రోగించుచుండిరి. అప్సరసలు గానము

చేయుచుండిరి. సీతాదేవి హస్తములో జయమాల శోభించుచుండెను. రాజు లెల్లరు చకితులై ఆమెవైపు చూచుచుండిరి. సీత శ్రీరాముని వైపు ప్రేమతో చూచుచుండెను. మునులు అచ్చట ఉండుట వలన సిగ్గుపడుచుండెను. శ్రీరాముని దివ్యరూపమును తన హృదయములో నిల్పుకొని సీత తన చెలుల వైపు చూచుచుండెను.

స్త్రీ పురుషులు రాముని లావణ్యమును, సీత సౌందర్యమును కనురెప్పలు వాల్చకుండా చూచుచుండిరి. వారు తమలోతాము ఇట్లనుకొనుచుండిరి. "విధాత జనకుని మూర్ఖపు పట్టుదలను పరిహరింప జేయుగాక! జనకుడు తన ప్రతిజ్ఞను వదలి సీతాదేవిని రాముని కిచ్చి వివాహము జరిపించునట్లు చేయుగాక! జనకునికే యీ విషయములో బ్రహ్మ మంచి బుద్ధి కలిగించుగాక! అట్లు జరిగినచో ప్రజ లతనిని మెచ్చుకొందురు. ఏలన అట్లు జరుగుట అందరికీ ఇష్టమైనది. జానకికి అన్ని విధాల అర్హులైన వరుడు ఈ రాముడే" అని అందరూ తలచుచుండిరి.

జనక మహారాజు భట్టు మూర్తులను పిల్చి మీరు నే చేసిన ప్రతిజ్ఞను వీరందరికి వినిపింపుడని చెప్పగా వారు ఇట్లు పలుక దొడంగిరి. "ఓ మహారాజులారా! వినండి, జనక మహారాజు ప్రతిజ్ఞను అందరికి చెప్పుచున్నాము. శివ ధనుస్సును మీలో ఎవరు విరిచెదరో వానికి జానకి నిచ్చి వివాహము జరిపింపబడును." అని ప్రకటింపగానే రాజు లెల్లరు అత్యుత్సాహముతో ధనుస్సును విరుచుటకు ముందుకు ఉరికిరి. వారెంత ప్రయత్నించినను దానిని ఏ మాత్రము కదలింప లేకపోయిరి. రాజులు శివధనుస్సును ఎత్తుటకు ప్రయత్నించినప్పుడు వారి భుజబలములను ధనుస్సు అకర్షించుకొని అత్యధిక భారవంత మగుచుండెను ఒక్కొక్క రాజు వచ్చి ఎంతగా ప్రయత్నించినను లాభములేకపోయెను. వారు దానిని కదల్చలేక సిగ్గుపడి తమ తమ స్థానాలకు వెళ్ళి కూర్చుండిరి. ఇది అంతయు చూచి జనక చక్రవర్తి మిగుల కోపోద్రిక్తుడై సభ్యుల నుద్దేశించి ఇట్లు పలికెను.



"రాజులారా! ఈ ధరాతలం వీరులులేక గొడ్డుపోయినదా? ధనుస్సు విరిచి సీతను వివాహము చేసుకొనుటకు బ్రహ్మ ఎవరిని సృష్టించనే లేదా? ఇప్పుడు భూమి మీద వీరులు లేనట్లు తెలిసినది. ఇక మీరు మీ ఇండ్లకు దయచేయండి. భూమి మీద వీరులు లేరని నాకు తెలిసియున్న యెడల నే నీ ప్రతిజ్ఞ చేసియుండువాడను కాను. విధాత మా సీతకు వివాహయోగము వ్రాసి యుండలేదు." జనకుని పలుకుల నాకర్ణించి అందరు జానకి వైపు చూచి మిగుల విచారించిరి.

లక్ష్మణుడు జనకుని మాట సహింపలేక ఉగ్రుడై లేచి రామునికి నమస్కరించి గంభీరముగా ఇట్లు పలికెను. "రఘు వంశీయులలో ఎవరైన ఒకరున్న చోట ఇట్టి మాటలు ఎవరును పలుకరు. రఘుకుల శిరోమణి రామచంద్రుడున్న సభలో జనకుడు ఇట్లు మాటాడుట అనుచితము. సోదరా! మీరు ఆజ్ఞ ఇచ్చినచో ఈ బ్రహ్మాండము నంతను బంతివలె ఎగురవేసెదను మట్టికుండ వలె పగుల కొట్టెదను. సుమేరు పర్వతమును అవలీలగా పిండి చేసెదను. ఈ పాత ధనుస్సు నాకు లెక్కయా? మీరు ఆజ్ఞ యిచ్చినచో ధనుస్సును ముక్కలు చేసి చూపెదను. ఇట్లు నేను చేయని యెడల ఇక నేను ఎన్నడును ఆయుధములు ధరింపను."

లక్ష్మణుని కోపమునకు భూమి కంపించెను. దిశలు దద్దరిల్లెను. రామచంద్రుడు, విశ్వామిత్రముని, సీతాదేవి మిగుల సంతసించిరి. అంత రాముడు లక్ష్మణునికి సైగ చేసి వారించెను. అతడు గురువుగారి యొద్దకు వెళ్ళి కూర్చుండెను.

విశ్వామిత్రుడు సరియైన సమయము నెఱిగి ప్రేమతో రామునితో "ఓ రామా! లెమ్ము! శివధనుస్సు విరిచి జనకుని సంతాపమును నివారింపుము" అనెను రామచంద్రుడు గురువుగారి వాక్యము ప్రకారము లేచి నమస్కరించి సుఖదుఃఖములు సమముగా నెంచి నిర్భయముగా నిలిచెను. ఆయన

బాలసూర్యునివలె ప్రకాశించుచుండెను. గురువుగారికి నమస్కరించి వారి ఆశీర్వాదము పొందెను. ధనుస్సు విరుచుటకు బయలుదేరెను తన పితృ దేవతలకు, దేవతలకు మనస్సులోనే వందనము చేసి తాను చేసిన పుణ్యమును స్మరించుకొని "ఆ పుణ్యము ఫలించినట్లైతే నేను ఈ ధనుస్సును అవలీలగా విరువగలను" అని నిశ్చయించుకొని ధైర్యముతో శివధనుస్సు వద్దకు వెళ్ళుచుండగా జానకి తల్లి సునయనాదేవి విలపించుచు ఇట్లనెను. "రావణుడు బాణాసురుడు మొదలగు జగద్విఖ్యాత వీరులు ధనుస్సును ముట్టుకొనలేక దూరము నుండియే నమస్కరించి వెళ్ళిపోయిరి. దానిని విరుచుటకు విశ్వామిత్రుడు రాముని పంపుట, అతడు వచ్చుట ఎంత చోద్యముగా ఉన్నది. అతడు బాలుడని విరుచుటకు పంపుట మంచిది కాదని విశ్వామిత్ర మునికి ఎవరూ చెప్పనైన చెప్పుట లేదు. ఇతరులు చెప్పినను చెప్పకపోయినను జ్ఞానియైన మహారాజు గురువుగారికి చెప్పవలెను. రాజు గారి మతి కూడా పోయెను, విధాత వ్రాత ఎట్లున్నదో ఎవరు చెప్పగలరు" అని పెక్కువిధముల విచారించుచున్న సునయనాదేవితో శ్రీరాముని బలము తెలిసిన ఒక చెలియ ఇట్లు పల్కెను.

"మహారాణీ! తేజోవంతులు, బలవంతులు చిన్నవారైనా తేలికగా భావించరాదు. కుండలో జన్మించిన అగస్త్యుడు ఎంత గొప్పవాడయ్యెను. సముద్రము నంతను ఆపోశనము పట్టెను. సూర్యమండలము చూచుటకు చిన్నదైనను ఉదయింపగనే ముల్లోకములలో అంధకారము నశించును. మంత్రము కొద్దిదైనను త్రిమూర్తులు లోపడెదరు. మన్మథుడు పుష్పబాణములతో సమస్త జగత్తును స్వాధీనము చేసికొనును. గొప్ప గొప్ప ఏనుగులు చిన్న అంకుశమునకు లోబడి పోవుచుండును. అమ్మా! సందేహింపవద్దు. రాముడు తప్పక ధనుస్సును విరువగలడు."

ఆ వాక్యములు వినిన మహారాణికి శ్రీరాముని యందు విశ్వాసమేర్పడెను.



శ్రీరాముడు శివధనుస్సును సమీపించుట చూచి సీత భయపడి దేవతలను, పార్వతిని ఇట్లు ప్రార్థించెను. "ఓ భవానీ! ఈ ధనుస్సును తేలిక చేయుము. నేను మిమ్ము పూజించినందుకు తగిన ఫలము నేడు కలుగచేయుము. విఘ్నేశ్వరా! నేటి ఈ కార్యము సాఫల్యంకొఱకే నిన్ను సేవించితిని. తప్పక ధనుస్సు బరువును తగ్గింపుము."

ఇంతలో ఆమెకు తండ్రి ప్రతిజ్ఞ జ్ఞాపకము వచ్చి ఖిన్నురాలయ్యెను. "నా తండ్రి ఇంతటి కఠిన ప్రతిజ్ఞ పూనెను. ఎట్లు జరుగునో? మంత్రులు కూడ వారికి చెప్పుటకు భయపడుచున్నారు. వజ్రము కంటె కఠినమైన ధనుస్సు ఎక్కడ? కోమల శరీరుడైన యీ యువకుడెక్కడ? నేను ధైర్యముతో ఎట్లుందును? పూలరేకులతో వజ్రమును ఛేదింపగలమా? ఈశ్వరా! భారమంతా నీదే'' యని ఆమె మనస్సులో పరిపరి విధాల చింతించుచుండెను. జానకికి క్షణము నూఱు యుగములుగా తోచుచుండెను. "శ్రీరామచంద్రుని పాదపద్మముల యందే నా మనస్సు వాస్తవముగా అనురక్తమైయున్న యెడల భగవంతుడు రాముని నాకు భర్తగా కూర్చగలడు." అని భావించెను. శ్రీరామచంద్రుడు సీతాదేవి వ్యాకులత్వమును గ్రహించి ఆమెను చూచుచు శివధనుస్సును తేరిచూచెను.

లక్ష్మణుడు అది చూచి అమితముగా ఉప్పొంగెను. "దేవతలారా! శ్రీరాముడు ధనుర్భంగము చేయబోవుచున్నాడు. సావధానముగా నుండి నా మనవి అలకించండి. దిగ్గజములారా! ఆదిశేషుడా! ధైర్యముతో భూమాతను గట్టిగా అదిమి పట్టుకోండి" అని హెచ్చరించెను. రాముడు ధనుస్సును సమీపించి సభ్యుల నందరిని చూచెను. సీతవైపు చూచి ఆమె విచారమును గ్రహించెను. "దప్పికతో ప్రాణము పోయిన పిమ్మట అమృతము ఇచ్చిన ప్రయోజనమేమి? పంట ఎండిన తరువాత వర్షము కురిసిన ఉపయోగమేమి? సమయము గడచిన మీదట పశ్చాత్తాపము చెందిన ఫలమేమి?" ఇట్లు భావించి తిరిగి మరల జానకిని చూచి ఆమె ప్రేమను తెలిసికొని పులకిత గాత్రుడయ్యెను.

రాముడు గురువుగారికి నమస్కరించి ధనుస్సును ఎత్తెను. అది శ్రీరాముని చేతిలోనికి రాగానే మెరుపు వలె మిగుల ప్రకాశించుచు మండలాకారమయ్యెను. ధనుస్సు పుట్టుకొనుట, ఎత్తుట, నారిలాగుట, ఏ క్షణములో జరిగెనో యెవరును చూడలేదు. క్షణములో ధనుస్సు ముక్కలై భూమి మీద పడెను. దాని భయంకరమైన ధ్వని లోకమంతా నిండెను. సూర్యుని గుఱ్ఱములు గతి తప్పెను. దిగ్గజములు ఘీంకారము చేయసాగెను. భూమి కంపించెను. దేవతలు, మునులు, రాక్షసులు ఆశ్చర్యపడిరి.

శ్రీరాముడు ధనుస్సును విరిచినట్లు సభ్యులెల్లరు తెలిసికొనిరి. అందరు రామచంద్రునికి జయము పలికిరి. విశ్వామిత్రుడు సంతోష సముద్రములో మునిగితేలుచుండెను. ఆకాశమున దేవదుందుభులు మ్రోగెను. దేవాంగనలు గానము చేసిరి. బ్రహ్మాది దేవతలు ప్రభువును అనేక విధములుగా స్తుతించిరి. బ్రహ్మాండమంతయు జయ జయ ధ్వనులతో మాఱుమ్రోగెను. జానకి దుఃఖము మటుమాయమయ్యెను. అసూయాపరులైన రాజుల ముఖములు వెలవెల బారెను.

సీతాదేవిని శ్రీరాముని వద్దకు తీసికొని రమ్మని శతానందులు ఆజ్ఞాపించిరి. చెలికత్తెలు ఆమెను పట్టుకొని రాముని వద్దకు కొని వచ్చిరి. రాముని కంఠమున సీతాదేవి జయమాల వేయగనే దేవతలు సంతోషముతో పూలవర్షము కురిపించిరి. అది చూచి రాజు లెల్లరు లోలోన దుఃఖించిరి. దుష్టులు ఉదాసీనులైరి. సజ్జనులు సంతోషించిరి. బ్రాహ్మణులు వేదమంత్రములను పఠించుచు ఆశీర్వాదములు చేసిరి. సౌందర్యము, శృంగారము కలిసి శోభించునట్లు సీతారాములు శోభిల్లుచుండిరి.

సీతాదేవి సౌందర్యము చూచి కొంతమంది రాజులు కోపోద్రిక్తులై ఆయుధములు ధరించి యుద్ధ సన్నద్ధులైరి. "పాత ధనుస్సును విరిచి నంత మాత్రమున ఈతడు సీతను వివాహము చేసికొనుటకు మేము అంగీకరించము. మమ్ములను గెలిచి వివాహము చేసికొనవలెను. రామలక్ష్మణులను బంధించి సీతను బలవంతముగా లాగుకొనిరండి" అని కొంతమంది రాజులు ఈర్ష్యతో కేకలు వేయసాగిరి.



కొంతమంది ఉత్తములైన రాజులు వారిని మందలించుచు "సిగ్గులేని మిమ్ములను చూచి సిగ్గుకూడ సిగుపడుచున్నది. ఓ రాజులారా! మీ శౌర్యము ప్రతాపము రాముడు శివధనుస్సు విరుచుటలోనే నశించెను. ఇప్పుడు మీకు బలము ఎక్కడినుండి వచ్చెను. ఇట్టి కుటిల బుద్ధి ఉండుట వలననే విధాత మీ ముఖములకు కళంకము వ్రాసిపెట్టెను. ఈర్ష్య, ద్వేషము విడచి రాముని సౌందర్యమును చూచి నేత్రానందము పొందండి. లక్ష్మణుని క్రోధాగ్నిలో మిడుతలవలె పడి భస్మము కాకండి సీత కొఱకు మీరు ప్రయత్నించుట మీరు నాశనమగుటకే" యని హితవు చెప్పిరి. ఈ గడబిడ చూచి సీతాదేవి, రాణులు యేమి జరుగనున్నదో యని ఖేదపడుచుండిరి.

లక్ష్మణుడు దుష్టరాజులు వాక్యములు విని భీకరాకారుడై అటు ఇటు చూచుచుండెను. కాని రాముని భయము వలన ఏమియు పలుకకుండెను. జనులెల్లరు ఆ రాజులను దూషింపసాగిరి.

శ్రీరాముడు శివధనుస్సు విరిచెనని తెలిసి పరశురాముడు అచ్చటికి వచ్చెను. పరశురాముని చూచి రాజులెల్లరు భయపడిరి. డేగనుచూచి చిన్నపక్షులు భయపడి దాగియున్నట్లు మిన్నకుండిరి. పరశురాముని శరీరమునందు విభూతి రేఖలు వెలుగుచుండెను. విశాల లలాటము నందు త్రిపుండ్రములు తీర్చిదిద్ది ఉండెను. శిరమున జడలు నిండియుండెను. సుందర ముఖము కోపకారణమున కంది యుండెను. నేత్రములు ఎరుపెక్కియుండెను. ఆయన సహజముగా చూచినను కూడ కోపముతో నున్నట్లు కనపడుచుండెను.

ఆయన భుజములు ఉన్నతములై ఉండెను. వక్షస్థలము విశాలముగా ఉండెను. యజ్ఞోపవీతము ఉండెను. కంఠమున జయమాల మృగచర్మము కలిగియుండెను. వల్కలములు కట్టి యుండెను. ఆయన వీపున రెండు

అమ్ముల పొదులు చేతిలో ధనుర్బాణములు భుజము మీద పరశువు ధరించి యుండెను. ఆయనది శాంతవేషమే కాని చేయు పనులు బహుకఠోరమైనవి. ఆ వీరుని పౌరుషము వర్ణింపజాలము. వీరరసమే శరీరము ధరించి వచ్చినదా అన్నట్లు తోచుచుండెను.

పరశురాముని భయంకర వేషమును చూచి రాజులెల్లరు భయపడిలేచి నిలిచి తమ పేరు, తమ తండ్రి పేరు విన్నవించి దండప్రణామములు చేసిరి. పరశురాముడు తమకు హితుడని తెలిసికూడా సహజముగా ఆయన వైపు చూచుటకు రాజులు బెదరుచుండిరి. "ఈ రోజుతో మాఆయువు మూడ లేదు కదా!" యని భయపడు చుండిరి.

పరశురాముని చూచి జనకుడు నమస్కరించి సీతాదేవిని పిలిపించి నమస్కారము చేయించెను. పరశురాముడు ఆశీర్వాదము చేసెను. వెంటనే సీతను సఖులు వివాహమండపమునకు తీసుకురాగానే విశ్వామిత్రుడు ఇద్దరు సోదరుల చేత పరశురామునకు నమస్కారములు చేయించి "వీరు దశరథుని కుమారులు రామలక్ష్మణులు" అని చెప్పెను. ఆ సోదరుల సౌందర్యమును చూచి సంతోషపడుచు పరశురాముడు వారిని ఆశీర్వదించెను. "అంతా ఎరిగియు ఎరుగనట్లు జనకునితో ఇక్కడికి ఇంతమంది రాజుల రాకకు కారణమేమి? యని కోపముతో అడిగెను." అంతమంది వచ్చుటకు కారణమును జనకుడు వివరించిచెప్పెను. ఆ మాట వినుచు పరశురాముడు రెండవవైపు నేలమీద ముక్కలై పడియున్న ధనుస్సును చూచి అమిత క్రోధముతో కఠోరముగా ఇట్లు పలికెను. "ఓయీ జనకా! ధనుస్సును విరిచిన వాడెవడో వెంటనే నాకు చెప్పుము. లేనియెడల నీ రాజ్యము నంతయు తలక్రిందులు చేసెదను."

పరశురాముని పలుకులకు జనకుడు భయపడి ఊరకుండెను. శత్రురాజులు జనకునికి తగిన శాస్తి జరిగినదని సంతోషించుచుండిరి. దేవతలు, మునులు, నాగులు, నగరములోని స్త్రీ పురుషులు భయపడి "విధాత



జరిగిన మంచి పనినంతయు చెడగొట్టెను" అని ఖేదపడుచుండెను పరశురాముని స్వభావము తెలిసికొని సీత క్షణము కల్పము వలె గడపుచుండెను. జనుల భయము సీత వ్యాకులతను చూచి రామచంద్రుడు పరశురామునితో మునీశ్వరా! శివ ధనుస్సును విరచిన వారెవరో కాదు. మీ దాసుడే. ఏమి ఆజ్ఞయో నాకు సెలవీయండి" అని అనగానే ఆ వాక్యములకు పరశురాముడు ఆగ్రహించి ఇట్లనెను. "సేవకుడవే ఐతే సేవ చేయవలెను. శత్రువైతే యుద్ధము చేయవలెను. రామా! శివధనుస్సు విరిచిన వాడు నాకు కార్తవీర్యార్జునుని వంటి శత్రువు. కాబట్టి యీ రాజులనుండి విడిపొమ్ము. లేనియెడల రాజు లందరితో పాటు మరణించెదవు."

పరశురాముని మాటలువిని లక్ష్మణుడు నవ్వుచు హేళనగా ఇట్లనెను "మహాత్మా! మేము చిన్నతనములో ఎన్నియో ధనుస్సులు విరచితిమి. కాని ఇట్లు మీరెన్నడూ మా మీద కోపపడలేదు."

ఆ మాటలకు పరశురాముడు ఇట్లు పల్కెను. "ఓ రాకుమారా! కాలవశుడవై తెలిసీ తెలియక మాటాడుచున్నావు. లోకములో ప్రసిద్ధి చెందియున్న యీ శివధనుస్సు అన్ని ధనుస్సుల వంటిదా?"

లక్ష్మణుడు నవ్వుచు "ఓ దేవా! మాకు అన్ని ధనుస్సులు ఒక్కటే. పాత ధనుస్సు విరిగిపోతే నష్టమేమిటి? శ్రీరామచంద్రుడు కొత్త ధనుస్సు అని తలంచి చేయిమోపెను. ఊడిపోయినది. కనుక విరిగిపోయెను. అన్నగారి దోషము కూడా ఏమియూ లేదు. కారణము లేకుండ కోపపడుచున్నారు" అనెను.

పరశురాముడు తన పరశువును చూపుచు లక్ష్మణునితో నిట్లనెను. "ఓ లక్ష్మణా! నా స్వభావము నీకు తెలియదు. నిన్ను నేను బాలకుడని దయతలచి చంపకుండా ఊరుకొంటిని. మూర్ఖుడా! నన్ను కేవలము 'ముని' యని తలచితివా! నేనెవరో నీకు తెలియునా? బాలబ్రహ్మచారిని! అమిత క్రోధము గలవాడను! క్షత్రియ కులమును నశింపచేయు వాడనని విఖ్యాతి

పొందితిని! నా భుజబలముచే దుర్మదాంధులగు రాజులందరిని నశింపజేసితిని. వారి రాజ్యమును అనేక పర్యాయములు బ్రాహ్మణులకు దానము నిచ్చితిని. ఇదిగో! చూడుము రాకుమారా! నీ తల్లిదండ్రులను దుఃఖములో ముంచకుము. నా పరశువు భయంకరమైనది. గర్భములో ఉన్న పిండములను కూడ ముక్కలు చేసివేయును."

ఆ మాటలు విన "లక్ష్మణుడు మీరు గొప్పయోధులని చెప్పుకొనుచున్నారు. మాటిమాటికి గొడ్డలిని పైకెత్తి చూపించుచున్నారు. ఇంత మాత్రమునకు భయపడువారు ఇచ్చట ఎవ్వరును లేరు. ఊదినంత మాత్రాన పర్వతము ఊగిపోవునా? బొటనవ్రేలు చూపించిన మాత్రాన వాడిపోయే గుమ్మడి పిందెలు ఎవరూ యిచ్చట లేరు. నీవు ధరించిన ఆయుధములు చూచియే నేనును అహంకారముతో దబాయించితిని పరశురామా! నీ యజ్ఞోపవీతమును చూచి మీరేమి పల్కినను కోపము చెందక సహించుచున్నాను. దేవతలు, బ్రాహ్మణులు, భగవద్భక్తులు, గోవులు, మొదలగు వారి మీద మా వంశీయు లెవ్వరూ వీరత్వము చూపించరు. ఎందుకనగా వారిని చంపిన పాపము వచ్చును. వారిచే ఓడిన అపకీర్తి కలుగును. కాబట్టి కొట్టినను కూడ నీ పాదములు మీద పడెదము. మీరు మాటాడే ఒక్కొక్క మాట వజ్రముతో సమానముగానున్నది. మీవంటివారు ఆయుధమును ధరించుటయే వ్యర్థము. అని చూచి నేను మిమ్ములను తిరస్కారముగా మాటాడినాను. లేనట్లైతే అట్లు మాటాడను. ఓ మునీ! అందుకు నన్ను క్షమించుడు" అని పలికెను.

ఈ మాటలు వినగనే పరశురామునికి అమితముగా కోపము వచ్చి గంభీరముగా నిట్లనెను. "ఓ విశ్వామిత్రా! ఈ రాకుమారుడు కుటిలుడు. బుద్ధిమంతుడే కాని కాలవశము చెందియున్నాడు. సూర్యకులమునకు కళంకము తెచ్చువాడు. వీడు కేవలము ఉద్దండుడు. నేను ఈ క్షణములోనే ఈ బాలుని కాలునికి అప్పగించగలను. నీ శిష్యుడని ఇంతవరకు ఆగితిని.



ఇక ఆగను. ముందే చెప్పితిని. నా తప్పులేదు. వీనిని రక్షింపదలచుకొన్న యెడల నా గొప్పతనము, నా ప్రతాపము, నా శౌర్యము వీనికి బాగా అర్థమగునట్లు చెప్పుము."

ఈ మాటలు విని లక్ష్మణు డిట్లనెను. ఓ మునీ! తమ యశము తమరు ఇచ్చట ఉండగా ఇతరులు ఏల చెప్పవలెనో! తమరే తమ గొప్పతనమును అనేకవిధములుగా వర్ణించియుంటిరి. అది తృప్తి లేకపోతే మరలమీరే చెప్పండి. క్రోధము ఆపండి. ఆవేశపడకండి. వీరుడ ననుచున్నారు. ధైర్యవంతుడనని, క్షోభరహితుడనని చెప్పుకొనుచున్నారు. ఇతరులను దూషించుట శ్రేయస్కరము కాదు. శూరత్వము చూపవలెను. శత్రువు యుద్ధములో నిలిచియున్నప్పుడు బడాయి మాటలు పలుకుట పిరికితనము. మీరు నన్ను కాలుని వద్దకు పంపెదనని పలుకుచున్నారు. ఆ కాలుడు మీరు నన్ను ఏమి చేయగలరు?"

లక్ష్మణుని కఠినవాక్యములు విని పరశురాముడు తన భుజముననున్న గండ్రగొడ్డలిని తిన్నగా చేతిలోనికి తీసికొని ఇట్లనెను. "మహాజనులారా! నా దోషము లేదు. బుద్ధిలేని పలుకులు పలికే ఈ మూఢుని చంపుటయే ఉత్తమము. ఈ బాలకుని చూచి నేను రక్షింపదలచినాను. కాని వీడు నిజముగ మరణించుటకే నా ఎదుటకు వచ్చియున్నాడు."

ఆ మాటలు విని విశ్వామిత్రు డిట్లనెను. "సోదరా! అపరాధములు క్షమించుము. బాలకుల దోషములను మహాత్ములు పరిగణింపరు." అందులకు పరశురాము డిట్లనెను. "మా ఆయుధము తీక్ష్ణమైన పదును కలది. దయారహితమైనది. మరియు ఈ గురుద్రోహి ఈ అపరాధి నా ఎదుట మాట్లాడుటయా? నా ఎదుట నిలిచి తన యిష్టము వచ్చినట్లు ప్రేలుచున్నను నేను వీనిని సంహరించకుండా మెదలకున్నాను. విశ్వామిత్రా! నీ ప్రేమను చూచియే ఊరకున్నాను. లేనట్లైతే ఈ గండ్రగొడ్డలితో ఇతనిని నరికి ముక్కలు ముక్కలు చేసి గురుద్రోహము తీర్చుకొనేవాడినే!"

విశ్వామిత్రుడు పరశురాముని మాటలు వని మనస్సులో "ఈ ముని రాజులందరినీ జయించిన కారణమున వీరు సాధారణ క్షత్రియులని తలంచుచున్నాడు. వీరి ప్రభావము తెలిసికొనలేదు. ఇప్పటికి వీరిని తూలనాడుచున్నాడు. నాకెందుకు? బాలుడే జవాబు చెప్పగలడు" అని భావించి ఊరకుండెను.

లక్ష్మణుడు "ఓ మునీ! మీ గొప్పతనమును, మీ శీలమును ఎవరెరుగరు? తల్లిదండ్రుల యొక్క ఋణము తీర్చుకొని యుంటిరి. ఇక గురు ఋణము తీర్పదలచితిరి. అది మానెత్తిమీద ఉన్నది కాబోలు! మేమే ఇచ్చెదము. చాలరోజులు అయి ఉన్నది. కాబట్టి లెక్క కట్టించండి. వడ్డీతో ఇచ్చెదము. సంచి విప్పండి" అనెను.

లక్ష్మణుని యొక్క విపరీత వాక్కులకు పరశురాముడు గండ్రగొడ్డలిని సవరించెను. అది చూచి సభాసదులు "అయ్యో! అయ్యో! బాలుడు ఏమగునో?" అని అరచిరి. తిరిగి లక్ష్మణుడు ఇట్లనెను. "ఓ భృగుశ్రేష్ఠా! నాకు పరశువును ఎత్తి చూపుచున్నారు. భయపడను. మిమ్ములను బ్రాహ్మణులని విడిచి పెట్టుచున్నాను మీకెప్పుడు రణధీరయోధులు కలవలేదు. బలవంతులను మీ రెదుర్కొనలేరు. మీ ఇంట్లో మీరే పెద్దలని అనుకొనుచున్నారు."

ఆ మాటలు విని ప్రజలు "ఊరుకో ఊరుకో!" అని అరచిరి. అప్పుడు శ్రీరామచంద్రుని సైగచే లక్ష్మణుడు ఆగిపోయెను. లక్ష్మణుని వాక్యములకు పరశురాముడు మిగుల మండిపోయెను.

కోపమనే అగ్ని హెచ్చుగుటను చూచి శ్రీరామచంద్రుడు శాంతముతో ఇట్లు పలికెను. "ఓ మునిశ్రేష్ఠా! బాలకుని మీద దయ చూపండి. పాలు గుడుచు పసిపిల్లవాడు. వాడి మీద క్రోధమెందుకండి? మీ ప్రభావము వానికి తెలియదు." అందువలన ఇష్టము వచ్చినట్లు మాట్లాడుచున్నాడు. బాలురకు అది అలవాటు. అది చూచి తల్లిదండ్రులు ఆనందించుచుందురు. కాబట్టి వీడు చిన్నపాపడని తలంచి దయఉంచండి. మీరు సమదర్శనులు, ధీరులు, ఉదారులు, యోగ్యులు, విజ్ఞానులు, మునులు.

రాముని వాక్యములు విని ముని వెంటనే చల్లబడెను.

ఇంతలో లక్ష్మణుడు ఏదో చెప్పబోయి పకపకా నవ్వెను. అది చూచి పరశురామునకు అమిత కోపము కలిగెను. రాముని చూచి "నీ సోదరుడు మహాపాపి. శరీరము తెలుపు. హృదయము కాలకూట విషము, పాలు కుడిచినవాడు కాదు. వంకర బుద్ధి కలవాడు. నీ వంటి వాడు కాదు. నీచుడు. నేను కాలుడనని అనుకొనుట లేదు.

వెంటనే లక్ష్మణుడు "మునీశ్వరా! కోపమునకు పాపము మూలము. ఎవరికున్నను అది చేయరాని పని చేయించును. విశ్వమునకే ప్రమాదము తెచ్చిపెట్టును. నేను తమకు దాసుడను. దయ ఉంచి క్రోధము వదలి ఆలోచించండి. విరిగిన ధనుస్సు కోపము వల్ల అతుకదు. దాని మీద మీకు మమత ఉన్నయెడల నేర్పరియైన పనివానిని పిలిపించి అతికించండి. కొత్త దాని వలెను కనపడును. మీరు నిల్వబడి చాలాసేపైనది. కాళ్ళు నొప్పి పుట్టవచ్చు. దయచేసి కూర్చోండి" అనెను.

లక్ష్మణుని మాటలు జనకునకు మిక్కిలి భయము కలిగించెను. "నీవు మాటాడకు నాయనా పెద్దవారున్నారు" అని లక్ష్మణుని ఆయన మందలించెను. జనక పురవాసు లందరు లక్ష్మణుని మాటలకు భయపడి వణకుచు మనస్సులో "చూచుటకు పిల్లవాడు గాని మాటలు కోటలు దాటును" అనుకొనిరి.

లక్ష్మణుని నిర్భయ వాక్యములు విని పరశురామునికి మంటలెత్తెను కాని శరీర బలము తగ్గుచుండెను. శ్రీరాముని మీద దయ కలిగి పరశురాముడు, "నేను నీ సోదరుడని ఇంతవరకు దయతలచితిని. విషముతో

నిండిన బంగారు పాత్ర వలె వీడి హృదయము విషము. శరీరము సుందరము.” అని పల్కెను.

“ఆ మాట విని లక్ష్మణుడు నవ్వెను. రామచంద్రుడు లక్ష్మణుని వైపు తీవ్రముగా చూచెను. లక్ష్మణుడు మాటాడకుండా గురువు వద్దకు వెళ్ళి కూర్చుండెను. అంత రామచంద్రుడు రెండు చేతులు ముకుళించి, వినయముతో నిట్లనెను. మీరు స్వభావ సిద్ధముగా బుద్ధిమంతులు. బాలుని వాక్యములు చెవిని పెట్టకండి. పిల్లల స్వభావమే యది. అందువలన పెద్దలు వారిని తప్పులు పట్టరు. వారివలన ఏ పనికూడ కాదు. తప్పు చేసిన వాడను నేను కాబట్టి స్వామీ! నన్ను ఏమి చేయవలెనో అది చేయండి. మీ దాసుడని తలచి చేయండి మీ క్రోధము పోయేవరకు మునిరాజా! కసి తీరేవరకు చేయండి.”

ఆ మాట విని పరశురాముడు “ఓ రామా! నా కోపము ఎట్లు పోవును? ఇప్పటికి కూడా నీ తమ్ముడు వంకరగానే మాటాడుచున్నాడు. నాకు కోపము ఉండి యేమి లాభము? ఇంతవరకు వీడి మెడమీద ఈ గొడ్డలి వేయలేక పోయితిని. ఈ గొడ్డలి చేయు పనులను చూచి విని రాజకాంతల గర్భములు పడి పోవుచుండును. అట్టి పరశువు ఉండినను ఈ బాల శత్రువును ఏమీ చేయలేకపోతిని. చంపుటకు చేతులు వచ్చుట లేదు. హృదయము మండిపోవు చున్నది. రాజులందరిని సంహారముచేసిన యీ గొడ్డలి మిక్కిలి కుంఠితమైపోయెను. విధాత అంతయు విపరీతము చేసెను. అందువల్ల నా స్వభావమే మారిపోయెను. లేకపోతే యీ సమయమున నాకు ఇంత శాంతముండునా? ఈ దయయే నాకు బహుదుస్సహ దుఃఖము కలుగజేయుచున్నది” అనెను.

ఇది విని లక్ష్మణుడు నవ్వుచూ నమస్కరించి ఇట్లనెను.“తమ దయ యనే గాలి కూడా తమ రూపమునకు అనురూపముగానే యున్నది. తమకు పూర్తికోపము వచ్చిన తమరూపము ఇంకెట్లుండునో? అనగానే



పరశురాముడు మండిపడుచూ యీ నీచుని నా నేత్రములు యెదుట నుండి ఎందుకు తొలగించరు? చూచుటకు చిన్నవాడే కాని మాటలు పెద్దవి.”

లక్ష్మణుడు తనలోతాను ఇట్లు అనుకొనెను. “కన్నులు మూసికొనిన యెడల ఎవరూ కనపడరు.”

పరశురాముడు మిక్కిలి క్రోధముతో శ్రీరాముని చూచి “మూర్ఖా! శివధనుస్సు విరచి కూడా తలక్రిందులుగా మాటాడెదవా? పైగా నాకు జ్ఞానము బోధించుచున్నావు. చాలు చాలు! నీ సోదరుడు నీ సమ్మతిపైననే కటు వచనములు పల్కుచున్నాడు. నీవు ఏమి తెలియనట్లు చేతులు ముకుళించి వినయముగా మాటాడుచున్నావు. ఎదుట నిలిచి నాతో పోరాడి నన్ను సంతోషపెట్టుము. లేకపోతే రాముడనని యిక ఎచ్చటను చెప్పుకొనకుము. శివద్రోహీ! కపట భావమును వదలి యుద్ధము చేయుము. లేనట్లైతే నీ సోదరునితో కూడ నిన్ను తెగటార్చెదను” అని పలికి గొడ్డలి ఎత్తెను.

రామచంద్రుడు తలవంచి తన మనస్సులో ఇట్లను కొనెను. “తప్పు చేసినది లక్ష్మణుడు. ముని కోపము నా మీద చూపుచున్నాడు. ఒక్కొక్కచోట నెమ్మదిగా, నుండుట కూడా దోషమే. క్రూరునకు అందరు భయపడు చుందురు. వంకరచంద్రుని రాహువుకూడ మ్రింగడు.”

అప్పుడు రామచంద్రుడు పరశురామునితో నిట్లనెను. “ఓమునీశ్వరా! క్రోధము వదలండి. మీ చేతిలో గండ్రగొడ్డలి యున్నది. నా తల మీగొడ్డలి క్రింద ఉన్నది. ఎట్లు మీకోపము చల్లారునో స్వామీ! అట్లే చేయండి. నన్ను మీ దాసుడనని మరువకండి. స్వామి సేవకులకు మధ్య యుద్ధమెట్లు? బ్రాహ్మణశ్రేష్ఠా! కోపమును వదలండి. మీరు ఆయుధములు ధరించి వచ్చినందున వీరులని యనుకొని బాలకుడు కొంచెము తూలనాడెను. నిశ్చయముగా వాని తప్పు కూడా లేదు. కుఠారము బాణములు ధనుస్సును

చూచి వీరులని యనుకొని బాలకునికి ఇంత కోపము వచ్చెను. వీడు తమ పేరు వినియుండెను కాని తమరిని ఎన్నడు చూడలేదు. రఘువంశీయులు చెప్పినట్లు ఇతడు మీకు జవాబు చెప్పెను. స్వామీ! మీరు మునివలె వచ్చినట్లైతే మీ పాదధూళిని శిరస్సున ధరించేవాడే. తెలియక పొరపాటు చేసెను. అందుకు క్షమించండి. బ్రాహ్మణులకు శాంతి, దయ, ప్రేమ ముఖ్యము. స్వామీ! మీతో మేము ఎట్లు తూగగలము? పాదము లెక్కడ! శిరస్సెక్కడ! నా నామము చిన్నది. మీ నామము పెద్దది. మాకు ఒకటే యధికారము. ఆయుధములు ధరించి పోరాడుట. మీకు తొమ్మిది యధికారములున్నవి. శమము, దమము, తపము, శౌచము, క్షమ సరళత, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తికత. అన్నివిధముల మేము మీ చెతిలో ఓడిపోయితిమి. మా అపరాధములు క్షమించండి."

శ్రీరామచంద్రుడు తనను "ముని", "విప్రుడు" అని యనుట వలన పరశురామునకు కోపమువచ్చెను. ఆయన రామునితో "నీవు కూడా నీ సోదరునితో సమానముగా పెంకివాడవే. నేను బ్రాహ్మణుడనని నీవు నిరాదరణ చేయుచున్నావు. నేను ఎట్టి బ్రాహ్మణుడనో చెప్పెదను వినుము. నా ప్రభావము నీకు ఏమీ తెలియదు. ధనుస్సును విరిచితినని గర్వము కూడా నీకు కలదు. ఏదో ఒక పాతధనుస్సును విరిచి లోకమంతటిని జయించినట్లు తలంచుచున్నావు" అనెను.

ఆ మాటలు విని రామచంద్రుడు ఇట్లనెను. "ఓ మునీశ్వరా! ఆలోచించి మాట్లాడండి. మీ క్రోధము చాల గొప్పది. మా పొరపాటు చాల చిన్నది. పాతధనుస్సు గనుక చెయ్యి తగలగనే విరిగినది. అంత మాత్రమున నాకు అహంకారము ఎట్లుకలిగినది? ఓ భృగునాథా! మీరు బ్రాహ్మణులని నిరాదారణ చేసినట్లైతే భయముతో మేము తలవంచుటకు ప్రపంచములో అట్టి వీరుడెవడైనా యున్నాడా! దేవతలు, రాక్షసులు, రాజులు, యోధులు



బలములో మావంటి వారు, మాకన్న బలము గలవారు ఎవరైన యుద్ధమునకు మమ్ములను రమ్మని సవాలు చేసిన యెడల వారితో తప్పక పోట్లాడెదము. కడకు కాలుని నైన ఎదిరించెదము. క్షత్రియజాతిలో జన్మించిన వాడెవడైనా యుద్ధరంగములో భయపడి పారిపోయినయెడల వాడు కులమునకే కళంకము తెచ్చినవాడగును. రఘువంశీయులు రణరంగములో యమునితోనైనను ఢీకొనగలరు. బ్రాహ్మణులకు భయపడినచో నింకెవరికి భయపడ నక్కరలేదు. అతడు నిర్భయుడుగా ఉండవచ్చు. ఎంత భయరహితుడైనా నా బ్రాహ్మణునకు భయపడవలయును. బ్రాహ్మణులకు అత్యద్భుతమైన మహిమ గలదు."

శ్రీరామచంద్రుని వాక్యములు విని పరశురామునికి కనువిప్పు కల్గెను. అంత పరశురాము డిట్లనెను. "ఓ రామా! లక్ష్మీపతీ!" ధనుస్సు చేతిలోనికి తీసికొని నా సందేహము తీర్పుమని యనుచూ ఈయబోగా ఆ చాపము దానియంతట అదియే రాముని వద్దకు వెళ్ళెను. అప్పుడు రాముడెవడో పరశురాముడు తెలుసుకొనెను. రాముని ప్రభావము గుర్తించి అతనికి నమస్కరించి యిట్లనెను. "ఓ రఘువంశ పావనా! మీకు జయము! జయము! దేవతల, బ్రాహ్మణుల, గోవుల రక్షణ కొఱకు అవతరించిన ప్రభూ! మీకు జయము" అని అనేక విధములుగా స్తుతించి "పలుకరాని మాటలు పొరపాటున పలికియుంటిని. నన్ను క్షమించు దేవా!" యని అతడు తపస్సు చేసుకొనుటకు బదరికాశ్రమమునకు వెళ్ళిపోయెను.

ఇది అంతయు చూచి విభ్రాంతులై భయపడి దుష్టరాజులు చెప్పకుండా పరారైరి. దేవతలు సంతోషించి దుందుభులు వాయించి పూలవర్షము కురిపించిరి. జనకపురవాసులందరు ఆనందించిరి. సౌందర్యవతులైన స్త్రీలు మంగళగీతములు పాడిరి. జనకుని సంతోషము వర్ణింపజాలము. సీతాదేవి భయము పోయెను.

అంత జనకుడు విశ్వామిత్రుని వద్దకు వచ్చి నమస్కరించి “మహాత్మా! మీ దయవలన రామచంద్రుడు ధనుస్సు విరిచెను. ఈ సోదరులు నన్ను కృతార్థుని చేసిరి. ఇక నేను చేయవలసిన దేదో చెప్పండి.” అనెను.

విశ్వామిత్రుడు “రాజా! రామచంద్రుడు ధనుస్సు విరువగనే వివాహము జరిగినట్లే! సందేహము లేదు. కాని నీవు మీ వంశములో పెద్దలను, గురువులను సంప్రదించి వేదవిహితముగా వివాహము చేయుము. అయోధ్యకు దూతలను పంపి అన్ని విషయములు దశరథునికి తెలియజేసి ఆయనను ఆహ్వానింపుము.” అని చెప్పెను. జనకుడు దూతలను పిలిచి జరిగిన చరిత్ర మంతా చెప్పి అయోధ్యకు పంపెను.

* * *



# సీతారామ కల్యాణ ఘట్టము

జనకుడు అధికారులను పిలిపించి మిథిలానగర మంతయు అలంకారము చేయించండని చెప్పగా వెంటనే వారట్లు చేసిరి గొప్ప గొప్ప శిల్పులను పిలిచి కళ్యాణ మండపము తయారు చేయించిరి. నగరము యొక్క మండపము యొక్క అలంకారమును శేషుడు కూడా వర్ణింపజాలడు నగరములో శ్రీ మహాలక్ష్మియే అవతరించి అన్ని ఏర్పాట్లు చేయుచున్నదా యన్నట్లుండెను.

దూతలు అయోధ్యానగరమునకు చేరుకొని అచ్చటి శోభను తిలకించి సంతోషముతో రాజద్వారము వద్దకు వెళ్ళి మహారాజుకు కబురు పంపిరి. మహారాజు దూతలను వెంటనే లోనికి రమ్మని ఆజ్ఞాపించెను. అంతట వారు మహారాజును సమీపించి వారికి నమస్కరించి జనక రాజేంద్రుని ఉత్తరము నిచ్చిరి. మహారాజు లేఖను స్వయముగా చదువుకొనెను. ఆయన నేత్రములు ప్రేమాశ్రువులతో నిండిపోయెను. ఆయన హృదయము ఆనందతరంగితమయ్యెను.

రామలక్ష్మణులను విశ్వామిత్రుడు తీసికొని వెళ్ళినది మొదలు ఎచ్చట వారున్నది మాకు తెలియలేదు. మీరు స్వయముగా రామలక్ష్మణులను చూచితిరా? యని దూతలను మహారాజు ఆత్రముగా అడుగగా వారు నవ్వుచూ “మీవంటి అదృష్టవంతులు మరొకరు లేరు. మీ రామలక్ష్మణులు విశ్వమునకే వెలుగునిచ్చే సుందరులు. ముల్లోకములను వారు ప్రకాశింప జేయుచున్నారు. సీతాదేవి స్వయంవరమునకు, ఒకరిని మించిన వారొకరు పెద్ద పెద్ద రాజులు వచ్చిరి కాని శివధనుస్సును విరువజాలక పోయిరి. బాణాసురుడు, రావణాసురుడు, మున్నగు ఎందరో వీరులు ధనుస్సును విరుచుటకు వచ్చి వింటిని చూచి భయపడి, దానిపై చేయిమోపలేక, వెళ్ళిపోయిరి.”

అప్పుడు రామచంద్రుడు, పదివేలమంది మోసుకుని వచ్చిన శివధనుస్సును అవలీలగా విరిచెను. మీ కుమారులు రాజులందరి చేతను మన్ననబడసిరి.

ఉత్సాహముతో దూతలు చెప్పిన మాటలు విని మహారాజు అయోధ్యావాసులు మిగుల సంతోషించిరి. మహారాజు ఆనందముతో వారికి చక్కని కానుకలు బహూకరింపగా అది నీతికి విరుద్ధమని వారు తీసుకొనలేదు.

సౌందర్యవతియైన సీతాదేవి శ్రీరాముని కంఠమున జయమాల వేయుట మొదలు జరిగిన చరిత్ర పూర్తిగా దశరథునకు దూతలు విన్నవించిరి. అందరు అది విని చాలా ఆనందించిరి. జయ జయ ధ్వనులు చేసిరి. ఈ శభవార్తను చెప్పుటకు మహారాజు వసిష్ఠులవారి వద్దకు వెళ్ళిరి. రామలక్ష్మణులు వృత్తాంత మంతా వారికి విన్నవించిరి. వశిష్ఠులవారు పరమానంద సంప్రాప్తమగును. ఎట్లన సముద్రము కోరనప్పటికిని నదులు తమంతట తామే వచ్చి కలియుచుండును గదా!" అనిరి.

ఆ సమయమున కౌసల్యాది రాణులు భిక్షుకులకు అన్నదానము, వస్త్రదానము చేసిరి. రాజ భవనమున జయభేరి మ్రోగెను. పురవాసు లెల్లరు ఈ సమాచారము తెలిసికొని వారి వారి యిండ్లకు అలంకారములు చేసికొనిరి. నగర మంతయు ఆనంద కోలాహలములతో నిండియుండెను.

దశరథుని ఆజ్ఞప్రకారము మిథిలానగర ప్రయాణమునకు కావలసిన పర్వసాధన, సామగ్రియు సిద్ధము చేయబడెను. వశిష్ఠులవారు నిర్ణయించినట్లు మంచి సుమూహర్తమున మహారాజు, భార్యలు, భరత శత్రుఘ్నులు బంధు మిత్రాదులు వెంటరాగా సకల పరివార సమేతుడై మిథిలానగరమునకు బయలుదేరెను. ఒక సుందరమైన రథము నందు వశిష్ఠ మహామునిని ముందు కూర్చుండబెట్టెను. పిమ్మట మరియొక రథముపై తాను



ఆసీనుడయ్యెను. మేళతాళములతో బయలుదేరుచున్న పెండ్లివారిని చూచి దేవతలు ఆనందించిరి. దశరథుడు బయలుదేరిన వార్త విని జనకమహారాజు దారి పొడుగున పెండ్లివారికి కావలసిన అన్ని సదుపాయములు చేయించెను.

మిథిలా నగర సమీపమునకు పెండ్లివారు చేరుకొనిరి. మంగళ వాద్యములతో మంగళ ద్రవ్యములతో కానుకలతో జనక మహారాజు తన పురోహితుడైన శతానందునితో గూడి సపరివారముగా ఎదురేగి సముచిత రీతిని దశరథ మహారాజునకు, వారి పరివారమునకు, సకల రాజమర్యాదలు చేసెను. పెండ్లివారికి అన్ని వసతులు సౌకర్యములు బ్రహ్మాండముగా చేసిరి. మగపెండ్లివారు తన నగరమునకు రానున్నారని తెలిసి సీతాదేవి తన యోగమాయచే అష్టసిద్ధులను పిలిపించి పెండ్లివారికి దుర్లభమైన అతిథి సత్కారములు చేయుమని ఆజ్ఞాపించెను.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులను వెంట నిడుకొని మహానందముతో దశరథుని విడిదికేగెను. దశరథుడు విశ్వామిత్రుని పూజించెను. రామలక్ష్మణులు తండ్రి పాదములకు భక్తితో నమస్కరించిరి.

దశరథుడు ఇరువురు రాకుమారులను గాఢాలింగనము చేసుకొని వారి వియోగము వలన కలిగిన దుఃఖమును మరచిపోయెను.

రామలక్ష్మణులు వశిష్ఠుల వారి పాదములకు ప్రణమిల్లిరి. మునులకు పెద్దలకు, నమస్కరించి వారి ఆశీర్వాదములు పొందిరి. జనక మహారాజు బంధు పరివారముతో వచ్చి అందరికి తగిన సత్కారములు చేసి తన నివాసమునకు చేరెను. శ్రీరాముని వియోగముచే అయోధ్యా వాసుల హృదయములలో కల్గిన ఆవేదన వారిని చూడగనే శాంతించెను.

లగ్నదినము కంటె ముందుగనే పెండ్లివారు రావడంవలన మిథిలాపురమంతా ఆనందముతో నిండిపోయెను. నలుగురు సోదరుల వివాహము మిథిలా నగరములోనే జరుగవలెనని మేమంతా

ఆ మహోత్సవమును నేత్రానందముగా చూచి ఆనందించేటట్లు దయచూపుమని స్త్రీలందరు బ్రహ్మదేవుని ప్రార్థించుచుండిరి.

హేమంత ఋతువులో మార్గశిర మాసమున ఉత్తమమైన గ్రహతిథి వారనక్షత్ర యోగాలు కూడిన శుభవేళ సుముహూర్తము బ్రహ్మయే నిర్ణయించి దానిని నారదమునికి ఇచ్చి జనక మహారాజు వద్దకు పంపెను. మహారాజు పురోహితులు ఆ ముహూర్తమునే నిర్ణయించిరి. మంగళములకు మూలమైన పవిత్రమైన గోధూళి వేళ అన్ని శుభశకునములు అనుకూలముగా నున్నవని తెలుసుకొని బ్రాహ్మణులు జనకునితో చెప్పిరి. స్త్రీపురుషులెల్లరు. పెండ్లి వారిని గాంచి ఆనందభరితులై జనకుని పుణ్యమును, దశరథుని భాగ్యమును మిగుల కొనియాడుచుండిరి.

జనకుడు తన పురోహితుడైన శతానందునితో వరపూజకు సర్వము సిద్ధము చేయుడని చెప్పగా వారు సకల మంగళ పూజా ద్రవ్యములను తెప్పించిరి.

ఆడ పెండ్లివారు మగ పెండ్లివారి విడిది వద్దకు వెళ్ళి "మహారాజా! పెండ్లి ముహూర్తము సమీపించినది. విచ్చేయు"దని విన్నవింపగా దశరథ మహారాజు కులగురువు వశిష్ఠుల వారితో సంప్రదించి కులాచారము లన్నింటిని నెరవేర్చి వేద వేదాంగ వేత్తలైన బ్రాహ్మణులు, మునులు, సాధువులు, వెంటనుండగా తన మువ్వురు రాణులు, నల్వురు కుమారులు, మంత్రులు, సామంతులు మొదలైన పరివారముతో వైభవోపేతముగా వివాహ మండపమునకు బయలుదేరెను.

బ్రహ్మ, ఈశ్వరుడు, ఇంద్రుడు, అష్టదిక్పాలకులు, విమానారూఢులై ఆకసము నుండియే జగత్కళ్యాణకారుని కళ్యాణ మహోత్సవ వైభవమును తిలకించి మిగుల ఆనందించిరి.



విద్యా, వినయ, రూప, శీలాది సకల సద్గుణములు మూర్తీభవించిన శ్రీరాముని చూచి దేవతలు సిగ్గుపడిరి. అంత సదాశివుడు "సకల బ్రహ్మాండ నాయకుడు శ్రీరాముడు, అతని యోగమాయ సీతాదేవి, వీరిద్దరి వివాహము కన్నులార గాంచి ఆనందించండి. ఇట్టి మహావకాశము మరియొక పర్యాయము లభింపదు" అని చెప్పెను. దేవతలు భక్తిపరవశులై పుష్ప వర్షములు కురిపించిరి. సర్వాంగ సుందరుడును, విశ్వమోహనుడైన శ్రీరాముని రూపలావణ్యములను గాంచి పార్వతీపరమేశ్వరులు ప్రేమపరవశులై ఆనంద బాష్పములు నిండిన నేత్రములతో చూచుచుండిరి.

శ్రీరాము డారోహించిన గుఱ్ఱము జన్మయే జన్మ. ఆశ్వారూఢుడై వచ్చిన శ్రీరాముని భువన మోహన రూపమును చూచి సీతాదేవి తల్లి సునయనాదేవి మహానందముతో పెండ్లి కుమారునకు తమ కులాచార ప్రకారము మంగళహారతి నిచ్చెను.

కులాచార విధులు నిర్వర్తించిన తరువాత గురువుగారు గౌరీపూజ, విఘ్నేశ్వర పూజ చేయించిరి. దేవతలు ప్రత్యక్షముగా వచ్చి పూజలందుకొని ఆశీర్వదించుచుండిరి. సూర్యభగవానుడు ప్రత్యక్షముగా వచ్చి తమ కులవిధులన్నియు నెరవేర్పించెను. సకల దేవతాపూజానంతరము మునులు సీతకు సుందరసింహాసన మిచ్చిరి. సీతారాముల పరమప్రేమ వర్ణింప నెవరితరము? హోమ సమయమున అగ్నిదేవుడు శరీరధారియై సాక్షాత్కరించి స్వయముగ ఆహుతులు గ్రహించుచుండెను. నాల్గువేదములు బ్రాహ్మణవేషములు ధరించి వచ్చి వివాహ విధులను నిర్దేశించుచుండెను.

మునుల ఆజ్ఞానుసారము జనకుని పట్టపురాణి సునయనాదేవి వచ్చి జనకుని వామపార్శ్వమున కూర్చుండెను. పవిత్ర, సుగంధ మంగళ జలములచే నిండిన బంగరు కలశమును, మణులచే మెరయుచున్న పళ్ళెరమును స్వయముగా తెచ్చి రాజదంపతులు జనకుడు, అతని రాణి

సునయనాదేవి ప్రేమవిహ్వలులై పతిత పావనుడైన శ్రీరాముని పావన చరణములను పవిత్ర జలములచే కడిగి ధన్యులైరి. సకల భువన వాసులు జయజయ ధ్వానములు చేయుచు" జనకుని భాగ్యమే భాగ్య"మని ఆనందముతో కొనియాడిరి. ఉభయ పక్షముల గురువులు, వధూవరుల గోత్రములు చెప్పుచుండిరి.

సముద్రుడు లక్ష్మిదేవిని శ్రీ మహావిష్ణువునకు కన్యాదానము చేసినట్లు, క్షత్రియజాతికే అలంకారప్రాయుడైన జనకమహారాజు శ్రీరామునకు సీతను కన్యాదానము చేసెను. దేవతలు సంతోషముతో పూలవర్షములు కురిపించుచుండ, మునులు వేదమంత్రము లుచ్చరించుచుండ, సకల మంగళ వాద్యములు మ్రోగుచుండ జనకుడు శ్రీరాముని చేతియందు, సీతాదేవి చేతిని ఉంచెను. వధూవరులు అగ్నికి ప్రదక్షిణము లొనర్చిరి. ఈ కిశోర దంపతుల శోభ యే కవి వర్ణింపగలడు.?

ప్రదక్షిణానంతరము దంపతులు ఏకాసనాసీనులైరి. కొడుకును కోడలిని చూచుచు దశరథ మహారాజు ఆనందము పట్టలేకపోవుచుండెను.

వశిష్ఠులవారి ఆజ్ఞానుసారము, జనక మహారాజు వివాహ సామగ్రి సర్వము తెప్పించి మాండవి, శ్రుతకీర్తి, ఊర్మిళ యను ముగ్గురు రాకుమార్తెలను పిలిపించెను. తన సోదరుడైన కుశధ్వజుని జ్యేష్ఠ పుత్రిక మాండవిని భరతుని కిచ్చి సీత చెల్లెలు ఊర్మిళను లక్ష్మణునకిచ్చి, సుందరవదన సకల సద్గుణ సంపన్నురాలైన శ్రుతకీర్తిని శత్రుఘ్నునకు ఇచ్చి విధివిధానముగా జనకుడు వివాహ మొనర్చెను.

సమాన గుణ, శీల, రూపసంపద గల నల్వురు దంపతులను జూచిన సకల జనులు హర్షించిరి. ఆ జనక మహారాజు నల్వురు అల్లుండ్రకు వారి హోదాకు తగినట్లు రథ, గజ, తురగ, రత్న, కనక, రజత, వస్త్రాదులను అమూల్యములును అపురూపములైన వస్తువులను కట్నముగా నొసగెను.



వాటిని దశరథ మహారాజు సాదరముగ స్వీకరించెను. యాచకులకు, వారి కిష్టమైన భోజనపదార్థములను పెట్టించెను. ఈ విధముగ వివాహమునకు వచ్చిన ఎల్లరను జనక మహారాజు సంతృప్తి పరచెను.

సకల మంగళ వాద్యములు మ్రోగుచుండ, పుణ్యాంగనలు గాన మొనర్చుచుండ, మునీంద్రునాజ్ఞ ప్రకారము వధూవరులను దేవుని యింటిలోనికి తీసికొనిపోయి ఉచిత పూజాదులు జరిపించి, అనంతరము అంతఃపురమునకు తోడ్కొని పోయిరి. నగరము, ఆకాశము జయ జయ ధ్వానములతో నిండియుండెను. దేవతలు, మునులు, సిద్ధులు వారివారి లోకములకు వెళ్ళిపోయిరి.

అనంతరము నల్వురు సోదరులును తమ భార్యలను వెంటనిడుకొని దశరథ మహారాజు వద్దకు పోయి నమస్కరించి ఆశీస్సుల నందుకొనిరి. జనకమహారాజు పెండ్లివారికి అపూర్వమైన విందు నొనర్చెను. అమృత తుల్యములై దేవలోకమున సైతము దుర్లభములైన షడ్రసోపేతములైన పదార్థములతో పెండ్లివారికి శ్రద్ధా, వినయ ప్రేమ గౌరవములతో భోజనము పెట్టించెను. రాజ శిరోమణి, దశరథ చక్రవర్తి పరమానందముతో తమ విడిదికి సపరివారముగ ఏగెను.

ఈ విధముగా కొన్ని దినములు మిథిలా నగరములో మహోత్సవములతో గడచెను. ఒక దినమున దశరథ మహారాజు వశిష్ఠుని వద్దకేగి నమస్కరించి బ్రాహ్మణ పూజ యొనర్పవలెనని తన కోరిక విన్నవింపగా, వశిష్ఠుడంత, వామదేవ, నారద, వాల్మీకి, జాబాలి, విశ్వామిత్రాది తపోధనుల నెల్లర నాహ్వానించి, యోగాసనములయందు కూర్చుండ జేసి, మహాభక్తితో పూజ లొనర్చి వస్త్రములచే, భూషణములచే అలంకరింపబడిన నాల్గులక్షల ధేనువులను వారికిచ్చెను. వారు సంతసించి రాజును, రాకుమారులను, ఆశీర్వదించిరి. మరియు యాచక సమూహమునకు ఎవరికి ఏ పదార్థము కావలెనో వారి కా

పదార్థములు మిక్కుటముగ నొసగెను, వారందరు "రఘువంశ శిరోమణికి, రామచంద్ర మహారాజుకు జయము కల్గుగాక! జయము కలుగుగాక!" యని పల్కుచు వెళ్ళిరి.

ఈ విధముగ సీతారామ కల్యాణము సకలభువన మోహనముగా జరిగెను.

ప్రతిదినము ఉదయమున అయోధ్యకు వెళ్ళుటకై జనకునితో దశరథుడు ప్రస్తావించుచుండును. "ఇంక నాల్గు దినములుండి మమ్ముల నందరిని ధన్యులను చేయు" డని జనకుడు ప్రేమవశుడై వియ్యంకునితో పలుకును. ఇట్లు బహు దినములు గడచిపోయెను.

ఒక దినమున శతానందుడు, వసిష్ఠుడు, జనకుని ప్రబోధించి అయోధ్యకు పోవుటకై దశరథునకు, పరివారమునకు తగిన సన్నాహములు చేయింపుడని చెప్పగా, అట్లేయని జనకుడు దశరథ మహారాజుకు, పరివారమునకు తిరుగు ప్రయాణమునకు కావలసిన సర్వ సౌకర్యములు తత్క్షణ మొనరించెను. జనకుడు అల్లుండ్రకు మరల అపూర్వ వస్తు వాహనములు లెక్కకు మిక్కుటముగా నొసంగెను. సీతారాములు తమ్ము విడిచి వెళ్ళుచున్నారని, విని మిథిలా పురజను లందరు చింతాక్రాంతులైరి. వృద్ధ స్త్రీలు రాజాంతఃపురస్త్రీలు సీతను ఆశీర్వదించి, ఆమెకు అత్తవారింట మెలగవలసిన విధానమును బోధించిరి.

ఆ సమయమున శ్రీరాముడు తన ముగ్గురు సోదరులతో కలిసి అత్తగార్లను సెలవడుగుటకై అంతఃపురమునకు వచ్చెను. అత్తగార్లను సెలవడిగిరి. వారు దీవించి హారతు లిచ్చిరి. మంగళస్నాన మొనరించి, సర్వరస సంపన్నమైన భోజనమిడి రాముని భువన మోహన సౌందర్యమునకు పరవశులై పలుకలేక యూరకుండిరి.

శ్రీరాముడు వారిని గాంచి "మాతలారా! మా తండ్రి దశరథ మహారాజు అయోధ్యాపురి కేగ కోరుచు మీ అనుజ్ఞ కొఱకై యిచ్చటకు మమ్ములను



పంపిరి. మాకు సెలవు నొసంగుడు. మీ పుత్రులవలె మమ్ములను దయతో తిలకింపుడు" అని విన్నవించిరి.

ఈ వచనములు విని రాణు లెల్లరు మాట్లాడలేక పోయిరి. నల్వురు కుమార్తెలను హృదయమునకు హత్తుకొని, వత్సములను విడువలేని గోవులవలె నుండిరి. సీతాదేవిని రాముని కప్పగించి "నాయనా! ఈ సీత మాకెల్లరకు ప్రాణములకన్న ప్రియమైనది. చరణదాసిగానీకు సమర్పించితిమి. నీవు సర్వజ్ఞుడవు. కాన నీకు చెప్పజాలము, నీవు పూర్ణ కాముడవు" అని రాముని చరణములు పట్టుకొని విడువకుండిరి.

ప్రేమ స్వరూపుడు, భక్త సులభుడును, అఖిలాంతరాత్ముడునైన రాముడు, అత్తగారి భక్తికి మెచ్చి ఆమెను అనేక భంగుల కొనియాడెను చేతులు జోడించి, మాటిమాటికి నమస్కరించుచు అత్తలవలన అనుజ్ఞ పొంది అనుజ సమేతుడై రాముడు బయలుదేరెను. వారి వెంట వారి భార్యలును తల్లుల దీవనలను బొంది, వారిని విడువలేక విడువలేక విడిచి అనుసరించిరి. సీత చేత పెంచబడిన పెంపుడు మృగములు ఆమె వియోగము సహింపజాలనిపై ఆహారమును, నీరును ముట్టకుండెను. పశుపక్ష్యాదుల అవస్థయే యిట్లుండ, మిథిలా నగరమున గల ప్రజల స్థితి ఎట్లుండునో రసజ్ఞు లూహింపవచ్చు.

మిథిలా నగర రాజులు పుట్టుకతోనే విరాగులు, బ్రహ్మజ్ఞాన సంపన్నులు. జనకుని సోదరులు ఆ సమయమున కూతుండ్రు అత్తవారింటికి తొలిసారి పోవు దృశ్యమును చూచి జ్ఞాను లయ్యును శోకగ్రస్తులైరి. జనకుడు ఎట్టకేలకు ధైర్యము తెచ్చుకొనెను. సర్వాలంకార శోభితములైన పల్లకీలను తెప్పించి శుభముహూర్తమున విఘ్నేశ్వరపూజ ఒనర్చి కూతుండ్రను పల్లకీలయందు ఎక్కించెను. విడువలేక విడువలేక, తండ్రి అనుగు కూతుండ్రకు అత్తగారింట మెలగ వలసిన నీతులు బోధించి, రాజవంశ మర్యాదలు నెల్ల నెఱిగించి విశ్వాస పాత్రులైన దాస దాసీ జనముల నొసంగెను. పెండ్లి కుమారులు

నల్వురు అత్తమామలకు నమస్కరించి ఆశీర్వాదములు పొంది భార్యాసహితులై అయోధ్యానగరమునకు బయలుదేరిరి.

వేగరులైన వార్తాహరులచే తమరాక అయోధ్యా పట్టణమందు మంత్రుల కెరింగింప వారు బహు సంరంభముతో పురజనుల కెల్లరకు తెలియజేసిరి. పురమంతయు అలంకారములు చేసిరి, అయోధ్యా నగరము వైకుంఠము వలె శోభాయమానముగా నుండెను. శుభముహూర్తమున వశిష్ఠముని ఆజ్ఞ ప్రకారము పెండ్లివారు అయోధ్య యందు మహోత్సవముతో ప్రవేశించిరి. పురజనుల సంతోష మెంతని వర్ణింపగలము? అయోధ్యానగరవాసులు, పురుషులు తమకుగల అమూల్యములైన ప్రియాతి ప్రియమైన వస్తువులు కానుకగా నొసంగిరి. స్త్రీలు హారముల నొసగిరి.

ఇట్లు మహావైభవముతో రాజ ద్వారమును సమీపించిరి. తల్లులు మహా సంతోషముతో కొడుకులకు కోడండ్రకు దిష్టి తీసి హారతి నొసంగిరి. సీతారాములను చూచుకొనుచు తమ జన్మలు ధన్యమని తలంచిరి. వేదవిధి కులాచారము ప్రకారము నల్వురు కొడుకులను కోడండ్రను రాజాంతః పురమునకు తోడ్కొని వచ్చిరి. వారి పాదములు కడిగిరి. వినాయకునకు, ఈశ్వరునకు పూజ లొనర్చి, బ్రాహ్మణులకు యాచకులకు అనేక ద్రవ్యములు దానమొసంగిరి. పురజను లెల్లరు జగన్మంగళకరులైన సీతారాములను కనులారగాంచి వస్త్ర భూషణాది బహుమతుల నందుకొని విడువలేక విడువలేక ఎట్టకేలకు తమ తమ ఆవాసములకు వెళ్లిపోయిరి.

దశరథ మహారాజు కులగురు సమేతుడై రాజ భవనమున ప్రవేశించెను. బ్రాహ్మణ బృందములు విశేషముగా వచ్చిరి. వారందరికి స్నానభోజనాదులు ఏర్పాటు చేయించిరి. వారు సంతసించి బహుదానములు గ్రహించి ఆశీర్వదించి వెడలిపోయిరి.

అంత దశరథుడు విశ్వామిత్రునికి దేవోపచార విధులచే పూజ లొనర్చి “మహాత్మా! మీ అనుగ్రహముననే నాకీభాగ్యము లభించినదని” బహుభంగుల



స్తోత్రముచేసి రాజమందిరమున, సర్వాలంకార శోభితమై సర్వవస్తు సంభరితమైన యొక భవనము నొసంగెను. కులగురువైన వశిష్ఠునికి మహాభక్తితో పూజలొనర్చెను. సీతారాములను తన హృదయమందు నిల్పుకొని వశిష్ఠుడు తన ఆశ్రమమునకు వెళ్ళిపోయెను. దశరథ మహారాజు బ్రాహ్మణుల భార్యల నందరను ఆహ్వానించి వారికి మర్యాదలుచేసి పూజలు చేసి వస్త్రాభరణాదులు దానమిచ్చెను. పురజనులందరకు వారువారు కోరిన బహుమతుల నొసంగెను. తదనంతరము రాణులు, తమ కుమారులు కోడండ్రతో గూడియున్న అంతఃపురమునకు మహోత్సాహముతో పోయిరి. మహారాజు పుత్రులతో కూడి స్నానమొనర్చి బ్రాహ్మణులు గురువులు, రాజ బంధువులతో కలిసి పరమ ప్రీతితో విందారగించెను.

శ్రీరామచంద్రుని సందర్శించి ఆయన ఆజ్ఞపొంది, అందరూ తలవంచి నమస్కరించి వారివారి గృహములకు వెళ్ళిపోయిరి. మహానందముతో రాత్రి యిట్లు గడచినది. రాముడు ఘోరరాక్షసి తాటకను వధించుట మారీచ సుబాహులను మట్టుపెట్టుట, రాక్షసులను శిక్షించుట, అహల్యను పవిత్రురాలుగా చేయుట, అనితర సాధ్యమైన శివధనుర్భంగ మొనర్చుట మొదలగు పరాక్రమములతో మహత్వముతో కూడిన కార్యములకు ఆశ్చర్యపడి తల్లులు రాముని సామాన్య మానవుడుగాగాక భగవంతుడేయని నిర్ధారణ చేసుకొనిరి.

ఉదయమున నల్గురు సోదరులు ద్వారము వద్దకువచ్చి సమస్తజనులకు దర్శన మొసంగిరి. తర్వాత తండ్రివెంట రాజసభకేగి గురువులకు నమస్కరించి వారి ఆశీస్సులను అందుకొనిరి. వశిష్ఠుడు, విశ్వామిత్రుని తపోమహిమను బహుభంగుల కొనియాడి రాజసభయందు తన గొప్పతనమును నిరూపించుకొనెను. కొన్నిదినములు ఇట్లు మహానందముతో గడచెను. శుభ ముహూర్తమున నూతన దంపతులు కంకణ విసర్జన మొనర్చిరి.

విశ్వామిత్రుడు తన ఆశ్రమమునకు వెడలగోరగా శ్రీరాముడు "కొన్నిదినములు మా యింటనుండి మమ్ములను ధన్యులచేయు"దని ప్రార్థించెను. ఎట్టకేలకు రాజాంగీకారమును పొంది విశ్వామిత్రుడు తన ఆశ్రమమునకు వెడలెను. సోదరులను వెంటనిడుకొని శ్రీరామచంద్రుడు విశ్వామిత్రుని వెంట కొంతదూరము సాగనంపి వచ్చెను.

శ్రీరాముడు సీతను వివాహమాడి అయోధ్యకు, సీతాసమేతుడై వచ్చినది మొదలు అయోధ్య పూర్వముకంటె మహాశోభతో వెలుగుచుండెను.

శ్రీ రఘురాముని చరిత్ర శతకోటి ప్రవిస్తరము. ఒక్కొక్క అక్షరమే మహాపాతక నాశన మొనర్చును. సీతారాముల యీ కల్యాణ మంగళకథను భక్తితో ఎవరు పఠించెదరో, ఎవరు వినెదరో అట్టివారికి వారి దాంపత్య జీవితము మంగళప్రదముగాను, సుఖావహముగాను జరుగునట్లును, కలహాలు జరుగకుండునట్లును సీతారాములు అనుగ్రహించెదరు.

* * *

# శ్రీ తులసీరామాయణము

## అయోధ్యాకాండము

శ్రీరామచంద్రుడు సీతాదేవిని పరిణయమాడి అయోధ్యకు తిరిగి వచ్చినప్పటినుండియు అయోధ్యానగరము "నిత్యకల్యాణము పచ్చతోరణము" గా వెలుగొందుచుండెను. నిత్యమును ఎడతెరపిలేకుండా విందులు వినోదములు జరుగుచుండెను. మంగళ వాద్యములు మారుమ్రోగుచుండెను.

పదునాలుగు భువనములలో నున్న పర్వతములమీద పుణ్యమనే మేఘములు క్రమ్మి ఆనందమనే వర్షము వర్షించుచుండెను.

బుద్ధి సిద్ధి మరియు సంపత్తి అనే నదులు ప్రవహించివచ్చి అయోధ్యానగరమనే సముద్రములో కలియుచుండెను.

నగరమందలి స్త్రీ పురుష లెల్లరును శ్రీరాముని ముఖ సౌందర్యమును గాంచి ఆనందపడుచుండిరి. కౌసల్యాది సతీమతల్లులు తమ మనోరథము ఫలించుచున్నందుకు మిక్కిలి సంతోషించుచుండిరి. శ్రీరాముని గుణ రూప శీలములను దర్శించి దశరథ మహారాజు మిగుల ఆనందించుచుండెను. మహారాజు జీవించియుండగనే రామునకు యువరాజపదవి ప్రాప్తించునట్లు అనుగ్రహించుమని పట్టణమునందలి స్త్రీ పురుషులెల్లరు పరమేశ్వరుని ప్రార్థించుచుండిరి.

ఒకానొక సమయమున దశరథమహారాజు సకల పరివార సమేతుడై రాజసభలో రత్నసింహాసనాసీనుడై యుండెను. పెక్కుమంది రాజులు దశరథమహారాజు ప్రాపకము కోరి కొలుచుచుండిరి.

ముల్లోకములలోను, మూడు కాలాలలోను దశరథునివంటి పుణ్యాత్ముడు, అదృష్టశాలి మరియొకడు లేదని జనులు భావించుచుండిరి. మంగళ కరుడగు శ్రీరామచంద్రుడు వారికి పుత్రుడుగా జన్మించుటవలన మహారాజు గొప్పతనమును ఎంత వర్ణించినను స్వల్పమేయగును.

ఒకరోజున రాజుగారు తన ముఖమును అద్దములో చూచుకొనుచు కిరీటమును సరిచేసికొను సమయమున తన చెవులమీది వెండ్రుకలు నెరసి పోవుటను చూచెను. అవి "మహారాజా, నీకు వార్ధక్యము వచ్చినది, అన్ని విధాలా అర్హుడైన శ్రీరామునకు యువరాజ పట్టాభిషేకము చేయుము." అని చెప్పినట్లు మహారాజునకు తోచెను.

మఱుసటి రోజు రాజుగారు ఉదయముననే లేచి కులగురువు వశిష్ఠ మహామునిని సందర్శించి "మునీశ్వరా! నాకు వృద్ధాప్యము వచ్చినది. నేను రాముని ప్రేమించినట్లు నగరములోనివారెల్లరు అతనిని ప్రేమించుచున్నారు. మీ ఆశీర్వాదము వలననే శ్రీరామచంద్రుడు పుత్రుడుగా నాకు జన్మించెను. ఇప్పుడు నా మనస్సులో ఒక అభిలాష గలదు. అది తమ కృపవల్లనే పూర్తి కాగలదు" అని విన్నవించెను. మహారాజుగారి స్వాభావికమైన ప్రేమను గ్రహించి వశిష్ఠ మహాముని సంతోషముతో "రాజా, మీ కోర్కె యేమిటో చెప్పండి. మీ పేరుప్రతిష్ఠలు కీర్తి ప్రభావమువలన మీరుకోరినదే తడవుగా సమస్తమును మీకు సంప్రాప్తమగును" అని పలికెను.

తనకు అనుకూలముగా గురువుగారు పలుకుచున్నట్లు మహారాజు తెలిసికొని వినయముతో "మునినాథా! శ్రీరాముని యువరాజుగా చేయుటకు దయచేసి అనుజ్ఞ యిప్పించండి. తమ అనుగ్రహమువలన ఆ పరమేశ్వరుడు నా మనోరథములన్నియు పూర్తిచేసెను. ఈ కోరిక ఒక్కటే మిగిలియున్నది. నేను జీవించియుండగానే శ్రీరామ పట్టాభిషేక మహోత్సవమును కనులార చూడగోరుచున్నాను. ఈ కోరిక తీరిన తర్వాత నా శరీరము ఉండినను రాలిపోయినను నేనుమాత్రము పశ్చాత్తాప పడను" అని పలికెను.

దశరథుని వచనములు విని వశిష్టమహాముని "ఓ రాజా! ఆలస్యము చేయకండి, వెంటనే అన్ని యేర్పాట్లు చేయండి. రాముని పట్టాభిషేకమునకు అన్ని దినములును శుభమైనవే. ఎవనికి విముఖులైన ప్రజలు బాధల పాలయ్యెదరో అట్టి ప్రభువు రాముని పేరుతో మీకు కుమారుడుగా జన్మించెను" అని చెప్పెను.



మహారాజు అంతులేని సంతోషముతో తన రాజభవమునకు తిరిగి వెళ్ళి సుమంత్రుడు మొదలైన మంత్రులను పిలిపించెను. వారెల్లరు వెంటనే వచ్చి మహారాజుకు నమస్కరించి నిలిచిరి.

అంతట దశరథమహారాజు రాముని పట్టాభిషేకము గురించి కులగురువు వశిష్ఠులవారితో జరిగిన సంభాషణమంతయు వారికి వివరించి చెప్పెను. "మీ అందరకు ఇష్టమైన యెడల రాముని యువరాజుగా చేసెదను." అని పలుకగా సుమంత్రుడు "మహారాజా! లోకమునకు క్షేమము కలిగించే శుభవార్త చెప్పినందులకు మీరు కోటివత్సరములు జీవించండి. ఆలస్యముచేయక వెంటనే అన్ని యేర్పాట్లు చేయుటకు ఆజ్ఞ ఇప్పించండి" అని విన్నవించెను. సభలోని వారెల్లరు సంతోషముతో జయ జయధ్వనులు చేయుచు ఏకగ్రీవముగా తమ ఆమోదమును తెలిపిరి.

"రామచంద్రుని రాజ్యాభిషేకమునకు ఏయే యేర్పాట్లు జరుగవలెనో వశిష్ఠ మహాముని ఆజ్ఞాపించినట్లు వానిని వెంటనేచేయండి" అని మహారాజు పలికెను.

వశిష్ఠ మహాముని మిగుల సంతసించి "సమస్తములైన ఉత్తమ నదులయందలి జలము తీసుకురండి. ఓషధులు, ఫలములు, పుష్పములు మున్నగు అనేక మంగళకరమైన వస్తువులను తీసుకురండి. మృగచర్మములు అనేక విధములైన వస్త్రములు, అసంఖ్యాకములైన ఉన్ని పట్టువస్త్రములు, నానావిధములైన రత్నములు, రాజ్యాభిషేకమునకు కావలసిన అన్ని వస్తువులను తీసుకరండి. వేదములలో చెప్పబడిన విధానముగా సమస్తము సిద్ధము చేయండి. నగరమంతా అలంకరించండి. దేవాలయములు, వీథులు, చతుష్పథములు, సత్రములు చక్కగా అలంకరణలతో అలంకరించండి" యని వశిష్ఠముని చెప్పెను.

ప్రజలు మహాముని చెప్పినట్లు వెంటనే అత్యుత్సాహముతో చేసిరి. కులదేవతలను, పెద్దలను పూజించిరి. ధ్వజములను, పతాకములను అలంకరించిరి. గుఱ్ఱములు, రథములు, ఏనుగులు చక్కగా అలంకరింపబడెను.

శ్రీరాముని యువరాజ పట్టాభిషేక వార్తవిని అయోధ్యానగర వాసులెల్లరు అమితోత్సాహముతో పనులు చేయుచుండిరి. సీతారాములకు శుభశకునములు కలిగెను. వారి అవయవములు స్పందింపసాగెను.

భరతుడు మేనమామయింటికి వెళ్ళిచాలాదినములు గడచెను. అతనిని కలుసుకొనవలెనని రాముని మనస్సు ఉవ్విళ్ళూరుచుండెను.

భరతునితో సమానముగా శ్రీరామునకు ప్రియమైనవారు మరొకరు లేరు. రఘురాముడు తన సోదరుడైన భరతునిగూర్చియే రేయింబవళ్ళు తలంచుచుండెను.

మంగళకరమైన శ్రీరామ పట్టాభిషేకవార్త విని రాణివాసములోని యెల్లరు మిగుల హర్షించిరి. రాణివాసమునకు వెళ్ళి మొదట ఈ శుభవార్త చెప్పినవారు అనేక బహుమతులు పొందిరి. శ్రీరాముని తల్లి కౌసల్యాదేవి దానధర్మములు విరివిగా చేసెను.

దశరథమహారాజు వసిష్ఠ మహామునిని పిలిపించి తగిన యుపదేశము లిచ్చుటకు రాముని మందిరమునకు పంపెను. గురువుగారు వస్తున్నట్లు తెలియగానే రఘురాముడు ద్వారమువద్దకు వచ్చి మునిగారి పాదములకు ప్రణమిల్లి ఆదరపూర్వకముగా గృహములోనికి తోడ్కొనిపోయి అర్ఘ్యపాద్యాది షోడశోపచారములతో పూజించెను. తన రెండుచేతులు జోడించి శ్రీరాముడు ఇట్లు చెప్పెను. "సేవకుని గృహమునకు స్వామి విచ్చేయుట మంగళకరమే. అయినప్పటికి గురువర్యా! యేమైనా పనులు ఈ దాసునితో నున్నయెడల కబురు పంపుట యోగ్యము. కాని గురుదేవులైన మీరు స్వయంగా విచ్చేసి



చూసిన వాత్సల్యము వలన ఈ భవనము పావనమైనది. స్వామీ! నేనేమి చేయవలెనో ఆజ్ఞాపించండి. స్వామిని సేవించుటలోనే సేవకునికి మేలు గలదు."

ప్రేమతో నిండిన శ్రీరాముని వాక్యములను వశిష్ఠమహర్షి విని మిగుల ఆనందించి రాముని ప్రశంసించుచు ఇటులపలికెను. ఓరామా! సూర్యవంశ భూషణుడవైన నీవు ఇట్లుమాట్లాడక, మరెట్లు మాట్లాడెదవు. రామచంద్రా! మహారాజు నీకు రాజ్యాభిషేకము చేయగోరుచున్నారు. నేడు నీవు ఉపవాసముండి హోమాది క్రియలు విధిపూర్వకముగా సంతోషముతో చేయుము. విధాత యీ కార్యమును నిర్విఘ్నముగా నెరవేర్చును" అనిచెప్పి దశరథుని వద్దకు వెళ్ళిపోయెను.

గురువుగారి వాక్యములు విని రాముడు "మా సోదరులెల్లరము ఒకే రోజున జన్మించితిమి. ఉపనయన వివాహాది సంస్కారములు అన్నియు వెంటవెంటనే జరిగెను. కాని యీ పవిత్రవంశములో సోదరులందరిని విడిచిపెట్టి పెద్దవాడ నగుటవలన నా ఒక్కనికే పట్టము గట్టుట యిదొక్కటియే అనుచితము." అని తనలోతాను తలంచుకొని బాధపడెను.

ఆ సమయమున లక్ష్మణుడు ఆనందముతో శ్రీరాముని వద్దకు వచ్చెను. శ్రీరాముడు ప్రియవచనములు పలికి అతనిని సంతోషపరచెను.

ప్రజలు అరుగులమీద, వీథులలోను, బజారులలోను గుమిగూడి "అశుభముహూర్తము రేపెంత తొందరగా వచ్చునో! విధాత మా అభిలాషను ఎంతతొందరగా పూర్తిచేయునో! రాముడు సీతాదేవితో స్వర్ణసింహాసనముపై విరాజమానుడై యుండుటను ఎప్పుడు మనము కనులార చూడగల్గుదుమో ఆ శుభగడియ ఎంతత్వరగా వచ్చునో" యని ఉవ్విళ్ళూరు చుండిరి.

కాని కుటిలులైన దేవతలు ఈ కార్యమునకు విఘ్నము కలిగించవలెనని సరస్వతీదేవిని ప్రార్థించగా వెంటనే ఆమె ప్రత్యక్షమయ్యెను. దేవతలు

మాటిమాటికి సరస్వతీదేవి పాదములమీద పడుచు ఆమెతో ఇట్లు విన్నవించిరి. "తల్లీ! రాముడు రాజ్యమును విడిచి అరణ్యమునకు వెళ్ళునట్లు చేయుము. తద్వారా మా విపత్తులను దూరముచేయుము."

వారి వాక్యములువిని సరస్వతీదేవి నేను కమలవనమునకు హేమంత ఋతురాత్రివలె అయ్యెద"నని బాధపడుచుండగా దేవతలు "అమ్మా! యిందుకు మీకు ఏమియు దోషము కలుగదు. రఘునాథుడు హర్ష, విషాదములు లేనివాడు. రాముని ప్రభావము మీకు తెలియనిది కాదు. జీవులు తమ తమ కర్మలవలన సుఖదుఃఖములు పొందుచుందురు. కాబట్టి మా క్షేమము కొఱకు మీరు అయోధ్యకు వెళ్ళండి" అని ఆమె పాదములు పట్టుకొని మరి మరి ప్రార్థించిరి. ఆమెను సందేహములో ముంచివేసిరి.

సరస్వతీదేవి యిట్లు తలంచెను. "దేవతల నివాసము ఉన్నతమే కాని వారి బుద్ధి నీచమైనది. ఇతరుల ఐశ్వర్యమును చూచి వారు ఓర్వలేరు. ముందు జరుగనున్న పనిని ఆలోచించి "రాముడు వనమునకు వెళ్ళినచో రాక్షసులను వధించును. అంతట ప్రపంచము సుఖించును." ఇట్లు తలంచి ఆమె అయోధ్యా నగరమునకు వెళ్ళెను.

కైకేయికి "మంథర" యను మందబుద్ధిగల ఒకదాసి యుండెను. ఆమె అపకీర్తికి గురియగునట్లు ఆమె బుద్ధిని మార్చివేసి సరస్వతీదేవి తనలోకమునకు వెళ్ళిపోయెను.

నగరమందలి అలంకారములను, ఉత్సవములను మంగళవాద్యముల మ్రోతలను దర్శించి యెందులకీ అలంకారములు జరిగినవని మంథర ప్రజలను అడుగగా రామపట్టాభిషేకము జరుగనున్నదని జనులు చెప్పిరి. ఆ మాటలు విని ఆమె హృదయము భగ్గున మండిపోయెను. "ఈ పట్టాభిషేకమును ఈ రాత్రికి రాత్రియే యెట్లు ఆపుదలచేయవలెనా" అని చింతించుచు మంథర తన యజమానురాలైన కైకేయివద్దకు వెళ్ళి నిలిచెను.

రాణి కైకేయి మంథరనుచూచి "నీముఖము చిన్నపోవుటకు కారణమేమి" యని అడిగెను. మంథర ఎట్టి జవాబు నీయక నిట్టూర్పు



విడుచుచు కన్నీరుకార్చుచు చూచుచుండెను. అంత కైకేయి చిరాకుతో "ఓసీమంథరా! లక్ష్మణుడు నిన్ను ఏమైనా దండించెనా? నీ నోరు ఊరుకొనదు" అని అడుగగా ఆ దాసి ఏమియు మాట్లాడక త్రాచుపామువలె బుసకొట్టుచుండెను. మంథర ముఖముచూసి యేమి జరిగెనో అని భయపడి కైకేయి, "రాజుగారు, సీతారామ లక్ష్మణ శత్రుఘ్నులు క్షేమమేకదా!" అని ఆదుర్దాతో అడిగెను. ఈ మాట వినగానే దాసీదానికి కోప మధికమయ్యెను. "అమ్మా! నేను ఎవరి అండ చూచుకొని సులభముగా మాట్లాడెదను? రామునకు తప్ప ఇప్పుడు ఎవరికి క్షేమము కలుగును? మహారాజు వానికి యువరాజ పదవి యిచ్చుచున్నాడు. కౌసల్య రాజమాత కానున్నది. అందువలన ఆమె గర్వము పట్టలేకయున్నది. అది చూచినప్పటినుండి నా కెంతో క్షోభ కల్గుచున్నది. పుత్రులు దూరదేశమున నున్నారని నీకు కొంచెమైన చింతలేదు. పతి నా ఆధీనములో నున్నాడని తలంచి పట్టుపరుపుల మీద పడుకొని నిద్రించుచున్నావు. మహారాజుగారి కపటముతో కూడిన చాతుర్యమును నీవు గ్రహించుటలేదు."

మంథర ప్రియవాక్యములు విని కైకేయి మంథర మనస్సులోని మాలిన్యమును గ్రహించి కోపముతో గద్దించుచు "ఇట్లు మాట్లాడకుము, నోరుమూయుము, కొంపలు ముంచేలాగున మాట్లాడకుము. మరల ఎప్పుడైన ఇట్లు మాట్లాడిన యెడల నీ నాలుక కోసివేయించెదను, చెవిటివాళ్ళు, మూగవాళ్ళు, కుంటివాళ్ళు, గూనివాళ్ళు, దుష్టులు కుటుంబములో కలహములను పెట్టి తమాషా చూచుచుందురు. అందులో నీవు స్త్రీవి. పైగా దాసి దానివి." అనుచు నవ్వెను.

మరల కైకేయి యిట్లనెను. "నాకు ప్రియవాక్యములు వినిపించే మంథరా! యికనుంచి నీవు నా యెదుట ఎన్నడూ యిట్టి చెడుమాటలు పలుకకు, నీ మీద నాకు ఎంతమాత్రము కోపములేదు. నాకు ప్రేమాస్పదుడైన రామునకు పట్టాభిషేకము జరుగుచుండగా నీకు క్షోభ ఎందుకు కలిగినదో నాకు చెప్పుము. రఘువంశము పద్ధతి పెద్దకుమారుడు ప్రభువు. మిగతా

పుత్రులు సేవకులయ్యెదరు. సూర్యవంశము రీతియే యది. రాముని పట్టాభిషేకము నిజముగా రేపేయైన యెడల నీ కిష్టమైన వస్తువు కోరుకొమ్ము సంతోషముతో ఇచ్చెదను. రామునకు తనతల్లి కౌసల్యవలె మిగిలిన యిద్దరు తల్లులు ప్రీతిపాత్రములు. అందులో నన్ను విశేషముగా ప్రేమించును. అనేక పర్యాయములు పరీక్షించి చూచితిని. విధాత నాకు మరల జన్మయిచ్చి నట్లయితే రాముడు పుత్రుడుగను, సీత కోడలుగను కావలెనని కోరుకొందును. రాముడు నాకు ప్రాణముకంటె ఎక్కువ ప్రియమైనవాడు. రాముని పట్టాభిషేక వార్తవిని ఎందుకు దుఃఖపడుచున్నావు? భరతుని మీద ఒట్టు, నీవు కపటము విడచి సత్యమును చెప్పుము. సంతోష సమయమున దుఃఖపడుటకు కారణము తెల్పుము?"

కైకేయి పలుకులువిని మంధర ఇట్లు బదులుచెప్పెను. "నా ఆశలన్నీ ఒక్క పర్యాయము చెప్పుటలోనే పూర్తిఅయ్యెను. మరల చెప్పి కొండనాలుక లాగించుకొనెదనా! నా తలపగిలిపోను! నీకు మంచిచెప్పినను నీవు తెలుసుకొనవు కదా. ఈ రోజులలో కల్లబొల్లిమాటలు చెప్పిన నమ్మెదరు. నీకు అట్టివారే మంచివారు. నేను నీకు చెడ్డదానిని. భగవంతుడు నన్ను వికారరూపముగా పుట్టించెను. అందువలన నేను పరులకు ఊడిగము చేసి బ్రతుకవలసి వచ్చెను. ఎవరు రాజైతేనేమి? నేను రాణినగుదునా? నా దాసీవృత్తి తొలగిపోవునా? నీకు అపకారము జరుగనున్నదని తలంచి అది చూడలేక ఒకటి రెండుమాటలు చెప్పితిని. అది నా పెద్ద పొరపాట. ఇక ఏమియు చెప్పను నన్ను క్షమించుము." చంచల బుద్ధిగల స్త్రీ యగుట వలన, దేవతల మాయకు వశమగుట వలన, మంధరయొక్క కపటముతో కూడిన ప్రియవాక్యములను కైకేయి విశ్వసించెను. మంధరను తన హితురాలుగా భావించెను. ఆమెయందు కైకేయికి విశ్వాసము కుదిరెను. భిల్లుర గానమునకు పరవశమైన జింకవలె కైకేయి మంధరను విశ్వసించి ఆదరముతో మాటిమాటికి అడుగుచుండెను. ఎట్టు జరుగనున్నదో అట్లు ఆమె బుద్ధి మారిపోయెను.



కైకేయి తనకు అనుకూలముగా నున్నదని తనపాచిక నెరవేరినదని గుర్తించి మంధర ఆనందించెను. ఆమె ఇట్లు చెప్పదొడగెను. "నీవు మరి మరి అడుగుచున్నావు. కానీ నేను చెప్పుటకు భయపడుచున్నాను. ఏలన మొదటనే నన్ను కయ్యములు కలుగచేసే దానివని అంటివి. కొంపలు కూల్చేదానివని నిందించితివి. నీ ముందు నోరు విప్పుటకే భయము కల్గుచున్నది. రాణీ! సీతారాములు నీకు ప్రాణమిత్రులంటివి. అదినేను కాదనను కాని అది పూర్వము. ఇప్పుడు ఆ రోజులు గడచిపోయినవి. సమయము దాటిన తరువాత మిత్రులు శత్రువులగుదురు. సూర్యుడు కమలములను వృద్ధిబొందించును. ఆ సూర్యుడే ఆ కమలములను మాడ్చివేయును. సవతి కౌసల్య నిన్ను కూకటివ్రేళ్ళతోసహా పెకలించి వేయవలెనని ప్రయత్నము చేయుచున్నది. నిన్ను నీవు రక్షించుకొమ్ము. నీ సంగతి నీవేమి పట్టించుకొనుటలేదు. మహారాజు నా వశములో నున్నాడని నీవు అనుకొనుచున్నావు. రాజు మనస్సులో మాట ఒకటి, నీకు చెప్పేది మరొకటి. నీది అమాయిక స్వభావము. రాముని తల్లి చాలా తెలివిగలది. నిబ్బరమైనది. సమయము చూచి తనపనిపూర్తిఅగుటకు రాజుకు చెప్పి భరతుని మేనమామ గారింటికి పంపించెను. మహారాజు రామునితల్లి సలహాతో ఇదంతయు చేయుచున్నాడు. నీచే ఆమె సేవ చేయించుకొనవలెనని తలంచుచున్నది. అదియునుగాక భరతుని తల్లి పతియొక్కగర్వముతో కులుకుచున్నదని ఆమెకు కంటకముగానున్నది. ఆమెహృదయము నీవు తెలుసుకొనలేవు. రాజు నిన్ను ఎక్కువగా ప్రేమించుచున్నాడని ఆమె సహించజాలక యున్నది. కాబట్టి ఆమె తెలివి తేటలతో రాజును వశపరచుకొని భరతుడులేని సమయముచూసి రామపట్టాభిషేకము తలపెట్టినది. రామపట్టాభిషేకము రఘుకులముయొక్క రీతియేకాని నీకు ముందు ముందు జరుగబోవు కష్టములు తలచుకొని మిగుల భయపడుచున్నాను. ఈ కార్యమును దైవము తలక్రిందులు చేయుగాక." అనిపలికి మంధర అనేకమంది సవతుల పోట్లాటలు, లేనిపోని కపట

వాక్యములు కల్పించి బహుభంగుల చెప్పి కైకేయికి ద్వేషము కలిగించెను. విధివశముచేత కైకకు మంధరపై మరింత నమ్మకము కలిగెను.

మంధర మరల ఇట్లు హెచ్చరించెను. "నీవు ఇంతవరకు తెలిసికొనలేదు. పశువులు కూడా మిత్రులెవరో, శత్రు లెవరో తెలుసుకొనును. పదునైదురోజులనుండి రాముని పట్టాభిషేకము ఏర్పాట్లు జరుగుచున్నవి. నీకేమైనా తెలియునా? నేను చెప్పేంతవరకు నీకు తెలియనే తెలియదు. నేను నీ వలన జీవించుచున్నాను. అందుచే పట్టాభిషేకము నావల్ల ఆగినా నాకు పాపములేదు. నేను లేనివి కల్పించి చెప్పినట్లయితే విధాతనన్ను శిక్షించుగాక! రేపు రాముని పట్టాభిషేకము జరిగినట్లయితే నీకు రేపటినుండి విపత్తులు ప్రారంభమగును. పాలలో పడిన ఈగను తీసి పారవేసినట్లు నిన్ను ఇంటినుండి పంపివేయుదురు నీవు నీపుత్రునితో పాటు నీసవతి కౌసల్యకు దాస్యము చేయుచున్నచో నిన్ను ఇంటిలోనుండ నిచ్చెదరు. కద్రువ వినతకు దుఃఖము కలిగించునట్లు కౌసల్య నీకు శోకము కల్గించును." భరతునికి కారాగారము తప్పదు.

మంధర మాటలువిని కైకేయి భయపడెను. నోటినుండి మాటరాక పోయెను. శరీరము చెమటపట్టెను. అరటి చెట్టువలె ఆమె వణికిపోసాగెను. ఆమెస్థితి చూచి మంధర యీమె హృదయగతి ఆగినేమోనని మిగుల భయపడెను.

మంధర అనేక విధములుగా చెప్పి కైకకు ధైర్యము కలిగించెను. కైకేయి భావము మారిపోయెను మంధరమీద ప్రేమయెక్కువ అయ్యెను. కొంగను హంసయనుకొని దానిని ప్రశంసించసాగెను. కైకేయి యిట్లనెను. "నీవు చెప్పే మాట నిజము. నాకు కుడికన్ను అదరుచున్నది. రాత్రిపూట నాకు చెడుకలలు వచ్చుచున్నవి. కాని అజ్ఞానమువల్ల నీకు నేను చెప్పలేదు. ఏమి చేయుదును. నాది సరళ స్వభావము అపకార ఉపకారములు ఎరుగను. నేను ఎరిగినంతవరకు ఎవరికి అపకారము చేసియుండలేదు. ఏ కారణము



వలన దైవము నాకు ఇట్టి దుఃఖము తెచ్చిపెట్టెను? అట్టిస్థితియే వచ్చెనేని మా పుట్టింటికైన వెళ్ళి జీవించెదను నా బొందిలో ప్రాణముండగా సవతికి దాస్యముచేయను. దైవము ఎవరిని శత్రువశమునపెట్టి జీవింపజేయునో అట్టివారు జీవించుటకంటే మరణించుట మేలు."

కైకేయి దీనవచనములు విని మంధర యిటుల మాట్లాడెను. "నీవు ఎంతమాత్రము దుఃఖపడవద్దు నీకు తప్పక మంచిరోజులు వచ్చును. నీకు చెడు తలపెట్టువారే చెడెదెరు. ఈ కుట్ర విన్నప్పటినుండి నాకు రాత్రి నిద్ర పట్టుటలేదు పగలు ఆకలివేయుటలేదు. నేను జ్యోతిషజ్ఞులను అడిగియుంటిని వారు రేఖలుగీచి గణితమువేసి భరతుడు తప్పక రాజగునని చెప్పియుండిరి. నీవు చేయదలచుకుంటే నేను ఉపాయము చెప్పెదను. రాజు నీకు అధీనుడే గదా" అని పలుకగా కైకేయి యిటులచెప్పెను. "మంధరా! నీవుచెప్పినచో నేను బావిలో దూకుటకైనను సిద్ధమే. పుత్రుని, పతినికూడా విడిచి పెట్టెదను నా దుఃఖమును చూచి నీవు నా మేలుకోరి చెప్పుచుండగా నేను అట్లుచేయకుండ ఎందుకుందును?"

కైకేయిని మంధర అన్నివిధాల తనకు స్వాధీసురాలుగా చేసుకొనెను. ఆ దాసి కైకేయిని బలిపశువుగాచేసి, కపటమనే కత్తిని తనకఠోర హృదయమనే రాతిపై పదునుపెట్టెను. తనకు రానున్న గావుసంగతి గమనించక పచ్చిగడ్డి తినగోరు బలిపశువువలె కైకేయి మంధర కుతంత్రమునకు పూర్తిగ లొంగిపోయెను.

మంధర మాటలు వినుటకు కోమలమైనవేగాని పరిణామములో భయంకరమైనవి. తేనెలో విషముకలిపి త్రాగించినట్లుండెను.

"అమ్మా, కైకమ్మా, నీకురాజు రెండువరములు ఇచ్చియున్నట్లు లోగడ నీవు నాతో చెప్పియుంటివి. జ్ఞాపకమున్నదా? ఇప్పుడా రెండువరములను కోరుకో, నీ హృదయ తాపమును చల్లార్చుకో నీ పుత్రుడైన భరతునకు రాజ్యాభిషేకము, రామునకు వనవాసము. ఈ రెండు వరములు కోరుకొని

నీ సవతి కౌసల్య పొందగోరిన ఆనందమును నీవే పొందుము రాజు రామునిమీద ఒట్టు పెట్టుకొన్నప్పుడు ఆ వరములు అడుగుము. అతడు తప్పించుకొనుటకు వీలుండదు. నేటిరాత్రి గడిచిపోయిన యెడల కార్యము భగ్నమైపోవును, కోపభవనమునకు వెళ్ళుము అన్నిపనులు బహు జాగ్రత్తగా చేయుము. రాజుగారి మాయమాటలలో పడకుము."

కైక తనప్రాణముతో సమానమైన ప్రియరాలుగా మంథరనుభావించి ఆమె బుద్ధిని విశేషముగా వర్ణించి యిటుల చెప్పెను. ప్రపంచములో నీతో సమానముగా నా హితము నభిలషించువారు మరొకరు ఉండరు. సఖీ! విధాత రేపు నా మనోభిలాషను పూర్తిచేసినట్లయితే నిన్ను నా కంటిలో పాపవలె చూచుకొనెదను" అనిచెప్పి కైకేయి కోపభవనములోనికి ప్రవేశించి పరుండెను.

రాజభవనములో, నగరములో, పట్టాభిషేక మహోత్సవ కార్యములు వైభవోపేతముగా జరుగుచుండెను. దానిని భంగపరచుటకు లోలోపల జరుగుచున్న కుట్ర యెవరికి తెలియును?

నగర స్త్రీ పురుషులు పట్టాభిషేకమును చూచుటకు అందముగా అలంకరించుకొని ఆనందముతో ఎదురుచూచు చుండిరి. రాజ ద్వారము వద్ద జనులు నిండియుండిరి. శ్రీరాముని బాల సఖులు పట్టాభిషేక వార్త విని సంతోషపడుచు కొంతమంది రాముని వద్దకు వచ్చిరి. వారి ప్రేమకు సంతోషించి రామచంద్రుడు వారిని ఆదరించి ఆప్యాయతతో అందరి క్షేమసమాచారములు అడిగి తెలుసుకొనెను. రాజాజ్ఞ పొంది ప్రియ సఖులు తమలో తాము రామచంద్రుని గొప్పతనమును చెప్పుకొనుచుండిరి. లోకములో శ్రీరామునివంటి ప్రేమాస్పదుడు ఇంకొకడు లేడు. మనము మరల కర్మవశాత్తు లోకములో ఎచ్చట జన్మించినను మనము సేవకులము గాను, సీతాపతి రామచంద్రుడు మనకు ప్రభువుగాను ఉండవలెను అని నగరములోని జనులు అభిలషించుచుండిరి.



కాని కైకేయి హృదయము మండిపోవుచుండెను. చెడును కోరినవారిలో చెడిపోని వారెవరు?

సంధ్యాసమయమున దశరథమహారాజు ఆనందముతో కైకేయి భవనమునకు వెళ్లెను. సాక్షాత్తు ప్రేమయే శరీరము దరించి నిష్ఠురత్వము వద్దకు వచ్చుచున్నదా యన్నట్లు ఉండెను. కోపభవనము పేరువిని మహారాజు భయపడెను. భయముచేత మహారాజు ముందడగు వేయలేకపోయెను స్వయముగా దేవరాజైన ఇంద్రుడు ఎవరి భుజబలము నాధారముగా రాక్షసులను జయించునో, లోకములోని రాజు లెల్లరు ఎవరి కనుసన్నలలో మెలగుచుండిరో అట్టి దశరథమహారాజు స్త్రీ కోపాగ్నికి భీతిల్లెను. కామదేవుని ప్రతాపము, మహిమ చూడండి! త్రిశూలము, వజ్రాయుధము, కత్తి దెబ్బలకును లెక్కచేయని మహారాజు కామదేవుని పుష్పబాణములకు లొంగిపోయెను.

మహారాజు భయపడుచు తన ప్రియమైన కైకేయి వద్దకు వెళ్ళి ఆమె దశను చూచి మిగుల దుఃఖించెను. కైకేయి నేలమీద పడియుండెను. పాతచీర ధరించెను. శరీరము పైగల భూషణము లన్నియు తీసివేసెను.

దుష్టురాలైన కైక వేషము ఎట్లున్నదనగా రాబోవు వైధవ్యమును సూచించుచుండెను.

మహారాజు ఆమెవద్దకు వెళ్లి యిట్లనెను.

"ఓ ప్రాణప్రియా! ఎందుకు కోపముతోనున్నావు? నీవు అలుగుటకు కారణమేమి? అని యనుచు ఆమెను చేతితో స్పృశించెను. కైక రాజు చేతిని తొలగించి పగబట్టిన నాగుపాము కోపముతో చూచినట్లు చూచుచుండెను. రెండువరములు సర్పముయొక్క రెండు నాలుకలు. మరియు రెండుకోరలు రెండు దంతములవలెనుండెను. కాటువేయుటకు మర్మస్థానము వెదకుచుండెను. విధివశముచేత మహారాజు ఏమియు చేయజాలక చింతిల్లుచుండెను.

ఇది అంతయు కామునిమాహాత్మ్యము. మహారాజు మరల మరల "ఓ ప్రాణసఖీ! గజగామినీ! నీ క్రోధమునకు కారణమేమి? ఎవరు నిన్ను నిందించిరి? వానికి రెండు తలలు మొలచెనా? లేక యమలోకము పోవుటకు సిద్ధముగా నున్నాడా? ఏ బీదవాడినై నను రాజుగా చేయుమందువా? లేక బంధువైన వానిని దేశమునుండి వెళ్ళగొట్టుమందువా? చెప్పుము. నిన్ను బాధించినవాడు దేవతయైనను వానిని తప్పక వధించెదను. ఇక మానవులు నాకు చీమలు, దోమల వంటివారు."

"ఓ ప్రియురాలా! నాసంగతి నీకు బాగుగా తెలియును. నా మనస్సు ఎల్లప్పుడు నీ ముఖచంద్రునివైపు చకోరమువలె చూచుచుండును. ఓ ప్రియ వదనా? నా ప్రజ, నా సంపత్తి, నా రాజ్యము, నా పుత్రులు కడకు నా ప్రాణము నా సర్వస్వము నీ అధీనము చేసెదను. నీవు నన్ను మోసగాడనని తలచే యెడల నూరు పర్యాయములు రామునిమీద ప్రమాణముచేసి చెప్పుచున్నాను. నామాట నమ్ముము. నీవు కోరిన వస్తువులను సంతోషముతో తెప్పించుకొమ్ము. చక్కగా అలంకరించుకొమ్ము. చెలీ, వెంటనే ఈ పాడు వేషమును మార్చుకొమ్ము. నేను చూడజాలకున్నాను" అని పల్కెను, ఆ వాక్యములు విని రామునిమీద ప్రమాణము చేసినందులకు మందబుద్ధిగల కైకేయి అమితానందము చెందెను రాజుగారు చెప్పినట్లు ఆమె చక్కగా అలంకరించుకొనెను. ఆమె కపటప్రేమను రాజు గ్రహించలేక తాను చెప్పినట్లు ఆమె చేయుచున్నదని తలంచి ఎంతయో మురిసిపోయెను.

ఓ నా ముద్దులరాణీ! నీ భావము నేను తెలుసుకొంటిని. నగరము లోని స్త్రీ పురుషులు యావన్మంది ఆనందములో ఓలలాడుచున్నారు. రేపు మన రామునకు యువరాజ పదవి ఈయనున్నాను కనుక నీవు చక్కగా అలంకరించుకొనుము అని మరల పల్కెను. ఈ వాక్యమలు వినగనే ఆమె కఠోరహృదయము భగ్గున మండిపోయెను.



దొంగవాని భార్య దుఃఖమును లోన దాచుకొన్నట్లు కైకేయి తన బాధను తెలియనీయకుండ పైకిమాత్రము ప్రేమతో చూచుచు నెమ్మదిగా నవ్వెను. పాపం మాహారాజు స్త్రీ మర్మమును తెలుసుకొనలేకపోయెను. స్త్రీ బుద్ధిని విధాతకూడా తెలుసుకొనలేదు.

కైకేయి కపటప్రేమను కనబరచుచు రాజుతో నిట్లనెను. "ప్రాణేశ్వరా! మీరెపుడును వరము లడుగుము. ఇచ్చెద"నని చెప్పుటయే కాని మీరు ఇచ్చినదిలేదు, నేను పుచ్చుకొన్నదిలేదు, పూర్వము ఒకప్పుడు నాకు మీరు రెండువరము లిచ్చియుంటిరి. అవియైనా ఇచ్చెదరా? లేక అవికూడ బూటకములేనా?" అది విని రాజు నవ్వుచూ ప్రేయసీ ఇప్పుడు నీ అసలు భావము గ్రహించితిని. దేవాసుర యుద్ధములో నీవు నాకు తోడ్పడినందుకు సంతోషముతో నీకు నేను రెండు వరము లిచ్చియుంటిని. నిజమే గుర్తున్నది. కానీ ఎపుడును నీవు వాటినిగూర్చి నన్ను అడుగలేదు. నా మతిమరుపు నీకు తెలియనిదిగాదు. నాకు అసత్యదోషము అంటగట్టవద్దు. ఆ రెండువరములకు బదులు ఇప్పుడు నాలుగు వరములు అడుగుము. ఇప్పుడే యిచ్చెదను. రఘువంశమువారు ప్రాణముపోయినను ఆడినమాట తప్పరు. ఆడినమాట తప్పినచో అంతకుమించిన మరొక పాపములేదు. కోట్లకొలది రాళ్ళముక్కలను కుప్ప కుప్పలుగా పోసినను పర్వతము కాజాలదు. సమస్త సుకృతములకు సత్యమే పునాది యని కదా పురాణములు చెప్పుచున్నవి. నాకు ప్రియమైన రామునిమీద ప్రతిజ్ఞచేసి చెప్పియుంటిని. రాముడు నా కత్యంతప్రియుడు" అని పలికెను, "ఓ ప్రాణనాథా! ఇప్పుడు ఆ రెండు వరములు అడుగుచున్నాను వినండి భరతునకు రాజ్యాభిషేకము మొదటి వరము, రెండవవరము చేతులుజోడించి అడుగుచున్నాను. రాజ్యమునందు విరక్తుడై మునివేషముదాల్చి రాముడు పదునాలుగు వత్సరములు అరణ్యములో నివసించవలెను."

చంద్రకిరణముల స్పర్శ సోకగానే చక్రవాకపక్షులు వికలమగునట్లు ఆ కైకేయి మాటలు వినగానే మహారాజు హృదయము వికలమయ్యెను. నోటమాట రాకపోయెను. డేగ పిట్టను పట్టినట్లు అయ్యెను. పిడుగు పడగానే తాటిచెట్టు కూలిపోయినట్లు రాజు మిగుల కుమిలిపోయెను.

కన్నులు మూసుకొని తలమీద చేతులు పెట్టుకొని యిట్లు ఆలోచింపసాగెను, "నా మనోరథము నేటితో ముగిసిపోయెను. ఫలములతో శోభిల్లు వృక్షమును ఏనుగు సమూలముగా పెకలించివేసినట్లు కైకేయి అయోధ్యను నాశనముచేసెను. విపత్తు తెచ్చిపెట్టెను; స్త్రీని నమ్మి నేను మోసపోతిని" ఈ విధముగా తనలో తాను తలంచుకొనుచు మహారాజు కుమిలిపోవుచుండెను.

అదిచూచి కఠినురాలైన కైకేయి కోపముతో నిట్లనెను. రాజా! భరతుడు మీకు పుత్రుడుకాడా? రాముడొక్కడేనా మీకు పుత్రుడు? నేను మీ ధర్మపత్నిని కానా? నన్ను మీరు ఖరీదుకుకొని తెచ్చుకొన్నారా? నా వాక్యములు మీకు బాణములవలె గ్రుచ్చుకొనుచున్నవా? జవాబు చెప్పరేమి? ఇస్తే యివ్వండి లేకపోతే లేదని చెప్పండి. రఘువంశమువారు ప్రతిజ్ఞా పాలకులుగా ప్రసిద్ధి పొందినట్లు ఇప్పుడేగదా మీరు చెప్పియున్నారు. మీరే వరములిచ్చెదనని పలికియుండిరి. పొరపాటు పడితినని చెప్పండి. ఆడినమాట తప్పండి. లోకములో అపకీర్తి పొందండి. సత్యమును గొప్పగా ప్రశంసించుచు వరములిచ్చియుంటిరి. పిల్లలకు సెనగపప్పులు చేతులలోపెట్టి బుజ్జగించినట్లు నన్ను బుజ్జగించి నా మనస్సు మార్చవలెననుకొంటిరా? అది అంత తేలికకాదు. శిబి, దధీచి, బలి మున్నగు చక్రవర్తులు ప్రతిజ్ఞాబద్ధులై శరీరమును, ధనమును గడ్డిపోచవలె వదలి సత్కీర్తిని పొందిరి."

కైకేయి కఠినముగా పలికిన పైమాటలు అగ్నిమీద ఆజ్యముపోసి నట్లయ్యెను.

ధర్మధురంధరుడైన మహారాజు ధైర్యముతో కన్నులు తెరచి తలమెత్తుకొనుచు దీర్ఘముగా శ్వాసవిడచుచు ఈ కఠిన పరిస్థితులనుండి



బయటపడుట బహు కష్టము అని తలంచుచుండెను. ఒరనుంచి తీసిన పదునయిన కత్తివలె కైక మండిపోవుచు కనపడుచుండెను. రాజు ఈ కత్తి భయంకరమైనదేయని గ్రహించెను. "అది నా ప్రాణముతీయునా?" యని యనుకొని తన కోపమును తగ్గించుకొని వినయముతో ప్రేమగా నిట్లుపల్కెను. "కైకా! కఠినముగా చెడ్డమాటలు ఎందుకు పల్కుచున్నావు? నాకు భరతుడు రాముడు రెండు నేత్రములవంటివారు. ఈశ్వరసాక్షిగా చెప్పుచున్నాను. నేను రేపు ఉదయమే దూతలను పంపి భరత శత్రుఘ్నులను పిలిపించి శుభ ముహూర్తమున భరతునకు రాజ్యాభిషేకము చేసెదను. రామునికి రాజ్యకాంక్షలేదు. వానికి భరతునిమీద మిక్కిలి ప్రేమ. నేనే "పెద్దా చిన్నా" ఆలోచించి రాజనీతి ననుసరించి రామునికి పట్టాభిషేకమును చేయవలెనని తలపెట్టితిని. నేను రామునిమీద నూరుసారులు ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. రామునితల్లి యీ విషయములో ఎప్పుడును ఏమియును నాకు చెప్పలేదు. నేను నిన్ను కూడ అడుగకుండచేసితిని. అందువలన నా మనోరథము విఫలమైనది. ఇప్పుడైన కోపమువదలి చక్కగా అలంకరించుకొని ఆనందముగా ఉండుము. కొద్ది దినములలో భరతుని రాజుగా చేసెదను. రెండవ వరము నాకు దుస్సహమైన దుఃఖము కల్గించుచున్నది. అది వినగానే నా హృదయము మండిపోవుచున్నది. నిజముచెప్పుము. రాముడు మంచివాడని అందరు చెప్పుచున్నారు. నీవే స్వయముగ రాముని ప్రశంసించియుంటివి. నాకంటె ఎక్కువగా నీవు వానిని ప్రేమించియుంటివి. నీ ప్రేమంతా బూటకమేనా యని సందేహము కల్గుచున్నది. శత్రువులకుకూడ అపకారము చేయనివాడు తల్లికి ప్రతికూలముగ నడచునా? బాగా ఆలోచించి రెండో వరము అడుగుము. భరతుని రాజ్యాభిషేకమయిన చూచెదను. నీరులేనిదే చేపలు జీవించవచ్చుగాక, మణిలేనిదే సర్పము సుఖించిన సుఖించుగాక, ఉన్నది ఉన్నట్లు చెప్పుచున్నాను. రాముడులేకుండా నిమిషముకూడ నేను జీవించియుండలేను. నా జీవితము రామునితో ముడిపడియున్నది."

దశరథుని దీన వాక్కులువిని దుష్టబుద్ధిగల కైకేయి అగ్నిలో ఆజ్యము పోసినట్లు భగ్గున మండిపోయెను. కైకేయి యిట్లనెను. "మీరు ఎన్ని చెప్పినను నేను వినను, వినను. ఇక మీ మాయకు నేను లోబడను, నేను ఏది అడిగితినో అది ఇవ్వండి. లేకపోతె లేదనండి. అపకీర్తి పొందండి. ఇక మీ మోసములోపడను. రాముడు సాధువే, తమరు సాధువులు, బుద్ధిమంతులు, రామునితల్లి మంచిదే. నేను అందరినీ ఎరుగుదును. కౌసల్య నాకు ఎట్లుచేసెనో నేను ఆమెకు అట్లుచేసెదను. రేపు ఉదయము కాగానే రాముడు మునివేషము ధరించి వనమునకు వెళ్ళనట్లయితే ఓ రాజా నాకు మరణము మీకు అపఖ్యాతి తప్పవు" అని కుటిలురాలైన కైకేయి పలికెను.

ఆమె క్రోధమునకు క్రొత్తపొంగు వచ్చినట్లుండెను. ఆ జలధార పాపమనే పర్వతములనుండి ప్రవహించెను. వరములనే తీర్థద్వయమును రాచుకొని విపదంబుధివైపు వేగవతియై ప్రవహించెను.

రెండువరములు నదికి రెండువైపుల ఒడ్డులు. కైకేయి హఠమే దాని తీవ్ర ప్రవాహము. మంధర వాక్యములే సుడిగుండములు. దశరథుడనే వృక్షమును వ్రేళ్ళతోసహ విపత్తియను సముద్రములోనికి తీసుకొని వెళ్ళుచుండెను. మహారాజు నిశ్చయముగా స్త్రీ వలన తనకు మరణము ఉన్నదని తెలుసుకొనెను. అప్పుడు కైక పాదములు పట్టుకొనికూర్చుండ బెట్టుకొని వినయముగా విన్నవించెను. కావలెనంటే "నా శిరస్సు అడుగు. వెంటనే యిచ్చెదను, కాని రాముని యెడబాటుతో నన్ను మరణించునట్లు చేయకుము. ఏ విధముగనైన రాముని నావద్ద నుంచుము. అట్లు ఉంచనట్లైతే నీవు తప్పక నశించెదవు." అని దూషించి యీరోగ మసాధ్యమని తలంచి "రామరామ" యనుచు, తల కొట్టుకొనుచు నేలపైనపడెను. మహారాజు వ్యాకులపడుచుండెను. ఆయన శరీరము శిథిలమయ్యెను. ఏనుగు కల్పవృక్షమును పీకివేసినట్లుండెను. కంఠము ఎండిపోయెను. నోటమాట రాకపోయెను. నీరులేక చేప తడబడినట్లుండెను.



కైకేయి తిరిగి యిట్టి కఠిన వాక్కులు పల్కెను. "గాయముపైన ఉప్పు రాచినట్లు చివరకు ఇట్లు మాట్లాడుచున్నారు. తమరు "అడుగు అడుగు" మని ఏ బలము చూచుకొని చెప్పినారు. ఓ రాజా! నవ్వులు బుగ్గలు పూరించుట ఒకేసమయమున జరుగునా? దాతృత్వము, అది లేదనుట ఒకే పరి సాధ్యమా? రాజధర్మములు వట్టివగునా? సత్యసంధులకు ఐశ్వర్యము, ప్రాణము, తృణ సమానములు. ఆడుదానివలె ఏడ్చెదరేమి? ధైర్యము అవలంబించుట తగును. సమాధానము చెప్పుడు."

మనస్సును గాయపరచు కైకేయి మాటలువిని రాజు ఇటులనెను. "నీవు ఏమి చేయదలచినావో అదిచేయుము. నీదిగాదు తప్పు అంతయునాదే. నాపాపమే నాకు పిశాచమైపట్టి అట్లు పలికించుచున్నది. భరతుడు పొరపాటునకూడా రాజపదవికోరడు. విధివశముచేత నీకే యీ బుద్ధి పుట్టినది. నా పాపఫలితము చెడుసమయమున విధాత యిట్లు విపరీతముచేసెను. నీవే తప్పక నశించెదవు. ఈ సుందర అయోధ్య తిరిగి సిరిపంపదలతో తులతూగును. గుణనిధియైన రామచంద్రుని గొప్పతనము లోకములో మరింత ప్రసిద్ధిచెందును. సోదరులు వానికి ప్రేమతో సేవలు చేయుదురు. ముల్లోకముల వారు శ్రీరాముని గొప్పతనము కీర్తించెదరు. కేవలము నీకు కళంకము నాకు పశ్చాత్తాపము మనము పోయిన తర్వాతకూడా పోదు. కనుక నీవు ఏది మంచిదనుకొనెదవో అది చేయుము. నా ఎదుట నుండకుము. ఇక నీ ముఖము నాకు చూపించకుము. చేతులు ముకుళించి మరి మరి వేడుచున్నాను. నేను జీవించి యున్నంతవరకు నాదగ్గరగారాకు. నాతో మాట్లాడకు ఓ దౌర్భాగ్యురాలా! నీవు అంతమున అమితముగా పశ్చాత్తాపపడెదవు. వరముకొరకు నా ఆత్మను శరీరమును గాయపరచితివి."

మహారాజు అనేక విధములుగా చెప్పి "ఎందుకు ఇట్లు సర్వనాశన మయ్యెదవు" అనుచు లేచి భూమిమీద తటాలున పడిపోయెను. కపటురాలైన కైకేయి మెదలకుండా చూచుచుండెను. రాజు "రామ! రామ!" యని

తలంచుచు ఇట్లు వ్యాకులపడుచుండెను. రెక్కలు తెగిన పక్షి ఆరాటపడుచున్నట్లు బాధపడుచుండెను. తన హృదయములో నిట్లు తలపోయుచుండెను. "ఈ దినము తెల్లవారకుండుగాక! ఎవరును వెళ్లి రామునికి ఈ వార్త చెప్పకుందురుగాక! రఘుకుల మూలపురుషుడైన సూర్యుడు ఉదయించకుండుగాక!" రాజు ప్రీతి, కైకేయి కఠినత్వమురెండును విధాత సృష్టించినవే. ఇట్లు విలాపము చేయుచుచుండగనే తెల్లవారెను.

శ్రీరామచంద్రుని పట్టాభిషేకము చూడవలెననే కుతూహలముతో ఆ రాత్రి ఎవ్వరును నిద్రించలేదు. రాజభవనమువద్ద మంత్రులు, సేవకులు మహాజనులు నిండియుండిరి. సూర్యుడు ఉదయించుట చూచి అందరును ఇట్లు చెప్పుకొనుచుండిరి. "ఏ కారణమువలన దశరథమహారాజు ఇంత వరకు లేవనెలేదు. నిత్యము తెల్లవారకముందే లేచువాడు" అని ఆశ్చర్యపడుచుండిరి. మహామంత్రియైన సుమంత్రునితో అందరు ఇట్లనిరి. "సుమంత్రా! నీవు వెళ్ళి రాజును మేల్కొలుపుము. వారి ఆజ్ఞపొంది అన్ని పనులు చేయుము."

అంత సుమంత్రుడు రాజమహలులోనికి వెళ్ళెను. కాని చూచుటకు మహలంతా భయంకరముగా కనిపించుచుండెను. విపత్తి, విషాదముకూడి ఉన్నదా యన్నట్లుండెను. మంత్రి లోనికి వెళ్లుచు కేక వేసిననుకూడా జవాబులేదు. కాని ధైర్యముతో లోనికి వెళ్ళగా అచ్చట మహారాజు కైకేయి ఉండిరి. రాజుకు జయముపల్కి మంత్రి నమస్కరించెను. మహారాజు ఎక్కువగా తపనపడుచుండెను. నేలమీద పరుండెను. పెల్లగించిన కమలవనమువలె వాడిపోయియుండెను. మంత్రి భయముచేత అడుగజాలకుండెను. అశుభముతోనిండి శోభాహీనురాలైన కైకేయి యిట్లనెను.

"రాత్రి అంతా మహారాజుకు నిద్రలేదు. ఆ కారణము జగదీశ్వరునికే తెలియవలెను. "రామ రామ" యనుచు తెల్లవారులు ఉచ్చరించుచున్నాడు.



కారణమేమో ఎవరికి చెప్పలేదు. నీవువెళ్ళి ఆ రాముని పిలుచుకొనిరమ్ము. అతడు అడిగిన చెప్పునేమో" యని పలికెను. మంత్రి రాముని పిలిచి రాజు ఏమి చెప్పునో యని తనలో ఆలోచించుచు వెలుపలకువచ్చెను. మంత్రి ఉదాసీనతనుచూచి జనులు అందుకు కారణ మడిగిరి. వారందరిని సమాధాన పరచుచు సుమంత్రుడు రామునివద్దకు వెళ్లెను. రామచంద్రుడు మంత్రిని తన తండ్రితో సమానుడని తలంచి ఆదరించెను. అతడు మహారాజు ఆజ్ఞను రామచంద్రునితో చెప్పెను.

శ్రీరాముడు సామాన్యదుస్తులతోనే సుమంత్రునివెంట బయలుదేరెను. వారినిచూచి జనులు ఆలోచింపసాగిరి. రఘుకుల శిరోమణి శ్రీరాముడు అంతఃపురములోనికి వెళ్ళి నేలమీదపడియున్న మహారాజు అవస్థనుచూచెను. సింహమునుచూచి ముసలి గజరాజు సహింపజాలక పడికొట్టుకొనుచున్నట్లు కైకచెంత మహారాజు పడియుండెను. రాజు పెదవులు ఎండిపోయెను. శరీరమంతయు మండిపోవుచుండెను. మణిని పోగొట్టుకొనిన సర్పమువలె ఆయన దుఃఖించుచుండెను. కోపముతో దగ్గర నిలిచియున్న కైకను చూచెను. ఆమె ఎట్లున్నదనగా మహారాజును తీసుకొనివెళ్ళుటకు మృత్యువు గడియలు లెక్కబెట్టుచు నిలబడియున్నదా అన్నట్లుండెను.

రామచంద్రుని స్వభావము కోమలమైనది. కరుణామయమైనది. ఆయన తన జీవితములో దుఃఖముచూచుట యిది మొదటిసారి అంతయు చూచి ధైర్యముపొంది చల్లని వాక్యములతో తల్లి కైకేయిని అడిగెను. "అమ్మా! తండ్రిగారు దుఃఖపడుటకు కారణమేమిటమ్మా! చెప్పుము. నాచేతనైనంతవరకు తండ్రిగారి విచారమును దూరము చేయుదును." రాముని మాటలకు కైక బదులుచెప్పెను. "ఓ రామా! దుఃఖపడుటకు గల కారణము లన్నింటిలోను ముఖ్యమైన కారణము మహారాజుకు నీ మీద మిక్కిలి ప్రేమయుండుట. పూర్వము వారు నాకు రెండువరములు ఇచ్చియుండిరి. ఇపుడు నాకు ఏవిమంచివో అవినేను కోరితిని. అది విని

రాజు ఆలోచించుచున్నాడు. నీ మీద ప్రేమ వదలలేక యిటు పుత్రప్రేమ అటుప్రతిజ్ఞాపాలన, ఏమి చేయవలెనా అని మహారాజు సంకటములో పడియున్నాడు. రాజాజ్ఞను నీవు శిరసావహించినట్లయితే యీ కఠినసమస్య తేలికగా పరిష్కారమగును" అని కైక నిర్భయముగా కఠినమైన మాటలు చెప్పెను. అది వినినయెడల కఠోరముగూడ మరింత కఠోరమగును. అంతయు గ్రహించి శ్రీరామచంద్రుడు సంతోషించి వినయముగా నిటులనెను. ''అమ్మా! తల్లిదండ్రులను సంతృప్తిపరచు పుత్రుడే అదృష్టవంతుడు. కాని అట్టివారు చాలా దుర్లభముగా నుందురు. వనమునకు వెళ్ళిన మునుల సాంగత్యము కలుగును. అన్ని విధముల మేలుచేకూరును. అందులో నా తండ్రిగారి ఆజ్ఞ, మీ సమ్మతి, ప్రాణప్రియుడైన భరతుడు రాజగును. అన్ని విధముల విధాత నాకు అనుకూలము చేసెను. ఈ స్వల్పకార్యమును నేను చేయలేనిచో మూర్ఖులలో మొదటివానిగా నన్ను పరిగణించవలెను."

కల్పవృక్షమును వదలి రేగుచెట్టు నాశ్రయించినట్లు, అమృతమును విడిచి విషమును పొందగోరినట్లగును తల్లీ! మహామూర్ఖుడు కూడా ఇట్టి సదవకాశము విడిచిపెట్టడు. కాని యీ స్వల్పకారణము కొరకు ధైర్యధురంధరుడైన మా తండ్రి యింత వేదనపడునా? నాకు నమ్మకము లేకున్నది: నిజము చెప్పుము. తెలియకుండా వారికి నేను ఏమైనా అపరాధము చేసితి నేమో! అది నాకు చెప్పలేక తండ్రిగారు బాధపడుచున్నారని నేను తలంచుచున్నాను" అని చెప్పగా కైక రాముని సరళవాక్యములను తనకు అనుకూలముగా భావించుకొనెను.

రాముని భావమునకు కైక సంతోషించి కపటప్రేమ కనబరచుచు నిటులనెను, "నాయనా! రామా! ఒట్టుపెట్టి చెప్పుచున్నాను. మహారాజు దుఃఖపడుటకు ఏ కారణము లేదు. నీవు ఎవరికి అపకారము చేయువాడవుకావు. అట్టి నీవు తల్లిదండ్రులకు దుఃఖముకల్గించెదవా? నిన్ను



నేను వనమునకు పంపుటకు బాధపడుచున్నాను. వృద్ధాప్యములో పొరపాటు చేసి అపయశము పొందవద్దని గట్టిగా మీ తండ్రిగారికి చెప్పుము."

శ్రీరామచంద్రునికి కైక చెప్పినమాటలు ప్రీతిగానుండెను. రాజు రామస్మరణచేయుచు ప్రక్కకు మరలెను. రామచంద్రుడు వచ్చెనని సుమంత్రుడు చెప్పెను. అదివిని రాజు నెమ్మదిగా కనులు తెరచెను. మంత్రి రాజును కూర్చుండబెట్టెను. రాముడు తండ్రి పాదములకు నమస్కరించుట చూచి ప్రేమతో విహ్వలుడై రాముని తదేకదృష్టితో చూచుచు హృదయమునకు హత్తుకొనెను. సర్పము పోయిన తన మణిని గాంచినట్లు రాజురామచంద్రుని చూచుచు ప్రేమాశ్రువులు కార్చుచుండెను. అమిత దుఃఖమువలన రాజుకు నోటమాట రాకపోయెను.

మరల మరల రాముని కౌగిలించుకొనుచు రాజుమనస్సులో రాముడు వనమునకు వెళ్ళకుండునట్లు చేయుమని బ్రహ్మను ప్రార్థించుచుండెను. లోకములో నా కెంతైన అపయశము రానీ! పాపమువల్ల నరకము ప్రాప్తించనీ! పూర్వము నేను చేసిన పుణ్యమంతా గంగలో కలిసిపోనీ! ఎంత దుఃఖమైనా అనుభవించెదను కాని రాముని నా ఎదుట నుండి పంపలేను" అవి మనస్సులో పరిపరి విధముల తలచి వేదన పడుచుండెను.

రాముడు తండ్రిగారి పుత్రమోహమును చూచి కాలానుసారముగా ఆలోచించి యిట్లనెను. "నేను మీకు చెప్పుచున్నందుకు బాలుడనని తలచి క్షమించండి. ఇంతటి చిన్నకారణమునకు మీరు ఇంత బాధపడుట ఎందుకు? మొట్ట మొదటనే యీ కథ యంతయు చెప్పినట్లయితే మీరు ఇంత బాధపడకయుందురు. తల్లిని అడుగగా ఆమె అంతయు నాకుచెప్పెను. తండ్రిగారూ! అంతా వింటిని. శుభసమయమున ఇతర ఆలోచనలు విడిచిపెట్టండి. సంతోషముతో నిండిన హృదయముతో నాకు ఆజ్ఞ యివ్వండి." యని చెప్పుచు రాముడు తిరిగి యిట్లనెను. "ఎవరి చరిత్రవిని తల్లితండ్రులు సంతసించెదరో వానిజన్మ ధన్యమైనది. వానికి ధర్మార్థ

కామమోక్షములు కలుగును. తమ ఆజ్ఞను పాటించి జన్మసార్థకము చేసికొనెను. వెంటనే తిరిగి వచ్చెదను. దయతో ఆజ్ఞ యివ్వండి. తల్లిగారి సెలవు తీసికొనివచ్చి మీపాద దర్శనము చేసికొని వనమునకు వెళ్ళెదను" అని విన్నవించి అచటనుండి శ్రీరాముడు వెళ్ళిపోయెను.

మహారాజు దుఃఖముతో ఏమియును మాటాడలేదు. తేలుకుట్టిన విషము శరీరమంతయు వ్యాపించినట్లు ఈ విషయము నగరమంతట వ్యాపించెను. అడవిలో దావానలము చుట్టుముట్టగనే అచటనున్న వృక్షములు మొదలగునవి మాడిపోయినట్లు నగరములోని స్త్రీ పురుషులు మిగుల దుః ఖించిరి. ఎవరిలోను ధైర్యము లేదు.

అందరి మనస్సులు చింతాక్రాంతము లయ్యెను. దుఃఖము పట్టలేక అందరు కన్నీరు విడుచుచుండిరి." అంతయును సవ్యముగానే జరిగిపోయెను. ఇప్పుడు విధాత విపరీతము చేసెను." అని యనుకొనుచు ప్రజలు కైకేయిని దూషించుచుండిరి. ఈ పాపాత్మురాలికి ఏమిరోగము వచ్చెను? అన్ని యిండ్లకు అగ్ని ముట్టించినది. తన కన్నులను తన వ్రేలితోనే పొడుచుకున్నది. ఇక లోకమును ఎట్లు చూడగలదు? అమృతమును పరిత్యజించి విషమును రుచిచూచినది. రఘువంశమనే వనమునకు కారుచిచ్చువలె దాపురించినది. కొమ్మమీద కూర్చుని చెట్టుమొదలు నరకినట్లు సుఖములో నున్న వారికి దుఃఖము కలుగచేసెను. శ్రీరామచంద్రుని తన ప్రాణముతో సమానముగా ప్రేమించునది. ఏ కారణమున ఇంతటి కుట్రపన్నెను."

కొందరు ఈ విధముగా తలంచిరి. "స్త్రీ హృదయము సముద్రమువలె అగాధమయినది, దానిని ఎవరును తెలిసికొనజాలరు. తన ఛాయ పట్టుకొనవచ్చును, కాని స్త్రీ హృదయము తెలిసికొనజాలరు. నిప్పు పట్టుకొన్న ఎవరిచేయి కాలదు? సముద్రములో ఏమియిముడదు? లోకములో కాలుడు ఎవరిని మ్రింగడు? విధాత ఏమిచెప్పెను? ఏమిచేసెను? ఇక ఏమి చేయనున్నాడో కదా? రాజుచేసిన పని ఏ మాత్రము బాగాలేదు. దుష్టురాలైన



కైకేయికి వరములిచ్చుట మొదటితప్పు, ఈమె పట్టుదలయే దుఃఖములకు కారణమైనది. స్త్రీకి లొంగిపోయి నందుననే రాజుకు జ్ఞానమునశించెను. రాజధర్మము, మర్యాద యెరిగిన వాడైనను ఈ దుష్కార్యము చేయక తప్పలేదు." మరికొందరు శిబి దధీచి హరిశ్చంద్రుల కథలు, ఒకరికొకరు చెప్పుకొనుచుండిరి. ఇందులో ఏమైనా భరతుని జోక్యమున్నదా? అనుకొనుచుండిరి. "అట్లు పలుకకు, నీవుచేసిన పుణ్యమంతా నశించును. భరతుడు రామునికి ప్రాణముతో సమానము. చంద్రుడు చల్లని కిరణములను వదలి అగ్ని కిరణములు దాల్చిన దాల్చవచ్చునుగాక! అమృతము విషముగా మారిన మారుగాక! భరతుడు స్వప్నములో కూడ రామునికి విరుద్ధముగా వ్యవహరించడు. కొందరు ఇదంతయును విధాత దోషముగా భావించిరి. నగరమంతయు నిట్లు అల్లకల్లోలముగా నుండెను, దుస్సహమైన దుఃఖముచే జనులు బాధపడుచుండిరి. బ్రాహ్మణస్త్రీలు కులములో పెద్దలు కైకేయికి మిత్రులు పదిమంది కలిసివచ్చి ఆమెను ప్రశంసించుచు నిట్లనిరి. "అమ్మా! నీవు ఎప్పుడును భరతునికన్న రామచంద్రుడే మంచివాడని చెప్పుచుంటివి, ఏ కారణముచేత రామచంద్రుని వనమునకు పంపుచున్నావు? మీకు ఎప్పుడును సవతుల పోట్లాటలుకూడా లేవు. కౌసల్య నీకు ఏమి కీడుచేసినది? ఇప్పుడు నగరమంతకు నిప్పుపెట్టితివి. రామచంద్రుడు వనమునకు వెళ్ళినట్లయితే సీతాదేవి రామునివిడిచి యింటివద్ద ఉండగలదా? లక్ష్మణుడు రామచంద్రుని వదలి ఉండగలడా? భరతుడు రామునిగాదని రాజ్యముచేయునా? మహారాజు జీవించునా? అయోధ్య అంతయును సర్వనాశనము కాకుండునా! అమ్మా! నీవు కోపము విడిచి ఆలోచించుకో! కళంకము తెచ్చుకొనకుము. భరతుని యువరాజుగా చేసికొనుటలో తప్పులేదు. కాని రామచంద్రుని వనములకు పంపుట ఏమిధర్మము? రామచంద్రుడు రాజ్యకాంక్ష లేనివాడు. ధర్మమూర్తి, విషయవాంఛలు లేనివాడు, నీకేమైన అనుమానమున్నయెడల రాముని గురువుగారి యింటిలో ఉండుటకు వరము కోరుకొనుము. నీవెందుకు అల్లరిపడెదవు? పొరపాటు

తెలిసికొనుము. నేను ఎగతాళికి అడిగి యుంటినని చెప్పి వనమునకు వెళ్ళుచున్న రామచంద్రుని వెనుకకు తీసికొనిరమ్ము. రామునివంటి ఉత్తమపుత్రుడు, వనమునకు పంపుటకు తగినవాడా? లెమ్ము! నీకు, నగరమునకు, కళంకమురాని, ఉపాయమును ఆలోచించి, కులమును రక్షించుము; వనమునకు వెళ్ళనున్న శ్రీరాముని బలవంతముగానైనను నిలుపుచేయుము. సూర్యుడులేని పగలు, ప్రాణములేని శరీరము, చంద్రుడులేని రాత్రి, ఎట్లు నిర్జీవమో, శోభావిహీనమో, రాముడులేని అయోధ్యకూడా అట్లేయగును. నీ వీ విషయమును చక్కగా గుర్తింపుము.”

పెద్దలు చెప్పిన మాటలు మధురముగా ఉండుటయేగాక క్షేమముగా కూడనుండును. కాని కుటిలమంధర బోధనలు నెత్తికెక్కుటవలన కైకేయికి వారి మాటలు రుచించలేదు. ఆమె ఎట్టి ప్రత్యుత్తరము నీయక ఆకలిగొన్న పులిచూచినట్లు క్రోధముతో వారిని చూచెను. అంతట ఆ పెద్దలు భయపడి, “యీమె దౌర్భాగ్యురాలు. ఏమిచెప్పిన మనమాట వినదు, ఈమె రోగము అసాధ్యమయినది” అని చెప్పుకొనుచు వెళ్ళిపోయిరి. నగరములోని వారందరు దుఃఖములో మునిగియుండిరి.

శ్రీరామచంద్రుడు తల్లికౌసల్య వద్దకు ప్రసన్న చిత్తముతో ఉత్సాహముగా వచ్చెను. “ఇక మహారాజు నన్నుండుమని పట్టుపట్టడుగదా” అని లోలోపల ఆనందించెను.

రాముడు పట్టాభిషేకముయొక్క వార్తవిని సోదరులందరిని వదలి పెద్దవాడైన తనకు పట్టాభిషేకము చేయుచున్నందుకు చింతించుచుండెను. ఇప్పుడు కైకేయి ఆజ్ఞ తండ్రిగారు మౌనముగా నుండి సమ్మతించుటవలన రామునికి విచారము తొలగిపోయెను. రఘుకుల శిరోమణి శ్రీరాముడు తల్లికి నమస్కరింపగా ఆమె ఆశీర్వదించి కౌగిట చేర్చుకొని మాటిమాటికి రాముని ముఖమును ముద్దుపెట్టుకొనుచు ప్రేమాశ్రువులు రాల్చుచుండెను.



కౌసల్య రాముని ఒడిలో కూర్చుండ బెట్టుకొనెను. మరల హృదయమునకు హత్తుకొని ఉప్పొంగిపోయెను. కన్నతల్లికి కుమారునిపైగల ప్రేమ ఆమె పొందే ఆనందము ఇంతింతని చెప్పజాలము. పేదవానికి కుబేరపదవి లభించినట్లు ఆమె మిగుల ఆనందపడుచుండెను. ఆమె శ్రీరామునితో “నాయనా! మంగళకరమైన శుభముహూర్తము ఎప్పుడు? నా పుణ్య విశేషమువలన నీవు నాకు పుత్రుడుగా జన్మించితివి. నా జన్మ సార్థకమయ్యెను. ప్రజలు ఆబాలగోపాలము నీ పట్టాభిషేక మహోత్సవము కన్నుల పండువుగా తిలకించుటకు తొందర పుడుచున్నారు. వెంటనే స్నానము చేయుము. నీ కిష్టమైన మిఠాయిలు తినుము. త్వరగా వారివద్దకు వెళ్ళుము. చాలా ఆలస్యమగును.” అని పలికెను. తల్లి వాత్సల్యముతో అనురాగముతో పలికినను రఘురాముని మనస్సు రాజ్యలక్ష్మిమీద భ్రమపడలేదు.

ధర్మధురంధరుడైన శ్రీరామచంద్రుడు తల్లితోనిట్లనెను. “అమ్మా! తండ్రిగారు నాకు వనరాజ్యము ఇచ్చియున్నారు. అచ్చట నేను గొప్పగొప్ప పనులు చేయవలసియున్నది. కాన అక్కడికి వెళ్ళుమని చెప్పిరి. నీవు ఆనందముతో ఆశీర్వదించి నాకు అనుజ్ఞయిమ్ము. అట్లయిన నా వనయాత్ర ఆనందముగా గడచును. పదునాలుగు సంవత్సరములు వనములో గడపి తండ్రిగారి ఆజ్ఞను పాటించి తిరిగివచ్చి నిన్ను దర్శించుకొనెదను. మనస్సులో ఏమి దుఃఖపడవద్దు.”

శ్రీరాముని నమ్రతతో కూడిన పైవాక్యములు తల్లి కౌసల్యాదేవి హృదయమునకు ములుకులవలె తగిలెను. ఆమె మిక్కిలి దుఃఖితురాలయ్యెను. సింహగర్జన వినిన లేడి భయము చెందినట్లు కౌసల్యాదేవి వైకల్యము చెందెను. భయముతో గడగడ వణకసాగెను. తదుపరి సంబాళించుకొని గద్గద స్వరముతో నిట్లనెను. “నీవు తండ్రిగారి ప్రాణసమానుడవు, ప్రియుడవు, నీ రూపలావణ్యమును చూచి ఆనందించుచు

వారు రాజ్యము నిచ్చెదనని చెప్పి శుభలగ్నము నేర్పాటుచేసిరి. ఏ యపరాధము వలన నిన్ను ఇప్పుడు వనమునకు పంపుచున్నారు? ఇక నేనేమి చేయుదును."

శ్రీరాముని భావము గ్రహించిన మంత్రి జరిగిన కథంతా కౌసల్యాదేవికి విపులముగా చెప్పెను. అది విని కౌసల్య మూగదానివలె మాటాడ లేకపోయెను. ఆ అవస్థను వర్ణింపజాలము. ఆమె యుండుమనుటకు, లేక వనమునకు వెళ్ళుమనుటకు నోరురాక ఏమీచెప్పలేని స్థితిలో ఉండెను. "విధాత కృత్యములు ఎప్పుడును ఎల్లరకును వ్యతిరేకముగానే యుండును." అని ఆమె మనస్సులో తలంచుచుండెను.

ఆమె ధర్మము, పుత్రప్రేమ రెండింటి నడుమ సతమతమగుచుండెను. సర్పము, ముంగిస పోరాడునట్లు ఆమెలో ధర్మము, పుత్రప్రేమ పోరాడుకొనుచుండెను. పట్టుదలతో పుత్రుని తనవద్ద ఉండుమని చెప్పినచో ధర్మము తప్పును. సోదరులతో వివాదము ఏర్పడవచ్చును. వనమునకు వెళ్ళుమని చెప్పినచో ప్రమాదము కలుగవచ్చును. ఇట్లు ధర్మసంకటములోపడి కౌసల్య బాధపడుచుండెను.

బుద్ధిశాలినియైన కౌసల్యాదేవి పాతివ్రత్య ధర్మములను గ్రహించి రాముడు, భరతుడు సమానమని తలంచి నిర్మల భావముతో నిట్లనెను, "రామా! తండ్రిఆజ్ఞను పాటించుటయే అన్ని ధర్మములకన్న ఉత్తమ ధర్మము. రాజ్యము నిచ్చెదననిచెప్పి నీకు నీ తండ్రి వనరాజ్యమిచ్చెను. అందుకు నేనేమియు చింతింపను. నీవులేని భరతుడు, ప్రజలు చాలా బాధపడెదరు. కేవలము తండ్రిగారి ఆజ్ఞయైన యెడల తండ్రికంటె తల్లిగొప్పది గాన వనమునకు వెళ్ళవద్దు, కాని తల్లితండ్రి ఇద్దరు వనమునకు వెళ్ళుమని చెప్పినచో నీకు వనము అయోధ్యకన్న నూఱురెట్లు సుఖకరమగును. వనదేవత నీకుతండ్రి, వనదేవి నీకుతల్లి. అచ్చటనున్న పశుపక్షులు నీకు సేవచేయును.



రాజులు అంత్యమున వనవాసముచేయుట ఉచితము. కాని నీ వయస్సును చూచి భయపడుచున్నాను. రఘువంశతిలకా! వనము చాలా అదృష్టము చేసికొన్నది. ఈ అయోధ్యయే దురదృష్ట వంతమయినది నాయనా! నీతోనన్ను తీసుకువెళ్ళుమని చెప్పినయెడల పుత్రుని పంపజాలక యిట్లు అడ్డుపలుకుచున్నదని అందరు సందేహించెదరు. అందరకు నీవు పరమ ప్రియుడవు. ప్రాణమునకు ప్రాణమువంటి వాడవు. నేను వనమునకు వెళ్ళెదనని నీవు చెప్పుచున్నావు. నీ మాటలువిని నేను కూర్చుండి కుమిలి పోవుచున్నాను. లేనిప్రేమ కల్పించుకుని నీవు వనమునకు వెళ్ళకుండా నేను అడ్డుపడను, కంటిని కనురెప్ప కాపాడుకొన్నట్లు సకలదేవతలు నిన్ను రక్షించెదరు. తల్లిప్రేమను మరువకుము. మేమందరము జీవించి యుండగనే నీవు క్షేమముగా రమ్ము. మా అందరిని అనాథలను చేసి నీవు సుఖముగా వనమునకు వెళ్ళుము. నేటికి మా అందరి పుణ్యములు పూర్తిఅయినవి కాబోలు! మాకు కఠినకాలము దాపురించెను." ఇవ్విధముగా కౌసల్యాదేవి అనేక విధములుగా విలపించుచు తాను దురదృష్టవంతురాలనని యేడ్చుచు రాముని పాదములు చుట్టివేసెను.

కౌసల్య బహు సంతాపము చెందుచుండెను. అప్పుడు ఆమె పడుచున్న బాధ వర్ణింపజాలము! రామచంద్రుడు తల్లిని లేవదీసి గట్టిగా కౌగిలించుకొని అనేక విధములుగా ఓదార్చెను. ఈ సమాచారము విని సీతాదేవి విచారపడుచు అత్తవారివద్దకు వచ్చి నమస్కరించెను. ఆమె కోడలిని ఆశీర్వదించెను. విచారపడుచు సీతాదేవి అత్యంత సుకుమారియని తలచి ఆమె వ్యాకులపడెను. సౌందర్యరాశి పతిని పవిత్ర ప్రేమతో ప్రేమించు సీత అత్తగారి ప్రక్కన కూర్చుండి "నా ప్రాణనాథుడు నన్ను వనమునకు తీసికొని వెళ్ళునా లేదా? అతనివెంట వెళ్ళగల పుణ్యము శరీరము, ప్రాణము రెండింటికి ఉండునా! లేక ఒక ప్రాణమునకే దక్కునా! విధాత చేతలు ఎవరును తెలిసికొనజాలరు. సీతాదేవి తన కాలిగోళ్ళతో నేలను

రాయుచుండెను. అందెల, కడియాల మధురధ్వని వచ్చుచుండెను. కవి దానిని ఇట్లు వర్ణించుచున్నాడు. ప్రేమవశములైన కడియాలు "మమ్ము సీతాదేవి చరణములు ఎప్పుడును విడిచిపెట్టవుగదా'' యని ప్రార్థించుచున్నట్లుండెను.

సీతాదేవి కనులనుండి కన్నీరు ప్రవహించుటను చూచి కౌసల్యాదేవి రామునితో నిట్లనెను. "ఓ నాయనా! సీత చాల సుకుమారి. కుటుంబమంతకు ప్రేమాస్పదురాలు, ఈమె తండ్రి జనకుడు. రాజులలో శ్రేష్ఠుడు. మామగారు సూర్యవంశమునకు సూర్యుడు. పతి సూర్యకుల మనే కమలములను వికసింప చేయువాడు. ఈమె సౌందర్యరాశి, సుగుణవతి, శీలనిధి, ఉత్తమురాలైన కోడలు. ఈమెను కంటిలోపాపవలె చూచుకొనుచుంటిని. ఈమెను కల్పలతకు సమానముగా అనేకవిధములుగా ప్రేమాభిమానములతో స్నేహముతో పెంచియుంటివి. ఇప్పుడు ఈ లత ఫలించి పుష్పించు సమయమున విధాత విరుద్ధముగా చేసెను. దీనిపరిణామము ఎట్లుండునో ఎవరును తెలుసుకొలేరు సీత కటికనేలమీదకాలుపెట్టి నడచియెరుగదు. బంగారపుటుయ్యేలలో ఊగుచు ఈమె కాలము గడపెను. ఈమెను సంజీవిని మూలికవలె బహుజాగ్రత్తగా కాపాడియుంటిని. దీపపువత్తి తగ్గించుమని కూడా చెప్పలేదు. అట్టి సీత నీతో వనమునకు వచ్చెదనని చెప్పుచున్నది. "రామా! ఏమి నీ ఆజ్ఞ? చంద్రుని కిరణామృతములు గ్రోలు చకోరపక్షులు సూర్యుని కిరణములను చూడగోరునా? ఏనుగులు, సింహములు, రాక్షసులు, మున్నగు భయంకర జంతువులు వనములో తిరుగుచుండును. విషవాటికలో సంజీవిని మొక్క జీవించునా? వనములో ఉండుటకు, విషయ సుఖములను ఎరుగని కోయలను, భిల్లులను, బ్రహ్మ సృష్టించెను. వారి హృదయములు రాతివలె కఠినమైనవి. వనములో ఎన్నడును బాధపడరు. తాపసస్త్రీలు వనములో ఉండగలరు. తపస్సుకొరకు వారన్ని భోగములను వదలి విరక్తితో ఉండెదరు. కోతిపటమును చూచి భయపడే సీత వనములో ఎట్లుండగలదు. దేవ సరోవరములలో కమల వనములలో తిరుగుచుండే హంసలు



తుమ్మపొదలలో ఎట్లుండగలవు? ఆలోచించిచెప్పుము. నీవు ఎట్లుచెప్పిన అట్లు సీతను సమాధాన పరచెదను. సీత యింటివద్ద నున్నట్లయితే నాకు చాలా సహాయపడును."

తల్లివాక్యములు విని రాముడు సంతోషించి ప్రియవచనములతో తల్లిని సంతృప్తి పరచెను, వనములో కష్టసుఖములు జానకికి ఎరింగించెను. తల్లి ఎదుట భార్యతో మాట్లాడుటకు సిగ్గుపడినను, ఈ సమయమున చెప్పక తప్పదని తలంచి యిట్లు చెప్పెను. "ఓ రాకుమారి" నామాటవినుము, మనస్సులో వేరే అభిప్రాయ పడకుము, నీ క్షేమము, నా మేలు నీవు కోరుచున్నట్లయితే నామాట విని యింటివద్దనే యుండిపొమ్ము" ఓ ప్రియా! నా ఆజ్ఞ పాటించినట్లగును అత్తగారికి సేవ చేయుటకు వీలుండును. నీవు ఇంటివద్దనే యుండుట నీకు మేలు, అందరికి అన్నివిధాల క్షేమము కలుగును. అత్తమామలకు భక్తితో సేవచేసిన దానికంటె మించిన ధర్మము వేరొకటిలేదు. అప్పుడప్పుడు నా తల్లి నన్నుతలంచుకొని బాధపడునప్పుడు ఆమె దుఃఖభారములో తన్నుతాను మరచిపోవును, అప్పుడు నీవు మృదుమధురముగా వెనుకటి చరిత్రలు చెప్పి అమ్మను ఓదార్చుచుండుము. నీవు వేరే భావము పెట్టుకొనవద్దు. తల్లిగారి సేవకే నిన్ను ఇంటివద్ద ఉండుమని పరిపరి విధముల చెప్పుచుంటిని. నా ఆజ్ఞను మన్నించి నీవు ఇంటివద్దనే యున్నయెడల వేదసమ్మతమైన ధర్మము నాచరించిన పుణ్యము శ్రమలేకుండ నీకు లభించగలదు. హఠముచేసినచో గాలవముని, నహుష మహారాజు, మొదలగు వారు సంకటపడినట్లు నీవును చిక్కులలో పడెదవు. నీవు బుద్ధిమంతురాలవు. నేను తండ్రిగారి ఆజ్ఞను పరిపాలించి వెంటనే తిరిగివచ్చెదను నా మాట బాగా వినుము. ప్రేమవశమున హఠముచేసిన యెడల పరిణామములో బాధపడెదవు వనవాసము చాల కష్టమైనది. భీకరమైనది. అక్కడ ఎండలు, గాలి, చలి, వర్షములు, అన్ని భయంకరముగానుండును. మార్గము రాళ్ళతో, ముళ్ళతో నిండియుండును. పాదరక్షలు లేకుండా కాలినడకతో నడవవలెను. మార్గమధ్యమున

సింహములు, పులులు, ఎలుగుబంట్లు భయంకర శబ్దము చేయుచుండును. వాని శబ్దములు విని ధైర్యవంతులైన పురుషులు సైతము భయపడి పారిపోయెదరు. నేలపై పరుండుచు, నారవస్త్రములు ధరించుచు కందమూలములు, ఫలములు భుజింపవలెను. అవికూడా అన్నిరోజులు దొరకవు. ఆయావేళలలో ఏవి దొరికిన అవి తినవలసియుండును. మనుష్యులను తిను రాక్షసులు, కపటవేషధారులై తిరుగాడుచుందురు. వనమందలి విపత్తి యింతని చెప్పజాలను; భయంకర సర్పములు, రాక్షసులు గుంపులుగుంపులుగా తిరుగాడుచుందురు. వన విపత్తులు జ్ఞాపకము వచ్చినప్పుడు ధీరులైన పురుషులే భయపడుచుందురు. కాని నీవు స్వాభావికముగా సుకుమార హృదయవు. నిన్ను వనమునకు తీసుకొని వెళ్ళినట్లుయితే నన్ను జనులు దూషించెదరు నాకు అపకీర్తికూడా వచ్చును. మానససరోవరపు అమృత జలములో సంచరంచవలసిన రాజహంస సముద్రపు జలములో సంచరించగలదా? లేతమామిడి తోటలలో విహరించే కోకిల తుమ్మచెట్లలో తిరుగాడునా? చంద్రముఖీ! నా మాటలు విని యింటివద్ద నుండుము. మేలుకోరి చెప్పేగురువు స్వామి ఉపదేశములు ఎవరు వినరో వారు తర్వాత చాలా పశ్చాత్తాపపడుదురు."

భర్తవాక్కులు వినగానే సీతాదేవి కన్నీరుకార్చుచూ చేతులు మోడ్చి శ్రీరాముని ముందు మోకరిల్లెను. చక్రవాకపక్షి రాత్రి చంద్రుని చూచి వ్యథపడినట్లు సీతాదేవి శ్రీరామచంద్రుని హితోపదేశములు విని జవాబు చెప్పజాలక వ్యాకులపడుచుండెను. తన ప్రాణనాథుడు తన్నువదలి వెళ్లనున్నాడని తలంచి కన్నీరు చేతితో తుడుచుకొనుచు ఆమె ధైర్యముతో అత్తగారి పాదములు పట్టుకొని యిట్లనెను "ఓ దేవీ! నా తప్పు క్షమించండి. నా ప్రాణేశ్వరుడు నాకు హితకరమైనశిక్ష యిచ్చియున్నారు. కాని జగత్తులో పతివియోగముకంటే మించిన దుఃఖము మరొకటి లేదు." భర్తతో ఆమె యిటుల పలికెను. "దయానిధీ! ప్రాణనాథా! రామచంద్రా! తమరు లేకుండా



స్వర్గమైనను నాకు నరకముతో సమానమైనది. తల్లిదండ్రులు, బంధువులు, సోదరులు, పరివారము, మిత్రులు, ఎవరైనాసరే ఎంతవరకు సంబంధము? భర్త చెంతలేని స్త్రీకి చంద్రుడుకూడా తాపము కలిగించును. శరీరము, ధనము, ఇల్లు, భూమి, నగరము, రాజ్యము ఇవియన్నియు పతినెడ బాసిన స్త్రీకి శోకహేతువులే. భోగము రోగముతో సమానము. సంసారము నరకముతో సమానము. మీరులేని లోకములో నాకు ఏమియు సుఖములేదు. ఎట్లనగా స్త్రీకి పతిలేనిచో దేహములో జీవుడు లేనట్లగును. నేను మీతో కలిసియున్నచో పక్షులు, పశువులే నా కుటుంబము. వనమే నాకు నగరము. వృక్షముల వల్కలములే నాకు వస్త్రములు. పర్ణకుటీరమే నాకు స్వర్గభవనము. వనదేవతలే నాకు అత్తమామలు. నీతో కలసియున్నయెడల పచ్చికబయళ్ళే నాకు హంసతూలికా తల్పములు, కందమూల ఫలములు నాకు అమృతముతో సమానము. పర్వతము నాకు అయోధ్యలోని రాజభవనముతో సమానము. క్షణక్షణము పతిపాదములు చూచి సంతసించెదను. ఓ ప్రాణనాథా! వనములలో చాలా కష్టములు దుఃఖములు కలుగునని చెప్పితిరి. అవన్నియు కలిసికూడా మీ వియోగమువలన వచ్చు దుఃఖములో లేశమాత్రమునకైన సరికావు! నాథా! మీ అర్ధాంగినైన నన్ను మీ వెంట తీసుకువెళ్ళండి. ఇంతకంటే మీకు ఏమి విన్నవించుకొనెదను! మీతో ఏమి చెప్పగలను! మీరు దయామయులు. అందరి హృదయ భావము లెరిగినవారు. నన్ను పదునాలుగు సంవత్సరములు అయోధ్యలో ఉంచినట్లయితే తిరిగి నన్ను మీరు ప్రాణములతో చూడజాలరు. క్షణక్షణము మీ ముఖము చూచుచున్నయెడల నాకు మార్గాయాసము కలుగునా? నేను మీకు అన్ని విధముల సేవచేసెదను. మీ మార్గాయాసము పోగొట్టెదను. భూమిమీద మెత్తని ఆకులుపరచి మీకు ప్రక్క అమర్చెదను. మీ పాదములు రాత్రంతా ఒత్తెదను. మరల మరల మీ చల్లని ముఖము చూచుచున్నయెడల నాకు తాపముండునా? ప్రభువు దగ్గర ఉన్నప్పుడు నావంకచూడ ధైర్యము

ఎవరికుండును? నేను సుకుమారినా? మీరు వనవాసమునకు యోగ్యులా? మీకు తపస్సు ఉచితమా? నాకు విషయభోగములా? ఇట్టి కఠోర వాక్యములు వినికూడా నా హృదయము పగిలిపోలేదు."

ఇట్లు పలికి సీత అమితముగా వ్యాకులపడెను. "వియోగము" అను మాటయే సహించలేక పోయెను. సీత దుఃఖమును చూచి శ్రీరామచంద్రుడు నేను ఈమెను ఇచ్చటనే ఉంచినయెడల ఈమె జీవించదని గ్రహించి ఇట్లనెను." సీతా! నాతో వనమునకు బయలుదేరుము. అన్ని సర్దుకొమ్ము! ప్రయాణమునకు సిద్ధముకమ్ము!

రామచంద్రుని దయతోకూడిన వాక్యములు విని సీతాదేవి అత్తగారికి నమస్కరించెను. ఆమె కోడలిని ఆశీర్వదించెను.

కౌసల్యాదేవి రాముని చూచి ''పుత్రా! నీవు తిరిగివచ్చి ప్రజల దుఃఖములను పోగొట్టుము. ఈ అభాగ్యురాలైన నీ తల్లిని మరవవద్దు. తిరిగి నీ ముఖము ఎప్పటికి చూచెదనో!" అని మిగుల శోకించెను. "ఓ బాబూ, రఘువరా, రామా, రఘుకులతిలకా!" యని నిన్ను ప్రేమతో పిలిచి ఎప్పుడు కౌగిలించుకొనెదనో!

తల్లి విలాపమును చూచి రామచంద్రుడు తల్లిని అనేకవిధముల ఓదార్చెను. వారి ప్రేమను ఏమని వర్ణించగలము?"

జానకి అత్తగారి పాదములు పట్టుకొని యిట్లు పలికెను. మీకు సేవచేయు సమయమున విధాత నాకీ శిక్ష విధించెను. మీరు దుఃఖము వదలండి. మా మీద దయ విడిచిపెట్టకండి. కర్మగతి కఠినమైనది. ఇందు నా దోషము ఏ మాత్రము లేదు.

సీతాదేవి వాక్యములు విని కౌసల్యాదేవి అమిత వ్యాకులపడెను, ఆమె సీతను మరల కౌగిలించుకొని, ఆశీర్వదించెను. "పుణ్యనదులైన గంగ,



యమున, సరస్వతి ప్రవహించువరకు సుమంగళివిగా వర్ధిల్లుదువుగాక" యని ఆమెను దీవించెను.

అంత సీత అచ్చటనుండి బయలుదేరెను. లక్ష్మణుడు సీతారాముల వనవాసమనే వార్త వినగానే మిగుల దుఃఖించి పరుగెత్తుకొని వచ్చెను. భయపడి వణకుచుండెను. రాముని పాదములపైపడి నోటమాట పల్కజాలక పోయెను. "విధాత ఏమిచేయునో? మేము చేసిన పుణ్యమంతా నేటితో పూర్తి అయినది కాబోలు! రామచంద్రుడు నాకు ఏమి చెప్పునో? ఇంటి వద్దనుండుమనునా? లేక వెంటతీసుకొని వెళ్ళునా?" యని లక్ష్మణుడు చేతులు కట్టుకొని పరిపరి విధాల పరితపించుచుండెను.

నీతి నిపుణుడు శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో "నాయనా! లక్ష్మణా! ముందువచ్చే ఆనందమును హృదయములో గ్రహించుము. ప్రేమవశుడవై అధైర్యపడకుము గురువు, తల్లి, తండ్రి చెప్పినవాక్యములు ఎవరు శిరసావహింతురో వారి జన్మ సార్ధకముకదా? అట్లు కానియెడల వారిజన్మ నిరర్ధకము. సోదరా! నా యుపదేశము వినుము. తల్లిదండ్రులకు సేవచేయుము భరత శత్రుఘ్నులు ఇంటివద్ద లేరు. తండ్రి వృద్ధుడు. అది కాక నా కొరకు అందరు దుఃఖించుచున్నారు. ఇట్టి పరిస్థితిలో నేను నిన్ను నాతో తీసుకొనిపోయినయెడల అన్నివిధముల అయోధ్య అనాథ యగును. తల్లితండ్రులు, ప్రజలు పరివారము దుఃఖింతురు. కనుక నీవు ఇక్కడఉండి అందరిని సంతోషపెట్టుము. లేనిచో చాలా పాపము కలుగును. ఎవరి రాజ్యములో ప్రేమాస్పదులైన ప్రజలు దుఃఖపడుదురో ఆ రాజు తప్పక నరకము పొందును. ఇట్టి సంగతి గ్రహించి నీవు ఇంటివద్ద ఉండుము."

ఆ మాటలు విని లక్ష్మణుడు అమిత వ్యాకులత చెందెను. మంచుచేత కమలము వాడిపోయినట్లు లక్ష్మణుడు ప్రేమచేత జవాబు చెప్పజాలక వెంటనే రాముని చరణములు పట్టుకొని యిట్లనెను. "అన్నా! నేను నీ దాసుడను. తమరు నా స్వామి, కాబట్టి తమరిని వదలిపెట్టి ఎవరి వశమగుదును?

మీరు చెప్పిన యుపదేశములు మంచివే కాని నా బలహీనత వలన భయపడుచున్నాను. శాస్త్రములు, నీతులు శ్రేష్ఠ పురుషులకు నేను ప్రేమను పాలించు బాలుడను నన్ను విడువకండి. నాకు గురువు, తల్లి, తండ్రి, అన్నియు మీరే. లోకములో స్నేహసంబంధము ప్రేమ విశ్వాసము ఎంతవరకు ఉండగలవో స్వయంగా వేదములు గానము చేయుచున్నవి. దీనబంధూ! అందరి హృదయములు తెలిసినవారు మీరు, నాకు అన్నియు మీరే! అన్నియు వదలి మనసా వాచా కర్మణా నేను మిమ్ములనే భజించుచున్నాను. కీర్తి, ఐశ్వర్యము, సద్గతి, పొందగోరు వారికి మీరు ధర్మములు నీతులు ఉపదేశించండి."

లక్ష్మణుని మాటలువిని, రాముడు తమ్మునికి తన మీదగల భక్తిగౌరవములు తెలుసుకొని "మీ తల్లిగారి వద్దకు వెళ్ళి ఆజ్ఞ తీసుకొనిరమ్ము" అని పలికెను.

అంతట లక్ష్మణుడు కష్టము దూరమై సుఖము లభించునట్లు సంతసపడుచు సుమిత్రవద్దకు వెళ్ళెను. తల్లికి నమస్కరించెను. కాని అతని మనస్సు సీతారాములందే లగ్నమై యుండెను.

లక్ష్మణుని ఉదాసీన ముఖము చూచి తల్లి కారణము అడిగెను. అంతట లక్ష్మణుడు తల్లికి జరిగిన కథ అంతయు విన్నవించెను. కైక చేసిన దుష్టకార్యమువిని సుమిత్ర మిక్కిలి బాధపడెను. అమ్మ వెళ్ళనిచ్చునో లేక ప్రేమచేత బంధించునో యని లక్ష్మణుడు వ్యాకులపడుచుండెను. "ఓ నాయనా! నీకు జానకి తల్లి. రాముడే తండ్రి, వారున్నచోటే నీకు అయోధ్య. రాముడు వనములకు వెళ్ళుచుండగా అయోధ్యలో నీకు ఏమిపని? గురువు. తల్లి దండ్రి సోదరులు స్వామి దేవతలు వీరి సేవ ప్రాణముతో సమానముగా చేయవలెను. అందులో రామచంద్రుడు ప్రాణముతో సమానమయినవాడు. స్వార్థరహితుడు. నీవు అటుల తలచి రామునితో వనమునకు వెళ్ళుము. నీ జన్మసార్థకము చేసుకొమ్ము. నిన్ను కన్నందుకు నా జన్మకూడా తరించును.



నిష్కామ కర్మతో రామునికి నీవు సేవచేయుము. రామచంద్రుడు నిన్ను వనమునకు తీసుకువెళ్ళుట నీఅదృష్టమే. వనములో ఉండుటవలన శాంతి లభించును. భగవంతుని కీర్తించగలవు. వనములో సీతారాములకు ఎవ్విధమైన క్లేశములు లేకుండా కాపాడుచుండుము," అని పరి పరి విధముల హితబోధలు చేసి ఆశీర్వదించి సుమిత్ర లక్ష్మణుని పంపెను. అంతట లక్ష్మణుడు మిక్కిలి సంతసించి రామచంద్రుని వద్దకు వెళ్ళెను. రామచంద్రునికి నమస్కరించి వారితో కలసి రాజభవనమునకు వెళ్ళెను.

నగరములోని వారందరు "విధాత బాగున్న వారికి కష్టములు తెచ్చి పెట్టెను" అని విలపింపసాగిరి. అందరు ఉదాసీనులైరి. తేనెతెట్టెను లాగగానే ఈగలు వ్యాకులపడినట్లు తలలు కొట్టుకొనుచూ చేతులు నులుము కొనుచూ బాధపడసాగిరి. అందరు రాజప్రాసాదము వద్దకు చేరిరి. ఆ విషాదమును ఏమని వర్ణింతుము! శ్రీరామచంద్రుడు వచ్చెనని మహారాజునకు చెప్పి మంత్రి రాజును కూర్చుండబెట్టెను, సీతారామలక్ష్మణులు వనవాసమునకు పోవుటకు ప్రయాణమై వచ్చినది చూచి మహారాజు మాట చెప్పలేక కనులవెంట ప్రేమాశ్రువులు ధారగా కార్చు చుండెను.

అంతట రాముడు తండ్రిగారి పాదములు పట్టుకొని సెలవడిగెను. "తండ్రిగారూ! నన్ను సంతోషముతో దీవించి ఆజ్ఞ యివ్వండి. సంతోష సమయమున దుఃఖపడుటెందుకు? మోహవశమున కర్తవ్యము మరవకండి. లోకములో మీకు గల యశము పోవును. అపనింద వచ్చును.

ఈ మాటలు విని మహారాజు రాముని ప్రేమతో కౌగిలించుకొని తన వద్ద కూర్చుండబెట్టుకొని యిట్లు చెప్పెను. మునులు నిన్ను గురించి చెప్పిరి. శ్రీరామచంద్రుడు చరాచరములకే స్వామియని, విధాత వారివారి కర్మానుసారముగా మంచిచెడ్డ ఫలితములిచ్చుచుండునని వేదములు, విజ్ఞాన వేత్తలు చెప్పుచున్నారు. కాని మన విషయములో వేరొక విధముగా జరుగుచున్నవి. అపరాధముచేయువాడొకడు; అనుభవించు వాడు వేరొకడు.

భగవానుని పనులు అతిగూఢములు. చిత్రములు, ఎవరునూ గ్రహించజాలరు.”

మహారాజు రామచంద్రుని ఉంచుటకు ఈ మాటలు చెప్పినాడు. కాని రాముడు ధర్మమెరిగిన వాడు కనుక మహారాజు మాట వినలేదు. వనమునకు వెళ్ళుటచే పూర్తిగా నిశ్చయించుకొనెను.

అంతట మహారాజు సీతను తన వద్దకు పిలిచి యిచ్చటనే యుండుమని అనేక విధముల నచ్చజెప్పెను. వనములో కలుగు కష్టములు వర్ణించి చెప్పి “నీకు ఇష్టమయిన యెడల ఇచ్చట నుండుము. లేనిచో మీతండ్రిగారి యింటివద్ద నుండుము”అనెను. కాని సీత మనస్సులో రాముని వెంట వెళ్ళుటకు నిశ్చయించుకొనుట వలన ఏమియు మాటాడలేదు. పిదప పుర ప్రముఖులు సుమంత్ర పత్నియు, వశిష్ఠుని పత్నియైన అరుంధతియు, గొప్ప యింటి స్త్రీలు ఇవ్విధముగా చెప్పిరి. “అమ్మా! సీతా! మీమామగారు నిన్ను వనమునకు పొమ్మని చెప్పలేదు. కాబట్టి నీవు వెళ్ళ నవసరము లేదు. ఇంటివద్ద నుండి అత్తమామలకు సేవచేసి కీర్తిగాంచుము” అని అందరు అనేక విధములుగా చెప్పిరి. కాని సీత అంగీకరించలేదు.

ఈ సంభాషణ మంతయు విని కైకేయి అమితముగా మండిపడి తటాలునలేచి, కాషాయవస్త్రము, కమండలము, లోపలనుండి తెచ్చి రాముని ముందుంచి యిట్లనెను. “ఓ రఘువీరా! నీవు రాజుకు ప్రాణసమానమైన ప్రియపుత్రుడవు. నీవు మమ్మింతవరకు వదలి వెళ్ళలేదు. నీవు వెళ్ళనిచో ఇంతవరకు వారికున్న యశము, గొప్పతనము నశించును, నిన్ను బుద్ధి పూర్వకముగా వనములకు పంపజాలడు. నీవే ఆలోచించి ఏది మంచిదో అది చేయుము.” తల్లి వాక్యములు విని రామచంద్రుడు సంతోషించెను. కాని రాజునకు ఈ మాటలు బాణముల వలె గుచ్చుకొన సాగెను. వెంటనే రాజు మూర్ఛ చెందెను. అది చూచి జనులు వ్యాకులపడిరి.



రామచంద్రుడు తల్లితెచ్చిన వల్కలములు ధరించి కమండలములుచేబూని తండ్రికి నమస్కరించి వనమునకు బయలుదేరెను. అరణ్యవాసమునకు కావలసిన సామానులు తీసుకొని సీతారామలక్ష్మణులు వనమునకు ప్రయాణమైరి. వారు బయలుదేరినంతనే వశిష్ఠ, వామదేవాది మునులు ద్వారమువద్దకు వచ్చి సుస్వాగతమిచ్చిరి. జనులందరు అది చూచి దుఃఖసముద్రములో మునిగిరి. అందరికి ప్రియవచనములు చెప్పి రాముడు బయలుదేరెను. గురువు గారికి వందనములు చేసి ధర్మకార్యములు అన్నియు చక్కగా నిర్వర్తించి ప్రజల నుద్దేశించి శ్రీరాము డిట్లు పల్కెను.

“ఓ ప్రియజనులారా! మీరందరు, మహారాజుగారికి నాతల్లులకు దుఃఖము కలుగకుండా నడచుకొన్నచో నామనస్సునకు అమిత సంతోషము కలుగును” అని పరిపరి విధముల జనులను ఓదార్చి చిరునవ్వుతో రామచంద్రుడు బయలుదేరెను. రామచంద్రుడు బయలుదేరు సమయమున ప్రజలలో అల్లకల్లోలము చెలరేగెను. చెడు శకునము లాయెను. అయోధ్యలో నలుమూలల అత్యంత శోకము వ్యాపింపసాగెను.

మహారాజు మూర్ఛనుండి కోలుకొనగానే, మంత్రిని పిలిచి రాముడు వనమునకు వెళ్ళెను కాని నా ప్రాణము నన్ను వదలి వెళ్ళలేదు. ఇంకను నేనేమి దుఃఖమనుభవించవలెనో నాకు తెలియదు. “ఓ మిత్రుడా! నీవు సీతారామలక్ష్మణులను రథములో ఎక్కించుకొని వనము చూపించి నాలుగు దినములు గడచిన పిమ్మట తీసుకురమ్ము. సత్యసంధులు, ధైర్యవంతు లగుటవలన వారిరువురు తిరిగి వచ్చుటకు ఇష్టపడనిచో రాముని ప్రార్థించి జానకిని తీసుకురమ్ము. సీత అరణ్యమును చూచి భయపడినప్పుడు అరణ్యములో అమిత బాధలు పడెదవని నచ్చజెప్పి తీసుకరమ్ము. పుట్టినింటగాని లేక అత్తవారింటగాని ఆమె యుండవచ్చును” అని సీతకుచెప్పి తీసుకురమ్ము. నీ తెలివితేటలు చూపించి సీతను ఎట్లయినా తీసుకురమ్ము.

లేనిచో నా ప్రాణము లుండవు." సీతారామలక్ష్మణులను తీసుకొని వచ్చి తనకు చూపించుమని మహారాజు తిరిగి మూర్ఛితు డయ్యెను.

సుమంత్రుడు రాజాజ్ఞ ప్రకారము రథమును తోలుకొని నగరుబయటనున్న సీతారామలక్ష్మణుల వద్దకు వెళ్ళెను. మహారాజు ఆజ్ఞను విన్నవించెను. సీతా రామలక్ష్మణులు అయోధ్యా ప్రజలకు నమస్కరించి రథ మారోహించి వనమునకు వెళ్ళి పోయిరి.

రామచంద్రుడు వెళ్ళిన పిదప అయోధ్య అంతయు భయంకరముగా కనబడుచుండెను. ఇండ్లు శ్మశానముగను, కుటుంబములు భూతపిశాచములుగను, పుత్రులు, మిత్రులు యమదూతలుగను, వృక్షములు, చెరువులు దయ్యములుగను కనపడుచుండెను. ఆవులు, మేకలు, ఎద్దులు మొదలగు పశుపక్ష్యాదులు మిగుల వ్యాకులత చెందెను. అవి చైతన్యము విడిచి బొమ్మలవలె కదలక మెదలక చూచుచుండెను. పశుపక్షులే అవ్విధముగా ఉన్నప్పుడు నగరవాసుల స్థితి ఏమని చెప్పవలెను? విధాత భిల్లకాంతను కైకగా పుట్టించెను. ఆమె దుస్సహమైన దావాగ్నిని రగుల్కొల్పెను. శ్రీరామచంద్రుని యెడబాటును ప్రజలు సహించలేక పోయిరి. సీతారామలక్ష్మణులు లేని అయోధ్య మన కెందుకని దేవలోకభవనములను మించి తమభవనములను వదలి రాముని వెంటపడిరి.

మొదటి దినమున తమసానదీతీరమున దిగిరి. ప్రజల ప్రేమను జూచి రామచంద్రుడు మిగుల వ్యాకులత చెందెను. జనులందరు అలసటచేత దేవమాయచేత శోకముచేత నిద్రించిరి. రాత్రి రెండపజాము గడచెను.

సుమంత్రుడు, చడీచప్పుడు కాకుండా సీతారామలక్ష్మణులను రథమెక్కించుకొని పరమేశ్వరుని ధ్యానించుచూ వెళ్ళిపోయెను. తెల్లవారగానే జనులందరు నిద్రనుండి లేవగానే సీతారామలక్ష్మణులు లేకపోవుట చూచి తమలోతాము నిందించుకొనుచు మన బాధను చూడలేక వారు



వెళ్ళిపోయినారని తలంచి వ్యాకులపడిరి. జనులు అయోధ్యకు తిరిగి వచ్చిరి. వారి దుఃఖము వర్ణింపజాలము. తిరిగి రాముని చూడవచ్చునని ఆశతో జీవించుచుండిరి. రామచంద్రుడు వచ్చువరకు కొందరు ఒంటిపూట భోజనము చేయవలెనని నిశ్చయించుకొనిరి. ఫలాహారములు చేసి కాలము గడపవలెనని మరి కొందరు నియమము పెట్టుకొనిరి.

రథము శృంగిబేరపురము చేరినది. సీతారామలక్ష్మణులు గంగానదిని చూచి రథము దిగి నమస్కరించిరి. రామచంద్రుడు గంగాదేవి మాహాత్మ్యము చెప్పెను. అందరు సంతోషించిరి. అందరు నదిలో స్నానము చేసి అలసట తీర్చుకొనిరి. సీతారామలక్ష్మణులు వచ్చిరని తెలుసుకొని నిషాదరాజు వెంటనే అనుచరులను సేవకులను వెంటబెట్టుకొని కందమూలములు తీసుకొని వచ్చి వారికి అర్పించెను. అతడు అనురాగముతో ప్రభువును చూచుచుండెను. రామచంద్రుడు ప్రేమతో క్షేమ సమాచారములు అడిగి నిషాదరాజును దగ్గర కూర్చుండ బెట్టుకొనెను. "నిషాదరాజు రామునిజూచి "మీ దర్శనమువల్ల మేమంతా కుశలము. మీ కృపవలన, భగవానుని దయవలన అదృష్టవంతులైన పురుషులలో నేనొక్కడనుగా పరిగణించబడితిని. ఓ దేవా! యీ భూమి, ధనము అంతయు మీది. నేను మీ సేవకుడను. దయతో శృంగిబేరపురమునకు దయచేయండి. ఈ దాసుని ప్రతిష్ఠను ఇనుమడింప చేయండి" అని మిగుల ప్రార్థించెను.

రాముడు "ఓ మిత్రమా! నీవన్నదంతయు సత్యమేగాని తండ్రి ఆజ్ఞలేదు. పదునాలుగేండ్లు మునివేషము ధరించి మునుల ఆహారము భుజించుచు వనములో ఉండవలయును." అనగా విని నిషాదరాజు అమితవిషాదము చెందెను. "సీతారామలక్ష్మణులను చూచి గ్రామములలోని ప్రజలు "ఒక సుకుమారిని, సుందర సుకుమారులైన యిద్దరు బాలకులను వీరి తల్లిదండ్రులు ఎందుకు అరణ్యమునకు పంపియుండిరో!" అనుకొనిరి.

మరొక చెలియ "రాజు మంచిపనియే చేసెను. వనమునకు రాముని పంపుటవలన నేడు మనము నేత్రానందముగా ఆ స్వామి సౌందర్యమును చూడగల్గితిమి" అని సంతోషముతో పలికెను.

నిషాదరాజు సీతారామలక్ష్మణులను అశోక వృక్షము క్రింద పరుండుటకు తగిన ఏర్పాటు చేసెను. దర్భలతో, ఆకులతో, మెత్తని చాపను తయారుచేసి పరచెను. చాపపై సీతారామలక్ష్మణు కూర్చుండి ఫలములను భుజించిరి. సీతారాములు శయనించిరి. సీతారాములు భూమిమీద పరుండుట చూచి నిషాదరాజు విచారముతో లక్ష్మణునితో నిట్లనెను. "ఉభయుల తల్లిదండ్రులు చాలా ఉన్నత కుటుంబములకు చెందిన వారు. సీతాదేవి తండ్రి జనక చక్రవర్తిమహాజ్ఞాని; రాముని తండ్రి దశరథమహారాజు సూర్యవంశమునకు సూర్యుని వంటివాడు. అట్టి మహనీయులకు బిడ్డలైన వీరు కఠినమైన నేలపై పరుండవలసిన దుర్గతి ఏర్పడినది. ఏమి ఈ వైపరీత్యము! విధికృతము తప్పదు గదా! దీని కంతటికిని కారకురాలు కైకేయి. ఆమె కాఠిన్యము వల్లనే మీరు అడవుల పాలైనారు."

అని చెప్పగా లక్ష్మణుడు "ఎవరికి ఎవరు ఏమి చేయునది లేదు ఎవరి కర్మ వారనుభవించవలసినదే. ఒకరికొకరు దుఃఖము కలుగ చేయువారు లేరు. సంయోగ వియోగములు, మంచిచెడ్డలు, శత్రుమిత్రత్వములు, ఇవి అన్నియు భ్రమలు. జన్మమృత్యువులు లోకజంజాటకములు. బాగుగా విచారించిన వీటన్నిటికి మూలము అజ్ఞానము, పరమార్థదృష్టిలో ఇవేమిలేవు."

ఎట్లనగా స్వప్నములో రాజు భిక్షుకుడుగను దరిద్రుడు రాజు గను ఐనట్లుగా కల గాంచును. కాని నేత్రములు తెరువగనే ఏమైనను లాభనష్టములు కలుగునా? ఇది అంతా యిట్టిదే, అని భావించి ఎవరిపైనను కోపగించుకొనకూడదు; ఎవరిని వ్యర్థముగా నిందించకూడదు. ఈ జగత్తు అనే రాత్రిలో యోగులు మాత్రము మేల్కొనియుందురు. సంపూర్ణభోగ



విలాసాలనుండి విరక్తిపొందిన జీవులు మేల్కొనిన వారుగా పరిగణింపబడుదురు. వివేకము కలిగిన మీదట మోహమనే భ్రమ దూరమగును. అజ్ఞానము నశించును. అప్పుడే రామచంద్రుని పాదములయందు భక్తి కలుగును.

మనసా, వాచా, కర్మణా రాముని పాదములయందు ప్రేమ కలుగుటయే పురుషార్థము. రామచంద్రుడు పరమార్థ స్వరూపుడు, పరబ్రహ్మము, అద్వితీయుడు, నిరాకారి, అట్టి కృపాళువు రామచంద్రుడు భక్తులను దేవతలను. బ్రాహ్మణులను రక్షించుటకు, మానవరూపము ధరించి లీలలు చేయుచున్నాడు. ఇట్లు గ్రహించి మోహమును వదలి రాముని పాదముల యందు భక్తి కలిగి యుండుము" అని పల్కెను. ఇట్లు రాముని గుణములు వర్ణించుచుండగా తెల్లవారెను.

లోకమంగళ కరుడు నిద్రనుండి లేచెను. శౌచకార్యములు నిర్వర్తించి స్నానము చేసెను. అంతట రామచంద్రుడు మర్రిపాలను తెప్పించి వానిచే లక్ష్మణునితో కూడ తలపై జడలు ధరించెను.

ఇది చూచి సుమంత్రుడు కన్నీరు కార్చెను. సుమంత్రుడు ఉదాసీనుడై చేతులు ముకుళించి దీనవదనముతో నిట్లనెను. "రఘునాథా! కోసలనాథుడు "మిమ్ములను రథముపై ఎక్కించుకొని వనము చూపించి నాల్గుదినముల పిమ్మట మరల అయోధ్యకు తీసుకురమ్మని నాతో చెప్పియుండిరి. ఇప్పుడు మీరు జడలు ధరించి మునివేషములతో బయలుదేరితిరి. నేనేమి చేయగలను? అని" శ్రీరాముని పాదముల మీదపడి బాలునివలె యేడ్వసాగెను. "అయ్యో! అయోధ్యను అనాథగా చేయకండి" అని పరిపరివిధముల విలపించెను.

రాముడు అతనిని లేవదీసి యిట్లనెను. "మీరు ధర్మమెరిగిన వారు శిబి, దధీచి, బలి, హరిశ్చంద్రుడు మొదలగు వారు ధర్మము కొరకు ఎన్నో

కష్టములు సహించిరి. బుద్ధిమంతులు ఎటువంటి కష్టములు నష్టములు వచ్చినను ధర్మము విడవరు. నేనును దాని కొరకు పాటుపడుచున్నాను. వేదశాస్త్ర పురాణములు సత్యముకంటె మించిన ధర్మములేదని చెప్పుచున్నవి. అట్టిధర్మమార్గము విడిచిన యెడల లోకములో అపకీర్తి వ్యాపించును. పురుషునకు ఆపయశము కన్న మృత్యువే మేలు. మీరు మమ్ము వనమునుండి తిరిగిరమ్మనుట కూడా పాపములో పాలుపంచుకొనుటయే. మీరు వెళ్ళి తండ్రిగారికి నానమస్కారములు చెప్పి నాకొరకు మీరు చింతించవద్దని నేను చెప్పినట్లు చెప్పండి." మీరు నాకు తండ్రితో సమానులు. నా హితము కోరువారు. చేతులు జోడించి మీకు చెప్పుచున్నాను. తండ్రిగారు నాకొరకు దుఃఖపడకుండునట్లు కనిపెట్టి యుండండి."

శ్రీరామచంద్రుడు సుమంత్రునితో చెప్పిన మాటలు విని నిషాదరాజు కుటుంబము విషాదములో పడెను. లక్ష్మణుడు తండ్రిచేసిన పనికి కఠిన వాక్యములు పలికెను. శ్రీరామచంద్రుడు లక్ష్మణుని మందలించి బాలుని వాక్యము తండ్రిగారికి చెప్పవద్దని సుమంత్రునిచే ఒట్టు వేయించుకొనెను. తర్వాత సుమంత్రుడు రాజు చెప్పినది సీతాదేవితో విన్నవించుకొనగా సీతాదేవి ఇట్లనెను. "ఓ తండ్రీ! మామగారివలె నా శ్రేయస్సును కోరువారు మీరు. మీకు తిరిగి జవాబు చెప్పుట అనుచితమే. నాకు భర్త తప్ప ప్రపంచములో గల యితర లన్నియు సంబంధము హీనమైనవే. నా తండ్రియొక్క ఐశ్వర్యమును చూచితిని. పెద్దపెద్ద మహారాజులు వచ్చి నా తండ్రిగారికి పాదాభివందనములు చేయుచుందురు. సర్వసుఖాలకు మా పుట్టినిల్లు నిలయం. అయినప్పటికి మతిమరపులో కూడా భర్తను విడిచి ఆ సుఖాలపై ఆసక్తి కలుగలేదు. నా తండ్రిగారు చక్రవర్తి. నా మామగారు మహారాజు. పదునాల్గు లోకాలలో మహాత్ములైన వారి కీర్తిప్రతిష్ఠలు ప్రసిద్ధికెక్కినవి. అటువంటి ఐశ్వర్యమున్నది. తల్లులవంటి అత్తలున్నారు. శ్రీరామచంద్రుని పాదధూళి తప్ప ఇతరము లెవ్వియును స్వప్నములోకూడ నాకు సుఖదాయకములు కావు. అరణ్యము, దుర్గమమైన మార్గము, పర్వతములు,



ఏనుగులు, పులులు, సింహాలు, భిల్లులు, అన్నియును ప్రాణవల్లభుడు చెంతనున్నచో సుఖముగానే యుండగలవు. మా అత్తమామలతో నేను వనములో సుఖముగా ఉన్నట్లు చెప్పండి. వీరులలో అగ్రగణ్యులైన నాభర్త, మరది, ధనుర్ధారులై యుండగా నన్ను భయము బాధలు ఎట్లు దరిజేర గలవు?".

సీతమ్మ మాటలు విని సుమంత్రుడు వ్యాకులపడెను. సుమంత్రుడు సీతారామలక్ష్మణులకు నమస్కరించి వ్యాపారంలో తన డబ్బంతా పోగొట్టుకొని నిరాశతో ఇంటికి తిరిగి వచ్చెడు వానివలె అతడు అయోధ్యకు బయలుదేరెను.

రథముమీద ఎక్కి సుమంత్రుడు గుఱ్ఱములను అదలించగా అవి మాటిమాటికి శ్రీరామచంద్రుని చూచి సకిలింపసాగినవి జ్ఞానములేని పశువులే రామ వియోగము వలన, ఇట్లు పరితపించుచుండగా ఇక ప్రజలు, తల్లి తండ్రులు; ఎట్లు పరితపించుచున్నారో ఏ విధముగా వివరింపగలము?

రామచంద్రుడు నది దాటుటకు నావ తీసుకొని రమ్మని గుహునితో చెప్పెను. కాని అతడు అంగీకరింపక యిట్లనెను. "మీ పాదము తగులగానే రాయి స్త్రీ అయినది. నా నావ కఱ్ఱతో చేయబడినది. శిలకన్న కర్రతేలిక. నా నావ స్త్రీ అయితే నా నావ మాయమగును. రాకపోకలు నిల్చిపోవును. నేను నా కుటుంబము ఈ నావ వల్లనే జీవించుచున్నాము. ఇతర ఆధారమేదియు నాకు లేదు. ఓ ప్రభూ! మీరు తప్పక గంగానది దాటవలెనంటే మొదట మీ పాదములు శుభ్రముగా కడుగ నివ్వండి. తరువాత మిమ్ములను దాటించెదను. మిమ్ములను కేవు కూడ అడుగను మీ తండ్రి దశరథుని మీద ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. లక్ష్మణునికి కోపము వచ్చినను నేను మీపాదములు కడుగనిదే నావపై ఎక్కనీయను."

గుహుని! ప్రేమను చూచి శ్రీరామచంద్రుడు నవ్వుచూ అతనితో నిట్లనెను. సోదరా! నీయిష్టప్రకారమే కానిమ్ము. త్వరగా నావ తెమ్ము. ఒకసారి

నా నామస్మరణ చేసిన మాత్రమున మనుష్యుడు అపార భవసాగరము దాటగలడు.

పూర్వము వామనావతారమున మూడు అడుగులువేసి విశ్వమంతయును చిన్నదిగా చేసిన శ్రీరామచంద్రుడు గుహుని సముద్రమును దాటింపుమని అడుగవలసి వచ్చినది. గుహుడు రామచంద్రుని ఆజ్ఞ పొంది కఱ్ఱతొట్టిలో జలమును తీసుకొని వచ్చి ఆనందముతో భగవానుని పాదములు కడిగెను. రాముని పాదోదకము త్రాగి ఆ పుణ్య ప్రభావమువలన తనను తన పితరులను భవసాగరము నుండి తరింప చేసెను.

నిషాదరాజైన గుహుడు సీతా రామలక్ష్మణులను నావలో ఎక్కించుకొని గంగానదిని దాటించెను. వారు ఇసుకలో నిల్చుని ప్రకృతి రామణీయకమును తిలకించుచుండిరి. నమస్కరిస్తున్న నిషాదరాజును చూచి రామచంద్రుడు ఇతనికి ఏమైన యిచ్చిన బాగుండునని తలంచెను.

పతి తలంపును గ్రహించిన సీతాదేవి రత్నములచే పొదుగబడిన తన చేతి యుంగరమును తీసి శ్రీరామునకు ఇచ్చెను. నదిని దాటించినందులకు ప్రతిఫలముగా దీనిని తీసుకొమ్మని. శ్రీరాముడు ఆ యుంగరమును నిషాదరాజుకు ఈయబోగా అతడు "స్వామీ! నాకు చాలా యిచ్చియున్నారు. ఇప్పుడు నేనేమియు తీసికొనను. మీరు తిరిగి వచ్చునప్పుడు మీరేమి యిచ్చినా తీసుకొందును" అని పల్కెను.

శ్రీరాముడు గుహునకు ఆ యుంగరము నివ్వవలెనని ఎంతగా ప్రయత్నించినను అతడు తీసుకొనలేదు. అంతట శ్రీరాముడు మిగుల సంతసించి అతనికి నిర్మలభక్తిని ప్రసాదించెను.

శ్రీరాముడు స్నానము చేసి ప్రార్థన పూజ చేసెను. "మేము క్షేమముగా తిరిగి వచ్చేటందుకు ఆశీర్వదించ"మని గంగాదేవిని సీతాదేవి ప్రార్థించెను. అది విని గంగాదేవి "ఏవమస్తు" (అట్లే అగుగాక) అని ఆశీర్వదించెను.



గంగాదేవి ఆశీర్వాదము పొంది సీతాదేవి మిగుల ఆనందించెను.

"ఇక నీవు మీ యింటికి వెళ్ళు"మని గుహునితో శ్రీరాముడు చెప్పగా స్వామి యెడబాటుకు గుహుడు మిగుల దుఃఖించి "నాలుగురోజులు మీతో నుండి మార్గము చూపించి వెళ్ళెదను" అని ప్రార్థించెను. వాని ప్రేమకు రామచంద్రుడు మెచ్చుకొని అతనిని తన వెంట తీసుకవెళ్ళెను. గుహుడు తన అనుచరులను వారి వారి యిండ్లకు పంపివేసెను.

శ్రీరాముడు మహాదేవుని ప్రార్థించి సీతాలక్ష్మణులతో వనమునకు బయలుదేరెను. వారారాత్రి చెట్టుక్రింద నివసించిరి. ఉదయమున ప్రయాగచేరిరి.

త్రివేణీ సంగమమున స్నానముచేసి సీతారామలక్ష్మణులు భరద్వాజముని ఆశ్రమమునకు వెళ్ళిరి. శ్రీరామచంద్రుడు మునీంద్రునకు సాష్టాంగదండ ప్రణామము చేయగా ముని ఆయనను లేవదీసి ప్రేమతో కౌగిలించుకొని ఆనందముతో ఆశీర్వదించెను. అమృతమువంటి మిగుల రుచికరమైన కందమూల ఫలములను ముని వారికి ఈయగా వారు వానిని భుజించి ఆనందించిరి. ముని రాముని జూచి "ఓ రామా! మిమ్ములను దర్శించుట వలన నేను ఇంతవరకు చేయుచున్న జపము, తపము, తీర్థసేవనము ఫలించినవి. ప్రభువు దర్శనముకంటే లాభమునకు, సుఖమునకు అవధి అంటూ ఏదీ లేదు. మీ దర్శనము వలన నా ఆశలన్నియు నెరవేరెను. ఇక మీ పాదపద్మముల యందు స్వాభావిక ప్రేమ కలుగునట్లు నాకు వరము ప్రసాదించండి. మనోవాక్కాయ కర్మముల మోసము త్యజించి మనుష్యుడు మీకు దాసుడు కానంతవరకు ఎన్ని ఉపాయములు చేసినను అతడు స్వప్నములో కూడ సుఖమును పొందలేడు" అని పల్కెను.

ఆ వాక్యములు విని ఆయన భక్తికి మెచ్చి శ్రీరాముడు భరద్వాజ మునీంద్రుని గొప్పతనమును పలు విధములుగా వర్ణించెను. "మునీశ్వరా!

ఎవరిని మీ రాదరించెదరో వాడే గొప్పవాడు, సకల సద్గుణములకు అతడే నిలయము" అని ప్రశంసించెను.

సీతారామలక్ష్మణులు వచ్చిన శుభవార్తవిని ప్రయాగ పుణ్యక్షేత్రములో నివసించుచున్న బ్రహ్మచారులు, మునులు, సిద్ధులు, తాపసులు అందరును వారిని చూడవలెనని అత్యుత్కంఠతో భరద్వాజ మునీంద్రుని ఆశ్రమమునకు వచ్చి యుండిరి.

శ్రీరాముడు అందరికి నమస్కారము చేసెను. వారెల్లరును శ్రీరాముని సందర్శించి మహానందముతో ప్రభువు సౌందర్యమును కొనియాడుచు తమతమ నివాస స్థానములకు వెళ్ళిపోయిరి.

రాత్రి అచ్చటనే విశ్రమించి ఉదయమున సీతారామలక్ష్మణులు ప్రయాగ క్షేత్రములో స్నాన మాచరించి మునికి నమస్కరించి గుహునితో బయలుదేరిరి.

బయలుదేరునప్పుడు "ఏ మార్గముద్వారా వెళ్ళవలెనో చెప్పండని" శ్రీరాముడు మునిని అడుగగా "మీకు అన్ని మార్గములు సుఖము కలిగించు" నని ముని చెప్పెను. శ్రీరాముని వెంట వెళ్ళుటకు ఆయన తన శిష్యులను పిలిచెను. అది వినగానే ప్రభువువెంట వెళ్ళుటకు ఏబదిమంది శిష్యులు ఆనందముతో ముందుకు వచ్చిరి. "మేము చూచిన మార్గమే". "మేము వెళ్ళుదుమంటే మేము వెళ్ళుదు" మని వారందరూ పలుకుచుండిరి. మునీంద్రుడు వారిలో నలుగురు బ్రహ్మచారులను ఎంచి పంపెను. వారు గత జన్మలలో ఎంతో పుణ్యము చేసి కొన్నవారు. గురువుగారికి నమస్కరించి వారందరు ఆనందముతో బయలుదేరిరి.

సీతారామలక్ష్మణులు ఏ గ్రామము మీదుగా ప్రయాణము చేయుదురో ఆ గ్రామమందలి స్త్రీపురుష లెల్లరు వారిని చూచుటకు పరుగెత్తుకొని వచ్చుచుండిరి. అద్వితీయమైన వారి రూప సౌందర్యములను చూచి జన్మించి నందులకు ఇప్పుడుగదా తగిన ఫలము లభించినదని మురియు చుండిరి.



మనస్సును ప్రభువువెంట పంపి శరీరమును కూడ వారి వెంట పంపలేనందుకు దుఃఖించుచు తిరిగి పోవుచుండిరి.

శ్రీరాముడు తన వెంట మార్గము చూపుటకు వచ్చిన నలుగురు బ్రహ్మచారులను పంపివేసెను. వారు అనన్యభక్తిని పొంది వెళ్ళిపోయిరి. సీతారామలక్ష్మణులు యమునా నదిలో స్నానముచేసి నదిని దాటిరి.

యమునానది ఒడ్డునగల స్త్రీ పురుషులు నిషాదునితో సుందరులైన యిద్దరు నవయువకులు సౌందర్యవంతురాలైన ఒకస్త్రీ వచ్చినట్లు తెలియగానే తమతమ పనిపాటులను మరచి పరుగెత్తుకొని వచ్చిరి. వారెల్లరు సీతారామలక్ష్మణుల సౌందర్యమును గాంచి తమ భాగ్యమును కొనియాడుకొనుచుండిరి. వారిని గూర్చిన వివరములు విశేషములు అడిగి తెలుసుకొనవలెనని ఈ ప్రజల మనస్సులో కోరికయున్నను ఊరు, పేరు అడిగి తెలుసుకొనుటకు సంకోచించు చుండిరి. వారిలో వయోవృద్ధులైన వారు చతురులు యుక్తితో శ్రీరాముని స్తుతించిరి.

తండ్రిగారి ఆజ్ఞపై వారు వనమునకు వెడలుచున్నట్లు వారు అందరికి చెప్పిరి. అది విని వారెల్లరు దుఃఖించిరి. రాణియు రాజును మంచిపని చేయలేదని చెప్పుకొనసాగిరి.

ఆ సమయమున అచ్చటకు ఒక తపస్వి వచ్చెను. అతని వయస్సు చిన్నదే. కాని తేజస్సు, సౌందర్యము గలవాడు. త్రికరణశుద్ధిగా అతడు రామభక్తుడు. అతడు తన యిష్టదైవమును స్మరించి మొదట రాముని పాదములపై, పిమ్మట లక్ష్మణుని పాదములపై, గుహుని పాదములపై పడిసాష్టాంగదండ ప్రణామము చేసెను. వారు అతనిని లేవదీసి కౌగిలించుకొనిరి. తపస్వి పాదధూళిని తన శిరసుపై ధరించెను. అతనిని తన కుమారునిగా భావించి సీతమ్మ ఆశీర్వదించెను.

గ్రామములో గల స్త్రీలు వారి రూపములు చూచి "ఓ సఖీ! సుకుమారులైన యీ సుందర మూర్తులను వనమునకు పంపిన వీరి తల్లి

దంద్రు లెట్టివారో'' అని చెప్పుకొనుచుండిరి. సీతారామలక్ష్మణుల రూపములను వనవాసమును చూచి స్త్రీ పురుషులెల్లరు వ్యాకుల హృదయములతో వ్యధనందుచుండిరి.

శ్రీరాముడు ఇంటికి పొమ్మని గుహునకు అనేక విధములుగా నచ్చజెప్పెను. శ్రీరామాజ్ఞ శిరోధార్యమని అతడు తన యింటికి బయలుదేరెను.

సీతారామలక్ష్మణులు యమునా నదికి నమస్కరించిరి. సూర్యకన్యయైన యమున గొప్పతనమును చెప్పుకుంటూ సంతోషముతో బయలుదేరి ముందున కరిగిరి.

మార్గమధ్యములో పెక్కుమంది వారిని చూచుటకు వచ్చు చుండిరి. శ్రీరామునితో "మీ దేహములయందు రాజలక్షణములు కనపడుచున్నవి. మీరు కాలినడకతో బయలుదేరి వచ్చుచున్నారు? దీనినిబట్టి జ్యోతిశ్శాస్త్రము అసత్యమని తోచుచున్నది. అరణ్యము నిండా పెద్దపెద్ద పర్వతములు, నదులు, వృక్షములు, పైగా మార్గము కఠినమైనది. మీవెంట సుకుమారి అయిన స్త్రీకూడా కలదు ఏనుగులు, సింహములు మొదలగు క్రూరజంతువులతో నిండియున్న యీ భయంకరారణ్యము ప్రవేశింప వీలుపడదు. మీ ఆజ్ఞ అయినచో మీవెంట మేము నడచిరాగలము. మీరు వెళ్ళు ప్రదేశము మిమ్ము చేర్పించి మేము తిరిగివచ్చి వేయుదుము" అని పలికిరి. కాని రాముడు వారికి వినయముతో తగు సమాధానము చెప్పి పంపివేయుచుండెను. స్త్రీలు సీతమ్మను, సమీపించి "అమ్మాయీ! ఆ సుందరాంగులు ఇరువును నీకేమగుదురు? అని ప్రశ్నించిరి. వారి మాటలు వినగానే సీతమ్మ మిక్కిలి సిగ్గుతో మనస్సులోనే చిరునవ్వు నవ్వుకొన్నది. ఆమె పల్కెను. "సుందరమైన గౌరవర్ణము కలవ్యక్తి లక్ష్మణుడు. అతడు నా చిన్న మరిది." అని పలికి రెండో వ్యక్తివైపు దృష్టిని సారించి కనుబొమ్మలను వంకరచేసి చక్కని నేత్రములను తిప్పి సైగచేసి ఏమియు చెప్పనట్లే చెప్పెను. అది చూచి స్త్రీ లెల్లరూ మిగుల ఆనందించిరి. వారు సీతమ్మ వారికి పాదాభివందనము చేసి "నీవు ప్రపంచమున్నంతవరకు సర్వదా ముత్తయిదువుగా ఉందువు గాక" యని ఆశీర్వదించిరి. "పార్వతివలె నీవు నీభర్తకు ప్రియురాలివగుదువు గాక!" అని దీవించిరి. "మా యందు దయకలిగియుండుము తిరుగు ప్రయాణములో ఈ మార్గముననే రమ్మని మాటిమాటికి మిమ్ములను ప్రార్థించుచున్నాము" అని బతిమాలుకొనిరి.



ప్రేమతో నిండిన వారెల్లరి వాక్యములను విని తన మృదుమధుర వచనములతో సీతమ్మ వారిని సంతోషపరచెను. లక్ష్మణుడు శ్రీరామచంద్రుని భావము గుర్తించి ప్రజలను త్రోవ అడిగెను. అది వినగానే స్త్రీ పురుషులు వారు వెళ్ళి పోయెదరని మిగుల దుఃఖించిరి. వారి నేత్రముల నిండా నీరు నిండెను. వారి ఆనందము మటుమాయమయ్యెను. చివరకు ఎట్లాగో ధైర్యము తెచ్చుకొని చక్కని మార్గమును వారికి తెలిపిరి. ప్రజలందరకూ ప్రియవచనములు చెప్పి సీతారామలక్ష్మణులు బయలుదేరిరి.

రామ వియోగముచే వ్యథిత హృదయులయిన ఆ స్త్రీ పురుషులు విధాతను అనేక విధాల నిందించసాగిరి. "విధాత నిర్దయుడు. చంద్రునకు వృద్ధి క్షయములు, కళంకము ఏర్పరచెను. కల్పవృక్షమును చెట్టుగాను, సముద్రపునీటిని ఉప్పగాను చేసివేసెను. కఠిన హృదయుడైన ఆ విధాతయే ఈ రాకుమారులను వనమునకు పంపెను. వీరిని అరణ్యవాసమునకు పంపి భోగవిలాసములను వ్యర్థముగనే సృష్టించెను. వీరు దర్భలు, ఆకులు పరచిన కటికనేలపై పరుండగా పరుపులను అత డెవరి కొరకు తయారు చేయించెను? వృక్షముల నీడలలో వీరికి నివాస మేర్పరచగా పెద్దపెద్ద భవనములను ఆ విధాత సృజించుట వ్యర్థమేగదా! కందమూల ఫలములను వీరు భుజించుచుండగా జగత్తులో మధుర మృష్టాన్నములను వ్యర్థముగనే చేయించెను."

కొందరు రామచంద్రుడు తనంతట తానుగా అవతరించెనని బ్రహ్మ వారిని సృష్టించలేదని చెప్పుకొనిరి. "పదునాలుగు లోకములలో కూడ

ఎంతగా వెదికిననూ రామలక్ష్మణుల వంటి పురుషులు, సీతాదేవి వంటి స్త్రీ ఎచటనూ ఉండరు." (కనుక వీరు బ్రహ్మ సృష్టికి భిన్నమైన వారు. తమ మహిమవల్లనే తాము అవతరించిన వారు) అని తలంచిరి.

"వీరితో సరియైన స్త్రీ పురుషులను సృష్టించుటకు ఎంత పరిశ్రమించినను విధాత వశముకాక పోయెను. కనుక అతడు వీరిని అడవికి పంపివేసెను. అతడు తన ఈర్ష్యను ఈ విధముగా ఫలింప చేసుకొనెను" అని కొందరు భావించిరి.

కొందరు "మనము చాలా ధన్యులము. వీరిని ప్రత్యక్షముగా చూడగలిగితిమి. ఇటువంటి సుకుమారులు, కఠినమైన అరణ్యమార్గములో ఎట్లు నడవగలుగుదురని వీరి మెత్తనిపాదముల స్పర్శచే భూదేవి తన కఠినత్వమునకు సిగ్గుపడుచున్నది. వీరికి జగదీశ్వరుడు వనవాసమే విధించి యున్నప్పుడు మార్గ మంతయును పుష్పములతో ఎందుకు నింపలేదు? జన్మించినందుకు, నేత్రములు కలిగియున్నందులకు మనము పూర్తిఫలితమును పొందగలిగితిమి." అని చెప్పుకొనుచుండిరి. మరికొందరు "వీరికి జన్మనిచ్చిన తల్లిదండ్రులు ధన్యులు. వీరు జన్మించిన నగరము ధన్యమైనది. వీరు నడచిన దేశము, పర్వతములు, వనములు, గ్రామములు ధన్యత గాంచినవి. ముందు శ్రీరాముడు, వెనుక లక్ష్మణుడు తపస్వివేషముతో శోభిల్లుచుండిరి. వారిరువురిమధ్యను సీతాదేవి బ్రహ్మ జీవుల మధ్యలో మాయవలె సుశోభితురాలయ్యెను."

శ్రీరామచంద్రుడు నడచునపుడు ఆయన అడుగుల నడుమ సీతమ్మ అడుగులువేయుచు రాముని పాదచిహ్నములను త్రొక్కకుండ వెళ్ళుచుండెను. లక్ష్మణుడు వారిరువురి చరణ చిహ్నములతో కూడిన నేలకు కుడిభాగమున నడచుచుండెను. ఆ విధముగా వెళ్ళుచుండగా సీతాదేవి అలసిపోయెనని గ్రహించిన శ్రీరామచంద్రుడు సమీపములోనున్న ఒక వటవృక్షము వద్ద విశ్రమించుటకై ఆగెను. కందమూలఫలములు భుజించి ప్రాతః కాలమున



స్నానాదికృత్యములను ముగించుకొని వారు ముందుకు బయలుదేరిరి. అందమయిన వనములు, చెఱువులు, పర్వతములు చూచుచు వారు వాల్మీకాశ్రమమును చేరుకొనిరి. ఆ ఆశ్రమమునుచూచి శ్రీరాముడు మిగుల ఆనందించెను. ఆ ఆశ్రమ సరోవరములో కమలములు, వాని మకరందమును గ్రోలు తుమ్మెదలు, వాని ఝంకారములు, కోలాహలము చేయు అనేక పశుపక్ష్యాదులు చూచుటకు మిగుల చక్కగానుండెను. శ్రీరాముని రాక విని వాల్మీకిముని వారిని తోడ్కొని పోవుటకు వచ్చిరి. శ్రీరామచంద్రుడు మునికి సాష్టాంగ దండ ప్రణామము చేసెను. ముని వారిని ఆశీర్వదించెను.

వాల్మీకి మహాముని ప్రాణప్రియులైన తన అతిథులకు మధురములయిన కందమూల ఫలములను తెప్పించెను. సీతారామలక్ష్మణులు అతిథ్యమును స్వీకరించిరి. వాల్మీకి శ్రీరామునివద్ద కూర్చొని శుభప్రదమైన వారి యాకారమునుచూచి మిగుల ఆనందించెను. రామచంద్రుడు చేతులు జోడించి ఇట్లుపల్కెను. "ఓ మునీశ్వరా! మీరు త్రికాలవేత్తలు. సంపూర్ణ విశ్వమును అరచేతిలో పెట్టుకొన్నటువంటివారు."

పిమ్మట శ్రీరామచంద్రప్రభువు కైకేయి ఏ విధముగా తమ్ము వనవాసమునకు పంపినదో ఆ కథనంతయు వివరముగ వినిపించెను. ఇంకను ఇట్లు పల్కెను. "ఓ మహర్షీ! తండ్రిగారి ఆజ్ఞను పాటించుట, తల్లిగారి హితవు, సోదరుడైన భరతుడు రాజగుట. తమవంటితపోధనుల దర్శనము లభించుట ఇదంతయు నా పూర్వజన్మ సుకృతముగా భావించుచున్నాను. తమకు మునులకు ఇబ్బందిలేకుండా ఉన్నచోట కొంతకాలము ఉండెదము. ఏలన తాపసులు ఎచ్చట దుఃఖము పొందెదరో అచ్చటి రాజు అగ్ని లేకుండానే భస్మమగును. కనుక అట్టిచోటు చెప్పండి. మేము అచటనే పర్ణకుటీరము నిర్మించుకొని కొన్ని రోజులు వసించెదము."

రామచంద్రుని సహజ సరళ మధుర వాక్యములు విని ముని యిట్లనెను. "తమరు ఇట్లు మాట్లాడక మరెట్లు మాట్లాడుదురు?" వేదధర్మమును

పాటించువారు మీరు. మీరూపము సామాన్యులకు ఆగోచరము. బుద్ధికి అందనిది. అపారమైనది. వర్ణనచేయుటకు వీలుకానిది.

ఆ మునీంద్రుని ప్రేమపూర్వక వాక్యములు విని రామచంద్రుడు మిక్కిలి ఆనందించెను.

వాల్మీకి రామునితో "మీకు అన్నియు తెలిసియుకూడా తెలియనట్లు అడుగుచున్నారు. చెప్పెదను. మీరు చిత్రకూట పర్వతమువద్ద నివాసము ఏర్పరచుకొనుడు. మీకు అన్నివిధముల సుఖము కలుగును. అది ఒక సుందరవనము. అచ్చట గల పశు పక్ష్యాదులు వైరము లేకుండా కలిసి మెలసి తిరుగుచుండును అచ్చట గంగానది ప్రవహించుచుండును. అత్రి మహాముని మొదలగువారు అచ్చట వసించుచున్నారు. జప తపోయాగములు చేసికొనుటకు అనువైనచోటు అది. చిత్రకూటమును మీ నివాసముచే పావనముచేయండి" అని పలికెను.

అది విని శ్రీరాముడు చాల సంతోషించెను. సీతారామలక్ష్మణులు మందాకినీ నదిలో స్నానము చేసిరి.

శ్రీరామచంద్రుడు పంచవటికి వచ్చి ఆగి "ఓ లక్ష్మణా! ఈ ప్రదేశము చాలా బాగున్నది. ఇచ్చట నుండిన బాగుండు ననెను. అనగా లక్ష్మణుడు "అచ్చటి పయస్విని నది తీరమున ఎత్తైన ప్రదేశము బాగున్న" దని రామునితో పలికెను.

దేవతల అదృష్టముచేత రామచంద్రుడు అచ్చట సుందరమైన ఆశ్రమమును లక్ష్మణునిచే నిర్మింపజేసెను. శ్రీరాముడు చిత్రకూటములో నివసించుటను విని మునులు, మహాత్ములు సంతోషపడుచు వచ్చిరి. వారందరికి రామచంద్రుడు నమస్కరించి వారి నెంతయో గౌరవించెను. "మీ మీ ఆశ్రమములలో జప తపో హోమములు ఇక నిర్భయముగ జరుపుకొనుడు" అని చెప్పగా వారందరు రాముని గుణగణములను గొప్పగా చెప్పుకొనుచు వెళ్ళిరి.



శ్రీరాముడు వనమునకు వచ్చెనని తెలిసి అచ్చటనున్న కోయలు, భిల్లులు మిగుల సంతోషించి కావిళ్ళతో కందమూలఫలములను తెచ్చి వారి ముందుంచి నమస్కరించగా రామచంద్రుడు వారి ప్రేమను చూచి ముగ్ధుడగుచుండెను. భిల్లులు, కోయలు ఇట్లు పలికిరి. "రామచంద్రా! మీదర్శనమైన తరువాత మే మందరము సనాతనులమైతిమి. ఇచ్చటనున్న పర్వతములు,నదులు, గుహలు, జలాశయములు మే మెరుగుదుము. అన్నియును త్రిప్పి మీకు చూపింతుము. మీరు విహరించుటకు వేటాడుటకు వీలుండును. అన్ని ఆనందములు కలుగును. మేము కుటుంబసమేతముగ మీసేవ చేయుదుము. మీరు మమ్ములను ఆజ్ఞాపించుటకు సంకోచపడకండి."

వేదములకు, మునులకు అందని కరుణానిధియైన రామచంద్రుడు కన్నతండ్రి చిన్ని బాలుర మాటలు వినుచున్నట్లు భిల్లుల మాటలు వినుచుండెను. తన ప్రేమ పూర్ణ వచనములతో వారందరిని సంతోషపరచుచుండెను. వారు ప్రభువునకు నమస్కరించి ప్రభువు గుణగణములను ప్రశంసించుకొనుచు తమ తమ యిండ్లకు వెళ్ళిపోయిరి.

శ్రీరామచంద్రుడు వనములో అడుగిడినప్పటినుండి వనము మంగళదాయక మయ్యెను. అనేకవిధములయిన వృక్షములు. ఫల పుష్పములతో కల్పవృక్షములవలె శోభిల్లుచుండెను. ఏనుగులు, సింహములు కోతులు, వరాహములు, జింకలు ఇవన్నియు తమవైరమును విడిచి సఖ్యముతో తిరుగుచుండెను. అవి శ్రీరాముని దివ్యశోభను చూచి మిగుల ఆనందము పొందుచుండెను.

గంగ, సరస్వతి, యమున, నర్మద, గోదావరి ఇత్యాది పవిత్ర నదులు, చెఱువులు, సముద్రము అనేక నదీనదములు, మందాకినీ నది గొప్పతనమును కొనియాడుచున్నవి. దేవతలు వసించే ఉదయాచలము అస్తాచలము కైలాసము, మందరాచలము, సుమేరువు హిమాలయము

మొదలగు అన్ని పర్వతములు చిత్రకూట పర్వతముయొక్క యశస్సును కీర్తించుచున్నవి.

లక్ష్మణుడు త్రికరణశుద్ధిగా రామచంద్రునికి సేవచేయుచుండెను. ప్రతిక్షణము అతడు సీతారాముల చరణములను సందర్శించుచు తనయందు వారికి గల ప్రేమను గుర్తించుచు స్వప్నములో కూడ తల్లిదండ్రులను, గృహమును జ్ఞప్తికి తెచ్చుకొనకుండ ఆనందముగ నివసించుచుండెను.

సీతారాములుకూడ అయోధ్యానగరమును కుటుంబమువారిని, గృహమును మరచి సంతోషముగ నివసించుచుండిరి. తన భర్తయైన శ్రీరాముని ముఖమును ప్రతిక్షణము చూచుచు చకోరపక్షి చంద్రుని చూచి ఆనందించినట్లు సీతాదేవి ఆనందపడుచుండెను. అచటి పశుపక్షులను ఆమె తమ కుటుంబము వారినివలె ప్రేమతో చూచుచుండెను. మునుల భార్యలను మునులను అత్తమామలవలెను కందమూలఫలములను అమృతాహారములుగాను సీతాదేవి తలంచుచుండెను.

శ్రీరామచంద్రుని స్మరించగలిగిన భక్తులు తమ భోగవిలాసములన్నింటిని గడ్డిపరకవలె విడిచిపెట్టుదురు. అట్టి రామచంద్రునకు పత్నియై జగత్తునకు తల్లియైన సీతాదేవి భోగవిలాసములను త్యజించుట ఏమంత ఆశ్చర్యము కాదు.

సీతాదేవి, లక్ష్మణునకు సుఖము కలుగునట్లు శ్రీరామచంద్రుడు మాటాడుచుండును. ప్రాచీనకథలను ప్రభువు వారికి చెప్పుచుండును. లక్ష్మణుడు సీతాదేవి వానిని ప్రేమతో విని ఆనందించుచుండిరి.

రామచంద్రునకు అయోధ్య జ్ఞాపకము వచ్చినపుడెల్ల తన తల్లి తండ్రి, సోదరులు, కుటుంబము, భరతునిప్రేమ, సేవాభావము గుర్తుకు వచ్చుచుండును, అప్పుడు ప్రభువు మిగుల దుఃఖించుచుండును. అది సమయముకాదని ధైర్యము తెచ్చుకొనుచుండును.



శ్రీరామచంద్రుడు దుఃఖపడుటచూచి సీతాలక్ష్మణులు మిగుల వ్యాకులపడుచుండిరి. వారి అవస్థను గాంచి రామచంద్రుడు వారికి పవిత్ర గాథలను చెప్పి ఆనందింపజేయుచుండెను. కంటిని రెప్పవలె సీతాలక్ష్మణులను ప్రభువు కాపాడుచుండెను. సీతాలక్ష్మణులు ప్రభువునకు భక్తితో సేవచేయుచుండిరి. ఈ విధముగ సీతారామలక్ష్మణులు మువ్వురును వనములో నివసించుచుండిరి.

ఇపుడు సుమంతుడు ఏ విధముగ అయోధ్యకు చేరుకొనెనో ఆ కథను వర్ణించెదను.

రామచంద్రునినుండి సెలవుగైకొని నిషాదరాజు తిరిగివచ్చినపుడు సుమంత్రుని చూచెను. అతనిని చూచి నిషాదుడు మిగుల దుఃఖించెను. నిషాదుడు ఒంటరిగా వచ్చుటను చూచి సుమంత్రుడు “అయ్యో! రామా! అయ్యో సీతా! అయ్యో లక్ష్మణా,” అని విలపించుచు రథమునుండి భూమిపై పడిపోయెను. గుర్రములు దక్షిణ దిశవైపు (రామచంద్రుడు వెళ్ళినవైపు) మాటి మాటికి చూచుచూ సకిలింపసాగెను. అవి మేతమేయుటలేదు, నీరు త్రాగుటలేదు. కన్నీరు కార్చుచుండెను. రామచంద్రుని గుర్రముల ఈ అవస్థను చూచి నిషాదు లందరూ బాధపడిరి.

నిషాదరాజు ఎట్టకేలకు ధైర్యము తెచ్చుకొని “ఓ సుమంత్రా! ఇప్పుడు విచారమును విడువండి. ధైర్యము వహించండి.” అని పలికి అనేక పూర్వ చరిత్రలను చెప్పి నిషాదరాజు సుమంత్రుని బలవంతముగా రథముమీద కూర్చుండబెట్టెను. కానీ శ్రీరాముని విరహవేదనవలన అతడు రథమును తోలలేక పోవుచుండెను. అదిచూచి నిషాదరాజు తన సేవకులను నలుగురిని పిలిచి సుమంత్రుని వెంటపంపెను. వారు రథముతో అయోధ్యకు బయలుదేరిరి. సుమంత్రుడు దుఃఖముతో చేతులు నలుపుకొనుచు, తలకొట్టుకొనుచు వ్యాకులపడుచుండెను''. అయోధ్యకు వెళ్ళి ఏమిచేయుదును? రామచంద్రుడు లేని రథమును ఎట్లు తోలుకొని వెళ్లెదను?

నగరములోని స్త్రీ పురుషులు రథమును జూచి పరుగెత్తివచ్చి అడిగిన ఏమి జవాబు ఇచ్చెదను? అమితదుఃఖముతో దుఃఖించుచున్న తల్లులు వచ్చి అడిగిన ఏమి చెప్పెదను?" అని దిగులుచెందెను.

సుమంత్రుడు ఈ ప్రకారము పరితపించుచుండగనే రథము తమసానదీ తీరమునకు వచ్చెను. మంత్రి నలుగురు నిషాదరాజులకు కృతజ్ఞతచెప్పి తిరిగిపంపి ముందుకు సాగిపోజాలక వ్యాకులపడుచు వెళ్ళుచుండెను. నగరములో ప్రవేశించుటకు దుఃఖపడెను. రాత్రివరకు ఒకచెట్టుక్రింద ఆగి చీకటి పడగనే అయోధ్యలో ప్రవేశించెను. రథమును రాజద్వారము వద్ద నిల్పి రాజమహలులోనికి వెళ్ళెను రథము చప్పుడును గుర్తించి గుఱ్ఱముల వ్యాకులత్వలము చూచి అంతఃపురమువారు నీరు తగ్గిన పిమ్మట మత్స్యములు విచార పడినట్లు మంత్రి ఒక్కడే వచ్చినందుకు అమితముగా దుఃఖించిరి. రాజమహలు భయంకర శ్మశానముగా కనపడుచుండెను. అమితదుఃఖముతో ఆర్తులు అడిగినమీదట సుమంత్రుడు యేమి సమాధానము చెప్పలేకపోయెను, ఎదుటకు వచ్చినవారిని సుమంత్రుడు "రాజు ఎచ్చట నున్నాడు?" అని అడిగెను.

మంత్రి మాటలు విని దాసీజనము వచ్చి సుమంత్రుని కౌసల్యా భవనమునకు తీసుకొనివెళ్ళిరి. సుమంత్రునకు అమృతములేని చంద్రునివలె రాజు కనిపించెను. మహారాజు భూషణములు లేకుండా ఉదాసీనముగా నేలమీద పడియుండెను. చింతతో ఏమియో తలపోయుచుండెను. రాజు క్షణక్షణమును ఆలోచనలు చేయుచూ దుఃఖించుచుండెను. "రామా రామా! రఘురామా! సీతా! లక్ష్మణా!" యని పలవరించుచుండెను. సీతారామ లక్ష్మణు లెక్కడ నున్నారు? వారిని తీసుకొని వచ్చితివా? లేక వారు వనమునకు వెళ్ళిపోయినారా? యని దశరథమహారాజు ఆవేగముతో సుమంత్రుని అడిగెను. "రాజ్యమును ఇచ్చెదనని చెప్పి వనవాసము ఇచ్చియుంటిని. ఇది వినికూడా రాముని మనస్సులో హర్ష విషాదములు



కలుగలేదు. అట్టి ఉత్తమ పుత్రుని వియోగములోకూడా నేను మరణించలేదు. నావంటి పాపాత్ముడు ఎవడుండును? సుమంత్రా! నా రామలక్ష్మణులు ఉన్నచోటుకు నన్నుకూడ తోడ్కొనిపొమ్ము. నేను జీవించదలచుకోలేదు. వారలను కనులార చూడగల్గే ఉపాయము చేయుము." అని వేదనతో పల్కెను.

అంత మంత్రి రాజుకు నమస్కరించి విషాదముతో నిట్లనెను. "రాజా! మీరు పండితులు, జ్ఞానులు, శూరులు, ధైర్యవంతులు. పెద్దల సాంగత్యము చేసినవారు. జననమరణములు, సుఖదుఃఖములు, త్యాగభోగములు, హాని లాభములు, సంయోగ వియోగములు, ఇవన్నియు కాలమునకు కర్మమునకు ఆధీనములు. పగలురేయి మాదిరిగా ఒకదాని వెంటఒకటి గడచుచుండును. మూర్ఖులు సుఖము కలిగినప్పుడు సంతోషించెదరు. విజ్ఞానులు రెండునూ సమానముగానే యెంచెదరు. తమరు బాగా ఆలోచించి శోకమును విడువండి" అని చెప్పి మరల నిట్లనెను. "రాజా! సీతారామలక్ష్మణులు మొదటిదినము తమసా నదీతీరమున మకాము చేసిరి. ఆ దినము స్నానముచేసి జలపానముచేసిరి. నిషాదరాజు వారికి ఎంతయో సేవచేసెను. ఆ దినము శృంగబేర పురములో గడపితిమి. రెండవరోజు ఉదయమున మఱ్ఱిపాలు తెప్పించి సోదరునితోకూడ రామచంద్రుడు జడలు దాల్చెను. నిషాదరాజు నావ తెప్పించెను. మొట్టమొదట సీతాదేవి యెక్కెను. తదుపరి రామచంద్రుడు ఎక్కెను. తరువాత లక్ష్మణుడు ధనుర్ధారియై రాముని ఆజ్ఞ తీసుకొని నావపై ఆసీనుడయ్యెను నా విషాదమునుచూచి శ్రీరామచంద్రుడు నాతో నిట్లనెను. "నాయనా! తండ్రిగారికి నా నమస్కారములు చెప్పుము. నేను పాదములమీద పడి మాటిమాటికి మ్రొక్కినట్లు చెప్పుము. తండ్రిగారిని నా కొరకు ఎంతమాత్రము చింతపడవద్దని విన్నవింపుము. వారి అనుగ్రహమువలన వనములో క్షేమముగా ఉండెదము. తల్లులకు నా నమస్కారములు చెప్పుము. నా తండ్రిగారు నన్ను గురించి ఆలోచించకుండా చేయుమని కుటుంబమువారికి గురువుగారికి నా మాటలుగా ప్రార్థించి

చెప్పుము. మహారాజుకు అనుకూలముగా నడచి ఆయనను సంతోషపెట్టుమని భరతుడు వచ్చిన మీదట చెప్పుము. రాజపదవి పొందినమీదట నీతి నియమములను వదలకూడదు. ప్రజానురంజకముగ పరిపాలనచేసి ప్రజల ప్రేమను చూరగొనుమని వానితో చెప్పుము. ఆ సమయమున లక్ష్మణుడు తండ్రినిగూర్చి కొంచెము కటువుగా మాటాడెను. అది విని రామచంద్రుడు లక్ష్మణుని మందలించి అతని మాటలు తండ్రిగారికి చెప్పవద్దని నాచేత ఒట్టువేయించుకొనెను. తర్వాత సీతాదేవి యేదో చెప్పబోయెను, కాని ప్రేమ వశమున చెప్పజాలక పోయెను. ఆ సమయమున రామచంద్రుని భావము నెరిగి నిషాదరాజైన గుహుడు నావ నడపెను. ఇటుల రామచంద్రుడు వెళ్ళిపోయెను. నేను ఇది అంతయు నిలచి చూచుచుంటిని. నా దుఃఖము ఏమని చెప్పుదును? రామచంద్రుని యిట్టి సందేశము తీసుకొని వచ్చి బ్రతికియుంటి" నని చెప్పి మంత్రి మరి మాటాడజాలకపోయెను. సారథి వాక్యములు విని రాజు భూమిమీద పడిపోయెను. వారి శరీరము తాపముతో మిగుల మండిపోవుచుండెను. రాణు లందరు విలాపము చేయుచుండిరి. ఆ విపత్తును ఏమని వర్ణింపగలము? ఆ దుఃఖమును చూచి దుఃఖము కూడా దుఃఖపడెను."

రాణివాసపు వారి దుఃఖమును విని అయోధ్య యావత్తు హాహాకారములతో నిండిపోయెను. రాజు ప్రాణము కంఠగతమయ్యెను. మణిలేని సర్పమువలె ఆయన బాధ పడుచుండెను. ఇంద్రియములు వికలములగుచుండెను. చెరువులోని నీరు ఎండిన తరువాత కమలములు వాడినట్లు మహారాజు పొందుచున్న దుస్సహ దుఃఖమును చూచి కౌసల్యాదేవి లోలోపల "ఇక సూర్యకుల భూషణుడు జీవించ"దని గ్రహించెను. అందుచే ఆమె ధైర్యము కలిగించే మాటలు చెప్పసాగెను. "మీరు బాగా ఆలోచించండి. రామచంద్రుని యెడబాటు అపార సముద్రమువంటిది. అయోధ్య నావవంటిది. తమరు దానికి కర్ణధారులు. కుటుంబము బంధు మిత్రులు



ప్రియజనులు యాత్రికులు దాని మీద ఎక్కికూర్చుండిరి. తమరు ధైర్యముతో నున్నయెడల అందరు ఈ దుఃఖ సముద్రమును దాటగలరు. లేనట్లయితే అందరు మునిగిపోయెదరు. ప్రియమైన స్వామీ! నా ప్రార్థన విని ధైర్యముతో ఉండండి. అనంతరము సీతారామలక్ష్మణులతో కలసి సుఖముగా ఉండవచ్చును."

ప్రియురాలు కౌసల్య వాక్యములు విని తపనపడుచున్న చేప చల్లని నీరు తగులగనే శాంతిని పొందినట్లు ధైర్యముతో రాజు లేచి కూర్చుండి యిట్లనెను. "సుమంత్రా! లక్ష్మణుడు ఎక్కడ? ప్రేమాస్పదుడైన రాముడెచ్చట? మా జానకి యేది?" రాజు ఇట్లు అనేకవిధములుగా ప్రలాపములు చేయసాగెను. ఆ రాత్రి అంతయు యుగముగా గడచెను ఆ సమయమున రాజుకు శ్రవణ కుమారుని తండ్రి పెట్టిన శాపము జ్ఞప్తికి వచ్చెను. జరిగిన చరిత్రనంతా వినిపించెను. దానిని వర్ణించుచు మరింత వ్యాకులపడెను. "రాముడు లేకుండా బ్రతుకుట వృథా. ఇక ఈ శరీరము ఎందుకు? నేను చేసిన ప్రతిజ్ఞ యిక నిర్వహించజాలను. రఘుకులమునకు ఆనందము కలుగచేయువాడు రాముడు దూరమైనాడు. జానకీ! లక్ష్మణా! రఘువీరా! రామచంద్రా! మీ వియోగము భరించి యింతవరకు జీవించితిని." అని విలపించెను. "రామా రామా! రామా!" యని పలుమార్లు స్మరించుచు రాజు శ్రీరాముని విరహముతో శరీరము వదలి స్వర్గమున కేగెను.

అతని నిర్మల యశము బ్రహ్మాండమంతా వ్యాపించెను. జీవించి యున్నప్పుడు శ్రీరాముని ముఖారవిందమును చూచుచూ అత డానందించెను. మరణించునపుడు కూడ ఆ రాముని విరహములోనే మరణించెను. రాణులందరు రాజుగారి రూప గుణ శీల శౌర్య పరాక్రమములు చెప్పుకొనుచు మిగుల దుఃఖించుచుండిరి. నగరవాసులందరు ఇట్టి సత్యసంధుడైన రాజు మరియొకడు లేడని యేడ్చుచుండిరి. లోకమంతా అంధకారము చేసెనని కైకను దూషించుచుండిరి. ఆ రాత్రి గడచెను.

ఉదయము కాగానే గొప్ప గొప్ప ఋషులు, జ్ఞానులు, మహాజనులు దుఃఖించుచు వచ్చిరి. వారందరికి వశిష్ఠులవారు సమయానుకూలముగ హితవాక్యములు చెప్పి తన ప్రజ్ఞా ప్రాభవముచేత వారి దుఃఖమును దూరము చేసిరి. వశిష్ఠులవారు ఒక నావ తెప్పించి పూర్తిగా నూనె పోయించి అందు రాజుగారి మృతకళేబరము పెట్టించెను. పిమ్మట దూతలను పిలిపించి మీరు వెంటనే భరతుని వద్దకు వెళ్ళి రాజుగారి మరణవార్త అతనికి చెప్పకుండా గురువుగారు వెంటనే రమ్మని చెప్పిరని చెప్పి తొందరగా తీసుకొని రండి" అని చెప్పెను. దూతలు వాయువేగముతో పరుగెత్తగల గుఱ్ఱములను ఎక్కి వెంటనే వెళ్ళిరి.

అయోధ్యలో ఈ అనర్థము జరుగగానే అచ్చట భరతునకు అపశకునములు కలుగుట మొదలయ్యెను. రాత్రి భయంకరస్వప్నములు వచ్చుచుండెను. అందువలన అతని మనస్సు కలత చెందుచుండెను. దాని శాంతి కొఱకు బ్రాహ్మణులకు భోజనములు పెట్టించెను. దానములు చేసెను. రుద్రాభిషేకములు కావించెను. మా తల్లిదండ్రులను, సోదరులను, కుటుంబమును క్షేమముగా రక్షించుమని పరమేశ్వరుని ప్రార్థించుచుండెను.

ఇట్లు భరతుడు చింతిల్లుచుండగా దూతలు అతనిని సమీపించి గురువుగారి ఆజ్ఞను విన్నవించిరి. వెంటనే వినాయకుని ప్రార్థించి భరత శత్రుఘ్నులు బయలుదేరిరి. గాలిని మించిన వేగముతో వెళ్ళు గుఱ్ఱములను అధిష్ఠించి పెద్దపెద్ద నదులు, పర్వతములు, అడవులు దాటుకొనుచు అయోధ్యకు వచ్చుచుండిరి. మనస్సులో మిగుల విచారించుచుండిరి. ఎగిరి యెప్పుడు అయోధ్యలో వాలుదుమా యని పరితపించుచు నిమిష మొక యుగముగ తలచుచుండిరి. భరత శత్రుఘ్నులు నగర సమీపమునకు చేరిరి. నగరములో ప్రవేశించినప్పుడు అనేక అపశకునములు కలుగసాగెను. ఉండ కూడనిచోట ఉండి కాకులు చెడ్డగా కూయుచుండెను. గాడిదలు, నక్కలు విపరీతముగ అరచుచుండెను. అది విని భరతుడు మనస్సులో చాలా



బాధపడుచుండెను. అతనికి అయోధ్యలోని చెరువులు, నదులు, తోటలు, శోభాహీనముగా కనిపించుచుండెను. నగరమంతా భయంకరముగ కనిపించెను. శ్రీరాముని వియోగములో అందరు బాధపడుచుండిరి. పక్షులు పశువులు మేత మేయక, నీరు ముట్టక వ్యాకులపడుచుండెను. జంతువులే యిట్లు వ్యాకులపడుచుండగా, అయోధ్య ప్రజల సంగతి ఏమి చెప్పెదము? జనులందరు తమ సంపత్తి కోల్పోయినట్లు వాపోవుచుండిరి.

నగరవాసులు ఎదురుపిడనను భరతునితో మాటాడకుండా జోహారుచేసి తొలగిపోవుచుండిరి. భరతుడుకూడా కుశల ప్రశ్నలు అడుగుట లేదు. ఎందుకనగా వారు ఏమి చెప్పెదరో యని భయపడి ముందుకు వెళ్ళుచుండెను. బజారులు, వీథులు చూచుటకు భయంకరముగా కనపడుచుండెను. దిశలు దావాగ్నివలె మండుచుండెను.

పుత్రుడు వచ్చుచున్న వార్త విని కైక ఆనందముతో భూషణములు, సుందర వస్త్రములు అలంకరించుకొని సఖులతో, చెలికత్తెలతో ముందుకు వచ్చెను. హారతి యిచ్చుటకు ద్వారము వద్దకు వచ్చి వారిని కలిసెను. వారిద్దరిని భవనములోనికి తీసుకొని వచ్చెను. భరతుడు మంచుపడిన కమలములవలె నున్న వారి కళావిహీనమైన ముఖములను చూచెను. ఒక్క కైక మాత్రమే సంతోషముగ కనబడుచుండెను. భిల్లాంగన అడవిలో నిప్పుబెట్టి మండుచుండగా ఆనందపడుచు ఎగురుచున్నట్లు ఆమె మనస్సు ఆనందాతిశయముతో నాట్యము చేయుచుండెను.

భరతుని ఉదాసీన ముఖమును చూచి కైక "తాతగారి యింటివద్ద అందరు క్షేమము గదా" యని అడిగెను. అందరు క్షేమముగా నున్నారని చెప్పుచు తిరిగి యిచ్చటి వారందరి క్షేమమును భరతుడు ఆదుర్దాగా అడిగెను.

"అమ్మా! తండ్రిగా రెచ్చట నున్నారు? తల్లు లెచ్చట నున్నారు? వదినగారెచ్చట? ప్రియమైన సోదరులు రామలక్ష్మణులు ఎచ్చటనున్నారు? కనపడరేమి?"

ఇట్లు పలుకుచున్న పుత్రుని ప్రేమ వాక్యములు విని కపటభావముతో కన్నీరు తుడుచుకొనుచు పాపాత్మురాలైన కైక భరతుని చెవులకు శూలముపోట్లు పొడిచినట్లు ఇట్లు జవాబు చెప్పెను. "నాయనా! నీ పని యంతయు నేనే పూర్తి చేసితిని. మనకు మంథర సహాయపడెను. మధ్యలో విధాత చెడగొట్టెను కనుక మహారాజు దేవలోకమునకు చేరెను."

భరతుడు తండ్రి మరణవార్త వినగానే అమిత విషాదముతో "తండ్రీ! తండ్రీ!" యనుచు నేలమీద కూలి ఏడ్వసాగెను. "తండ్రీ! మీరు మరణించు సమయమున నేను మీవద్ద లేకపోయితిని. నన్ను అన్నగారికైన అప్పగించకపోతిరి. నేనెంత దురదృష్టవంతుడను?" అని ఏడ్చుచు తిరిగి సంబాళించుకొని లేచి "అమ్మా! తండ్రిగారి మరణమునకు కారణము ఏమిటమ్మా!" అని ప్రశ్నించెను.

పుత్రుని దుఃఖమును చూచి కైక మనస్సును నిబ్బరించుకొని తాను చేసిన పనులన్నియు వివరముగా చెప్పెను. శ్రీరామచంద్రుని వనగమనమును విని భరతుడు తండ్రి మరణమును మరచిపోయెను. జరిగిన అన్ని అనర్థములకు కారకుడు తానేయని తెలిసికొని నిశ్చేష్టుడయ్యెను. పుత్రుని వ్యాకులత్వమును చూచి కైకేయి గాయముమీద ఉప్పు చల్లినట్లు ఇట్లు చెప్పెను. ''నాయనా! మహారాజు విషయములో ఏమియును విచారించనక్కరలేదు. మీ తండ్రిగారు పుణ్యవంతులు; యశఃకాములు; చిరకాలము భోగము లనుభవించిరి; జన్మించినందుకు జన్మసార్థకము చేసికొనిరి; అంత్యకాలమున స్వర్గలోకము చేరిరి. కనుక వారిని గురించి చింత వదలి నీవు సుఖముగ రాజ్యపాలనము చేయుము."

రాజకుమారుడు భరతుడు తల్లి మాటలు విని పక్వమునకు వచ్చిన గాయము మీద నిప్పురవ్వ పడినట్లు సహించలేకపోయెను. తిరిగి ధైర్యము వహించి యిట్లనెను. "ఓసీ! పిశాచీ! నీవు నన్ను అన్ని విధముల నాశనము చేసితివి. నీకు ఇట్టి దుర్బుద్ధి యేల పుట్టినది? పుట్టినప్పుడే నన్ను ఎందుకు



చంపలేదు? చెట్టును నరికి ఆకులకు నీరు పోసినట్లయినది. నాకు హితమని, నీవు అహితము చేసినావు. సూర్యవంశము వంటి ఉన్నతవంశము నాది. దశరథునివంటి మహనీయుడు నా తండ్రి. రామలక్ష్మణులు నా సోదరులు. నాకు జన్మ యిచ్చిన తల్లివైతివి. నిన్నేమి చేయుదును? ఓ దుష్టురాలా! నీలో ఈ దుర్బుద్ధి కలిగినపుడే నీ హృదయము ముక్కలుగా ఎందుకు పగిలిపోలేదు? వరములను కోరు సమయమున నీ మనస్సులో కొంచెమైన బాధ కలుగలేదా? నీ నాలుక తెగిపోలేదేమి? మహారాజు నిన్నెట్లు నమ్మెను? మహారాజు మరణించు సమయము సమీపించగా వారి బుద్ధిని విధాత మార్చియుండవచ్చును. స్త్రీల స్వభావము విధాత కూడా తెలిసికొనలేడు. అది మోసము, పాపముతో కూడిన అవగుణములకు పుట్టినిల్లు. మహారాజు బుద్ధిశాలి, సరళస్వభావము కలవాడు, ధర్మపరాయణుడు. అట్టివాడు నీ స్వభావమును ఎట్లు తెలిసికొనగలడు? జగత్తులోని జీవజంతువులు కూడ రాముని ప్రేమించునే! అట్టి సుగుణాభిరాముడు, రాముడు నీకు విరోధి అయ్యెనా? నీ వెవతెవు? నీ ముఖము నాకు చూపకుము! ఇచట నుండకుము! వెళ్ళిపొమ్ము! మా సోదరుల మిత్రత్వము చూడజాలక విధాత విరోధము కల్పించినాడు. నా వంటి పాపాత్ముడు మరొకడు లేడు. నిన్ను నిందించిన ఉపయోగ మేమున్నది?"

తల్లి కుతంత్ర మంతయును విని శత్రుఘ్నుని శరీరము క్రోధాగ్నితో మండిపోవుచుండెను. అతని మనస్సు అతని వశము తప్పెను. ఆ సమయమున వివిధాలంకార భూషితురాలై మంథర అచ్చటికి వచ్చెను. ఆమెను చూచి శత్రుఘ్నుడు క్రోధము ఆపుకొనలేకపోయెను. అగ్ని మీద నెయ్యిపోసినట్లు మండిపడి దాని గూని మీద గట్టిగా ఒక్క తన్ను తన్నెను. ఆ దుష్టురాలు అరచుచు నేలమీద బోరగిల పడిపోయెను. దాని గూని విరిగెను. తల బొప్పిగట్టెను. పళ్ళు రాలెను. నోటి నుండి రక్తము కారసాగెను. మంథర ఏడ్చుచు "నేను ఎవరికి ఏమి చెరుపు చేసితిని? పుణ్యానికి పోతే పాపము వచ్చినట్లున్నది" అని పలికెను.

శత్రుఘ్నునకు నఖశిఖపర్యంతము కోపము వచ్చి దాని కొప్పు పట్టుకొని బటబట ఈడ్వసాగెను. దయానిధియైన భరతుడు అడ్డుపడి విడిపించెను. సోదరు లిరువురు కౌసల్య వద్దకు వెళ్ళిరి. కౌసల్య పాతచీర కట్టుకొనియుండెను. దుఃఖభారముతో ఆమె శరీరము శుష్కించిపోయెను. ఆమె ముఖము కళావిహీనముగ కన్పించెను.

భరతుని చూడగనే కౌసల్య లేచి అతనివైపు పరువెత్తెను. కాని కన్నులు తిరుగుటచే ఆమె భూమిమీద పడిపోయెను. అది చూచి భరతుడు దుఃఖించుచు వెళ్ళి తన్ను తాను మరచి ఆ తల్లి పాదముల మీద పడెను "అమ్మా! నా తండ్రిగారు ఏరి? వారిని చూపించు? మా వదిన సీతమ్మ. ప్రేమాస్పదులైన రామలక్ష్మణులు ఎచ్చట ఉన్నారమ్మా? చూపించవూ? కైకేయి లోకములో ఎందుకు పుట్టెను? కర్మవశమున జన్మించినను. గొడ్రాలైన కాకూడదా? కులమునకు కళంకము, ప్రియజనులకు ద్రోహినినైన నావంటి పుత్రుని ఏల కనెను. ముల్లోకములలో నా వంటి అభాగ్యుడు లేడు. నీకు ఈ దశ కలుగుటకు కారణము నేను. తండ్రిగారు స్వర్గమునకు వేంచేసిరి. రామలక్ష్మణులు వనమునకు వెళ్ళిపోయిరి. కేతువువలె ఈ యన్ని అనర్థములకు నేనే కారణము. నేను జీవించుట ధిక్కారము. వెదురు వనములో అగ్నివలె నేను ఈ రఘువంశములో జన్మించితిని. నీ దారుణ దుఃఖమునకు కారకుడనైతిని" అని పరిపరివిధముల వాపోయెను.

భరతుని దీన వాక్యములు విని తల్లి కౌసల్య సంబాళించుకొని లేచి భరతుని లేవదీసి కౌగిలించుకొని కన్నీరు కార్చుచు "రామచంద్రుడు తిరిగివచ్చినాడా" యన్నట్లున్న భరతుని శత్రుఘ్నుని ఓదార్చెను. శోకము, ప్రేమ, హృదయములో సమానముగ నెంచెను. అక్కడ చేరిన వారందరును కౌసల్య భావమును చూచి "శ్రీరాముని తల్లి స్వభావము ఇట్లెందుకు ఉండదు?" అనుకొనిరి.

తల్లి కౌసల్య భరతుని ఒడిలో కూర్చుండ బెట్టుకొని కన్నీరు తుడిచి కోమల వచనములతో ఇట్లనెను "కుమారా! ఇప్పుడు నీవు ధైర్యముగా



నుండుము. మంచిరోజులు గడచిపోయినవి. దుఃఖమును వదలుము కర్మను దాటుట ఎవరితరము కాదు. నాయనా! ఎవరిని ఏమనకుము విధాత నా జీవితమును అన్ని విధముల తలక్రిందులు చేసెను. ఇంతటి దుఃఖములో కూడ ఇంకను బ్రతికియే ఉన్నాను. ఇంకా యెన్ని కష్టములు పెట్టతలచెనో ఎవరికి ఎఱుక? తండ్రి ఆజ్ఞచే శ్రీరామచంద్రుడు వస్త్రభూషణములు వదలివేసి వల్కలములు ధరించెను. కాని వాని హృదయములో ఎంతమాత్రము విషాదము లేదు. వాని ముఖము ప్రసన్నముగనే ఉండెను. ఆసక్తి, ద్వేషము లేవు. సంతోషముతోనే వనమునకు వెళ్ళెను. సీతాదేవి కూడ వానితో బయలుదేరెను. రామచంద్రుని పాదానురాగిణియైన ఆమె యిచ్చట ఎట్లుండగలదు? లక్ష్మణుడు కూడా రామునివెంట బయలుదేరి వెళ్ళెను. లక్ష్మణుని అయోధ్యలోనే ఉంచుటకు రాముడెంతో ప్రయత్నించెను. కాని అతడు వినలేదు. రామచంద్రుడు అందరికి నమస్కరించి సీతాలక్ష్మణులను వెంట తీసికొని వెళ్ళిపోయెను. వారు ముగ్గురు వెళ్ళిపోయిరి. కాని నేను మాత్రము వారి వెంట పోలేదు. ఇది అంతయు నా కండ్ల ఎదుటనే జరిగిపోయెను. అయినను ఈ అభాగ్యురాలి ప్రాణములు ఈ శరీరమును విడిచిపోలేదు నా ప్రేమను చూచి నేను సిగ్గుపడుట లేదు. రాముని కన్న తల్లిని! ఎట్లు బ్రతక వలెనో, ఎట్లు మరణించవలెనో రాజుకే చెల్లినది. నా హృదయము వజ్రము కంటె కఠినమైనది."

కౌసల్య వాక్యములు విని భరతుడు, రాణివాసపు వారెల్లరు విలపించసాగిరి. రాజప్రాసాద మంతయును శోకముతో నిండిపోయెను. భరత శత్రుఘ్నులు మరింతగా దుఃఖింపసాగిరి. అంత కౌసల్య భరతుని దగ్గరకు తీసికొని అనేక విధములుగా ఊరడించెను భరతుడు తల్లులకు వేద పురాణములందలి పెక్కు చక్కని కథలు వినిపించెను. అతడు చేతులు జోడించి పవిత్ర హృదయముతో "తల్లిదండ్రులను, పుత్రులను చంపుట వలన, గోశాలలను, బ్రాహ్మణుల నివాసములను భస్మముచేయుట వలన,

స్త్రీలను బాలకులను హత్యచేయుట వలన, మిత్రునకు, రాజునకు విషము పెట్టుట వలన ఏ పాపము వచ్చునో మనోవాక్కాయ కర్మలచే చేయబడిన ఎన్ని మహా పాపములు కలవో అవన్నియు రాముని వనవాసమునకు పంపుటలో నా సంబంధము ఏమైననున్నచో నాకు లభించుగాక!" అని పలికెను.

కౌసల్య భరతుని స్వభావమును, సత్య నిరతిని, సరళతను గ్రహించి అతనిని మెచ్చుకొనుచు ఇట్లనెను. "నాయనా! నీవు మనోవాక్కాయముల సర్వదా రాముని భక్తుడవు. రాముడు కూడ నిన్ను ప్రాణముతో సమానముగ ప్రేమించును. మంచు అగ్ని వర్షము కురిసిన కురియుగాక! నీవు ఎన్నడును రామునికి ప్రతికూలముగ నడచువాడవు కావు. రామవనవాసములో మీకు పాత్ర యున్నదని చెప్పిన వారికి స్వప్నములో కూడ సుఖము, సద్గతి లభించవు." ఇట్లు చెప్పుచు ఆమె భరతుని కౌగిలించుకొనెను.

ఇట్లు కూర్చుండి మాటలాడుచుండగనే రాత్రి గడచెను. వశిష్ఠ వామ దేవాదిమునులు వచ్చిరి. మహాజనులను, మంత్రులను పిలిపించిరి. వశిష్ఠుల వారు అనేక పరమార్థములను ఇతిహాసములను చెప్పి "నీవు ధైర్యము వహించుము. నేడు ఏ కార్యము అవసరమో అది ముందు చేయుము." అని భరతున కుపదేశించెను గురువుగారి వాక్యములు విని భరతుడు లేచి అవన్నియు తయారుచేయుడని చెప్పెను.

వేద విహితముగ రాజు మృత దేహమును స్నానము చేయించిరి. విచిత్రమైప విమానమును సిద్ధము చేయించిరి. భరతుడు తల్లులందరి పాదములు పట్టుకొని ప్రార్థించి పతితో సతులు సహగమనము చేయకుండ ఆపెను. రాణులు కూడ రామచంద్రుని దర్శనాభిలాషతో ఒప్పుకొనిరి. చందన సుగంధ ద్రవ్యములతో సరయూనది తీరమున మహారాజు శరీరమును దహనము చేసిరి. అందరు విధి పూర్వకముగ స్నానము చేసి తిలాంజలి యిచ్చిరి. వేద పురాణములు చెప్పినట్లు భరతుడు తండ్రిగారికి దశ దినములు



అపర కృత్యములు నెరవేర్చెను. ముని వశిష్ఠుల వారు చెప్పినట్లు చేసెను. శుద్ధుడైన పిమ్మట అన్నదానము చేసి గోవులు, గుఱ్ఱములు, ఏనుగులు, వాహనములు, సింహాసనములు, ఆభరణములు, వస్త్రములు, భోజనములు అందరికి సంతృప్తిగా ఇచ్చెను.

వశిష్ఠుల వారు వచ్చి మహాజనులను, మునులను మంత్రులను అందరిని పిలిచెను. అందరు రాజసభలో వచ్చి కూర్చుండిరి. అప్పుడు వశిష్ఠముని భరత శత్రుఘ్నులను పిలిపించి తన యొద్ద కూర్చుండ బెట్టుకొని నీతి ధర్మములతో కూడిన వాక్యములను ఇట్లు చెప్పెను. మొట్ట మొదట కైకేయి కుటిలత్వమును చెప్పి రాజుగారి రాజ ధర్మము, సత్య వ్రతమును ప్రశంసించిరి ప్రాణము త్యజించి ధర్మమును నిలబెట్టిరని చెప్పిరి. శ్రీరామచంద్రుని గుణశీలములు, స్వభావమును వర్ణనచేయు చుండగా మహర్షి నేత్రముల నుండి బాష్పములు కారెను. తిరిగి సీతా లక్ష్మణులు గొప్పతనము చెప్పి శోక, ప్రేమలలో మునిగిపోయిరి. ముని దుఃఖించుచు నిట్లనెను. ఓ భరతా! విధి చాల బలవత్తరమైనది. దానిని దాటుటకు ఎవరి తరము కాదు. జీవన్మరణములు, హాని వృద్ధులు, కీర్తి, అపకీర్తులు, ఇవన్నియు విధాత చేతిలో నున్నవి. నీవు అట్లు భావించి ఎవరి మీదను దోషము వేయకుము. మహారాజు దశరథుని విషయములో విచారింప పనిలేదు. ఎవరి సంగతి ఆలోచించవలెననగా వేదమును చదువని బ్రాహ్మణుని గురించి, తమ ధర్మములను మరచి విషయ భోగములలో నిమగ్నులైయున్న వారిని గూర్చి, నీతి తెలియని వారిని గురించి, ప్రజల ప్రేమకు పాత్రుడు గాని రాజును గురించి, ధనవంతుడైనను, లోభిగా నుండి అతిథి సత్కారముచేయని వైశ్యుని గురించి, జ్ఞానిగా గర్వించెడి శూద్రుని గురించి భర్తను మోసగించెడి కుటిల స్వభావురాలు, కలహప్రియురాలైన స్త్రీని గూర్చి, బ్రహ్మచర్య వ్రతమును విడిచిపెట్టి గురునాజ్ఞానుసారము నడవని బ్రహ్మచారిని గూర్చి, మోహాలలో కర్మ మార్గమును విడిచిన గృహస్థుని గూర్చి, జ్ఞాన

వైరాగ్యములులేని సన్యాసిని గూర్చి విచారించవలయును. కోసల రాజు దశరథుని గురించి ఆలోచింప వలసినవని లేదు. వారి ప్రభావము, గొప్ప తనము వర్ణనాతీతము. పదునాలుగు లోకములలో వారికి సమానమైన రాజు మరొకడు లేడని చెప్పుకొనుచున్నారు. త్రిమూర్తులు కూడ వారు చేసిన పనులను కథలుగా చెప్పుకొనుచుందురు. రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల వంటి పుత్రులను కన్న భాగ్యశాలి మన మహారాజు అన్ని విధముల అదృష్టవంతుడు. వారి కొరకు విషాదపడుట వ్యర్థము. వారు చెప్పినట్లు వ్యవహరించుట ధర్మము. రాజుగారు ఆయన రాజ్య పదవి నీకు ఇచ్చిరి. తండ్రిగారి మాట నిలబెట్టుము. ఆయన మాట కొరకు ప్రియమైన ప్రాణము వదలెను. మహారాజుగారికి తన ప్రతిజ్ఞ ప్రియము కాని, ప్రాణము ప్రియము కాదు. కనుక నీవు తండ్రి చెప్పిన మాట పాటించుము. అందువలన నీకు అన్ని విధముల మేలు కలుగును. పరశురాముడు తండ్రి ఆజ్ఞ ప్రకారము తల్లిని సంహరించెను. ఆ సంగతి లోక విదితమే. యయాతి పుత్రుడు తన తండ్రికి తన నవయౌవనము నిచ్చెను. "ఉచితమా? అనుచితమా?" యని సందేహింపక తండ్రి ఆజ్ఞను పాలించుము. ఇహ పరములలో సుఖము పొందెదవు. స్వర్గములోను ఉన్న మీ తండ్రిగారు కూడ సంతోషించెదరు. తండ్రి ఎవరికి రాజ్యము ఇచ్చెదరో వారే రాజ్యము పరిపాలించుటలో తప్పు లేదు. దుఃఖమును వదలుము. నా మాట వినుము. ఇది విని సీతారాములు సంతోషించెదరు. ఇది పండితులు కూడ అనుచితమని చెప్పరు. కౌసల్యాది తల్లులు, ప్రజలు సంతోషముతో సుఖించెదరు. నీకు రామచంద్రునికి గల సంబంధము ఎరిగిన వారు సంతృప్తి చెందెదరు. శ్రీరామచంద్రుడు వనము నుంచి తిరిగి వచ్చిన పిమ్మట రాజ్యము వారికి అప్పగించి ప్రేమతో వారికి సేవ చేయుము."

మంత్రి చేతులు ముకుళించి యిట్లు ప్రార్థించెను. "గురువు గారి ఆజ్ఞ తప్పక పాటించుము. రామచంద్రుడు తిరిగి వచ్చిన మీదట మీ యిష్టము వచ్చినట్లు చేయవచ్చును."



ధైర్యము తెచ్చుకొని కష్ట సుఖములు ఆలోచించి తల్లి కౌసల్యయిట్లు చెప్పెను. "నాయనా! భరతా! గురువుగారి ఆజ్ఞను తప్పక ఆచరించవలెను. కాలము ననుసరించి విషాదము వదలుము. శ్రీరామచంద్రుడు వనములో నున్నాడు. మహారాజు స్వర్గములో నున్నారు. నీవు ఏమియు పట్టించుకొనుట లేదు. పుత్రా! కుటుంబము, ప్రజలు, మంత్రులు మా అందరికి ఇప్పుడు నీవే దిక్కు. మనకు విధాత ప్రతికూలుడు. కాలమా కఠినము. ఆలోచించి ధైర్యము వహించుము. గురునాజ్ఞను శిరసావహించి చెప్పినట్లు కర్తవ్యనిర్వహణమునకు, పూనుకొనుము. కుటుంబ దుఃఖమును పారద్రోలుము."

భరతుడు గురువుగారి వాక్యములను, మంత్రి ప్రార్థనను, కౌసల్య ఉపదేశమును విని ఊరట చెందెను. ఆయన హృదయము చల్లబడెను. తరువాత భరతుడు శీలము, ప్రేమ సరళ రసములో కరుగునట్లు కరిగిపోయెను. తల్లి కౌసల్య వాక్కులు విని భరతుడు వ్యాకులపడెను. నేత్ర కమలముల నుండి ప్రేమాశ్రువులు రాల్చుచు దీన వదనుడై స్వాభావిక ప్రేమతో ధైర్యము ధరించి అమృతములో కరగి పోసినట్లు వినయముతో నిట్లు జవాబు చెప్పెను. "గురువుగారు నాకు మంచి ఉపదేశము చేసిరి. ప్రజలు, మంత్రులు మొదలగు వారందరు వారి వాక్కులను బలపరచిరి. తల్లి కూడ ఉచితమైన మాట చెప్పెను. వారు ఏమి చెప్పిరో అట్లే నేను కూడ ఆచరించుట మంచిది. ఏలయన గురువు, తల్లి, తండ్రి, స్వామి, మొదలగు వారు చెప్పిన మాటలు సంతోషముగ ఆచరించవలెను. మంచిదా? చెడ్డదా? యని ఆలోచించుట కూడ గొప్ప తప్పిదమే. తమరు నాకు మంచి శిక్షణ యిచ్చితిరి ఏది ఆచరించుటవలన నాకు మేలు కల్గునో అదే మీరు చెప్పుచున్నారు. నేను ఈ విషయము బాగుగా తెలిసికొనియున్నాను. అయినను అది అసంతృప్తి కలిగించుట లేదు. తమరు కూడ నా ప్రార్థన వినండి. నా యోగ్యతను బట్టి నాకు చెప్పండి. నేను తిరిగి సమాధాన

మిచ్చుచున్నందుకు క్షమించండి దుఃఖముతో విన్నవించు వారి తప్పొప్పులను ఉత్తములు పరిగణించరు. తండ్రిగారు స్వర్గమునకు వెళ్ళిరి. సీతారాములు వనమునకు వెళ్ళిరి. అందువలన మీరు నన్ను రాజ్యము చేయుమని కోరుచున్నారు. ఇందులోనే నాకు క్షేమ మున్నదని చెప్పుచున్నారు. రాజ్యము మీద ఆశ యుండవలసినదే. కాని సీతాపతియైన శ్రీరామ చంద్రునికి సేయచేయుట యందే నా క్షేమము ఇమిడి యున్నది. దానిని నా తల్లి తన కుటిలత్వము చేత ధ్వంస మొనరించెను. ఏ యితర ఉపాయముల వలన నాకు క్షేమము లేదు. కుటిలోపాయము ద్వారా వచ్చే యీ రాజ్యము ఏ పాటి విలువైనది? నగ్నముగానున్న వారు ఆభరణాలు ఎన్ని అలంకరించుకొన్నను వ్యర్థము. వైరాగ్యము లేకుండ బ్రహ్మ విచారణ ఎంత చేసినా వ్యర్థమైనట్లు సీతారామలక్ష్మణులు లేనిదే శోకము ద్వారా లభించిన యీ రాజ్యము వ్యర్థము. రోగులు వివిధ భోగములు అనుభవించ జాలరుగాన వారి కవి వ్యర్థము. శ్రీహరి భక్తి లేనిదే జపము, తపము, యోగము వ్యర్థము. జీవము లేనిదే శరీర మెంత సుందరమైనా వ్యర్థము. అట్లే శ్రీ రఘునాథుడు లేనిదే నా సర్వస్వము వ్యర్థము.

శ్రీరాముని సన్నిధికి వెళ్ళుటకు నన్ను ఆజ్ఞాపించండి నన్ను రాజుగా చేసి మీరు మేలు పొందగోరుచున్నారు. ఇది మోహవశులై చెప్పుచున్న మాట. కైకేయి పుత్రుడను. కుటిల బుద్ధిగల వాడను, రామ విముఖుడను. ఇట్టి అధముని రాజ్య పాలనలో మీరు మోహము వలన సుఖము పొంద గోరుచున్నారు. ధర్మశీలుడే రాజు కావలయును. మీరు పట్టు పట్టి నాకు పట్టము గట్టినచో ఆ వెంటనే భూమి పాతాళానికి క్రుంగి పోగలదు. నా మూలముగానే సీతారాములకు అరణ్య వాసము తటస్థించెను. నా వంటి పాపాత్ముడు మరి యొకడు ఈ మహీ మండలములో నుండునా? తండ్రిగారు శ్రీరామ చంద్రుని వనమునకు పంపి వారి వియోగముతో స్వర్గమునకు వెళ్ళిపోయిరి. ఇన్ని అనర్థములకు కారకుడనైనను అన్నగారు లేని



రాజమందిరమును చూచి కూడా ప్రపంచములోని ప్రజలు చేయు పరిహాసములను సహించి యింకా ప్రాణములతో జీవించి యున్నాను. కారణము వల్ల కార్యము కఠినమగును. ఇందులో నా దోషము లేదు. ఎముకకంటే వజ్రము, రాయికంటే ఇనుము కఠోరముగా నుండును. కైకేయి నుండి జన్మించిన యీ శరీరమును ప్రేమించెడి పామరులు పూర్తిగా దురదృష్టవంతులు. ప్రియతముని వియోగములో కూడా నా ప్రాణములే యింకా నాకు ప్రియముగా నున్నవి. మా తల్లి కైకేయి సీతా రామ లక్ష్మణులను వనమునకు పంపించి భర్తను స్వర్గానికి పంపించెను. స్వయం వైధవ్యమును అపకీర్తిని పొందెను. ప్రజలకు శోక సంతాపములు కొని తెచ్చెను. నాకు రాజ్యము సుఖము సత్కీర్తి యిచ్చెను. చేయవలసిన పని అంతా మా తల్లియే పూర్తిచేసెను. ఆమె గర్భము నుండి జన్మించిన నాకు జగత్తులో అనుచితమైన దేదీ లేదు. ఒక వ్యక్తికి పిశాచము పట్టుకొన్నది. అతడు వాయురోగ పీడితుడు. అతనిని తేలు కుట్టెను. ఆపై అతడు సారాయి కూడ త్రాగియుండెను. ఇంక అతనికి చికిత్స ఏమిటి? కైకేయి పుత్రుడుగా నాకు యోగ్యమైన దేదో అది విధాత యిచ్చి యున్నాడు. కాని దశరథ పుత్రునిగా, రాముని సోదరునిగా, ఉండగల గొప్పతనము విధాత నాకు కలిగించుట వ్యర్థమే. శ్రీరామచంద్రుని తల్లి చాలా సహృదయురాలు. నాపై ఆ అమ్మకు విశేష ప్రేమ గలదు. కనుకనే నా దీనత్వమును చూచి స్వాభావికమైన మాతృ స్నేహము వలన ఆమె ఈ విధముగా మాట్లాడుచున్నారు. గురువుగారు జ్ఞాన సముద్రులు. జగత్తు అంతటికి ఈ విషయము తెలియును. వారు కూడా నాకు పట్టాభిషేకము జరుపవలెనని తలంచుచున్నారు. విధి విపరీతముగా నున్నప్పుడు అంతా విపరీతముగానే జరుగుచుండును.

ఈ చెడు కార్యములకు అంగీకారము లేనట్లు శ్రీ సీతారాములు తప్ప జగత్తులో మరెవ్వరు గుర్తింప లేరు. ఈ మాటలను వినెదను సహించెదను. ఎచ్చట నీరుండునో అచ్చట చివరకు బురద కూడ ఉండును కదా! ప్రపంచములోని ప్రజలు నన్ను "చెడ్డవాడు" అనెదరనే భయము నాకు

లేదు. పరలోక విచారము కూడా నాకు లేదు. నా హృదయమును దుస్సహమైన యొకానొక దావాగ్ని దహించుచున్నది. అదేమిటన నా కారణముగా శ్రీ సీతారాములు దుఃఖించిరి. తన సర్వస్వము త్యజించి శ్రీరాముని వెంట వెళ్ళుట ద్వారా లక్ష్మణుడు బ్రతికి యున్నందులకు తగిన ఫలితమును పొందియుండెను. శ్రీరాముని వనమునకు పంపుటకు నేను జన్మించితిని. అందుకు అభాగ్యుడనైన నేను పశ్చాత్తాప పడుచున్నాను శ్రీరాముని దర్శించనిదే నా హృదయ తాపము చల్లారదు. నాకు మరే ఉపాయము తోచుట లేదు. శ్రీరాముడు తప్ప నా హృదయములోని భావము ఎవ రెరుగుదురు? ఉదయముననే ప్రభువు వద్దకు బయలు దేరెదను. నేను చెడ్డవాడనే! అపరాధినే! నా మూలముగానే యీ అన్ని ఉపద్రవములు జరిగెను. అయినప్పటికి నేను శరణువేడగా శ్రీరాముడు నా అపరాధములన్నింటిని మరచి నా యందు విశేషముగా కృప చూపును. శ్రీరాముడు శీలమునకు, సరళస్వభావమునకు, కృపకు, స్నేహమునకు నిలయము, అత డెన్నడును శత్రువునకు కూడా అనిష్టము చేయలేదు. నేను కుటిలుడనే అయినను అతని బిడ్డను దాసుడను. మీరెల్లరు నే నిట్లు చేయుటయే నాకు కళ్యాణమని తలంచి నన్ను ఆశీర్వదించండి. నాకు అనుజ్ఞ యివ్వండి. నా ప్రార్థనను విని నన్ను తన దాసునిగా భావించి శ్రీరామచంద్రుడు అయోధ్యకు తిరిగి రాగలడు. దుర్మార్గురాలైన స్త్రీగర్భము నుండి నేను జన్మించి యంటిని. దుష్టుడను. దోష యుక్తుడను. అయినప్పటికి శ్రీరాముడు నన్ను తన వానిగా భావించి పరిత్యజింపడనే నమ్మకము నాకు ఉన్నది."

భరతుని వాక్యములు అందరికి వీనుల విందయ్యెను. ప్రియమయ్యెను ప్రజలెల్లరు శ్రీరాముని ప్రేమామృత ప్రవాహములో తేలిరి, శ్రీరామ వియోగమనే భయంకర విషముచే అందరు మూర్ఛిల్లి యుండిరి. బీజ సహితముగా మంత్రమును వినగానే మేల్కొన్నట్లు వారు లేచిరి.



తల్లులు, మంత్రి, గురువు, నగరములోని స్త్రీ పురుషులు అందరూ స్నేహము వలన వ్యాకుల హృదయులైరి. మీరు సాక్షాత్ శ్రీరాముని ప్రేమ మూర్తీభవించిన వారు. అని భరతుని వారు వేనోళ్ళ కొనియాడిరి. "భరతా! మీరట్లుగాక మరెట్లు చెప్పుదురు. శ్రీరామునకు మీరు అత్యంత ప్రియులు. ప్రాణముతో సమానము. ఏ నీచుడు తన మూర్ఖత్వముతో ఆ తల్లి కైకేయి కుటిలత్వమును ఆధారముగా చేసికొని మిమ్ములను సందేహించునో ఆ దుష్టుడు వంద కల్పముల వరకు నరకమందు పడియుండ గలడు. సర్పముచేసిన పాపములకు అవగుణములకు మణికి ఎట్టి సంబంధము లేదు. అంతేగాక ఆ మణి విషమును హరించును. దుఃఖమును దారిద్ర్యమును నాశనముచేయును. కావున భరతా! వనమునకు తప్పకవెళ్ళండి." అని పలికిరి.

మేఘగర్జన విని చాతక పక్షులు, నెమళ్ళు ఆనందించునట్లు భరతుని అంగీకారమునకు అందరు ఆనందించిరి.

రెండవ రోజున ప్రాతః కాలమున వనమునకు బయలుదేరి వెళ్ళవలెననే నిర్ణయము వలన భరతుడు అందరికి ప్రీతి పాత్రుడయ్యెను. వశిష్ట మహా మునికి నమస్కరించి భరతుని ముందు శిరస్సు వంచి భరతుని జీవితమే ధన్యమైనదని అతని శీలమును, స్నేహమును మిగుల కొనియాడుచు ప్రజలు తమ తమ యిండ్లకు వెళ్ళిపోయిరి. కాని ఎవరును ఇంటివద్ద నుండుటకు ఇష్టపడుట లేదు.

నగరము, గుఱ్ఱములు, ఏనుగులు, ఖజానా, భవనములు, సంపత్తి అంతా రామచంద్రునిది. వానిని తగిన విధముగా రక్షించకుండా వెళ్ళినచో స్వామి ద్రోహము కాగలదని తలంచి స్వప్నములో కూడా తన ధర్మాన్ని విడువని విశ్వసనీయులైన సేవకులను వానికి సంరక్షకులుగా నియమించి భరతుడు కౌసల్యా దేవి వద్దకు వెళ్ళెను. తల్లులెల్లరు దుఃఖితలుగా నుండుటను చూచి వారికి పల్లకీలు తెప్పించి సుఖాసనములు ఏర్పాటు చేసెను రాత్రి అంతా మేల్కొని యుండగా తెల్లవారెను.

భరతుడు మంత్రులను పిలచి, "రాజ్యాభిషేకమునకు కావలసిన సామానులు అన్నియు తీసికొని పదండి. వనములో శ్రీరామచంద్రునకు వశిష్ఠమహా ముని పట్టాభిషేకము చేయుదురు. కనుక వెంటనే బయలు దేరండి" అనిచెప్పెను.

అందరి కంటె ముందు వశిష్ఠుల వారు, అరుంధతీ సహితులై అగ్నిహోత్ర సామగ్రితో సహా రథము పైనెక్కి బయలు దేరిరి. పిమ్మట బ్రాహ్మణులు అనేక రథములపై నెక్కి బయలుదేరిరి.

నగరమందలి ప్రజలు రథములను అలంకరించి చిత్రకూట పర్వతమునకు బయలుదేరిరి. అందరు బయలుదేరిన తర్వాత భరత శత్రుఘ్నులు ఇరువురు సీతారాముల పవిత్ర చరణములను స్మరించి బయలుదేరిరి.

దాహముగొన్న ఏనుగులు జలమును చూడగానే ఉత్సాహముతో పరుగిడునట్లు శ్రీరామచంద్రుని దర్శించవలెననెడి అభిలాషతో అయోధ్యా నగరమందలి స్త్రీ పురుషులెల్లరు ఆనందముతో బయలు దేరిరి.

అన్ని సుఖములు విడిచి సీతారామలక్ష్మణులు వనములో పాదచారులై యున్నారని తలంచి భరత, శత్రుఘ్నులు రథముపై నెక్కకుండ కాలి నడకనే పోవుచుండగా అందరు చూచి ప్రేమలోమగ్నులై రథముల నుండి సవారీల నుండి కాలినడకను బయలుదేరిరి.

కౌసల్యాదేవి భరతునికి సమీపముగా తన పల్లకీని నడిపించి భరతునితో నిట్లనెను. నాయనా! నీవు రథముపై కూర్చుండుము. లేనిచో అందరును కాలినడకనే నడచి దుఃఖించెదరు. ఈ మార్గము కాలినడకతో నడచుటకు యోగ్యమైనది కాదు.

తల్లి మాటను జవదాటలేక భరత శత్రుఘ్నులు రథముపై కూర్చుండిరి. మొదటి దినమున తమసా నది వద్ద మకాముచేసి రెండవ మకాము గోమతీ నదీ తీరమున చేసిరి.



కొందరు పాలు త్రాగిరి. కొందరు పండ్లు భుజించిరి. కొందరు రాత్రి ఒక్క పూట భోజనము చేసిరి. భూషణములు, భోగ విలాసములు విడిచి అందరు శ్రీరాముని కొరకు వ్రతముచేయుచుండిరి. రాత్రి అంతయును నదీ తీరమున వసించి ఉదయముననే ప్రయాణము చేయుచు వారందరు శృంగబేరపుర సమీపమునకు చేరుకొనిరి.

విషాద రాజుకీ వర్తమానం అందగానే "భరతుడు వనమునకు ఎందుకు వెళ్తున్నాడు? అతని మనస్సులో కుటిలత్వము లేనిచో వెంట సైన్యాన్ని ఎందుకు తీసుకవెళ్తున్నాడు? రామలక్ష్మణులను వధించి రాజ్యమును నిష్కంటకముగా అతడు పాలింప తలచెను. భరతుడు రాజ నీతి గూర్చి ఆలోచించ లేదు సకల దేవతలు, సమస్త దైత్యవీరులు ఏకోమ్ముఖులై పోరాడినప్పటికి శ్రీరాముని జయించ జాలరు. విషపుమొక్క నుండి అద్భుత ఫలము పుట్టదు గదా" ఈ విధముగా గుహుడు ఆలోచించి తన జాతి వారితో ఇట్లు పలికెను. "నదిలో తిరిగే నావలన్నియు స్వాధీనములో ఉంచండి. వాటిని నీటిలో ముంచివేయండి. అన్ని ఘట్టములకు ఎవరిని రానీయకుండా నిలుపుచేయండి. భరతుని, అతని సేనను, ఎదిరించండి. మరణమునకు భయపడకండి. మనము బ్రతికియుండగా వారిని గంగను దాటనీయకండి. యుద్ధములో మరణము. అదియును గంగానదీ తీరమున శ్రీరాముని కార్యము నిమిత్తము. క్షణ భంగురమైన యీ శరీరము నాశనమైనను మంచిదే. భరతుడు శ్రీరాముని సోదరుడు. పైగా రాజు. అట్టి వాని చేతులలో నీచ సేవకుడనైన నాకు మరణము ఎంతో భాగ్యము వలన లభించును. స్వామి కొఱకు యుద్ధముచేయుదును. యుద్ధములోనే జయించినచో పద్నాల్గు లోకములలో రామ సేవకునిగా యశస్సు పొందెదను. ఒక వేళ మరణించినచో నిత్యము శ్రీరామునికి సేవచేయుచు ఉండగలను. సాధు సంఘములో ఎవరికి పరిగణనలేదో, శ్రీరాముని భక్తులలో ఎవరికి స్థానము లేదో అట్టివాడు భూమికి బరువుచేటు" అని తన జాతి వారితో చెప్పెను.

విషాదమును విడిచి నిషాదరాజు శ్రీరాముని స్మరించుచు అమ్ములపొది, ధనుస్సు, కవచము తెప్పించుకొనెను. అతని వాక్యములు వినగానే నిషాదులు ఆయుధములు చేత బూని యినుపటోపీలు శిరస్సున పెట్టుకొని కవచములు బిగించి నిషాదరాజు వద్దకు వచ్చిరి. అతడు అందరిని గౌరవించి యిట్లనెను. "సోదరులారా! మరణమునకు భయపడకండి. ఇది గొప్ప "కార్యము". అప్పుడు నిషాదులు ఉత్సాహముతో నిట్లుపల్కిరి. "ప్రభూ! మీరెంత మాత్రము అధైర్యపడవలసిన పనిలేదు. శ్రీరాముని ఆశీర్వాదము వలన మేము భరతుని సైన్యమును హతమార్చెదము. మా ప్రాణములున్నంత వరకు మేము వెనుకడుగు వేసేదిలేదు. భరతుని సైన్యమును సంహరించి నెత్తురు కాలువ కట్టించెదము."

నిషాదరాజు బలీయమైన తన సేననుచూచి "పోరాడుటకు బయభేరి మ్రోగించండి" యని యనుచుండగా ఎవరో ఎడమవైపు నుండి తుమ్మిరి. ఈ శకునమునకు జయము మనదే అని కొందరు జోస్యము చెప్పిరి.

ఒక వృద్ధుడు "భరతుని కలుసుకొనండి. తొందరపడకండి. అతనితో యుద్ధము ఉండదు. శ్రీరాముని ఒప్పించుటకు అతడు వెళ్ళుచున్నాడు" అనెను.

అది విని గుహుడు "ముసలివాడు సరిగానే చెప్పుచున్నాడు. త్వరపడి ఆలోచించకుండ పనిచేసి మూర్ఖులు పశ్చాత్తాపపడెదరు. భరతుని శీలస్వభావము అర్థముచేసికొనకుండా యుద్ధమునకు సన్నద్ధమగుట శ్రేయస్కరము కాదు. నేను వెళ్ళి భరతుని కలుసుకొని మాట్లాడి వాని రహస్యమును తెలిసికొని వచ్చెదను. మిత్రత్వము శత్రుత్వము దాగునది కాదు. అప్పుడే వచ్చి అన్ని యేర్పాట్లు చేసుకొనవచ్చును. అని చెప్పి గుహుడు భరతుని వద్దకు వెళ్ళెను."

ముందుగా వశిష్ఠ మహామునిని చూచి గుహుడు సాష్టాంగ నమస్కారము చేసెను. అతడు రామునకు ప్రియసఖుడని ముని గ్రహించి



అతనిని కౌగిలించుకొని ఆశీర్వదించెను. "ఇతడు శ్రీరామునకు మిత్రుడు" అని భరతునితో ముని చెప్పగానే రథము దిగి గుహుని కలిసికొనెను. గుహుడు తన పేరు, జాతి, గ్రామము చెప్పి భరతుని ముందు తలవంచెను తన తమ్ముడైన లక్ష్మణుని కలిసికొన్నాడో అన్నట్లు తన ముందు వినమ్రుడైయున్న గుహుని భరతుడు లేవనెత్తి అతనిని కౌగిలించుకొనెను.

ఎవరిని నీచులుగా లోకులు చూచెదరో, ఎవరి ఛాయతగులగానే రోసెదరో అట్టి నిషాదులకు రాజైన గుహుని శ్రీరాముని సోదరుడు భరతుడు ప్రేమతో కౌగిలించుకొని అస్పృశ్యతా పిశాచమును రూపుమాపెను. ఎవరు ఆవులించినప్పుడు కూడా ఏమరుపాటుగా రామ రామ అని పలికెదరో అట్టి వారివద్దకు పాపములుచేరుటకు భయపడును. శ్రీరామనామమే అంత ప్రభావమైనది కాగా సాక్షాత్ శ్రీరాముడే గుహుని కౌగిలించుకొనెను. ఇక అతని అదృష్టమేమని చెప్పగలము? మామూలు నదీ జలము గంగా నదిలో కలియగానే అది పవిత్రమగును. రామనామమును తలక్రిందుగా (మరా మరా అంటూ) జపించినను వాల్మీకి బ్రహ్మ అంతటి వాడయ్యెను. భిల్లులు, చండాలురు, మూర్ఖులు, రామ నామమును జపించి పవిత్రులైరి. యుగ యుగములనుండి యీ పద్ధతి కొనసాగుతూ వస్తున్నది. దేవతలు ఇట్లు రామనామ మహిమను వర్ణించుచుండగా అయోధ్యా నగర వాసులు అది వినుచు మిగుల ఆనందపడుచుండిరి. భరతుడు నిషాదరాజును కలిసికొని కుశల ప్రశ్నలడిగెను.

భరతుని ప్రేమను పరికించి గుహుడు విదేహు డయ్యెను. (ప్రేమముగ్ధుడై దేహస్మృతి కోల్పోయెను.) అతడు ప్రభూ! క్షేమమునకు మూలమైన మీ పాద పద్మములను దర్శింపగానే ముల్లోకములలో నేను క్షేమము పొంది యుంటిని. ఇప్పుడు మీ అనుగ్రహము వలన నా ముందు కోటితరాల వారికి క్షేమమైనది. నీచజాతినైన నేనెచ్చట? అనంతకోటి బ్రహ్మాండములకు ప్రభువైన శ్రీరామచంద్రుడెచ్చట? నీచుడనైన నన్ను ప్రభువు తన

అవ్యాజానురాగముతో తన వానిగాచేసికొనెను. విధాత ద్వారా మోసగించబడిన వాడే శ్రీరాముని భజింపడు. నేను కపటాత్ముడను. దుర్బుద్ధిగల వాడను. అయినప్పటికి శ్రీరాముడు నన్ను తన వానిగా చేసి కొన్నప్పటినుండి నేను జగత్తునకే భూషణమైతిని.

భరతుని సోదరుడు శత్రుఘ్నుడు గుహుని కలసికొనెను. పిమ్మట గుహుడు మహారాజు లెల్లరకు తన పేరు వినమ్రతతో చెప్పుచు ఆదరముతో నమస్కరించెను. నీవు కోటి సంవత్సరములు సుఖముగా జీవించుమని ఆశీర్వదించిరి. గుహుని చూచి అయోధ్యానగర స్త్రీ పురుషులెల్లరు లక్ష్మణుని చూచినట్లే ఆనందించిరి. శ్రీరామచంద్రుడు తన బాహువులతో గుహుని బంధించి కౌగిలించుకొనెను. ఇతడెంత అదృష్టశాలియో అని ప్రజలు చెప్పుకొనసాగిరి.

గుహుడు తన సేవకులను పిలిచి అందరకు తగిన ఏర్పాట్లు చేయుడని సైగచేసి చెప్పెను. వారు వెళ్ళి వృక్షముల క్రింద చెరువుల ప్రక్కతోటలలోపల నుండుటకు తగిన ఏర్పాట్లుచేసిరి.

శృంగవేరపురమును చూడగానే భరతుడు మిగుల ఆనందించెను. వినయము, ప్రేమ రెండు శరీరము ధరించి కలిసికొని వెళ్ళుచున్నవా అన్నట్లు భరతుడు గుహుని భుజముపై చేయివైచి ఇరువురును వెళ్ళుచుండిరి. పవిత్రమైన గంగానదికి వారు చేరుకొనిరి.

శ్రీరామచంద్రుడు స్నానము సంధ్యచేసిన స్థలమునకు భరతుడు నమస్కరించెను. శ్రీరాముని కలిసికొన్నంతగా అతడు ఆనందించెను.

అయోధ్యానగర స్త్రీ, పురుషులు నమస్కారములు చేయుచుండిరి. బ్రహ్మస్వరూపమైన గంగా జలమును చూచి వారు మిగుల ఆనందించుచుండిరి. శ్రీరాముని పాదములయందు మాకు ఇతోధిక ప్రేమకలుగు గాక అని వారు వరము లడుగుచుండిరి.



భరతుడు ''ఓ గంగాదేవీ! శ్రీ సీతారాముల దివ్య పాదారవిందములయందు నాకు స్వాభావిక ప్రేమ కలుగునట్లు వర మనుగ్రహింపుము" అని వేడుకొనెను.

గంగానదిలో అందరు స్నానము ముగించుకొని బయలుదేరిరి. ఎక్కడెక్కడ ఆగుచుండిరో అచ్చటచ్చట భరతుడు స్వయముగా వచ్చి అందరి మంచి చెడ్డలను వారి క్షేమ సమాచారములను అడిగితెలిసికొనుచుండెను.

భరతశత్రుఘ్నులు కౌసల్యాదేవి వద్దకువెళ్ళి ఆమె పాదములను ఒత్తి సేవచేసిరి. భరతుడు తన మంచి మాటలచే తల్లులెల్లరను సంతోషపరచి తల్లుల సేవా భారము సోదరుడైన శత్రుఘ్నునకు అప్పగించి నిషాదరాజును పిలిపించెను.

గుహుని చేతులతో తన చేతులు కలపి భరతుడు బయలుదేరెను. సీతారామలక్ష్మణులు రాత్రి నిద్రించిన చోటును చూపుమని భరతుడు గుహుని అడిగెను. ఆ వాక్యము విని నిషాద రాజు విషాద భరితుడయ్యెను. అతడు వెంటనే భరతుని ఆ స్థలమునకు తీసికొని వెళ్ళెను.

శ్రీరాముడు విశ్రమించిన పవిత్రమైన అశోక వృక్షము క్రిందగల భూమికి అత్యంత ప్రేమాదరములతో భరతుడు నమస్కరించెను. శ్రీరాముని పాదధూళిని కనులకద్దుకొనెను. సీతాదేవి ఆభరణముల నుండి రాలిన రెండు స్వర్ణకణములు చూచి వాటిని సీతమ్మ వారితో సమానముగా భావించి శిరసుపై పెట్టుకొనెను. ప్రేమాశ్రువులతో భరతుని నేత్రములు నిండిపోయెను. అతడు ఇట్లు పలికెను. రాముని వియోగములో అయోధ్యానగర స్త్రీ పురుషులు శోకవిహ్వలులైనట్లు సీతాదేవి విరహము వలన ఈ స్వర్ణకణములు శోభా విహీనముగానున్నవి. భోగ యోగములను తన స్వాధీనములో నుంచుకొన్న జనక మహారాజుకు పుత్రికయై, దేవేంద్రుడు కూడ అభిలషించెడి ఐశ్వర్య, వైభవములుగల సూర్యకుల సూర్యుడైన దశరథ మహారాజునకు కోడలై

ప్రభువైన శ్రీరామునకు ధర్మపత్నియై, శ్రేష్ఠమైన పతివ్రతా మణులలో శిరోమణియైన సీతమ్మ వారు దర్భశయ్యను పరుండవలసివచ్చెను. శ్రీరాముడు రూపము, శీలము, సమస్త సద్గుణములు మూర్తీభవించినవాడు. శత్రువులు గూడ శ్రీరాముని గొప్పతనము కొనియాడుదురు. మంగళములకు, ఆనందమునకు నిధి అయిన రామచంద్రుడు కటికనేల మీద దర్భలపై పరుండెను. విధాతచేష్టలు చాల బలవత్తరమైనవి.

శ్రీరాముడు దుఃఖమనే శబ్దమును ఎన్నడూ వినియుండలేదు. మహారాజు తల్లులకెట్టి యిబ్బందికలుగకుండా రేయింబవళ్ళు ఆయన చూచుచుండెడివారు. అట్టి శ్రీరాముడు అడవులలో పాదచారియై తిరుగుచున్నాడు, కంద మూల ఫలములను భుజించుచున్నాడు. దీని కంతటికి కారకురాలైన కైకేయికి ధిక్కారము. ఆమె కడుపునబుట్టిన నావంటి దురదృష్టవంతునకు కూడ ధిక్కారమే నా కారణముననే యింత అనర్థము జరిగెను. కులానికి కళంకముగా నన్ను విధాత పుట్టించెను.

ఇది విని నిషాదరాజు, ప్రభూ! మీరు వ్యర్థముగా ఎందుకు దుః ఖించెదరు. శ్రీరాముడు మీకు ప్రియుడు. మీరు శ్రీరామునకు ప్రియులు. దోషము ప్రతికూలుడైన బ్రహ్మది. బ్రహ్మ చేయు పనులు చాలా కఠోరముగా నుండును. తల్లియైన కైకేయి మనస్సును మార్చివేసెను. ఆ రాత్రి శ్రీరామచంద్ర ప్రభువు మిమ్ములనే మాటి మాటికి గొప్పగా ప్రశంసించుచుండెను. మిమ్ములను శ్రీరాముడు ప్రేమించినంతగా మరొకరిని ప్రేమించినట్లు కన్పింపలేదు. నేను ఒట్టుపెట్టుకొని యీ మాట చెప్పుచున్నాను.

ధైర్యముగా ఉండండి. అంతా కళ్యాణవంతముగానే జరుగగలదు. విశ్రాంతి గైకొనండి."

నిషాదరాజు పలికిన వాక్యములు విని భరతుడు ధైర్యము వహించి శ్రీరాముని స్మరించుచు తన వసతికి వెళ్ళిపోయెను శ్రీరాముడు ఆగిన



స్థలమును తెలిసికొని ప్రజలు ఆదరముతో చూచుచుండిరి. ఆ స్థలమునకు ప్రదక్షిణములు చేసి నమస్కారముచేయుచుండిరి. కైకేయిని అనేక విధములుగా దూషించుచుండిరి.

కొందరు భరతుని స్నేహమును కొనియాడుచుండిరి. అందరు తమను నిందించుకొనుచు గుహుని భాగ్యమును ప్రశంసించుచుండిరి. ఈ విధముగా రాత్రి అంతయును అందరును మేల్కొనియే యుండిరి.

ఉదయము కాగానే భరతుడు గురువుగారిని పడవపై కూర్చుండ పెట్టెను, మరియొక పడవపై తల్లులను కూర్చుండపెట్టెను. నాల్గు గడియలలో అందరును గంగానది దాటిరి.

ప్రాతఃకాల కృత్యములను నిర్వర్తించిన పిమ్మట భరతుడు తల్లుల పాదాలకు వందనములచేసి మార్గముచూపుటకు నిషాదగణములను ముందుపెట్టి సేనను నడిపించెను.

నిషాదరాజును ముందుంచి వెనుక తల్లుల పాలకీలను నడిపించెను. సోదరుడైన శత్రుఘ్నుని వారివెంట పంపెను.

భరతుడు గంగానదికి నమస్కరించెను. సీతారామలక్ష్మణులను స్మరించెను. భరతుడు కాలి నడకనే బయలుదేరెను.

గుఱ్ఱముపై మీరు ప్రయాణముచేయండి. అని సేవకులు మాటిమాటికి చెప్పుచుండిరి. "శ్రీరాముడు పాదచారియై వనములో తిరుగుచుండగా నా కొరకు రథములు, ఏనుగులు, గుఱ్ఱములు ఏర్పాటుచేయబడినవి. నడచి వెళ్ళుటయే నాకు సముచితము" అని భరతుడు పలికెను. సేవకుని ధర్మము చాల కఠినమైనది. భరతుని దశ కని కోమలములైన ఆయన వాక్యములు విని సేవకులు బాధపడిరి. ప్రేమతో ఉప్పొంగిపోవుచు "సీతారామ" "సీతారామ" యనుచు భరతుడు మూడవ జామున ప్రయాగ ప్రవేశించెను. తామరమొగ్గమీద పడిన మంచుబిందువులు మెరయుచున్నట్లు కాలినడకవలన

ఆయన పాదములమీద ఏర్పడిన బొబ్బలు ప్రకాశించుచుండెను. భరతుడు కాలినడకన వచ్చిన వార్త విని అందరు దుఃఖించిరి.

అందరు స్నానముచేసిన విషయము తెలిసికొన్న తర్వాత భరతుడు త్రివేణికి నమస్కరించెను. విధిపూర్వకముగ అతడు గంగా యమునా జలములలో స్నానముచేసెను. యమునానదియొక్క శ్యామలవర్ణ జలము, గంగా నదియొక్క శ్వేతవర్ణ జలము కెరటాలనుచూచి అతని శరీరము పులకితమయ్యెను. అతడు చేతులు జోడించి "ఓ! తీర్థ రాజమా! జనుల సమస్తమైన కోరికలను పూర్తిచేయుదానవు నీవు. నీ ప్రభావము వేదములలో ప్రకటితమైనది. నా ధర్మాన్ని (యాచించకుండుట క్షత్రియ ధర్మము) విడిచి నేను భిక్ష అడుగుచున్నాను. ఆర్తుడుచేయని చెడుకార్యమేమున్నది. శ్రేష్ఠులైన దాతలు ఏదికోరిన అది యిచ్చుచుందురు. నాకు సంపత్తియందు రుచిలేదు. ధర్మమందు అభిరుచి లేదు. కామాభిలాషలేదు. మోక్షేచ్ఛయులేదు. జన్మ జన్మలలో కూడా శ్రీరాముని పవిత్ర పాదములయందు నాకు భక్తికల్గియుండునట్లు వరమిమ్ము, నాకింకేమియును అక్కరలేదు. రఘురాముడు నన్ను కుటిలుడని భావించినను, ప్రజలు నన్ను గురుద్రోహి, ప్రభు ద్రోహి అని నిందించినను శ్రీరాముని పాదములయందు నాభక్తి దినదినాభివృద్ధి చెందుగాక!

మేఘములు చాతకపక్షులకు నీళ్ళకు బదులుగా రాళ్ళు, రప్పలు కురిపించినను! జీవితాంతము వానిని అవి వదలవు. బంగారము సానపెట్టిన కొలది మెరయుచుండును. అట్లే ప్రియతముని పాదములయందు నియమము ప్రకారము ప్రేమకల్గియుండుటవలన ప్రేమికుడైన సేవకుని గౌరవము ఇతోధికముగ వృద్ధియగును.

భరతుని వాక్యములు విని త్రివేణి నుండి మంగళకరమైన చక్కని ఈ వాక్యములు వినబడెను. "ఓ సోదరా! నీవు అన్ని విధముల ఉత్తముడవు. శ్రీరాముని చరణములయందు నీకు అంతులేని ప్రేమకలదు. నీవు మనస్సులో వృథాగా బాధపడుచున్నావు. శ్రీరామునకు నీ మీద ఉన్నంత ప్రేమ మరెవరి మీద లేదు."



త్రివేణి వాక్కులు విని భరతుడు అమందానంద కందళిత హృదయారవిందు డయ్యెను. "భరతుడు ధన్యుడు, ధన్యు"డని దేవతలు పలుకుచు పూలవర్షము కురిపించిరి.

ప్రయాగలో నివసించు బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు సన్యాసులు అందరూ ఆనందించుచుండిరి. అందరు శ్రీరామచంద్రుని గుణగణములు ప్రస్తుతించుచు భరద్వాజముని వద్దకు వచ్చిరి. భరతుడు సాష్టాంగ ప్రణామముచేయగాచూచి భరద్వాజమహాముని అతనిని లేవనెత్తి ప్రేమతో కౌగిలించుకొని ఆశీర్వదించి కృతార్థుడయ్యెను. ముని ఆసన మిచ్చెను. దానిపై భరతుడు కూర్చుండెను. భయపడి పారిపోయివచ్చిన వానివలె అతడు బిక్కమొగముతో ఆ ముని ఏమైన అడిగినచో ఏమి చెప్పవలె అని ఆలోచించుచుండెను. అతని సంకోచము గ్రహించి భరద్వాజమహర్షి యిట్లనెను.

"భరతా! మా కంతయు తెలిసినది. విధాత వ్రాతలు తుడిచివేయుట ఎవరి తరము కాదు. తల్లి చేష్టలు తలచుకొని నీవు బాధపడవద్దు. ఇందు కైకేయి దోషము లేదు. ఆమె బుద్ధిని సరస్వతీదేవి చెడగొట్టెను. అట్లు చెప్పుట కూడా మంచిది కాదు. ఏలన లోకము వేదము రెండును విద్వాంసులకు అంగీకార యోగ్యములు. నీ నిర్మల కీర్తిని గానముచేసి లోకము, వేదము రెండును గొప్పతనము పొందెను. అవియే యిట్లు చెప్పుచున్నవి. తండ్రి యెవనికి రాజ పదవి యిచ్చునో అతడే రాజ్యము చేయును. రాజు సత్యవ్రతుడు. నిన్ను పిలిచి రాజ్యమిచ్చినట్లయిన బాగుండెడిది. అన్ని అనర్థములకు మూలము రాముని వనవాసము. కైకమ్మ కూడా ముందు కుట్రచేసి తరువాత పశ్చాత్తాపపడెను. ఇందు మిమ్ములను ఎవరైనా తప్పని అనిన యెడల వాడు అజ్ఞాని, నీచుడు. భరతా! నీవు ఇప్పుడు మంచిపని

చేసితివి. ఇట్లు చేయుట ఉచితమే. శ్రీరామచంద్రుని పాదములయందు అనన్య భక్తి కలిగి ఉండుటే శ్రేయస్కరము. రాముని పాదసేవ మీకు తరుగని ద్రవ్యము. నీవంటి అదృష్టవంతుడు మరియొకడు లేడు. నీవిట్లుండుటలో ఆశ్చర్యము లేదు. ఎందుకనగా దశరథుని పుత్రుడవు. రాముని సోదరుడవు. శ్రీరామ చంద్రుని మనస్సులో నీవంటి ప్రేమపాత్రుడు మరియొకడు లేడు. సీతారామలక్ష్మణులు ముగ్గురు ఆ రోజు రాత్రియంతయును నిన్ను ప్రశంసించుచునే గడపిరి. ప్రయాగలో స్నానము చేయుచున్నప్పుడు వారి మాటలు వింటిని. నీ ప్రేమలో నిమగ్నులైరి. నీ మీద శ్రీరామునికి ఇట్టి అగాధయైన ప్రేమ ఉండెను. శ్రీరామచంద్రుడు శరణాగతులను రక్షించువాడు. నా అభిప్రాయము ఇది. నీ దృష్టిలో ఇది వేరు కావచ్చు. కాని మాకు ఉపదేశము. శ్రీరామభక్తి సిద్ధించుటకు ఇది మంచి శుభ సమయము.”

ఓ భరతా! నీ కీర్తి నిర్మలమైనది. నవోదయ చంద్రుని వంటిది. శ్రీరాముని భక్తులు కలువల వంటివారు. చకోరపక్షుల వంటివారు. చంద్రునకు వృద్ధిక్షయములు గలవు. అందువల్ల ఒకప్పుడు కలువలు వాడిపోవును. చకోరపక్షులు దుఃఖపడును. కాని నీ యశస్సు అనే చంద్రుడు ఉదయించునే. కాని అస్తమించడు. జగత్తు అనే ఆకాశములో క్షీణింపడు సరికదా దినదినాభివృద్ధి నొందును.

కీర్తి అనే యీ చంద్రుడు రాత్రింబవళ్ళు ఎల్లప్పుడు సుఖమునే కలిగించును. కైకేయి కుకర్మయను రాహువు దానిని మ్రింగజాలదు. ఈ చంద్రుడు శ్రీరామప్రేమయనే అమృతంతో పరిపూర్ణుడై ఉండెను. గురువుగారికి ద్రోహము గావించిన దోషముతో ఈ చంద్రుడు దూషితుడు కాడు. ఇట్టి యశస్సు అనే చంద్రుని సృష్టించి భూలోకములో కూడా అమృతమును సులభము చేసి యుంటివి. ఇప్పుడు రామభక్తులు ఆ అమృతమును పానము చేసి తృప్తులగుదురు.



భగీరథుడు భూలోకమునకు గంగను తీసికొని వచ్చెను. ఆ గంగను స్మరించినంత మాత్రమున సకల శుభములు కలుగును. దశరథుని గుణములు వర్ణింపజాలము. అధికముగా ఏమి చెప్పగలను? అతనితో సరితూగగలవారు మరి యొకరు జగత్తులో లేరు. అతని భక్తి ప్రేమలకు సచ్చిదానంద స్వరూపుడైన ఆ పరమాత్మ వశుడై రాముడుగా అవతరించెను. శ్రీరాముని తన హృదయనేత్రముతో పరమేశ్వరుడు ఎంతగా చూచుచుండినను తృప్తిచెందుటలేదు. నీవు కీర్తి అనే అనుపమ చంద్రుని సృష్టించితివి. ఆ చంద్రబింబమునందు శ్రీరామ ప్రేమయే చిహ్నముగా ఉండును.

నాయనా! నీవు వ్యర్థముగా దుఃఖపడవద్దు పరుసవేది దగ్గరఉండి కూడా దరిద్రుడ నని ఎందుకు భావించెదవు? మేము అసత్యము పలుకము. మేము తాపసులము ముఖస్తుతులు చేయువారము కాము. వనములో నివసించెడువారము. మేము చేసిన యజ్ఞయాగముల ఫలితమే సీతారామలక్ష్మణుల దర్శనము. వారి దర్శన ఫలితముగా నేడు మీ దర్శనము కలిగినది. ప్రయాగపుణ్యక్షేత్రముతో కూడ మేము అందరము అదృష్టవంతులము.

ఓ భరతా! నీవు ధన్యుడవు. నీ యశముచేత లోకము నంతయు వ్యాపించితివి అని పలుకుచు భరద్వాజ మహర్షి ఆనందపారవశ్యములో నిమగ్నుడై పోయెను.

భరద్వాజముని వాక్యములు విని సభాసదులు సంతోషించిరి. భరతుడు మునులకు నమస్కరించి యిట్లనెను. “నా హృదయములోని సంగతులు ఉన్నవి యున్నట్లు చెప్పుచున్నాను. తమరందరు సర్వజ్ఞులు, రామచంద్రుడు అందరి హృదయములు ఎరిగినవాడు. తల్లి కైకేయి చేసిన పనులకు నాకెట్టి చింత లేదు. జగత్తు నన్ను నీచునిగా తలచునని దుఃఖముకూడా నాకు లేదు. పరలోకములో సుఖము లభించదనే భయము నాకు లేదు. తండ్రిగారు

మరణించినందులకు కూడా నేను విచారపడలేదు. ఏలన మహారాజు పుణ్యమూర్తులు, యశఃకాములు. రామలక్ష్మణుల వంటి పుత్రులను కనిరి. వారు రామచంద్రుని విరహములో క్షణభంగురమైన శరీరమును వదలిరి. అట్టి రాజు కొరకు నేను విచారింపను. ముఖ్యముగ నావల్లనే కదా సీతారామలక్ష్మణులు వనములో పాదరక్షలు లేకుండ పాదచారులై ముని వేషముతో తిరుగుచు, ఫలములు తినుచు కటిక నేలమీద నిద్రించుచున్నారు. చలి, ఎండ, వానలను సహించుచున్నారు. ఇది తలచుకొని నాహృదయము కుమిలిపోవుచున్నది. పగలు ఆకలి లేదు. రాత్రి నిదుర లేదు. రాముని కష్టములు ఎట్లు పోవునా యని ఎంతో ఆలోచించితిని. నాకు ఏమియును తోచలేదు. మనోవ్యాధికి ఎంత వెదకినా మందు దొరకలేదు. తల్లి పన్నినకుట్ర ఈ పాపమునకు మూలము. నా కొఱకు ఆమె యీ చెడుపని చేసెను. జగత్తు నంతటిని ఛిన్నాభిన్నము చేసెను. ఈ యుపద్రవమంతయు రామచంద్రుడు తిరిగివచ్చినగాని చక్కబడదు. దీనికి మరొక ఉపాయము లేదు."

భరతుని వాక్యములు విని భరద్వాజముని సంతోషించి భరతునితో, నీవు అధికముగా ఆలోచింపకుము శ్రీరాముని దర్శనము కాగా, నీకు అన్ని దుఃఖములు నశించును. ఇప్పుడు మీరు నాకు ప్రియమైన అతిథులు. మేము అందజేసే కందమూల ఫలములను స్వీకరించండి. అని పల్కెను.

మునివచనములు విని సమయముకాని సమయములో వారి అతిథ్యము స్వీకరించుటకు భరతుడు కొంత సందేహించెను.

అతడు "మునీశ్వరా! మీ ఆజ్ఞ శిరోధార్యము. మీ ఆజ్ఞను పాటించుట మా పరమ ధర్మము" అనెను.

భరతుని వాక్యములు మునికి నచ్చెను. విశ్వాసపాత్రులైన సేవకులను, శిష్యులను అతడు పిలిచి "భరతునకుగాను కందమూలఫలములను



తీసికొనిరండి. ఇప్పుడు మన వద్దకు గొప్ప అతిథి యొకరు వచ్చిరి. వారికి తగినవిధముగా అతిథ్యము నీయవలెను." అని చెప్పెను. అది విని అణిమాది సిద్ధులు వచ్చి "మీ ఆజ్ఞ యేమిటో సెలవీయండి" అవి మునికి విన్నవించగా ముని "భరతశత్రుఘ్నులు సపరివారముగా రాముని విరహముతో వేదనపడుచున్నారు. వారికి తగిన అతిథిసత్కారములు చేసి వారి శ్రమను దూరము చేయండి" అనెను.

ముని ఆజ్ఞను విని సిద్ధులు తమకుతాము మహాభాగ్యముగా భావించి వారికి ఎత్తయిన భవనములను నిర్మించెను. ఆ యిండ్లలో అనేకవిధములైన భోగములకు, ఐశ్వర్యములకు సంబంధించిన సామానులను నింపివేసెను. వానిని చూచిన దేవతలకు కూడా నోరు ఊరుచుండెను.

తన వెంట నున్న వారికి అన్ని ఏర్పాట్లు తనకంటె ముందు జరుగవలెనని భరతుని మనస్సులో గల కోరికను ముని గ్రహించి ఆ విధముగానే వారి వారి అభిరుచులకు అనుగుణముగా భవనములు నిర్మించి యిచ్చి పిమ్మట కుటుంబసమేతముగా భరతునకు దివ్యభవనము నిచ్చెను. భరతుని వెంటనున్నవారు ఏయే వస్తువులు కావలెనని మనస్సులో కోరుదురో వెంటనే వారికి ఆయా వస్తువులు లభించుచుండెను.

చక్కని ఆసనములు, సుందర వస్త్రములు, చందనము తోటలు, రకరకాల పశుపక్షులు, సుగంధపుష్పములు. అమృతమువంటి స్వాదిష్ఠమైన ఫలములు, పిండివంటలు వారి ఆతిథ్యమునకు ఏర్పరచిరి.

వసంతఋతువు శీతల మంద సుగంధ సమీరము వీచుచుండెను. అందరికి చతుర్విధ పురుషార్థములైన ధర్మార్థ కామమోక్షములు సులభముగా లభించినట్లుండెను. వానిని చూచి వారికి హర్షవిషాదములు కలిగెను. భోగసామగ్రులను, ముని తపఃప్రభావమును గమనించునప్పుడు హర్షము కలుగుచుండెను. శ్రీరాముని వియోగముతో నియమ వ్రతాలను పాటించెడి

మేము ఆ భోగములలో ఆసక్తి కల్గి నియమవ్రతాలను విడిచిపెట్టెదమేమో అని విషాదము కలుగుచుండును.

సుందరమైన దివ్యభవనములో భరతుడు రాత్రియంతయు భోగవిలాసముల మధ్య నున్నప్పటికి అతని మనస్సు లేశమైనను చలించలేదు.

ఉదయముననే భరతుడు ప్రయాగలో స్నానమాచరించి భరద్వాజ మహాముని ఆజ్ఞ గైకొని మార్గదర్శకులు వెంటరాగా చిత్రకూట పర్వతమునకు బయలుదేరెను. వారి కాళ్ళకు చెప్పులు లేవు. శిరముపై తలపాగాలేదు. గుహునితో అతడు సీతారామలక్ష్మణులు వెళ్ళిన మార్గము అడిగి తెలిసికొనుచుండెను. శ్రీరాముడు ఆగిన ప్రతిచోట, ఆగి అచ్చటి వృక్షములను చూచి భరతుడు ఆనందము పట్టలేకపోయెను.

భరతుడు పాదచారియై వెళ్ళుచున్నప్పుడు మార్గము సుఖదాయకముగా నుండెను. అట్టిది శ్రీరామునకు కూడా కలుగలేదు.

శ్రీరాముడు వెళ్ళునప్పుడు మార్గములో ప్రభువును చూచిన చరాచర జీవులును, ప్రభువు చూచిన జీవులును పరమపదానికి యోగ్యులైరి. కాని భరతుని దర్శనముతో వారు భవరోగవిదూరులై పరమపదమును ప్రాప్తించిరి.

ప్రపంచములో 'రామా' అని ఒక్కమారు పలికినా వారు తరించెదరు. అటువంటప్పుడు రామునకు, ప్రియుడు, సోదరుడైనవానిని గూర్చి చెప్పవలసినపని యేమున్నది?

భరతుని ప్రేమ ప్రభావమును గమనించి యితని ప్రేమవలన రాముడు తిరిగి బయలుదేరునేమో, మనము తలపెట్టిన కార్యములన్నిటికి విఘ్నమగునని దేవతలు చింతిల్లుచుండిరి. ఈ ప్రపంచము మంచివారికి మంచిగాను, చెడ్డవారికి చెడ్డగాను కనపడుచుండును. భరతునకు శ్రీరామునితో కలయిక జరుగకుండునట్లు చేయుడని దేవేంద్రుడు తమ గురువు బృహస్పతితో విన్నవించెను.



బృహస్పతి ఇంద్రునితో నిట్లు పల్కెను.

"ఒక పర్యాయము శ్రీరాముని భావమెరిగి కొంతచేసి యుంటిమి. కాని ఈ సమయములో కుట్రపన్నినచో హాని జరుగగలదు. తన పట్ల జరుపబడిన అపరాధానికి శ్రీరామచంద్రు డెన్నడూ కోపపడడు. కాని శ్రీరామభక్తునకు ఎవరైనా అపరాధముతలపెట్టినచో అతడు రాముని క్రోధాగ్నిలో భస్మము కాగలడు. దీనికి సంబంధించిన చరిత్ర వేదము లందును లోకమునందును ప్రసిద్ధి నందినది దుర్వాసున కీ మహిమ తెలియును." జగత్తు సమస్తము శ్రీరాముని జపించుచుండును. ఆ రాముడు జపించే భరతునితో సమానమైన భక్తులెవరు గలరు?

రఘుకులశ్రేష్ఠుడైన రామునియొక్క భక్తుని కార్యము పాడుచేయవలెననే ఆలోచన మనస్సులో రానీయకుము. అట్లు చేసినచో లోకములో అపకీర్తి. పరలోకములో దుఃఖము కల్గును. శ్రీరామునకు తన సేవకులంటే చాలా ప్రీతి. తన సేవకులకు సేవ చేయుటలోనే శ్రీరాముడు ఆనందించుచుండును. సేవకులతో వైరము పెద్ద వైరముగా భావించును. అతడు సర్వసముడు. అతనిలో రాగద్వేషములు లేవు. రోషము లేదు. ఎవరి పాపపుణ్యములను, గుణదోషములను గ్రహించడు. విశ్వములో అతడు కర్మకు ప్రాధాన్యమిచ్చెను. ఎవరు ఎట్లా చేయుదురో వారట్టి ఫలిత మనుభవించెదరు.

స్వామి తన భక్తులను ప్రేమతో కౌగిలించుకొనును. విరోధులను వధించి తరింపచేయును. గుణరహితుడు, ఆద్యంతరహితుడు, నిర్లిప్తుడునైన భగవానుడు భక్తుల ప్రేమవశమున నరుడుగా ప్రకటీభూతుడయ్యెను.

శ్రీరాముడు సదా తన భక్తుల అభిరుచి కనిపెట్టుచుండును. వేదములు, పురాణములు, సాధువులు, దేవతలు దీనికి సాక్షులు. ఇట్లా హృదయములో గుర్తించి కుటిలత్వమును విడువుము. భరతుని పాదములయందు ప్రీతి పెంచుకొనుము. ఇంద్రా! శ్రీరాముని భక్తులు సర్వదా యితరులకు మేలుచేయుటలోనే నిమగ్నులై యుందురు. వారు ఇతరుల దుఃఖమును

చూచి దుఃఖితు లగుచుందురు. భరతుడు భక్తశిరోమణి, వారిపట్ల ఏ మాత్రము భయపడవద్దు శ్రీరాముడు దేవతలకు హితము చేయువాడు. భరతుడు శ్రీరామాజ్ఞానుసారము నడచువాడు. నీవు స్వార్థమువలన వ్యర్థముగానే వ్యాకులపడుచున్నావు ఇందు భరతుని దోషమేమీలేదు. నీ మోహమే."

బృహస్పతి వాక్యములను విని ఇంద్రుని విచారము దూరమయ్యెను.

భరతుడు మార్గమున పోవుచుండెను. అతని భక్తి పారవశ్యమును చూచి మునులు, సిద్ధులు ఆనందించుచుండిరి. అతని ప్రేమవాక్యములు విని వజ్రములు, రాళ్ళుకూడా కరగిపోవుచుండెను. భరతుడు యమునానది యొద్దనకు వచ్చెను. యమునానది శ్యామవర్ణ జలమునుజూచి రఘురాముని శ్యామలవర్ణము గుర్తుకువచ్చెను. భరతుడు అతని వెంటనున్న సమాజము ప్రేమవిహ్వలులైరి. ఆ రాత్రి అచ్చటనే నివాసము చేసిరి. మర్నాడు స్నానముచేసి అందరు బయలుదేరిరి.

ఎచ్చ టెచ్చట సీతారామలక్ష్మణులు నివాసము చేసియుండిరో ఆయా స్థలములను చూచి భక్తితో నమస్కారము చేయుచుండిరి. మార్గములో నివసించెడి స్త్రీపురుషులు ఈ వార్త విని యిండ్లనుండి పనిపాటులు విడిచి తండోపతండములుగా వచ్చి భరతశత్రుఘ్నుల రూప, సౌందర్య, భక్తివిశేషములను గాంచి ఆనందించుచుండిరి. తమ జన్మ సార్థకమైనట్లు వారు తలంచుచుండిరి.

గ్రామస్త్రీలు ఒకరితో మరొకరు యిట్లు చెప్పుకొనుచుండిరి. వీరు రామలక్ష్మణులు అవునా? కాదా? వీరి వయస్సు, శరీరము, రూపము అంతా అదే. శీలము, స్నేహము వారివంటివే. నడకకూడా అదే. కాని వీరు వారివలె మునివేషములో లేరు. సీతమ్మవారు వెంటలేదు. వీరిముందు చతురంగసేన వెళ్ళుచున్నది. వీరి ముఖములలో ప్రసన్నత లేదు. కనుక ఈ భేదముల వలన ఏదో సందేహము కల్గుచున్నది.



ఒక స్త్రీ శ్రీరాముని పట్టాభిషేకము ఎట్లా భంగము అయినదో ఆ కథ అంతా చెప్పుచు ఇట్లనెను. "తండ్రి యిచ్చిన రాజ్యమును త్యజించి పాదచారియై భరతుడు వెళ్ళుచున్నాడు. శ్రీరాముని తోడ్కొని వచ్చుటకు వెళ్ళుచున్నాడు. భరతుని సోదరప్రేమ, భక్తి, ఆచరణ చెప్పినా, వినినా, దుఃఖము, దోషములు హరించును. వీరిని గురించి ఎంత చెప్పినా తక్కువే. వీరిని చూచి మన మిప్పుడు ధన్యురాండ్రమైతిమి. కైకేయి వంటి ఆమెకు ఇతడు తగిన పుత్రుడు కాడు". అది విని ఇంకొక స్త్రీ యిట్లు పలికెను. ఇందు రాణిగారి దోషము లేదు. ఇది అంతా విధాత చేసియుండెను.

ఈ విధముగ శ్రీరాముని గుణగణములను కీర్తించుచు శ్రీరాముని స్మరించుచు భరతుడు వెళ్ళుచుండెను. మార్గమధ్యములో భిల్లులు, కోలులు, బ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్న్యాసులు కలిసికొనుచుండిరి. వారెల్లరకు నమస్కారములు చేయుచు "సీతారామలక్ష్మణులు ఏ వనములో నివసించుచున్నారు?" అని అడుగుచుండెను. ప్రభు సమాచారము చెప్పువారు వుండిరి. ఈ విధముగా అందరినుండి ప్రభువు సమాచారము అడిగి తెలిసికొనుచుండిరి. ఆ దిన మచ్చటనే ఆగి మరుసటిరోజు ప్రాతఃకాలమున లేచి శ్రీరాముని స్మరించి బయలుదేరిరి.

అంతటను మంగళసూచక శకునములు కనపడుచుండెను. శ్రీరాముని దర్శించెదము. మన దుఃఖములు దూరమగునని తలంచుచు భరతుడు అతని వెంట నున్న అనుచరులు అత్యుత్సాహముతో ముందుకు వెళ్ళుచుండిరి. అందరును భక్తిపరవశులై నడచుచుండిరి.

శరీరావయవములు శిథిలమయ్యెను. పాదములు తడబడుచుండెను. ప్రేమవిహ్వలత్వమున మాటలు రాకపోవుచుండెను. ఆ సమయమున నిషాద రాజు సహజ సుందరమైన కామదగిరి పర్వతమును చూపించెను. దాని సమీపముననే పయస్విసీనది ఒడ్డున సీతారామలక్ష్మణులు నివాసము చేయుచుండిరి. అందరు ఆ పర్వతమును గాంచి "శ్రీరామచంద్రమూర్తికి

జయ" మని పలుకుచు నమస్కారము చేయుచుండిరి. రామచంద్రుడు అయోధ్యకు తిరిగివచ్చినంతగా వారందరు ఆనందించిరి. ఆ సమయమున భరతునకు కలిగిన పారవశ్యమును ఆదిశేషుడుకూడా వర్ణించజాలడు అహంకార, మమకారములతో మలినమైన మనుష్యులకు బ్రహ్మానందమువలె కవులకుకూడ ఆ వర్ణనము అసాధ్యము.

జనులందరు శ్రీరాముని యందుగల అనురాగముచేతను, మార్గాయాసముచేతను డస్సిపోయిరి. సాయంకాలము వరకు రెండు క్రోశములు మాత్రమే నడువగలిగిరి. తెల్లవారగనే భరతుడు ముందునకు సాగెను.

అచ్చట శ్రీరామచంద్రుడు తెల్లవారకముందే మేల్కొనెను. జనసమాజ సహితముగ భరతుడు వచ్చుచున్నట్లు సీతాదేవి స్వప్నము గాంచెను. ఆ స్వప్నమును సీతాదేవి శ్రీరామచంద్రునికి చెప్పెను.

ప్రభువుగారి వియోగాగ్నిచేత వారి శరీరములు సంతాపము చెందుచున్నట్లు అందరు వికల హృదయులై ఉదాసీనులై దుఃఖముతోనున్నట్లు అత్తగారల రూపములు మారిపోయినట్లు స్వప్నములో చూచియుంటినని సీతాదేవి తనభర్తతో చెప్పెను.

అది విని శ్రీరాముని నేత్రములు కన్నీటితో నిండిపోయెను. అందరి విచారములను దూరముచేసే శ్రీరామచంద్రుడు తానే విచారములో పడెను.

"లక్ష్మణా! మీ వదినకు వచ్చిన స్వప్నము మంచిదికాదు. ఏదో భయంకర దుర్వార్త వినవలసివచ్చును." అని యనుచూ శ్రీరాముడు సోదర సమేతముగా నదికి వెళ్ళి స్నానముచేసి దేవపూజలుచేసి ఉత్తర దిశనున్న ఆశ్రమునకు వచ్చెను. అప్పుడు కొందరు భిల్లులు వచ్చి భరతుడు వచ్చుచున్న సమాచారము చెప్పిరి.



మంగళకరమైన ఆ మాటలు విని శ్రీరామచంద్రుడు అమితానందము పొందెను. సీతాపతి రామచంద్రుడు తిరిగి ఏదో ఆలోచనలోపడెను. "భరతుడు ఇచ్చటికి వచ్చుటకు కారణమేమి?" అని తలంప సాగెను, మరొక భిల్లుడు వచ్చి చతురంగ సేన వచ్చుచున్నదని చెప్పెను. రాముడు తండ్రి ఆజ్ఞ, భరతుని మొగమాటము తలచుకొని ఏమి చేయవలెనా అని చింతిల్లుచుండెను. అతని మనస్సు నిలుకడగా లేదు. భరతుని స్వభావము నిలుకడగా లేదు. భరతుని స్వభావము మనస్సులో తలంచుకొని చివరకు ఈ విధముగా భావించెను.

"భరతుడు సాధువు, బుద్ధిశాలి, నా ఆజ్ఞను పాటించువాడు" అని అనుకొని శాంతించెను. ప్రభువు వ్యాకులతను చూచి లక్ష్మణుడు ఇట్లు మనవిచేసెను. "అన్నయ్యా! తమరు అడుగకుండానే అవసరమని చెప్ప సాహసించుచున్నాను. అందుకు నన్ను క్షమించండి. మీరు సర్వజ్ఞులు. మీరు లోకజ్ఞులు. మీరు ప్రతిఫలము లేకుండా హితము చేయువారు. సరళ హృదయులు. శీలవంతులు. ప్రేమస్వభావులు. అందరిని విశ్వసించెదరు. అందరుకూడా తమవంటివారేయని అనుకొనెదరు. కాని మూఢులు పదవిరాగానే అహంకారము చెందెదరు. భరతుడు నీతిపరాయణుడు, సర్వసమర్థుడు. ప్రభువునందు భక్తికలవాడు. ఈ విషయము జగత్తంతా యెరుగును. ఇప్పుడు భరతుడు మీరు పొందవలసిన రాజపదవిని పొందియున్నాడు. అందువలన ధర్మమును మంటకలిపెను. అహంకారపరుడైన భరతుడు మీరు వనములో ఒక్కరే ఉన్నారని, నిస్సహాయులై యున్నారని తలంచి తన రాజ్యమును నిష్కంటకముగా చేయవలెనని ఆలోచనతో సైన్యమును వెంటబెట్టుకొని వచ్చుచున్నాడు. నిజముగ ఏ కపటమును లేనివాడైనచో రథములు, గుఱ్ఱములు, ఏనుగులు, సైన్యము వెంటబెట్టుకొని ఇక్కడికి ఎందుకు వచ్చును? కాని యిది భరతుని తప్పుకాదు. రాజ పదవి వచ్చిన మీదట ఎట్టివారైనను అహంకారము

చెందెదరు. చంద్రుడు గురుపత్నీగామి అయ్యెను. నహుషుడు బ్రాహ్మణులచే పల్లకిని మోయించుకొనెను. వేనుడు వేదమార్గము విడిచెను. కార్తవీర్యార్జునుడు దేవేంద్రుడు, త్రిశంకుడు మొదలగు ప్రముఖులు రాజ్యమదముతో కళంకభావము పొందిరి. భరతుడు ఇట్లనుకొనుట ఉచితమే. ఎందులకన శత్రుశేషము, ఋణశేషము ఎప్పుడు ఉంచకూడదు. కాని భరతుడు మీరు నిస్సహాయులని తలచి పొరపాటు పని చేసెను. నేడు యుద్ధమున మీ క్రోధ పూర్వకమైన ముఖమును చూచి తగిన ఫలితము పొందగలడు" అని పలికి లక్ష్మణుడు క్రోధావేశముతో యుద్ధ సన్నద్ధు డయ్యెను.

శ్రీరామునికి వందనము చేసి తన బాహుబలము ప్రశంసించుకొనుచు లక్ష్మణుడు ఇటులనెను. "ఇక మనము భరతుని తేలికగా చూడగూడదు. ఎంతవరకు మనము ఓపిక పట్టెదము? నా చేతులలో ఆయుధములు ఉండగా రఘువంశము వాడనైన నేను రాముని బంటునైన నేను ఈ పనిని ఎట్లు సహించెదను!'' అని నిద్రించుచున్న వీర రసము ఒక్కసారి లేచి విజృంభించినట్లు లక్ష్మణుడు లేచి చేతులు ముకుళించి ఆజ్ఞనిమ్మని అడిగి అమ్ముల పొదిని ధరించి ఆయుధములు చేబూని యిట్లు పల్కెను.

"నేను రామునికి నిజమైన సేవకుడనైతే భరతుని తప్పక యుద్ధములో వధించెదను. రామచంద్రుని నిరాదరణ చేసినందులకు తగిన ఫలముగా ఆ సోదరు లిద్దరు రణశయ్య మీద పరుండెదరు. మునుపటి క్రోధమంతయు తీర్చుకొనెదను. సింహము ఏనుగుల గుంపును చెండాడి నట్లు భరతుని సేన నంతయు పటాపంచలు చేసెదను శంకరుడు దిగి వచ్చినను వారిని వదలను."

లక్ష్మణుని ఆగ్రహావేశమును చూచి అతని ప్రతిజ్ఞను విని లోకపాలురు కూడా భయపడిరి. లోకమంతయును గడగడ వణక సాగెను. లక్ష్మణుని బాహు బలమును ప్రశంసించుచు ఆకాశవాణి యిట్లు పల్కెను.



"ఓ లక్ష్మణా! నీ ప్రతాపము, ధైర్యము ఎవరెరుగరు? కాని ఎవరైనను ఒక పనికి పూనిన యెడల అది ఉచితమా అనుచితమా యని ఆలోచించి చేయవలెను. తొందరపడి చేసి తదుపరి పశ్చాత్తాప పడుట మంచిది కాదు."

లక్ష్మణుడు అశరీరవాణి వాక్కులను విని సంకోచించెను. సీతారాములు ప్రేమతో నిట్లనిరి. "లక్ష్మణా! నీవు చెప్పినదియే రాజనీతి. సోదరా! రాజపదవి వలన అహంకారము హెచ్చును. ఎవరు సాధువులను సేవించరో వారికి అహంకారము కలుగును. వినుము. మన భరతుని వంటి ఉత్తమ పురుషుని బ్రహ్మ సృష్టిలో ఎచ్చటను చూడలేదు, వినలేదు. మజ్జిగ చుక్కవేసిన మాత్రాన పాలసముద్రము విరిగిపోవునా? అయోధ్యా రాజ్యమే కాదు భరతునకు త్రిలోకాధిపత్యము వచ్చినను అతడు గర్వము పొందడు."

అంధకారము సూర్యుని మ్రింగివేయవచ్చు. ఆకాశము మేఘములలో కలసి పోవచ్చు. ఆవు గిట్టంత నీటిలో అగస్త్యుడు మునిగి పోవచ్చు. భూదేవి తన సహజమైన ఓర్పును విడువవచ్చు. దోమ ఊదితే సుమేరు పర్వతము ఎగిరి పోవచ్చు. కాని భరతునికి మాత్రము రాజ్యమదము ఎన్నడును కలుగదు. నేను రూఢిగా చెప్పుచున్నాను. భరతుని వంటి పవిత్ర హృదయుడైన పుణ్యమూర్తి యీ ప్రపంచములో మరొకడు లేడు.

లక్ష్మణా! విధాత గుణమనే పాలలో అవగుణమనే నీటిని కల్పి జగత్తును సృష్టించెను. కాని భరతుడు సూర్యవంశమనే సరోవరములో హంసవలె జన్మించి గుణదోషముల విభాగించెను. భరతుడు తన యశముచేత దేదీప్యమానముగా ప్రకాశించుచున్నాడు."

భరతుని గుణశీల స్వభావములను వర్ణించుచు శ్రీరామచంద్రుడు ప్రేమపరవశుడయ్యెను. భూమిమీద భరతుడు జన్మించినట్లయితే సంపూర్ణ ధర్మములను ఈ భూమిమీద ఎవరును పాటింపకపోయియుందురు. సీతారామలక్ష్మణులు ఆకాశవాణి వాక్కులు విని ఆనందభరితులైరి.

భరతుడు పరివారసహితముగ మందాకినీ నదిలో స్నానము చేసెను. తీరమున ఆగియున్న గురువుగారి ఆజ్ఞ పొంది నిషాదరాజుతో కూడి భరత శత్రుఘ్నులు సీతారాములున్నచోటునకు బయలుదేరిరి. తన తల్లిచేసిన దుష్కార్యము జ్ఞాపకము వచ్చినపుడు భరతుడు సిగ్గుపడుచుండెను.

"నేను వచ్చుచున్నానని తెలిసికొని సీతారాములు ఆ స్థలమును విడిచి మరెచ్చటికైన వెళ్ళరుకదా! మా తల్లి చేసినపనికి వారు ఏమి చేసినను తప్పులేదు. నన్ను మలినమనస్కుడని వదలినను లేక సేవకుడనని దగ్గరకు చేరదీసినను ఏమైనను శ్రీరామచంద్రుని పాదకమలములే నాకు సర్వదా దిక్కు."

ఇట్లు మనస్సులో పరిపరివిధముల మథనపడుచు భరతుడు మార్గమున నడచుచుండెను. ఆయన శరీరము డస్సిపోయెను. భక్తిబలముతో వెళ్ళుచుండెను. రాముని స్మరించుచున్నప్పుడు పాదములు ముందుకు పడుచుండెను. ఆ సమయమున భరతుని స్థితి యేమని చెప్పగలము? భరతుని భక్తిపారవశ్యము చూచి నిషాదరాజు దేహమును మరచిపోయెను వారికి అమంగళ శకునములు కలుగజొచ్చెను.

అది చూచి నిషాదరాజు విషాదముతో "విచారము నశించును. ఆనందము కల్గును. అంతములో అసంతుష్టి కలుగును" అనెను. గుహుని వాక్యములను భరతుడు సత్యమని భావించెను.

అందరు కలిసి ఆశ్రమ సమీపమునకు వచ్చిరి. భరతుడు అచ్చటి పర్వతపంక్తులను చూచి ఆకలిగొన్నవానికి మంచి భోజనము అందినట్లు ఆనందించెను. మంచి రాజు రాజ్యమును పాలించునప్పుడు ప్రజలు సుఖించినట్లు రాముని నివాసమువలన వనసంపత్తి శోభాయమానముగా నుండెను. పర్వతముల ప్రకృతి సౌందర్యము మనోహరముగా నుండెను.

గుహుడు పర్వతమెక్కి చేతులెత్తి భరతుని పిలిచెను. అల్లదిగో! ఆ కనపడుచున్నదే ఆశ్రమము. అవిగో మామిడి, జామ, కదంబ తమాల



వృక్షములు కనవచ్చుచున్నవి. ఆ వృక్షములకు మధ్యలో సుందరమైన విశాల వటవృక్షము ఉన్నది. దానిని చూచిన మహానందము కలుగును. దాని ఆకులు నీలిరంగు, ఫలములు ఎరుపురంగు గల్గియున్నవి. దాని చల్లని ఛాయలో అన్ని ఋతువులలో సుఖము కలుగును. శాంతిని, కాంతిని ఒక్కచోట చేర్చి బ్రహ్మ దీనిని సృష్టించెనా అన్నట్లు ఇది శోభిల్లుచున్నది.

నదీసమీపమున అదిగో పర్ణకుటీరము. సుందరమైన తులసీవనము కందోయికి విందు చేయుచున్నది. అచ్చటచ్చట సీతాలక్ష్మణులు పూల మొక్కలను నాటియున్నారు. ఈ వటవృక్షముల మొదట సీతాదేవి తన కోమల హస్తములతో చక్కని అరుగువేసి యున్నది. దానిపైన సీతారాములు కూర్చుండి మునులు చెప్పెడి వేదపురాణశాస్త్రములు ఇతిహాసములు వినుచుండిరి.

ఆ దృశ్యమును చూచినంతనే భరతునకు కన్నీరు నిండెను. శ్రీరామ చంద్రుని పాదచిహ్నములను చూచి భరతశత్రుఘ్నులు బీదవానికి పరుసవేది దొరికినట్లు ఆనందపడిరి. సోదరులిద్దరు అడుగడుగునకు సాష్టాంగము పడుచు వెళ్ళుచుండిరి. అచ్చటి పాదధూళిని కన్నులకద్దుకొని శిరస్సున ధరించుకొనుచుండిరి. వారికి శ్రీరాముని స్వయముగా చూచినట్లుండెను.

భరతుని అనిర్వచనీయమైన రూపముచూచి వనములోని పశువులు పక్షులు జడములు, చేతనములు సైతము ఆనందపారవశ్యములో మునిగి పోవుచుండెను. మార్గమును చూపించు నిషాదరాజు కూడా మైమరచిపోయి మార్గము తప్పెను. అది గ్రహించి దేవతలు మార్గమున పువ్వులు పరచిరి భరతుని భక్తిని ప్రేమను పారవశ్యమును అచ్చటి మునులు, సిద్ధులు ప్రశంస చేయుచుండిరి. ప్రేమ అమృతము. విరహము మందరాచలము. భరతుడు అగాధమైన సముద్రమువంటివాడు. శ్రీరామచంద్రుడు సాధుహితముకొరకు స్వయముగా ఆ సముద్రమును మథించి ప్రేమ అను అమృతమును సృష్టించెను.

వనవృక్షములు అడ్డుండుటవలన నిషాదరాజును భరతశత్రుఘ్నులను లక్ష్మణుడు చూడలేదు. శ్రీరాముని పవిత్రాశ్రమమును భరతుడు చూచెను. ఆశ్రమమును చూడగనే భరతునిలోగల అన్ని దుఃఖములు దూరమయ్యెను. యోగులు పరతత్త్వప్రాప్తిచే సుఖించినట్లు భరతుడు ఆనందించెను.

లక్ష్మణుడు ప్రభువు ఎదుట నిలచి రామచంద్రుడు అడిగినదానికి బదులు చెప్పుచుండుటను భరతుడు చూచెను. శ్రీరామలక్ష్మణులు శిరమున జడలు, నడుమున కాషాయవస్త్రములు, వీపున అమ్ములపొదులు ధరించి యుండిరి. చేతులలో ధనుర్బాణములు ధరించియుండిరి. వేదికమీద సీతా సమేతుడైన శ్రీరామచంద్రుడు విరాజమానుడై యుండెను మునివేషములో నున్న సీతారాములను చూచినంతనే రతీమన్మథులు మునివేషములు ధరించి యుండిరా అన్నట్లు తోచుచుండెను. జ్ఞానులసభలో భక్తి, సచ్చిదానందము, రూపములు ధరించి విరాజమానములై యున్నట్లు సీతారాములు ప్రకాశించుచుండిరి. ఎవరివైపు శ్రీరాముడు చిరునవ్వుతో చూచుచుండెనో అతనికి పరమానందము. పరమశాంతి లభించుచుండెను. భరతశత్రుఘ్నులును నిషాదరాజైన గుహుడును రామచంద్రుని చూచి అనురాగతన్మయులైరి.

భరతుడు ''రక్షించు తండ్రీ! రక్షించు'' అనుచూ భూమిమీద సాష్టాంగపడెను. భరతుడు నమస్కరించుచున్నట్లు లక్ష్మణుడు తెలిసికొనెను. లక్ష్మణుడు రామచంద్రుని ఎదుట నిలబడియుండెను. భరతుడు రాముని వెనుకభాగములో నుండెను. అందువలన రామచంద్రుడు భరతుని చూడలేదు.

లక్ష్మణుడు రామచంద్రునితో "అన్నయ్యా, భరతుడు మీకు నమస్కారము చేయుచున్నాడు.'' అని చెప్పెను. అది వినగానే రామచంద్రుడు ప్రేమమయహృదయముతో గబగబ లేచెను. పైనున్న ఉత్తరీయము ఒకచోట జారిపడెను. అమ్ములపొది ఒకచోట పడెను. బాణము లొకచోట జారెను.



శ్రీరాముడు భరతుని గాఢముగా ఆలింగనము చేసికొనెను. ఆ కలయికను చూచి అచ్చటి వారందరు తమ్ము తాము మరచిపోయిరి. ఆ అన్నదమ్ముల ప్రేమ మనస్సునకు అందనిది. కవులకు తెలియనిది. వారి కలయిక హరిహరాదులకు అందనిది. ఆ కలయిక చూచి దేవతలు భయభ్రాంతులై చింతిల్లుచుండిరి. తమ గురువుగారగు బృహస్పతికి విన్నవించిరి. దేవగురువు వారికి బాగా నచ్చచెప్పినమీదట దేవతలు పుష్పవర్షము కురిపించిరి.

అంత అందరు పరస్పరము కలిసి క్షేమసమాచారములు చెప్పుకొనిరి. నిషాదరాజు వచ్చి వశిష్ఠులవారు, తల్లులు మీకొరకు పరితపించుచున్నారని చెప్పగా రామచంద్రుడు పరుగెత్తుకొని వెళ్ళి వశిష్ఠులవారి పాదములమీద పడెను. ముని శ్రీరాముని ప్రేమతో లేవదీసి ఆశీర్వదించెను.

మొట్టమొదట కైకకు నమస్కరించి ఆమె హృదయములోని ఆవేదన తీర్చి "అమ్మా! యిది అంతయు విధికృతము. నీ తప్పు లేదు.'' అని సంతృప్తిపరచెను. తదుపరి తల్లి కౌసల్యకు పిమ్మట సుమిత్రకు నమస్కరించెను. సీతాదేవి అత్తలకు నమస్కరింపగా వారు ప్రేమతో ఆమెను ఆశీర్వదించిరి. రామచంద్రుని చూడవలెనని ప్రజలు తొందరపడుచుండిరి. రామచంద్రుడు అందరి కన్నిరూపులై అందరి క్షేమసమాచారములు అడిగి వారిని సంతుష్టులను చేసెను.

వశిష్ఠులవారు రామునికి దశరథుడు స్వర్గధామము చేరిన సంగతి చెప్పెను. తనతండ్రి తన నిమిత్తము మరణించినందున రామచంద్రుడు మిగుల దుఃఖపడెను. కఠోరమైన వార్తవిని సీతాలక్ష్మణులు, రాణులు అమితముగా శోకించిరి. జనులందరు విలపించిరి. మహారాజు ఆ రోజే మరణించినట్లు అందరు దుఃఖించిరి.

మునీశ్వరుడు చెప్పినట్లు శ్రీరామచంద్రుడు సపరివారముగ మందాకినీ నదిలో స్నానము చేసెను. వశిష్ఠులవారు చెప్పినను ఆ దినము ప్రభువు

పచ్చి గంగనైన ముట్టలేదు. రెండవదినము ఉదయమున శ్రద్ధతో వేదశాస్త్ర పురాణములలో చెప్పినట్లు రామచంద్రుడు తండ్రికి శ్రాద్ధకర్మలు చేసి అశౌచమనే అంధకారమును నశింపచేసికొని పరిశుద్ధుడయ్యెను.

రెండుదినములు గడచెను. అప్పుడు రామచంద్రుడు గురువుగారి వద్దకు వెళ్ళి నమస్కరించి యిట్లనెను. "గురువర్యా, నగరవాసులందరు ఇక్కడికి వచ్చి అమితముగా బాధపడుచున్నారు. కందమూలఫలములే వారికి ఆహారములగుచున్నవి. భరతశత్రుఘ్నులు, మంత్రులు, మహాజనులు, తల్లులు కష్టములు పడుచున్నారు. తొందరగా అయోధ్యకు బయలుదేరండి. అచ్చట మహారాజు లేదు. ఇట్లు చెప్పుచున్నందుకు మన్నించండి. మీరు ఏమి చేయుట యుచితమో అది చేయండి."

అందుకు వశిష్ఠులవారు ఇట్లు సమాధానము చెప్పిరి. "నీవు అన్ని ధర్మములు తెలిసినవాడవు. దయామూర్తివి. ఈ రెండుదినములు నిన్ను దర్శించి ప్రజలు అందరును శాంతి పొందిరి."

శ్రీరాముని వాక్యములు విని అందరు తాము అయోధ్యకు వెళ్ళవలసి వచ్చునేమో అని భయభీతులైరి. కాని వశిష్ఠులవారి కళ్యాణకరమైన మాటలు విని భయముపోయి సంతోషపడిరి. అయోధ్య ప్రజలందరు పయస్వినీ నదిలో స్నానము చేయుచు మూడువేళల రాముని దర్శనము చేయుచు పాపములను నశింపచేసికొనుచుండిరి. పర్వతములను, వనములను చూచుచు సుఖముగా కాలము గడుపుచుండిరి. సెలయేళ్ళ తీయనినీరు త్రాగుచు శీతలమంద సుగంధమారుతము వీచుచుండగా ఆనందించుచుండిరి. అనేక ఫలవృక్షములు నిండియుండెను. కోలులు, భిల్లులు, చెంచులు మొదలగు ఆటవికులు గంపలతో కందమూలఫలములు, దొన్నెలతో తేనెలు, కావిళ్ళతో కాయగూరలు తెచ్చి వాటి రుచులను, పేర్లను చెప్పుచు వారికిచ్చిరి. జనులు వాటికి వెలకట్టి యివ్వబోగా తీసికొనక "యిచ్చినయెడల రామునిమీద ఒట్టు" అని పలికి వినయముతో ఇట్లనిరి.



"సాధువులని ప్రేమతో సన్మానము చేసితిమి. మీరు వాని కిమ్మత్తు ఇచ్చినయెడల ఆ వస్తువులు తిరిగియిచ్చినట్లే అగును. మా ప్రేమను తిరస్కరించినట్లే యగును. మీరు పుణ్యాత్ములు. మేము నీచనిషాదులము. శ్రీరాముని దర్శనమువలన మాకు మీ దర్శనమైనది. లేనిచో మీ దర్శనము దుర్లభము. శ్రీరామచంద్రుడు మీమీద ఎంతటి దయచూపిరో మీరు మామీద అంతటి దయ చూపండి. మాకు మీరు ప్రియమైన అతిథులు. మేము మీకు సేవచేయుటకు తగినవారము కాదు. మీకు మేము ఏమివ్వగలము? జీవహింసకులము. కుటిలవర్తనులము. వంకరబుద్ధి గలవాళ్ళము. రాత్రిపగలు పాపము చేయుచుందుము. అయినను కట్టుకొనుటకు వస్త్రములు లేవు. పొట్టనిండా ఆహారములేదు. స్వప్నములో కూడా ధర్మబుద్ధి లేదు. శ్రీరాముని దర్శనభాగ్యము కలిగిన తరువాత దుస్సహ దుఃఖములు దోషములు నశించినవి."

వనవాసుల వాక్యములు విని అయోధ్యాప్రజలు ఆనందించిరి. భరతునకు పగలు ఆకలిలేదు. రాత్రి నిదురలేదు. అలోచనలో మునిగిపోయెను ఊబిలో కూరుకుపోయినవాని మాదిరి బాధపడుచుండెను. "గురువుగారు చెప్పినట్లయితే రామచంద్రుడు తప్పక అయోధ్యకు తిరిగివచ్చును కాని వశిష్ఠముని శ్రీరామచంద్రుని భావమెరిగియే ప్రవర్తించును. తల్లి కౌసల్య చెప్పినను శ్రీరాముడు వచ్చును. కాని శ్రీరాముని కన్నతల్లి అప్పుడు వనమునకు పంపి యిప్పుడు తిరిగి రమ్మనునా? నేను సేవకుడను. నాకు మంచిరోజులు కావు. విధాత ప్రతికూలుడు." భరతుని మనస్సులో ఏమాత్రము ఆశ కనపడలేదు.

ఇట్లుండగనే రాత్రి గడచిపోయెను. వశిష్ఠునివద్దనుండి పిలుపు వచ్చెను. వెంటనే వెళ్ళి గురుపాదములకు నమస్కరించి ఆజ్ఞ పొంది కూర్చుండెను. ఆ సమయమున మహాజనులు, మంత్రులు మొదలగువారందరు వచ్చి కూర్చుండిరి. వశిష్ఠులవారు సమయమునకు తగినట్లు ఇట్లు చెప్పిరి.

''మహాజనులారా! బుద్ధిశాలియైన భరతా! శ్రీరాముడు సూర్యకులమునకు సూర్యుడు, ధర్మధురంధరుడు, సాక్షాత్ భగవానుడు, లోకములో సత్యము, ధర్మము నిలుపుటకు రామచంద్రుడుగా అవతరించెను. ఆయన గురువు తల్లి తండ్రి వాక్యములను అనుసరించువాడు, దుష్టులను సంహరించువాడు, దేవతలకు హితము చేయువాడు, నీతిపరమార్థమును బాగుగా ఎరిగినవాడు, స్వార్థరహితుడు, అట్టి యథార్థవాది యింకొకరు లేరు. సర్వసృష్టికి కారకుడు, ప్రభువు. కాబట్టి అతని ఆజ్ఞ ప్రకారము నడచుటలో మనకు హితము ఉన్నది. బుద్ధిశాలురైన మీరందరు ఆలోచించి మీకు ఏది యుచితమో అది చేయండి. శ్రీరామచంద్రునికి పట్టాభిషేకము జరుగుట అందరికి ఇష్టమే. సుఖదాయకమే. సంతోషకరమే. మంగళకరుడగు శ్రీరామచంద్రుడు ఎవ్విధముగా అయోధ్యకు వచ్చునో ఆలోచించి ఆ ఉపాయమును చేయండి.''

మునిశ్రేష్ఠులైన వశిష్ఠులవారి నీతిపరమార్థతత్త్వముతో కూడిన పైవాక్యములు అందరు శ్రద్ధగా వినిరి. కాని ఏమియును సమాధాన మీయలేక పోయిరి.

అప్పుడు భరతుడు అందరికి నమస్కరించి యిటుల పల్కెను. “సూర్య వంశములో ఒకరినిమించి మరొకరు గొప్పగా రాజ్యము చేసిరి. ఎంతటి వారైన అందరి పుట్టుకకు కారణము తల్లి దండ్రులు. వారు చేసిన శుభా శుభ కర్మలను పట్టి విధాత ఫలితము నిచ్చుచుండును.” ఇట్లు పలికి వశిష్ఠులవారికి నమస్కరించి “గురువర్యా! తమ ఆశీర్వాదము అన్నిటికన్న గొప్పది. దుఃఖోపశమనము లభించును. సమస్త కళ్యాణములు కలుగును. విధాత వ్రాతను కూడా మీరు మార్చగలరు. అట్టి మీరు నన్ను ఉపాయము అడుగుచున్నారు. అది నా దౌర్భాగ్యము” అనెను. భక్తియుక్తములైన భరతుని వచనములు విని గురువుగారి మనస్సులో ప్రేమ, ఉత్సాహము ఇనుమడించెను. “నాయనా! భరతా! రాముని కృప ఉంటే నీవు చెప్పినది



సత్యమే. రామ విముఖునకు స్వప్నములో కూడా ఏదియు సిద్ధించదు. నీకు ఒక మాట చెప్పుటకు సందేహపడుచున్నాను. బుద్ధిశాలురైన మనుష్యులు సర్వము పోవుచున్నప్పుడు సగమునైనా రక్షించుట కొరకు మిగతా సగము విడిచి పెట్టెదరు. మీ యిద్దరు సోదరులు (భరత, శత్రుఘ్నులు) వనమునకు వెళ్లండి. సీతా రామ లక్ష్మణులు వనము నుండి అయోధ్యకు వచ్చెదరు.”

వశిష్ఠుని వాక్యములు భరతునకు సంతోషము కలిగించెను. దశరథుడు తిరిగి జీవించి నట్లు అతడు ఆనందించెను. రాముడు రాజైనట్లు అతనికి కనపడెను. జనులకు ఇందువలన లాభము ఎక్కువ, హాని తక్కువగా కనపడెను. కాని తల్లులకు సుఖ దుఃఖములు సమానముగా ఉండెను. ఇది విని వారు వ్యాకులత్వము చెందిరి. భరతుడు వెంటనే ఇట్లనెను–

“ఓ మునీంద్రా! మీరు ఏమి చెప్పుచున్నారో అది అందరికి ఇష్టమే. కాని మేమిద్దరము పదునాలుగు వత్సరములే గాదు, మా జీవితాంతము వనములోనే గడపెదము. మీరన్నట్లు ఆ మాట సత్యము చేయండి సీతా రామ లక్ష్మణులు అయోధ్యకు తిరిగి వస్తే అదే నాకు పదివేలు.”

భరతుని భక్తి వాక్యములు విని సభా సదులందరు తమ దేహములనే మరచి పోయిరి. భరతుని మహిమ చాలా గొప్పది. ముని బుద్ధి చాలా సంకుచితమైనది. వశిష్ఠులవారి అంతరాత్మను భరతుడు కొనియాడెను. పరివార సహితముగా అందరు శ్రీరాముని వద్దకు వెళ్ళిరి. ప్రభువు నమస్కరించి ఉత్తమ ఆసనము ఇచ్చెను. అందరు ముని ఆజ్ఞను పొంది కూర్చుండిరి.

ముని శ్రేష్ఠుడు కాలమాన పరిస్థితులను గమనించి యిట్లు చెప్పెను. ''ఓ సర్వజ్ఞా! బుద్ధిశాలీ! జ్ఞాననిధీ! రామచంద్రా! తమరు అందరి హృదయములలోను నివసించువారు. అందరి మంచి చెడులు ఎరిగినవారు అందరికి హితము కలుగనట్లు ఉపాయము చెప్పండి. దుఃఖముతో ఉన్నవారికి

వివేచనా శక్తి ఉండదు. జూదరి తాను తప్పక తన పందెము గెలిచెదనని ఆశతో ఆడుచుండును."

ముని మాటలు విని రామచంద్రుడు "ఓ గురువర్యా! ఆ ఉపాయము మీ చేతిలోనే ఉన్నది. తమ ఆజ్ఞ ప్రకారము నడచుటలోనే మా అందరి క్షేమము ఇమిడి యున్నది. మొట్టమొదట నాకు ఆజ్ఞ యివ్వండి. సంతోషముగా పాటించెదనని ప్రమాణము చేయుచున్నాను. మీ ఆజ్ఞ అందరికి సంతోషము కలుగ జేయును" అని పల్కెను.

అంత మహాముని వశిష్ఠుడు "రామా! నీవన్నదంతా నిజమే! కాని, మరల మరల చెప్పుచున్నాను. నా మనస్సు భరతుని భక్తిలో లీనమైనది. భరతుని అభిరుచిని దృష్టిలో పెట్టుకొని ఏమి చేసినా నా దృష్టిలో అది శుభము కాగలదు. మొట్ట మొదట భరతుని ప్రార్థన వినండి. తదుపరి ఆలోచించండి. అప్పుడు సాధు సమ్మతము, లోక సమ్మతము నీతి సమ్మతమైన విధముగా చేయండి."

భరతుని మీద గురువుగారికి గల అపార ప్రేమను చూచి రామచంద్రుడు మనస్సులో విశేషముగా ఆనందించెను. భరతుని ధర్మ ధురంధరుడుగాను, తన సేవకుడుగాను తలచి శ్రీరామచంద్రుడు గురువుగారి ఆజ్ఞానుకూలముగా మనోహరమైన, కోమలమైన కళ్యాణమూలమైన వాక్యములు ఇట్లు పల్కెను.

"గురువర్యా! నేను సత్యము చెప్పుచున్నాను. విశ్వములో భరతుని వంటి సోదరుడు ఎవరునూలేరు. లోకములో ఎవరు గురువుగారిని సేవించెదరో వారు అన్నివిధముల అదృష్టవంతులు. గురువుగారి ప్రేమకు పాత్రుడైన భరతుని భాగ్య మేమని కొనియాడగలను? నా కన్న చిన్నవాడు నాకు సోదరుడును కనుక వాని యెదుట వాని గొప్పతనమును చెప్పుటకు సందేహించుచున్నాను. అయినప్పటికి భరతుడు ఏమి చెప్పునో అది చేయుటలో మేలున్నదని చెప్పుచున్నాను." అని పలికి రామచంద్రుడు మౌనము వహించెను.



అంత వశిష్ఠ మహాముని భరతునితో "నాయనా! నీవు అన్ని సందేహములు వదలి నీ హృదయములో గల విషయము లన్నియు చెప్పుము." అని అనెను.

ముని వాక్యములు విన రామచంద్రుని భావమెరిగి గురువుగారు, సోదరులు పూర్తిగా తనకు అనుకూలమని, భారమంతా తనమీద పడినదని గ్రహించి భరతుడు ఏమియు చెప్పజాలక ఆలోచనలో పడి చూచుచుండెను. కొంతసేపటికి ప్రేమాశ్రువులు రాల్చుచు ధైర్యముతో నిట్లనెను.

"నేను చెప్పదలచినది మునీశ్వరుడే చెప్పియుండెను. ఇంతకన్న అధికముగా నేనేమి చెప్పగలను? మా అన్నగారి స్వభావమంతా నేను ఎరిగి ఉన్నాను. ఆటలలో కూడా కోపించడు. విశేషముగా నా మీద దయచూపును. ఆటలలో కూడ మా అన్న కోపముగా ఉన్నట్లు నేను చూడలేదు. చిన్న తనములో కూడా నేను వారిని వదలలేదు. వారు కూడా ఎప్పుడు నా మనస్సు కించపరచలేదు. నేను అన్నగారి యనుగ్రహమును అనేక విధములుగా చూచితిని. నేను ఆటలలో ఓడినను నన్ను ప్రోత్సహించుచుండెడివాడు. అన్నగారిని ఎంత చూచినను నా నేత్రములు తనివితీరేవికావు. కాని విధాత నాప్రేమను సహించలేక పోయెను. నా తల్లిద్వారా మా యిద్దరి మధ్య భేదము కల్గించెను. నాతల్లి హీనురాలు, నేను పవిత్రుడనని హృదయములో ఆలోచించుటయే మహాపాపము. పుచ్చిపోయిన విత్తనము మొలకెత్తునా? స్వప్నములో కూడ యితరుల దోషము లెన్నకూడదు. నా అభాగ్యదేవతయే నన్నిట్లు చేసినది. నా పాపముల పరిణామమేయిది. ఆలోచించ కుండా నేను నాతల్లిని కఠినవాక్కులు పల్కి వ్యర్థముగా బాధించితిని. నాహృదయములో సావధానముగా సమస్తమును విచారించిచూచితిని. నాకు ఎక్కడ సుఖము లేదు. నాకు ఇదిఒక్కటే మేలుగాకనపడుచున్నది. అది ఏమనగా గురుదేవులు సర్వ సమర్థులు. సీతారాములు నాప్రభువులు. అందువలననే నాకు మంచి రోజులున్నవి."

సాధువులు ఉన్న సభలో గురువు, స్వామి ప్రత్యక్షమై ఉండగా పుణ్యతీర్థమునందు నేను ఉన్నది ఉన్నట్లు చెప్పుచున్నాను. నాయీ ప్రేమ నిజమైనదా లేక కపటమా? నేను చెప్పునది సత్యమా? లేక అసత్యమా? అనునది సర్వజ్ఞుడైన గురువు గారికి, అంతర్యామియైన అన్నగారికే తెలియును. నా తల్లి దుర్బుద్ధి వలన మాతండ్రి ప్రతిజ్ఞకు బద్ధుడై మరణించుట లోకులందరికిని తెలియును. తల్లుల వ్యాకులత చూడజాలము. అయోధ్యా వాసులు దుస్సహమైన దుఃఖముతో తపించుచున్నారు. అన్ని అనర్థములకు కారకుడను నేను. ఇది విని తెలుసుకొని దుఃఖమును సహించితిని. సీతా రామ లక్ష్మణులు ముని వేషములు ధరించి పాదరక్షలు లేకుండా పాదచారులై వనమునకు వెళ్లిన వార్త విని కూడా నేను బ్రతికియున్నాను. ఇక్కడికి వచ్చి కన్నులారా మిమ్ములను చూచియున్నాను.

మార్గమున నున్న సర్పములు, వృశ్చికములు నన్ను చూచి తమలోగల భయంకర విషాన్ని క్రోధాన్ని విడిచిపెట్టి తొలగి పోవుచున్నవి. ఆ పాములకు మించిన విషము నావద్ద ఉన్నందున నన్ను కాటు వేసినచో నా విషము వలన తమ ప్రాణములకే ముప్పు వాటిల్లగలదని భయపడి విషసర్పములు తమ విషమును వృధాగా భావించి వెళ్లి పోవుచున్నవి.

సీతారామ లక్ష్మణులకు శత్రువైన కైకమ్మకు జన్మించిన నాకు గాక విధాత మరెవ్వరికి దుఃఖమునిచ్చును?"

అత్యంత వ్యాకులత్వము, దుఃఖము, ప్రేమ, వినయము, శాంతి తొణుకుచున్న భరతుని పై వాక్యములు విని అందరు శోకించిరి. సభయంతయు విషాదముతో నిండిపోయెను. కమలవనమున మంచు కురిసినట్లయ్యెను. జ్ఞాని వశిష్ఠ మహాముని అనేకములైన యితిహాసములు చెప్పి భరతుని సమాధాన పరచెను. శ్రీరామచంద్రుడు భరతునితో నిట్లనెను.

"సోదరా! నీవు నీ హృదయములో ఎందుకు వ్యర్థముగా దుఃఖపడెదవు. జీవులగతి ఈశ్వరాధీనము. నా దృష్టిలో ముల్లోకములలోకూడా మూడు



కాలములయందును నీవంటి పుణ్య పురుషుడు లేడు. నీకు నీవేసాటి. నిన్ను మనస్సులోనయిన నిందచేయువాడు ఇహపరలోకములలో సుఖపడడు. గురువులను, సాధుపురుషులను సేవింపని మూర్ఖులే మన తల్లి కైకమ్మను దూషించెదరు.

"ఓ భరతా! నీ నామము స్మరించినంతమాత్రమున పాపము అజ్ఞానము నశించును. శివుని సాక్షిగా ఉన్నది ఉన్నట్లు చెప్పుచున్నాను. వ్యర్థముగా నిన్నునీవు నిందించుకొనకుము. ప్రేమ, విరోధము, దాచిన దాగునని కావు. పశువులు, పక్షులు మునుల దగ్గరకు నిస్సంకోచముగావెళ్లును. కాని హింసకులను చూడగనే భయపడి పారిపోవును. మిత్రులెవరో శత్రులెవరో పశుపక్షులుకూడ గుర్తింపగలవు. మానవుడు వివేకశాలి, బుద్ధిగలవాడు. నిన్ను గురించి నాకు బాగుగా తెలియును. కాని ఏమిచేయుదును? చాలా సందిగ్ధ స్థితిలో పడియున్నాను, రాజు నన్ను త్యజించి సత్యమును నిలబెట్టుకొనెను. ప్రతిజ్ఞ కొరకు తన శరీరమును విడిచెను. వారిమాటను త్రోసివేయుటకు మనస్సులో విచారము కల్గుచున్నది. దాని కంటె మించినది మీపరువు. అందునను గురువుగారు కూడా ఆజ్ఞాపించిరి. కనుక ఇప్పుడు నీవు ఏమి చెప్పెదవో తప్పక అది చేయ గోరుచున్నాను. నీవు సంతోషముతో అన్ని సంకోచములు వదలి చెప్పుము."

రఘుకుల శిరోమణి శ్రీరామచంద్రుని వాక్యములు విని అందరు సంతోషించిరి. దేవతలతో కూడా దేవేంద్రుడు భయపడి "చేసిన పని యంతయు చెడి పోవుచున్నది. ఏమి ఉపాయము తోచుట లేదు." అని మనస్సులో తలంచుచుండెను.

ఇట్లు దేవతలందరు తమలోతాముతర్కించుకొనిరి. రామచంద్రుడు భక్తుల భక్తికి వశుడు. అంబరీషుని, దుర్వాసుని ఘట్టములు జ్ఞాపకము చేసికొని దేవతలు, ఇంద్రుడు నిరాశచెందిరి. "నరసింహస్వామి సాక్షాత్కరించి

భక్తుడైన ప్రహ్లాదుని రక్షించెను. కనుక ఈ కార్యము భరతుని చేతిలోనేయున్నది.”

శ్రీరామచంద్రుడు తన భక్తుల నెవరైన సేవించినచో ప్రసన్నుడగును. కనుక శ్రీరాముని తన వశములో ఉంచుకొన్న భరతుని అందరూ తమ తమ హృదయాలలో ప్రేమ సహితముగా స్మరించుడు.” అని భావించిరి.

దేవతల అభిప్రాయము విని దేవతలగురువైన బృహస్పతి ‘మీరు మంచి ఆలోచన చేసితిరి. మీరు చాలా అదృష్టవంతులు. భరతుని పాదముల యందు ప్రేమ కలుగుట సకల శుభములకు, మంగళములకు మూలము. దేవేంద్రా! శ్రీరాముని ఛాయయే భరతుడు, కనుక అతని యందు మనస్సు స్థిరముగా పెట్టుము. భయపడవలసినపనిలేదు.”

దేవగురువు బృహస్పతి మాటలను, దేవతల అభిప్రాయములను, ఆలోచనలను గ్రహించి అంతర్యామియైన శ్రీరామచంద్రుడు లజ్జచెందెను, భరతుడు భారమంతా తనమీదనే పడినదని తలచి చివరకు తనలో తాను ఇట్లు నిశ్చయించుకొనెను.

“శ్రీరాముని ఆజ్ఞయే నాకు మేలు చేకూర్చును. జానకీ వల్లభుడు అమిత దయ నామీదచూపెను. తన ప్రతిజ్ఞను వదలి నా ప్రతిజ్ఞను పూర్తి దేయుటకు సంకల్పించెను. నాయెడ అంత దయ వారికున్నది.” అని నిశ్చయించుకొని పరమానందముతో చేతులు జోడించి భరతుడు శ్రీరామునితో నిట్లనెను.

“స్వామీ! దయాసాగరా! మీగొప్పతనమును నేనేమని వర్ణింపగలను? గురుదేవులు వశిష్ఠులు మీరు నాకు అనుకూలముగా నున్నందున నామలిన మనస్సులో కల్పించుకున్న అపోహనశించెను. లేనిసందేహము కల్పించుకొని భయపడితిని. దిశలు పొరపాటుపడి సూర్యునిది తప్పనుకొంటిని. నా దౌర్భాగ్యము, తల్లి కుటిలత్వము, విధాత ప్రతికూలత, కాలమాన పరస్థితులు ఇవన్నియుకలసి నన్ను తికమకపెట్టినవి. శరణాగతరక్షకా! మీరు మా



ప్రతిజ్ఞను చక్కగా నిర్వర్తించితిరి. ఈ విధానము మీకుక్రొత్తగాదు. లోకములో వేదములు చెప్పుచున్నవి. తమ స్వభావము కల్పవృక్షము వంటిది. ఎవరికి ప్రతికూలముగాని అనుకూలముగాని కాదు. గుర్తించి దాని వద్దకు వెళ్లిన వారందరికి విచారమును పోగొట్టును. బీదసాద యని చూడక అందరికి కోరిన కోర్కెల నిచ్చును.

ఈ దాసుని కొరకు మీరు మీ మనస్సులో ఏమాత్రము క్షోభ పడవద్దు ఏసేవకుడు తన స్వామిని సంకటములో పడవేయునో వాడు నీచుడు. సేవకుని మేలు సమస్తసుఖములును, లోభములను వదలి సేవచేయుటలోనే యున్నది. మిమ్ములను తిరిగి రమ్మనుటలో అందరికి స్వార్థమున్నది. మీ ఆజ్ఞను పాటించుటయే పరమ కళ్యాణము.

ఓ స్వామీ! నా ప్రార్థన విని ఎట్లుచేయుట ఉచితమో అట్లు చేయండి. మీ పట్టాభిషేకమునకుగాను సకల వస్తువులు తెచ్చితిమి. వాటిని ఉపయోగించండి. తమ్ముడైన శత్రుఘ్నునితో కూడ నన్ను వనమునకు పంపండి. మీరు అయోధ్యకు వెళ్ళి అందరిని ఆనందపరచండి. అట్లు కానట్లయితే లక్ష్మణుని, శత్రుఘ్నుని అయోధ్యకు పంపి నన్ను మీ వెంట తీసుకువెళ్ళండి. లేదా మేము ముగ్గురము కలిసి అడవికి వెళ్ళెదము.

“ఓ రఘురామా! మీరు సీతాసమేతముగా అయోధ్యకు వెళ్ళండి. మీకు ఏది ఇష్టమో అది చేయండి. మీరు బాధ్యతనంతా నా మీద మోపితిరి నీతిలేనివాడను. నా స్వార్థము కొరకు ఇది అంతా చెప్పుచున్నాను. దుఃఖితులైనవారికి వివేకముండదు. స్వామి ఆజ్ఞకు తిరిగి జవాబు చెప్పువానిని చూచి సిగ్గుకూడా సిగ్గుపడుచుండును. సంపూర్ణముగా నాలో అవగుణములు ఉన్నను సత్పురుషుడనని నన్ను గొప్పచేసి తమరు ప్రశంసించుచున్నారు. హృదయములో ఉన్న నిజమును చెప్పుచున్నాను. స్వామిని సేవకుడు సంకోచములో పడవేయకూడదు. ప్రభువు పాదములను పట్టుకొని

ప్రమాణముచేసి చెప్పుచున్నాను. లోకకళ్యాణము జరుగవలెనన్న సంతోషముతో అన్ని సందేహములు వదలి ప్రభువు ఆజ్ఞ శిరసావహించుట ఒకటే మంచి మార్గము.”

భరతుని పవిత్ర వాక్యములు విని దేవతలు సంతోషించి పుష్పవర్షము కురిపించిరి. అయోధ్యావాసులు సంశయగ్రస్తులైరి. వనవాసులు ఆనందించిరి. కాని శ్రీరామచంద్రుడు మౌనము వహించెను.

ఆ సమయమున జనక మహారాజు దూతలు వచ్చిరి. ముందుగా వశిష్ఠులవారి వద్దకు వచ్చి నమస్కరించిరి. ముని వేషములోనున్న శ్రీరాముని చూచి చాలా చింతించిరి వశిష్ఠులవారు జనకుని క్షేమము అడుగగనే దూతలు నమస్కరించి యిట్లు విన్నవించిరి.

“మా క్షేమమంతయు కోసలరాజు దశరథునితోనే పోయెను. అందుచేత లోకమంతా దిక్కులేనిదయ్యెను. ముఖ్యముగా అయోధ్యా, మిథిలానగరములు అనాథము లయ్యెను. దశరథుని మరణవార్త విని జనక పురవాసులందరు అపార దుఃఖములో తమ్ముతామే మరచిపోయిరి. తన రాణి దుఃఖమును చూచి జనకమహారాజు ధైర్యము చెడి విద్వాంసులను, మంత్రులను పిలిపించి సలహా అడిగెను. వారు ఇదమిత్థ మని చెప్పజాలకపోయిరి. జనక మహారాజే ధైర్యము తెచ్చుకొని తెలివైన నలుగురు వేగులవారిని పిలిచి మీరు వెంటనే అయోధ్యకు వెళ్లి శ్రీరామునిపట్ల భరతుని అభిప్రాయం ఎట్లా ఉన్నదో తెలిసికొని ఎవరికి తెలియకుండా త్వరలో వచ్చి నాకు చెప్పవలెనని ఆదేశించెను. వారు అయోధ్యకువెళ్లి భరతుని ప్రవర్తన తెలిసికొని అతడు చిత్రకూటము వెళ్లినట్లు ఎరిగి జనకపురమునకు తిరిగివచ్చి భరతుని భక్తిప్రేమలు విశేషంగా వర్ణించి చెప్పిరి.”

జనకమహారాజు ఆజ్ఞాపించినట్లు సేవకులు రథములు, గుఱ్ఱములు, ఏనుగులు మొదలగు వాహనములను అలంకరించి తీసికొనివచ్చిరి. నగరమునకు నమ్మకమైన సేవకులను రక్షకులుగా ఉంచి, మంచి



శుభముహూర్తమున మహారాజు రాణితో, నగర ప్రముఖులతో బయలుదేరిరి. రాణి పడుబాధవలన మహారాజు మొదలగు వారందరు ఎచ్చట ఆగక సరాసరి ప్రయాగవచ్చి ఆగిరి. వనములో సీతారాములు ఎచ్చటనున్నారో తెలిసికొనివచ్చి మాకు చెప్పుమని మమ్ములను ముందు పంపిరి. అని తమ విషయ మంతయు దూతలు విన్నవించిరి.

ముని వశిష్ఠులవారు ఆరుగురు భిల్లులను వారికి తోడుగా పంపెను. జనకుని ఆగమనము విని అయోధ్యాపురవాసులు ఆనందించిరి. రామచంద్రుడు సంకోచించెను. ఇంద్రుడు విశేషముగా ఆలోచనలో పడెను. కుటిలురాలైన కైక దుఃఖముతో కుమిలిపోవుచుండెను.

జనకుడు మునులందరికి నమస్కరించెను. శ్రీరాముడు శతానందులవారు మొదలగు పెద్దలకు నమస్కరించెను. సోదరులతోకూడ శ్రీరామచంద్రుడు జనకునికి ఎదురేగి నమస్కరించి తన ఆశ్రమమునకు తీసికొని వచ్చెను. వారిద్దరి కలయిక ఎట్లున్నదనగా శాంతరసము, కరుణరసము కలిసినట్లున్నది. రెండుదేశములవారు శోకముతో వ్యాకులపడుచుండిరి. ఎవరికిని ధైర్యము లేదు. దశరథుని రూప గుణ శీలములను తలచుచు అందరును దుఃఖములో మునిగిపోయిరి. విధాతను దూషించుచుండిరి. వారికి వశిష్ఠులవారు శతానందులవారు అనేక విధములుగా జ్ఞాన ముపదేశించి ధైర్యము పురికొల్పిరి.

శ్రీరామచంద్రుడు విశ్వామిత్రునితో ఇట్లు చెప్పెను. “నిన్నటినుండి ఎవరును పచ్చిగంగనైన ముట్టలేదు. ఆహారము భుజింపుమని చెప్పండి” అని అనగా విశ్వామిత్రునితో “ఇప్పుడు రెండుజాములకు పైగాగడచినది. మేము భోజనముచేయ” మని జనకుడు చెప్పెను.

మరుసటిరోజు ఉదయము కోలులు, భిల్లులు మొదలగు అడవి జాతులవారు కందమూల ఫలములు, తేనె కావిళ్ళతో తెచ్చిరి. అవి అందరు

భుజించిరి. శ్రీరామచంద్రుని దయవలన పర్వతములనుండి కోరిన వస్తువులన్నియు లభించుచుండెను. అన్ని బాధలు నివారణమగుచుండెను. వృక్షములు ఫల పుష్పములతో శోభిల్లుచుండెను. పక్షులు, పశువులు, చిలుకలు తీయని పలుకులు పల్కుచుండెను. సుఖము కలుగులాగున శీతల మంద సుగంధ వాయువులు వీచుచుండెను. భూదేవి జనకునకు అతిథ్యము ఇచ్చుచున్నదా అన్నట్లు ఉండెను. జనులు రాముని మరియు జనకుని ఆజ్ఞలను పొంది వనములను, పర్వతములను చూచుచు ఆనందించుచుండిరి.

ఈ ప్రకారము నాల్గు దినములు గడచెను. రామచంద్రుని దర్శించి అందరు బ్రహ్మానంద భరితులైరి. ఉభయ నగరవాసులు రాముడు అయోధ్యకు తిరిగిరానిది మనము ఎవ్వరము వెళ్లగూడదు". అని నిశ్చయము చేసికొనిరి.

సీతాదేవి అత్తలకు మిక్కిలి సేవచేసి సంతోషపెట్టుచుండెను. ఒక సమయమున సీత తల్లి సునయనాదేవి కౌసల్యాది వియ్యపురాండ్రను పలుకరించుటకు దాసీ జనముతో వచ్చెను. ఆమెను కౌసల్యాదేవి ఆదరముతో గౌరవించి ఆసనమిచ్చి క్షేమ సమాచారము లడిగెను. వారు రామచంద్రుని రూప లావణ్యములు చెప్పుకొని దుఃఖించిరి.

విధాత విధానములు విపరీతముగా ఉండును. ఉభయుల హృదయములలో అనురాగము, శీలము, ప్రేమ చూచియు, వినియు, కఠిన వజ్రంకూడా కరిగిపోవును. విధాత ఎంత చెడ్డవాడు. బుద్ధిమంతులకు, యోగ్యులకు కష్టములమీద కష్టములు తెచ్చిపెట్టుచుండును. అమృతము పేరు వినుటయేకాని యెక్కడను అది లభింపదు. విషము అంతటా ఉండును.

"విధాతచేయు పనులన్నియు మహాభయంకరములు. కాకులు, గ్రుడ్ల గూబలు, కొంగలు అంతట కనపడుచుండును. హంసలుమాత్రం సరోవరంలోనే ఉండును." ఇది విని సుమిత్రాదేవి దుఃఖముతో "విధాత ప్రవర్తన విపరీతము, విచిత్రము. జగత్తును సృష్టించి పోషించును. మరల అతడే ధ్వంసము చేయును. విధాత బుద్ధి బాలుర ఆటవలె వివేకహీనముగా నున్నది" అని పల్కెను.



కౌసల్యాదేవి ఇట్లనెను "ఇందు ఎవరి దోషము లేదు. సుఖదుఃఖములు కర్మాధీనములు. మనముచేసిన పాపపుణ్యములను బట్టి మనకు విధాత ఆయా కర్మఫలములను ఇచ్చుచుండును. ఈశ్వరుని ఆజ్ఞ అందరు శిరసావహించవలసినదే. పుట్టుట, పెరుగుట, గిట్టుట, అమృతము, విషము ఇవన్నియు అతని ఆధీనములు. వీనిని గురించి ఆలోచించుట వ్యర్థము. సుహారాజుగారు బ్రతికినప్పటి విషయమును, మరణించుటను, గుర్తుతెచ్చుకొని చింతిల్లువారు తమ స్వార్థము కోరియే అట్లు చేయుదురు."

"నీవు చెప్పినమాట నిజమే. నీవు పుణ్యాత్ముడైన దశరథమహారాజుగారి భార్యవు. అట్లు పలుకక మరెట్లు పలికెదవు?" అని జానకీదేవి తల్లి సునయనాదేవి కౌసల్యతో పలికెను.

కౌసల్యాదేవి దుఃఖముతో "సీతారామ లక్ష్మణులు వనమునకే వెళ్లవచ్చును. దాని పరిణామము బాగానే ఉండవచ్చును. కాని నాకు భరతుని గురించియే విచారము. ఈశ్వరుని అనుగ్రహము వలన, మీ ఆశీర్వాదము వలన నా నల్గురు పుత్రులు, నల్గురు కోడళ్ళు గంగాజలములవలె పవిత్రలు. నేనెన్నడును శ్రీరాముని మీదఒట్టు పెట్టుకొని ఎరుగను. కాని నేడు శ్రీరామునిపై శపథముచేసి సత్యము చెప్పుచున్నాను. భరతుని గుణశీలములు, నమ్రత, సోదరప్రేమ, భక్తి, యోగ్యత, యివన్నియు వర్ణించుటకు వీలుపడనవి. ముత్యపుచిప్పతో సముద్రపు నీరంతా బైటకు పోయగలమా? నేనెప్పుడును భరతుని కులదీపకుడుగానే యెరుగుదును. మహారాజు కూడా పలుమార్లు ఇదేమాట చెప్పుచుండెడివారు. బంగారమును గీటురాయిమీద గీచిన అదెట్టిదో తెలియగలదు. అట్లే పరీక్షా సమయములో పురుషుని స్వభావమునుబట్టి అతడెట్టివాడో తెలియగలదు. కాని యిట్లా నేను చెప్పుట కూడా అనుచితము. ప్రేమవలన భరతుని గొప్పగా చెప్పుచున్నాను." ఆమె పవిత్ర వాక్కులువిని రాణులు అందరు స్నేహార్ద్ర హృదయములతో కరగిపోయిరి. కౌసల్యాదేవి ధైర్యముతో "ఓ మిథిలేశ్వరీ! జ్ఞానసముద్రుడైన

జనక చక్రవర్తికి ప్రియురాలైన నీకు ఎవరు ఉపదేశము చేయగలరు? సమయము కనిపెట్టి లక్ష్మణుని ఇంటివద్దే నుంచునట్లును భరతుని వనమునకు పంపునట్లును రాజుగారికి నచ్చచెప్పుము. భరతుడు ఇంటివద్ద నుండుట శ్రేయస్కరము కాదు. వాని జీవితము ఏమగునోయని నాకు భయము కలుగుచున్నది" అని పల్కెను.

కౌసల్య వాక్యములద్వారా ఆమెభావమును గ్రహించి అందరు ప్రశంసించిరి. సుమిత్రాదేవి "దేవీ రెండుజాములు రాత్రిగడచెను" అనెను. అది విని కౌసల్యాదేవి లేచి సద్భావముతో నిట్లనెను. "మీరు వెంటనే మీ మకాములకు వెళ్లండి. ఇక మాకు ఈశ్వరుడే రక్షకుడు. మిథిలేశ్వరుడు జనకుడే సహాయకుడు."

కౌసల్య వినయవాక్యములు విని సునయనాదేవి ఆమె పాదములు పట్టుకొని "నీవు దశరథ మహారాజు పట్టపురాణివి. రాముని కన్నతల్లివి. ఇట్టి వినమ్రత నీకు ఎందుకు ఉండదు? ప్రభువు తనకన్న క్రిందివారినికూడా ఆదరించును. రాజు మనసా వాచా కర్మణా తమ సేవకుడు. పార్వతీ పరమేశ్వరులు తమకు సహాయము చేయువారు. మీకు సహాయపడు యోగ్యత ఎవరికి ఉండును? దీపము సూర్యునకు సహాయపడుటకువెళ్ళి శోభింపగలదా? శ్రీరామచంద్రుడు వనమునకు వెళ్ళి దేవతల కార్యమునెరవేర్చి అయోధ్యకు వచ్చి స్థిరముగా రాజ్యముచేయును. అందువలన, దేవతలు, నాగులు, మానవులు. తమతమ లోకములలో సుస్థిరముగా సుఖముగా ఉండెదరు. యాజ్ఞవల్క్యముని మొదటనే మాకు ఈ విషయము చెప్పెను. ముని వచనములు తప్పవు."

ఇట్లు చెప్పుచు సీతను తీసికొని వెళ్ళుటకు ఆజ్ఞపొంది సీతతోకూడ తన నివాసమునకు వెళ్ళెను. సీతాదేవి తన ప్రేమాస్పదమైన కుటుంబము వారితో వారి వారి యోగ్యతనుబట్టి కలసికొనెను. జానకీదేవిని తపస్వినీ వేషములో చూచి అందరు శోకముచే అత్యంత వ్యాకులత చెందిరి.



జనకుడు గురువుగారి యాజ్ఞను పొది తన మకామునకు వచ్చెను. సీతాదేవిని చూచి అత్యంత ప్రేమతో ఆలింగనము చేసికొనెను. సీతాదేవిని తపస్వినీ వేషములో చూచిన జనకునకు అమితప్రేమ కలిగెను. జనకుడు జానకితో ఇట్లనెను. "అమ్మా! పుట్టినింటికి, మెట్టినింటికి, పేరు ప్రతిష్ఠలు తెచ్చుదానవు. నీకీర్తి బ్రహ్మాండము లంతటను వ్యాపించును."

తండ్రిగారి ప్రశంసావాక్యములు విని సీతాదేవి సిగ్గుపడి తలవంచుకొనెను. సీత భావము ఎరిగి తిరిగి కౌసల్యవద్దకు ఆమెను తీసికొనివచ్చి ఒప్పజెప్పిరి. రాణి సమయమును కనిపెట్టి జనకమహారాజుతో భరతుని దశను వర్ణించి చెప్పెను. జనకుడు భరతుని అవస్థ విని ప్రేమ విహ్వలుడయ్యెను. ఆయన శరీరము పులకితమయ్యెను. ఆయన భరతుని యశమును కీర్తించి యిట్లు చెప్పెను.

"రాణీ! సావధానముగా వినుము. భరతుని చరిత్ర సంసార బంధనములు వదలించునది. ధర్మము, రాజనీతి, బ్రహ్మ విచారము ఈ విషయములలో నాకు కొంత ప్రవేశము ఉన్నది. తన ముఖ ప్రతిబింబము అద్దములో కనబడును. ఆ అద్దము తన చేతిలో నున్నను ఆ ప్రతిబింబమును పట్టుకొనలేడు. అట్లే భరతుని అద్భుత వాణి అందుబాటుకు రాదు. భరతుని గుణములను వర్ణించుటకు నాకు శక్తి చాలుటలేదు. భరతునికి భరతుడేసాటి. భరతుని అపరమిత ప్రేమ ఆ రామచంద్రునికే తెలియును. కాని అతడుకూడా దానిని వర్ణింపలేడు."

ఈ విధముగా జనకుడు భరతుని ప్రభావమును ప్రేమ పూర్వకముగా వర్ణించి తిరిగి భార్య భావము ఎరిగి యిట్లు చెప్పెను.

"లక్ష్మణుడు తిరిగి రావచ్చు. భరతుడు వనమునకు పోవచ్చును. ఇది అందరికి మేలు. అందరికి ఇదే మనస్సులో ఉన్నది. భరతునికి రామచంద్రునికి గల పరస్పర విశ్వాసము బుద్ధికి అందనిది. రాముడు

సమతకు హద్దు. భరతుడు ప్రేమకు మాహాత్మ్యానికి హద్దు. భరతుడు శ్రీరాముని యందు అనన్యప్రేమ తప్ప సమస్త పరమార్థాలను స్వార్థమును, సుఖములను స్వప్నములోకూడా మనస్సుతోనైనా ఆశించేవాడు కాడు."

అట్లు చెప్పుచు రాజు ప్రేమలో మునిగి గద్గద కంఠుడయ్యెను. "భరతుడు రాముని యాజ్ఞను పొరపాటునకూడా జవదాటడు. కనుక అనురాగాతిశయమువలన నీవు చింతపడవద్దు."

ఈ విధముగ జనకుడు రాముని, భరతుని గుణగణములు వర్ణన చేయుచుండగనే రాత్రి క్షణమువలె గడచిపోయెను. తెల్లవారగనే ఉభయబృందములవారు స్నానముచేసి దేవపూజ లొనర్చిరి. రామచంద్రుడు స్నాన సంధ్యాదికములు సలిపి వశిష్ఠులవారి వద్దకు వచ్చి యిట్లనెను.

"మహాత్మా! భరతుడు, అయోధ్యావాసులు, తల్లులు అందరు నాకొరకు వచ్చి వనవాసమువలన చాలా బాధలు పడుచున్నారు. జనక మహారాజు పరివార సమేతముగావచ్చి చాలా దినములనుండి బాధపడుచున్నారు కాబట్టి ఉచితమేదో అదిచేయండి. అందరి శ్రేయస్సు మీ చేతులలో ఉన్నది." ఇట్లు పల్కుచు శ్రీరాముడు ప్రేమవరవశుడయ్యెను.

రాముని శీలమునకు వినయమునకు వశిష్ఠులవారు పులకితులై ఇట్లు వచించిరి. "ఓ రామా! నీవు లేకుండా సంపూర్ణ సుఖములు కలిగినను, అది యిరుపక్షముల వారికి నరకము వంటిది. నీవు ప్రాణమునకు ప్రాణమవు. ఆత్మకు ఆత్మవు. సుఖములకు కూడా సుఖము నిచ్చు వాడవు. నాయనా! నిన్ను విడిచిపెట్టి ఎవరికి తమయిండ్లు నచ్చునో వారియెడల విధాత విముఖుడై యుండును. ఎచ్చట రాముని పాదపద్మములయందు భక్తియుండదో ఆ సుఖములు, కర్మలు, ధర్మములు వ్యర్థములు. రామప్రేమకు ప్రాధాన్యమీయని యోగము యోగము కాదు. జ్ఞానము జ్ఞానము కాదు. ఎవరి హృదయములో ఏమి ఉన్నది నీవు బాగుగా ఎరుగుదువు. కనుక నీవు ఆశ్రమమునకు వెళ్లుము."



ఇట్లు చెప్పుచు మునీంద్రుడు ప్రేమతన్మయు డయ్యెను. రామచంద్రుడు వశిష్ఠులవారికి నమస్కరించి వెళ్ళిపోయెను. వశిష్ఠులవారు వెంటనే జనకుని వద్దకు వెళ్ళి రాముని సుగుణములను, స్వాభావిక ప్రేమను ప్రశంసించి యిట్లనెను."

"ఓ జనకరాజా! అందరికి హితమైనది, ధర్మసమ్మతమైనది, ఆలోచించి చేయుము. నీవు బుద్ధిశాలివి, జ్ఞానివి, పవిత్రుడవు, ధర్మమూర్తివి. ధీరుడవు. ఈ సమయములో ఈ సమస్యను పరిష్కరించుటకు నీవు తప్ప ఇంక సమర్థులెవరు?" అని యనగా జనకుడు ప్రేమపరవశుడయ్యెను. మహారాజుగారి అవస్థనుచూచి జ్ఞానవైరాగ్యములకు, వైరాగ్యము కల్గెను. ఇచ్చటకు వచ్చుట మంచిది కాదేమోనని ఆయన మనస్సులో తలచెను. జనక మహారాజు ఇట్లు పల్కెను. "దశరథ మహారాజు శ్రీరాముని వనమునకు పంపి తన ప్రియమైన ప్రేమను సత్యమైనదిగా ఋజువు చేసికొనెను. ప్రియుడైన రాముని వియోగములో తన ప్రాణమును పరిత్యజించెను. కానీ మేము సీతారామ లక్ష్మణులను గహనమైన వనముల పాలుచేసి వివేకవంతులమనే గర్వముతో సంతోషముగా తిరిగివెళ్లెదము. మాకు ఏ మాత్రము ప్రేమ లేదు. శ్రీరాముని వనములో విడిచి దశరథునివలె ప్రాణములు విడచు శక్తి మాలో లేదు." జనకుని పలుకులకు అచ్చటి వారందరు వ్యాకులపడిరి. జనక చక్రవర్తి పరివార సమేతముగా భరతుని వద్దకు వెళ్ళెను. ఆయనను చూచి భరతుడు నమస్కరించి ఆసనమిచ్చెను. జనకుడు "నాయనా భరతా! నీకు శ్రీరాముని స్వభావము తెలియును. అతడు సత్యవ్రతుడు. ధర్మపరాయణుడు. శీలవంతుడు. ప్రేమనిధి. కాబట్టి అతడు సంకోచించుచున్నాడు నీ భావము చెప్పిన అది అతనికి నేను చెప్పగలను" అనెను.

భరతుడు జనకులవారి మాటలు విని ఇట్లనెను. "అయ్యా! తమరు మాకు మా తండ్రిగారివలె పూజనీయులు. విశ్వామిత్రుడు మొదలుగాగల

మహామునులు, మాన్యులైన మంత్రులు, జ్ఞానధనులైన తమరు ఇక్కడ ఉన్నారు. ఓ స్వామీ! నన్ను తమ బిడ్డగాను, సేవకునిగాను, తమ ఆజ్ఞానుసారముగా నడచువానిగాను భావించి నాకు హితవు చెప్పండి. ఇట్టి పుణ్యస్థలమునందు తమరు నన్ను అడుగుచున్నారు. దీనికి జవాబు చెప్పకపోయినయెడల కుటిలుడనని తలచెదరు. జవాబిచ్చిన యెడల పిచ్చివానిగా తలచెదరు. అయినను చిన్నవాడనైన నేను పెద్దమాటలు మాటాడుచున్నాను. విధి విధానము ప్రతికూలముగా నున్నదని తెలిసికొని క్షమించండి. మనకు వేదశాస్త్ర పురాణములలో సేవాధర్మము కఠినమైనదని చెప్పబడినది. స్వామిపట్లచూపే ధర్మమునకు స్వార్థమునకు విరోధము. ద్వేషము గ్రుడ్డిది. ప్రేమకు జ్ఞానము ఉండదు. దానిముందు ఇది నిలువలేదు. నేను స్వార్థవశుడనై చెప్పుచున్నానో? లేక ప్రేమ వశుడనై చెప్పుచున్నానో? రెండింటిలోకూడా తప్పుగా నున్నానని భయపడుచున్నాను. కాబట్టి నన్ను పరాధీనునిగా ఎంచండి. శ్రీరాముని భావమును తెలిసికొని ధర్మమును దృష్టిలో పెట్టుకొని అందరికీ సమ్మతమైనది, హితమైనది ఆలోచించి సెలవీయండి;"

భరతుని వాక్యములు విని వాని స్వభావము గ్రహించి జనకుడు అతనిని ప్రశంసించెను. భరతుని వాక్యములు స్వల్పమే కానీ అందలి అర్థము నిగూఢమైనది.

అంత జనకుడు, భరతుడు, వశిష్ఠులవారు పరివార సమేతముగా శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళిరి. అందరు వెళ్ళిన సంగతి తెలిసి దేవతలు భయపడి యిట్లు అనుకొనిరి "శ్రీరామచంద్రుడు ప్రేమగలవాడు, సంకోచవశుడు. కాబట్టి యిప్పుడు మనము మాయ చేయకపోతే పని చెడిపోవును." ఇట్లు తలచి దేవతలు సరస్వతీదేవిని ప్రార్థించిరి.

ఆమె ప్రత్యక్షమై వారి వాక్యములు విని "దేవతలు మిక్కిలి స్వార్థపరులు; మూర్ఖులు" అని భావించి యిట్లనెను "భరతుని బుద్ధి మార్చుమని



కోరుచున్నారు. ఇంద్రునకు వెయ్యి నేత్రములు ఉండికూడా సుమేరు పర్వతము కనపడుట లేదు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల మాయ చాలా ప్రబలమైనది. అదికూడా భరతుని బుద్ధిని మార్చలేదు. ఆ బుద్ధిని మార్చుమని మీరు నాతో చెప్పుచున్నారు. భరతుని హృదయములో సీతారాములు నివసించుచున్నారు. సూర్యుడు ఉదయించిన చోటున అంధకార ముండునా?" అని ఆమె తన లోకమునకు వెళ్ళిపోయెను.

మలిన మనస్సుగల, స్వార్థపరులైన దేవతలు ప్రబలమైనమాయతో కుట్రపన్నిరి. వారిలో భయము, భ్రమ, వ్యాపించెను. "మన పని భరతుని చేతులలో నున్నది" అని వారు తలంచిరి.

జనకుడు, భరతుడు మొదలగు వారందరు రామచంద్రుని వద్దకు వచ్చిరి. శ్రీరాముడు వారందరిని ఉచితరీతిని సన్మానించి వారికి ఉన్నతాసనములు ఇచ్చెను. వశిష్ఠులవారు శ్రీరాముని జూచి ఇట్లనిరి.

"ఓ రామా! యిక నీవు ఏమి చెప్పెదవో విని అందరును అట్లు చేయుదురు."

ముని పలుకులు విన వినయముతో రామచంద్రుడు ఇట్లనెను. "మీరును, జనకమహారాజుగారును ఉండగా నేను చెప్పుట ఉచితము గాదు. మీరు, జనకమహారాజు ఏమి ఆజ్ఞాపించెదరో అదే నాకు శిరోధార్యము. ఈ మాట ప్రమాణముచేసి చెప్పుచున్నాను."

రామచంద్రుని శపథము విని ముని, జనకమహారాజు. సభాసదులు మిగుల ఆశ్చర్యము చెందిరి. ఎవరు ఏమి సమాధానము చెప్పలేక పోవుచుండిరి. అందరు భరతునివైపు చూచుచుండిరి. భరతుడు సభవారి భావము గ్రహించి మిక్కిలి ధైర్యము వహించి అగస్త్యుడు పెరుగుచున్న వింధ్యాచలమును నిలుపు చేసినట్లు, పెద్దలందరిని ఆపి ప్రణమిల్లి "అత్యంతమును అనుచితమైన నేటి నా ప్రవర్తనకు నన్ను క్షమించండి"

అనిపలికి అంతరాత్మలో సరస్వతీదేవిని స్మరించెను. ఆమె ఆయన ముఖములో ప్రవేశించెను. పిమ్మట సీతారాములను స్మరించి భరతుడు ఇట్లు పలికెను.

"శ్రీరామచంద్రా! మీరు నాకు తల్లి, తండ్రి, గురువు, దైవము. తమవంటి ప్రభువును మరొకరితో పోల్చుటకు వీలుపడదు. ప్రభువుకు ద్రోహము చేయుటలో నాకు నేనే సాటి. మోహముచేత తండ్రి ఆజ్ఞను ఉల్లంఘించి పరివారమును సమకూర్చుకొని ఇచ్చటకు వచ్చితిని. లోకములో జనులకు మంచిచెడ్డలు, హెచ్చుతగ్గులు, జీవన్మరణములు అనుల్లంఘనీయములు. అట్లే ఎవరు ఎచ్చట శ్రీరాముని ఆజ్ఞను ఉల్లంఘించుటను చూడలేదు, వినలేదు. అన్నివిధముల నేను విరుద్ధముగా వ్యవహరించితిని కాని ప్రభువు నా ప్రవర్తనను సేవగా, ప్రేమగా భావించెను. అన్నయ్యా! మీరు దయతో ఔదార్యముతో నాకెంతో మేలుచేసితిరి. నా దోషములుకూడా భూషణములైనవి. నా కీర్తి నలుదిశల వ్యాపించినది."

రామా! మీ స్వభావము, మీ విధానము, మీ గొప్పతనము లోకములో ప్రసిద్ధి పొందినవి. ఎవరైతే, క్రూర, కుటిల, దుష్ట, కళంక, కల్మష బుద్ధి కలవారో అట్టివారు కూడా మీశరణు జొచ్చి ఒక్క నమస్కారము చేసినచో వారిని మీ వారిని చేసికొందురని వేదశాస్త్రములు చెప్పుచున్నవి. మీరు శరణాగతుల దోషములను ఎంచకుండా వారి మంచిగుణాలనే సత్పురుషుల మధ్య మెచ్చుకొని వారిని దరిజేర్చుకొందురు.

నేను చేతులెత్తి ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. తమవంటి ప్రభువు మరొకరు లేరు. జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలలో నా హృదయములో గల వాంఛ తెలుపుచున్నాను. కపటము, స్వార్ధము, పరిత్యజించి, ధర్మార్థకామమోక్షములనే చతుర్విధ పురుషార్ధములను విడిచి సహజప్రేమతో స్వామిని సేవించుటయే, ప్రభువు ఆజ్ఞను పాలించుటయే నాధర్మము.



అంతకంటె శ్రేష్ఠమైన సేవ మరొకటిలేదు. ఇప్పుడు ఆ ఆజ్ఞారూపమైన ప్రసాదము ఈ సేవకునకు లభించుగాక!".

ఇట్లు పలికి భరతుడు ప్రేమవివశుడై పులకిత శరీరుడయ్యెను. నేత్రములలో ఆనందాశ్రువులు నిండెను. తన్మయత్వముతో శ్రీరాముని పాదములు పట్టుకొనెను. ఆయన ఆవేదన చెప్పజాలము. కృపాసాగరుడు రామచంద్రుడు భరతుని ప్రేమతో లేవదీసి తనవద్ద కూర్చుండబెట్టుకొనెను. భరతునిమాటలు, స్వభావము చూచి ప్రజలెల్లరు స్నేహముగ్ధులైరి. శ్రీరాముడు, పరివారము, సాధుసమాజము, ముని వశిష్ఠుడు, జనకమహారాజు ప్రేమలో మునిగిపోయిరి. అందరును భరతుని భక్తిని ప్రశంసింపసాగిరి.

దేవేంద్రుడు కపటి, దుర్మార్గుడు. అతడు ఎప్పుడును ఇతరులకు కీడు, తనకు మేలు కావలెనని కోరుచుండును. వానిబుద్ధి కాకిబుద్ధి వంటిది. ఎవరిమీదను విశ్వాసము లేదు. ముందే చెడుగా ఆలోచించి కపటముతో కూడిన విరక్తి అందరిలో కల్గించెను.

దేవతా మాయచే అందరను సమ్మోహితులను చేసెను. భయము, విరక్తివలన ఎవరిమనస్సు స్థిరముగా లేకపోయెను. క్షణము వనములో నుండవలెనని మరుక్షణము ఇంటివద్ద నుండవలెనని వ్యాకులపడుచుండెను. అందువలన ప్రజలు దుఃఖపడుచుండిరి. ఉభయ పరివారముల వారికి సంతోషము లేదు రామచంద్రుడు హృదయములో నవ్వుకొనెను.

ఇంద్రుడు, చపలస్వభావుడు, కాముకుడు. స్థిర స్వభావముగల భరతుడు, జనకుడు, మునులు, మంత్రులు సాధుసత్పురుషులు తప్ప మిగిలిన జనులందరిలో వారివారి యోగ్యతానుసారముగ దేవమాయ వ్యాపించెను. జనకుడు, వశిష్ఠుడు, బ్రాహ్మణులు, మంత్రులు మొదలగు వారందరి బుద్ధి భరతుని భక్తికి వశమైపోయెను.

అందరు బొమ్మలవలె రామునివైపు చూచుచుండిరి. భరతుని ప్రీతి, ప్రేమ, వినయము గొప్పతనము, కనుటలోను వినుటలోను సుఖమున్నది. కాని వానిని వర్ణనచేయుట కష్టము. భరతుని భక్తి భావమును గని ముని గణములు మిథిలేశ్వరుడు ప్రేమ నిమగ్నులైరి. భరతుని స్మరించినవారికి శ్రీరాముని ప్రేమ సులభముగా లభ్యమగును. దయాళువైన శ్రీరాముడు అందరి స్థితిని పరికించి భరతుని హృదయప్రేమను గమనించి ఇట్లనెను.

"ఓ సోదరా! భరతా! నీవు ధర్మమును నిలుపువాడవు, ప్రేమ ప్రవీణుడవు. మనోవాక్కాయములచే నిర్మలుడవు. నీకు నీవే సాటి. గురువుల యెదుట, పెద్దల సమక్షమున ఇట్టి విపత్కర సమయమున చిన్నసోదరుడవగు నిన్ను ఎట్లు పొగడగలుగుదును?"

సూర్యుడు సాయంసమయము కాకముందే అస్తమించినచో ప్రజలలో అల్లకల్లోలము బయలుదేరును. అటువంటి అవస్థయే విధాత మనకు, మన తండ్రిగారి ఆకస్మిక మృత్యువుద్వారా కల్గించెను. గురువుగారి కృపచేత మనకుటుంబము, మన ప్రజలు రక్షింపబడిరి. పగలు సూర్యుడు అస్తమించి నట్లైతే లోకమంతా తికమకపడును. రాజ్యపాలన మొదలగునవి అన్నియు గురువుగారి దయవలన సక్రమముగా జరుగును. భరతా! ఎట్లు చేసిన ప్రజలు, పరివారము సుఖపడెదరో అట్లు నీవు చేయుము. నాచే చేయించుము. సూర్యవంశమును రక్షించుము. ఈ భారమును గ్రహించి మీరందరు పంచుకొనవలెను. అధికభారము నీవు మోయవలెను. నీవు చిన్నవాడవని ఎరుగుదును. సేవకుడు చేతులు, పాదములు నేత్రముల వంటివాడు ప్రభువు ముఖమువంటివాడు. సేవకునికి స్వామికి మధ్య ఇట్టి అన్యోన్య ప్రేమ యుండవలెను."

శ్రీరామచంద్రుని వాక్యములు విని అందరి మనస్సు ప్రేమమయమయ్యెను. ఆ మాటలకు భరతునకు అమితానందము కలిగెను.



దుఃఖము, తాపము నశించెను. మూగవానికి మాటలు వచ్చినట్లు సంతోషము కలిగెను. భరతుడు ప్రేమ పూర్వకముగా నమస్కారము చేసి చేతులు ముకుళించి శ్రీరామునిజూచి యిట్లనెను.

"నన్ను మీరు వెంటతీసికొని వెళ్లినంత ఆనందము కలిగెను నేను లోకములో జన్మించినందుకు నాజన్మ సార్థకమయ్యెను. ఇప్పుడు మీరు ఏమి ఆజ్ఞ యిచ్చెదరో అది తప్పక తలదాల్చెదను. నాకు అండగా నున్నయెడల సేవ చేసెదను. ఓ దేవా! గురువుగారి ఆజ్ఞ పొంది మీ పట్టాభిషేకమునకు అన్ని తీర్థముల జలము తెప్పించితిమి. అది ఎట్లు వినియోగించుటకు ఆజ్ఞాపించెదరో! నా మనస్సులో ఒక పెద్దకోరిక ఉన్నది. భయముతో చెప్పలేకున్నాను" అని పలికి అదేదో చెప్పుమని రామచంద్రుడు ఆజ్ఞాపించగా భరతుడు ఇట్లనెను.

"ఈ వనములో మీరెచ్చట తిరిగితిరో మీ పాద చిహ్నములు పడిన ఆ భూభాగ మంతయు చూడవలెనని ఉత్కంఠతో నున్నాను."

రామచంద్రుడిట్లనెను "అత్రి మహాముని ఆజ్ఞను గైకొని అట్లే చేయుము. వనములో తిరుగుము. ఈ వనమంతయు అత్రి మహాముని దయవలననే పవిత్రమైనది. ఆ ముని ఆజ్ఞాపించినచోట తీర్థజలమునుంచుము." ప్రభువు వాక్యములు విని భరతుడు చాల ఆనందించెను. అత్రి మునిపాదములకు నమస్కరించెను. సకల మంగళములకు మూలభూతమైన శ్రీరామ భరతుల సంభాషణము విని దేవతలు ప్రశంసించిరి. పూలవర్షము కురిపించిరి. భరతుని వాక్యములు విని వశిష్ఠ మహాముని, జనకమహారాజు మొదలగువారు అనేక విధముల భరతుని కొనియాడిరి.

వారి సంభాషణమును విని జనులు, హర్షము, విషాదము చెందిరి. భరతుని సేవాధర్మమునకు సంతోషము, రాముని వియోగమునకు విషాదము. రాముని తల్లి కౌసల్యాదేవి సుఖము, దుఃఖము రెండును

సమానము గావించెను; అత్రిముని భరతునితో “ఈ పర్వతసమీపమున ఒక బావికలదు. ఈ పవిత్ర జలములు దానిలో స్థాపితము చేయుము. అనిపల్కెను. భరతుడు అత్రిమునీంద్రుని ఆజ్ఞ పొంది శత్రుఘ్నునితో జనులతో కలిసి జలపాత్రతో అచ్చటకు వెళ్ళెను. పాత్రను ఆ పుణ్యస్థలములో ఉంచెను. అత్రిమహాముని ఇట్లు చెప్పెను.”

“ఈ బావి అనాదిగా ప్రసిద్ధమైనది. కాలవశమువలన ఇది యిప్పుడు మరుగున పడినది. అందువలన దీని మాహాత్మ్యము ఎవరికిని తెలియదు.”

భరతుని సేవకులు పుణ్యతీర్థములు జలముకొరకు క్రొత్తగా వొక బావిని త్రవ్విరి. ఇప్పుడు జనులు దానిని ‘‘భరతకూప’’మని యందురు. పుణ్యతీర్థముల జలము కలుపుటవలన అది మిక్కిలి పవిత్రమయ్యెను. దానిలో ప్రేమపూర్వకముగా నియమముతో స్నానముచేసిన వారెల్లరు మనోవాక్కాయ కర్మలయందు పరిశుద్ధులగుదురు.

ఆ కూప మహిమను కొనియాడుచు అందరు రామచంద్రుడున్న చోటునకు వెళ్ళిరి. అత్రి మహాముని ఆ పుణ్యతీర్ధ ప్రభావమును రామునికి వినిపించెను. ఆ రాత్రి గడచెను. తెల్లవారగనే భరత శత్రుఘ్నులిరువురు నిత్య కృత్యములు తీర్చుకొని రాముడు, అత్రిమహాముని, గురువుగారైన వశిష్ఠులు మొదలగువారి అనుమతిపొంది పరివార సహితముగా వనములో ప్రదక్షిణము చేయుటకు పాదచారులై బయలుదేరిరి. వారు పాదములకు పాదరక్షలు లేకుండా నడచుచున్నందుకు భూదేవి తన కఠినత్వమును తగ్గించుకొనెను. శీతల మంద సుగంధ మారుతము వీచుచుండెను. మార్గము తెలియుటకు దేవతలు పుష్పములు కురిపించిరి. మేఘములు చల్లగాలులు వీచి హాయి నిచ్చెను. వృక్షములు పుష్పించి ఫలించెను. తృణములు తమ మృదుత్వమును ప్రకటించెను. పశువులు ఆనందముతో నిల్చిచూచెను. పక్షులు తియ్యని పల్కులు పల్కెను.



భరతుని రామచంద్రునికి ప్రియమైనవానినిగా తెలిసికొని అవన్నియు ఈ విధముగా అతనికి సేవచేసెను. ఒక సాధారణ మానవుడుకూడ ఆవులింత వచ్చినప్పుడు ‘రామా’ యని అన్నంత మాత్రముననే అన్ని సిద్ధులు సులభమగుచుండును. అటువంటప్పుడు శ్రీరాముని ప్రాణప్రియుడైన భరతునకు ఇట్లు జరుగుటలో గొప్పతనము ఏమున్నది?

ఈ విధముగా వారు వనములో తిరుగుచుండిరి. వారి నియమనిష్ఠలను ప్రేమను చూచి మునులు సైతము సిగ్గుపడుచుండిరి. పృథ్వి యొక్క వేరు వేరు భాగములు, అచ్చటి పశుపక్ష్యాదులు, వనములు, పర్వతములు ఇవన్నియు సుందరమైనవిగా విచిత్రమైనవిగా భరతునకు కనపడుచుండెను. అతడు వాని విషయమై అత్రిమహామునిని అడుగుచుండగా ముని వానిపేర్లు, వాని గుణములు, వాని పుణ్యప్రభావములు చెప్పుచుండెను.

భరతుడు ఒకచోట స్నానము చేయును. మరియొకచోట మనోహర దృశ్యములను తిలకించి సంతోషించును. మరొకచోట అత్రిమహాముని ఆజ్ఞపొంది సీతారామ లక్ష్మణులను స్మరించుచుండును. భరతుని స్వభావము సేవాభావము చూచి వనదేవతలు ఆనందించుచు ఆశీర్వదించుచుండిరి.

వారు తిరిగి తిరిగి రెండున్నర జాములు గడచిన తర్వాత తిరిగి వచ్చిరాముని సందర్శించిరి. భరతుడు ఐదుదినములు అచ్చటనున్న అన్ని తీర్థస్థానములను చూచెను. భగవంతుని పురాణగాధలు చెప్పుకొనుచు సుఖముగా వారు దినములు గడపిరి.

మరుసటిరోజు ఉదయమున స్నానముచేసి భరతుడు, జనకమహారాజు మహాజనులు, అందరు ఒకచోట సమావేశమైరి. ఈ రోజు అందరికి వీడ్కోలు. అది వీడ్కోలు ఇచ్చుటకు మంచి దినమని అనుకొన్నప్పటికి శ్రీరాముడు అది చెప్పుటకు సంకోచించుచుండెను. రామచంద్రుడు వశిష్ఠులవారిని, జనక చక్రవర్తిని, భరతుని, సభవారిని చూచి సందేహముతో దృష్టిని మార్చుకొని భూమివైపు చూచుచుండెను.

సభవారు శ్రీరాముని శీలమును ప్రశంసించుచు శ్రీరాముని వంటి వినయశీలుడైన ప్రభువు మరొకరు లేరని తలచిరి.

భరతుడు శ్రీరామునికి చేతులు జోడించి "ప్రభూ! మీరు నా అభిరుచులన్నియు పూర్తిగావించితిరి. నా నిమిత్తము ప్రజలు అనేక కష్టములు పడిరి. మీరు కూడా అనేక విధములైన దుఃఖములను పొందితిరి. స్వామీ! ఇప్పుడు నాకు ఆజ్ఞ ఈయండి. నేను వెళ్ళి పదునాలుగు సంవత్సరముల వఱకు అయోధ్యకు సేవ చేసెదను. మరల ఈ సేవకుడు మీపాదదర్శనము చేసికొనుటకు ఉపాయము చెప్పండి. ఆ వ్యవధి అగునంతవఱకు నాకు తగిన జ్ఞానోపదేశము చేయండి. మీ ప్రేమవలన, మీ దయవలన అయోధ్యా ప్రజలు అందరు పవిత్రులైరి. మీ కొఱకు జనన మరణ దుఃఖజ్వాలలలో తపించుటకూడా మంచిదే. మీరు లేకుండా పరమపదము పొందుటకూడా వ్యర్థము. నా దీనత్వము, ప్రభువు ప్రేమ, రెండు కూడా నన్ను బంధించి వేసినవి. ఈ దోషము పోవుటకు నాకు తగిన ఉపదేశము చేయండి."

నీరు, పాలు వేరుచేసే హంసవంటి మతిగల భరతుని ప్రార్థన విని అందరు ప్రశంసించిరి.

రాముడు భరతుని దీనత్వము నిశ్చయవాక్కులు విని దేశ, కాలమాన పరిస్థితులను అనుసరించి యిట్లు పల్కెను.

"సోదరా! నీకు, నాకు, పరివారమునకు ఉన్న కుటుంబ సమస్యలే వశిష్ఠులవారికి, జనకమహారాజుకు గలవు. మన హృదయములో వశిష్ఠుల వారిని విశ్వామిత్రులవారిని, జనక చక్రవర్తిని తలచుకొన్నంత మాత్రమున నాకు గాని, నీకు గాని స్వప్నములోకూడా ఎట్టి కష్టములురావు. మనకు ఇరువురకు తండ్రి ఆజ్ఞను పాటించుటయే పరమధర్మము. నీవు రాజువయినప్పటి నుండి యీ ధర్మములు పాటించుము. నీవు గురువులు, తల్లులు, మంత్రులు చెప్పినట్లు రాజ్యమును పరిపాలించుము."



రామచంద్రుడు భరతునకు అనేక విధములుగా రాజకార్యములు కష్టసుఖములు తెలియచెప్పెను. అతని మనస్సులో సంతోషముగాని ఉత్సాహముగాని కనిపింపకపోయెను. ఇటు ప్రేమమూర్తియైన భరతుని అటు గురుజనులను, మంత్రులను చూచి రఘునాథుడు ఆనందపరవశుడయ్యెను. భరతునకు ప్రేమపూర్వకముగ తనపాదుకల నీయగోరెను. కాని అచ్చట గురు జనుల సమక్షమున ఇచ్చుటకు సంకోచపడుచుండెను. చివరకు భరతుని ప్రేమకు వశుడై అతనికి తన పాదుకల నిచ్చెను. వానిని భరతుడు ఆదర పూర్వకముగా తన శిరస్సుపై పెట్టుకొనెను. ఆ రెండు పాదుకలు ప్రజలను రక్షించు రెండు కాపలాదార్లు. సీతారాములు తమ సమీపమున ఉన్నట్లుగానే ప్రజలు ఆనందించిరి భరతుడు నమస్కరించి సెలవుగైకొనెను.

శ్రీరాముడు అనుజుని హృదయానికి హత్తుకొనెను. ఇంద్రుడు ఈ సమయమును కనిపెట్టి ప్రజల మనస్సును రామునిపై లగ్నము కాకుండా చేసెను. ఇది వారికి మేలే అయ్యెను. లేనిచో సీతారామ లక్ష్మణుల వియోగరోగముతో ప్రజ లెల్లరు మరణించియుండెడివారు.

శ్రీరాముని కృపవలన అన్ని చిక్కులు తొలగిపోయెను. దేవతల సైన్యము చిక్కులు పెట్టుటకు వచ్చి హితము చేకూర్చెను. ధైర్యధురంధరుడైన శ్రీరాముడు ధైర్యమును విడిచెను. ఆయన నేత్రములనుండి ప్రేమాశ్రువులు రాలుచుండెను శ్రీరాముని స్థితిచూచి దేవతలుకూడ దుఃఖించిరి.

మునులు, వశిష్ఠ మహాముని, జనక చక్రవర్తివంటి ధైర్య ధురంధరులు తమ మనస్సులను జ్ఞానాగ్నిచే బంగారమువలె పరిశుద్ధ మొనర్చుకొన్న వారు. నీటిలోని తామరాకువలె అనాసక్తముగా నున్నవారు. అట్టివారుకూడా శ్రీరాముని భరతుని అద్వితీయమైన అన్యోన్యమైన అపార ప్రేమను గాంచి హర్షించే మనోవాక్కాయ కర్మలతో ఆ ప్రేమ సరస్సులో నిమగ్నులైరి.

శ్రీరాముడు భరతుని కలిసికొని నచ్చజెప్పెను. సంతోషముతో శత్రుఘ్నుని హృదయానికి హత్తుకొనెను.

మంత్రులు, సేవకులు భరతుని భావమెరిగి తమ తమ పనులలో మునిగియుండిరి.

భరత శత్రుఘ్నులు ప్రభువు పాదములకు ప్రణమిల్లి శ్రీరాముని ఆజ్ఞను తలదాల్చిరి పిమ్మట లక్ష్మణుని కలసికొని నమస్కరించిరి. సీతమ్మగారి పాదధూళిని శిరస్సుపై ధరించి సకల మంగళములకు మూలమైన వారి ఆశీర్వాదము పొంది ప్రేమమయ హృదయములతో బయలుదేరిరి.

శ్రీరాముడు జనక చక్రవర్తికి నమస్కరించి అనేక విధములుగా ప్రార్థించి యిట్లుచెప్పెను. "దేవా! మీరు అనేక కష్టములు పొందితిరి. సపరివారముగా మీరు వనమునకు వచ్చితిరి. ఇప్పుడు మమ్ము ఆశీర్వదించి నగరమునకు వేంచేయండి."

అది విని జనకుడు ధైర్యము వహించి బయలుదేరెను. పిమ్మట శ్రీరాముడు మునులను, బ్రాహ్మణులను, సాధువులను హరిహరులతో సమానముగా భావించి సన్మానించి పంపివేసెను.

శ్రీరామ లక్ష్మణులు అత్త సునయనాదేవి వద్దకు వెళ్ళి ఆమె పాదాలకు నమస్కరించి ఆశీర్వాదము పొంది తిరిగివచ్చిరి. పిమ్మట విశ్వామిత్రుని వామదేవుని జాబాలిని బంధువులను నగరవాసులను మంత్రులను వారి వారి యోగ్యతానుసారముగా వినయముతో గౌరవించి పంపివేసిరి. భరతుని తల్లి కైకేయికి కూడా నమస్కరించి ఆమె దుఃఖమును, అనుమానములను దూరము చేసి అలంకరించిన పల్లకిలో కూర్చుండబెట్టి పంపించిరి.

సీతాదేవి పుట్టింటి చుట్టాలను, తల్లిదండ్రులను కలిసికొని వారి దీవనలు అందుకొని తిరిగివచ్చెను. ఆమె అత్తలకు నమస్కరించి ఆశీర్వాదము పొందెను.



శ్రీరామచంద్రుడు చక్కని పల్లకీలను తెప్పించి అలంకరించి వానిలో తల్లులను కూర్చుండబెట్టెను.

ఇట్లు అందరిని పంపివేసి వైరాగ్యము, భక్తి, జ్ఞానము రూపములు ధరించి యున్నట్లు సీతా రామ లక్ష్మణులు పర్ణకుటీరములో శోభిల్లుచుండిరి.

మునులు, బ్రాహ్మణులు, వశిష్ఠముని, భరతుడు, జనక చక్రవర్తి శ్రీరాముని వియోగముచే విహ్వలులై ప్రభువు గుణములను మనస్సులో స్మరించుచు నిశ్శబ్దముగా నడచి వెళ్ళుచుండిరి.

మొదటి దినమున అందరు యమునానదిని దాటిరి. భోజనము లేకుండా ఆ దినము గడపిరి. రెండవ మకాము గంగానదిదాటి శృంగవేరపురమందు చేసిరి. అచ్చట నిషాదరాజు అన్ని ఏర్పాట్లు చేసెను. పిమ్మట గోమతీ నదిలో స్నానముచేసిరి. నాల్గవ దినమున అయోధ్య చేరుకొని జనకుడు నాల్గు దినములు అచ్చట ఉండెను. జనకమహారాజుగారు భరతుని రాజ్యపాలనమును అంగీకరించి మిథిలానగరమునకు వెళ్ళిరి.

శ్రీరాముని దర్శనముకొఱకు ప్రజలందరు ఉపవాసము చేయుచుండిరి. భూషణములు సుఖ భోగములు విడిచిపెట్టిరి. భరతుడు తల్లులందరికి సేవచేయు బాధ్యత చిన్న తమ్ముడైన శత్రుఘ్నునికి ఒప్పగించెను.

భరతుడు పరివారములోనివారిని, నగరవాసులను పిలిచి వారెల్లరను సమాధానపరచి తగిన వసతులు ఏర్పాటుచేసెను. గురువుగారి గృహానికి వెళ్ళి చేతులు జోడించి "ఆజ్ఞ అయితే నియమ పూర్వకముగా నుందును" అని పలుకగా వశిష్ఠ మహాముని పులకిత గాత్రుడై "భరతా! నీవు ఏమి ఆలోచించెదవో, చెప్పెదవో, చేయుదువో అది ప్రపంచములో ధర్మసారము కాగలదు." అనెను. భరతుడు జ్యోతిష్కులను పిలిపించి శుభముహూర్తమును నిశ్చయించి ఆ శుభవేళ ప్రభువు పాదుకలను సింహాసనముపై ప్రతిష్ఠించెను.

భరతుడు కౌసల్యాదేవికి గురువుగారికి పాదాభివందనము చేసి నంది గ్రామములో పర్ణకుటీర మొకటి ఏర్పాటుచేసికొని అందు నివసించుచుండెను.

శిరస్సుపై జటాజూటము, వల్కలములు ధరించెను. భూమిమీద దర్భాసనము పరచుకొని కూర్చుండెను. భోజన, వస్త్ర, వ్రత, నియమము లన్నింటిలో భరతుడు ఋషుల మార్గము ననుసరించి ముని జీవితమును ప్రేమతో నడుపుచుండెను.

ఆభరణములు, వస్త్రములు, వివిధములైన సుభభోగములను త్రికరణ శుద్ధిగా త్యజించెను.

ఏ అయోధ్యా రాజ్యమును దర్శించి దేవేంద్రుడు మోహము చెందు చుండునో, ఏ అయోధ్యాపతి దశరథుని సంపత్తివిని ధనాధిపతి అయిన కుబేరుడు కూడా సిగ్గుపడుచుండునో ఆ అయోధ్యా పురములో భరతుడు సంపెంగ తోటలో తుమ్మెదవలె అనాసక్తుడై నివసించుచుండెను.

శ్రీరాముని ప్రేమించు అదృష్టవంతులు భోగైశ్వర్యములను వాంతి చేసుకున్నట్లు విడిచిపెట్టుదురు. భరతుడు రామునకు ప్రేమపాత్రుడు. భోగైశ్వర్యములను త్యజించుట అతనికి గొప్ప విషయము కాదు. భూమిపైగల నీటిని త్రాగని పట్టుదలగల చాతక పక్షిని, నీరమును క్షీరమును వేరుచేయు వివేకముగల హంసను సైతము పండితులు ప్రశంసించుచుందురు.

భరతుని శరీరము నానాటికి కృశించిపోవుచుండెను. అన్నము, ఘృతమువలన పెరిగే శరీరము వానిని భుజింపక పోవుటవలన తరిగిపోవుచుండెను. కాని బలము, ముఖవర్చస్సు మాత్రము పెరిగిపోవుచుండెను. రామప్రేమ నిత్య నూతనత్వమును తుష్టిని పుష్టిని ఇచ్చుచుండెను. ధర్మము పెరుగుచుండెను. మనస్సు ప్రసన్నముగా నుండెను. భరతుని హృదయమనే నిర్మల ఆకాశములో శమము, దమము, సంయమము, నియమము, ఉపవాసము మొదలైనవి ప్రకాశించే నక్షత్రములు. విశ్వాసమే ఆకాశములో ధ్రువతార. పదునాలుగు సంవత్సరముల వ్యవధి పూర్ణిమతో సమానము. రామప్రేమయే నిరంతరము నిశ్చలమునైన నిరీక్షణము.



భరతుని భక్తి, జ్ఞాన, వైరాగ్య వైభవములను వర్ణించుటలో కవులు కూడా సిగ్గుపడుచుందురు. స్వయముగా విఘ్నేశ్వరుడు, సరస్వతీదేవియే వానిని వర్ణించలేరు.

భరతుడు నిత్యము ప్రభువు పాదుకలను పూజించుచుండును. పాదుకలనుండి ఆజ్ఞ అడిగిఅడిగి అన్ని విధముల రాజకార్యములు చేయుచుండెను.

భరతుని హృదయములో సీతారాములు ఉండిరి. అతని నాలుక నిరంతరము రామనామమును జపించుచుండెను. నేత్రములు ఆనందాశ్రువులతో నిండియుండెను. సీతారామ లక్ష్మణులు వనములో హాయిగా ఉండిరి. కాని భరతుడు ఇంటిలో ఉన్నను తపస్సుద్వారా శరీరము శుష్కింపజేసికొనుచుండెను.

భరతుడు అన్నివిధాలా ప్రశంసింపబడుటకు యోగ్యుడు. వాని వ్రతానుష్ఠానములను విని మహాత్ములుకూడ తలలు వంచుచుండిరి.

భరతుని పవిత్ర చరిత్ర మధురమైనది. సుందరమైనది. ఆనందదాయకమైనది. మంగళప్రదమైనది. కలియుగమందలి కఠిన పాపములను తాపములను క్లేశములను హరించునది.

భరతుని చరిత్రను నియమముతో ఆదరపూర్వకముగా వినువారికి తప్పకుండా శ్రీరామునియందు ప్రేమ కలుగును. సాంసారిక విషయ వాసనల నుండి వైరాగ్యము కల్గును.

పవిత్రమైన భరతుని చరితము కలియుగములోని కల్మషములను, క్లేశములను హరించును. సంతాపములను పోగొట్టును. ప్రపంచ దుఃఖములను పటాపంచలు చేయును.

* * *

# శ్రీ తులసీరామాయణము

## అరణ్యకాండము

ఒకానొకసమయమున శ్రీరామచంద్రుడు ఏరినపువ్వులును గ్రుచ్చి, వివిధాభరణములుగా తయారుచేసి, స్పటిక శిలపై కూర్చొనియున్న సీతాదేవికొప్పున అలంకరించి, అనందపడుచుండెను. ఆ సమయమున ఇంద్రుని పుత్రుడు-జయంతుడు కాకిరూపము ధరించి శ్రీరామచంద్రుని బలము తెలిసికొనవలెనని సీతాదేవి పాదమును తన ముక్కుతో పొడిచి శ్రీరామునిజూచి భయపడి పారిపోయెను. గాయమునుండి రక్తము కారుట చూచి శ్రీరామచంద్రుడు ఉగ్రుడై దర్భను మంత్రించి వానిపై వదలెను. హరిచక్రము దుర్వాసుని వెంబడించినట్లు మంత్రప్రేరితమైన ఆదర్భ పెనుభూతమై వానివెంటబడెను. అంత జయంతుడు కాకిరూపమును పరిత్యజించి నిజరూపము దాల్చి తన తండ్రియగు దేవేంద్రునివద్దకు వెళ్ళి రక్షింపుమనెను. తన కొడుకు రామచంద్రునికి అపకారియని తలంచి ఇంద్రుడు వానికి చోటివ్వలేదు.

"ఓ గరుడుడా! విను; భగవానుని వ్యతిరేకించువానికి తండ్రియే యముడగును. తల్లియే మృత్యుదేవత యగును. అమృతము విషమగును. గంగానది వానిపాలిటి వైతరణీ నది యగును."

అంత జయంతుడు బ్రహ్మలోకము, కైలాసము మొదలగు లోకము లన్నియు తిరిగెను. కాని వారెవ్వరు నిలుచుండుటకైనను వానికి చోటివ్వలేదు. అంత జయంతుడు విస్సహాయుడై నిరాశ్రయుడై నిస్పృహ చెంది దుఃఖించు చుండెను. మహాత్ములు ఇతరుల దుఃఖము చూచి సహింపజాలరు గదా! నారదమహాముని జయంతుని దుఃఖమును జూచి జాలివేసి "జయంతా! నీవు శ్రీరాముని పాదములనే ఆశ్రయింపుము; నీకు రక్షణకలుగు" నని వానికి చక్కని ఉపాయము చెప్పెను అతడు తిరిగివచ్చి శ్రీరాముని పాదాల



మీదపడి "దీనరక్షకా! అపరాధిని, నన్ను రక్షించుము రక్షించుము" అని వేడుకొనెను. "నేను తెలియక తప్పుచేసితిని; దాని ఫలితము పొందితిని" అని మాటిమాటికి మొరపెట్టుకొనగా అతడు అహంకారముచేత అట్లు చేసెనని శ్రీరామచంద్రుడు గ్రహించి జయంతుని క్షమించి ఒక చెవి, ఒక కన్ను మాత్రము పనికిరాకుండ చేసి, వానిని ప్రాణములతో వదలెను.

చిత్రకూటములో శ్రీరామచంద్రుడు అనేక సత్కార్యములు చేయుచు అచ్చటి ప్రజలను సంతోషపెట్టుచుండెను. అందువలన జనులు తండోపతండములుగా రాముని దర్శింప వచ్చుచుండిరి. రామచంద్రునికి విశ్రాంతిలేకపోయెను అచ్చట మునులవద్ద అనుజ్ఞదీసికొని రామచంద్రుడు సీతాలక్ష్మణులతో మరియొక వనమునకు బయలుదేరెను. మార్గమున అత్రి మహాముని ఆశ్రమమును జూచెను. ఆ ఋషి శ్రీరామచంద్రుడు వచ్చుట గాంచి వారి కెదురేగెను. ఆదరముతో ఆశ్రమమునకు రాముని తోడ్కొని వచ్చెను. ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి క్షేమసమాచారము లడుగుచు, గొప్పగా పూజించెను. పిమ్మట కందమూలఫలము లిచ్చి, సంతృప్తిపరచి అనేక విధములుగా స్తుతించెను.

అంత అ మ్మహామునిపత్ని అనసూయాదేవి సీతాదేవిని చూచి వనములో పతితోపాటు కష్టపడుతున్నందుకు ఆమెను అభినందించెను. తనవద్ద కూర్చుండబెట్టుకొని ఆమెకు స్త్రీ ధర్మముల నిట్లు వివరించెను. "ఓ రాకుమారీ! తల్లీ, తండ్రి, సోదరుడు మొదలగువారందరు స్త్రీకి హితముచేయువారే, వారందరూ ఒక పరిమితమైన సుఖమునుమాత్రమే యిచ్చువారు. కాని పతి ఒక్కడే కావలసినంత సుఖము నిచ్చువాడు. కనుక భర్తను సేవించని స్త్రీ అధమురాలు, ధైర్యము, ధర్మము, మిత్రులు, స్త్రీలు పురుషునకు ఆపదసమయములో తోడ్పడుదురు. వృద్ధుడు, రోగి, మూర్ఖుడు, దరిద్రుడు-అయినను పతికి సేవచేయుటయే స్త్రీధర్మము. లేనియెడల యమలోకములో ఎన్నోయాతనలు పతిని సేవించని స్త్రీలు పొందెదరు.

లోకములో నాలుగురకములైన పతివ్రత లున్నారని వేదములు పురాణములు, ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి ఉత్తమ పతివ్రత తన భర్తనుగాక పరాయిపురుషుని కలలోనైనగాంచదు. మధ్యరకము పతివ్రత పరపురుషుని తనకన్న పెద్దవాడైనచో తండ్రిగాను, తనతో సమానుని సోదరునిగాను, తనకంటె చిన్నవానిని పుత్రునిగాను, చూచును. మూడవరకము స్త్రీ కులము, మర్యాద, ధర్మము విచారించి, ఉచితరీతిగా నడచును. ఈమె నికృష్టస్త్రీ యని వేదములలో చెప్పబడెను. అవకాశము దొరకకను, లేదా భయమువలనను, ఒకస్త్రీ పతివ్రతగా, నుండును. జగత్తులో ఆ స్త్రీ అధమురాలని తెలుసుకొనవలెను. ఆమె పతిని మోసగించి పరాయిపురుషునితో వ్యభిచరించుచుండును. అట్టి స్త్రీ నూరుకల్పములవరకు నరకములో అనేకయాతనల ననుభవించుచుండును, పతికి ప్రతికూలముగా నడచుచు, పరాయిపురుషుని చేరి సంతోషపడు స్త్రీ ఎప్పుడు ఎచ్చట జన్మించినను యౌవనములో వైధవ్యమును పొందును. కనుక క్షణకాలపు సౌఖ్యము కొరకు అసంఖ్యాక జన్మలలో పొందే ఇంతటిబాధలను తెలుసుకొనలేని స్త్రీ కంటె మించిన మూర్ఖు లెవరుండెదరు? పతిని సేవించుటవలన స్త్రీకి శుభము చేకూరుచున్నది. పతివ్రతాధర్మములు పాటించినందువల్లనే నేటికి గూడ తులసీదేవి భగవానునికి ప్రియమై యెల్లరచే పూజింపబడుచున్నది. ఓ సీతాదేవి! నీ నామమును స్మరించియే స్త్రీలు పతివ్రతాధర్మములను పాటించుచుందురు. నీకు శ్రీరాముడు ప్రాణప్రియుడు. ఈ పతివ్రతాధర్మములు నీకు తెలియనివి కావు. అందరూ ఆచరించుటకు నేను చెప్పుచున్నాను" అని చెప్పి అనసూయాదేవి సీతకు ఎప్పటికీ నిత్యనూతనంగా ఉండే దివ్యవస్త్రములు, ఆభరణములు, ఇచ్చి సత్కరించెను. శ్రీరాముడు అత్రిమహామునిని చూచి స్వామీ! మేము వనమునకు బయలుదేరుటకు అనుజ్ఞయివ్వండి. నాయందు నిరంతరం దయగల్గి యుండండి. నన్ను తమ సేవకునిగా భావించండి" అని వినయముతో కోరగా ముని సంతోషించి



"ఓ భగవాన్! త్రిమూర్తులకుగూడా అలవికాని నీదర్శనభాగ్యము నాకు కల్గెను. రామచంద్రప్రభూ! ఇప్పుడు మీరు వెళ్ళండని నేనెట్లు చెప్పగలను? మీరు అంతర్యాములు" అని ప్రశంసించి, సజల నేత్రాలతో చూచుచుండెను. అత్రిమహామునికి నమస్కరించి శ్రీరాముడు బయలుదేరెను. ముందు రామచంద్రుడు, వెనుక లక్ష్మణుడు, వారిరువురిమధ్య జానకీదేవి. ఈ రీతిగా వారు నడచుచుండిరి. అది ఎట్లున్నదనగా బ్రహ్మ-జీవులమధ్య మాయవలె నొప్పుచుండెను. వారు పర్వతములను, అడవులను నదులను దాటుచు వెళ్ళుచుండిరి. ఆకాశమున మేఘములు క్రమ్మివారికి చల్లదనము నిచ్చుచుండెను. మార్గమధ్యమున విరాధుడను రాక్షసుడు వారికి కన్పడెను. రాముడు వానిని సంహరించి వానికి మోక్షమిచ్చెను. పిమ్మట వారు శరభంగమహాముని ఆశ్రమమునకు వెళ్ళిరి.

శరభంగమహర్షి శ్రీరామునిగాంచి అమితానందంతో తన అశ్రమమునకు తీసికొనివచ్చి, గొప్పగా పూజించి, యిట్లనెను. "నేను బ్రహ్మలోకమునకు వెళ్ళుటకు ప్రయాణమైతిని. ఇంతలో మీరు ఈ వనమునకు వచ్చుచున్నారని తెలుసుకొని, ప్రయాణమును మానుకొని, మీ రాకకై ఎదురు చూచుచుంటిని. నేను సాధనహీనుడను, దీనుడను. ఈ దీనసేవకుని రక్షించండి. ఈ దీనుని క్షేమానికిగాను నేను, బ్రతికియున్నంతవరకు ఇచ్చటనే తమరు నివసించండి." అని ప్రార్థించెను. అతడు తన జపతపములను హోమములను ప్రభువునకు సమర్పించి, దానికి బదులుగా స్వామియందు దృఢభక్తిని వరముగా పొందెను. తరువాత చితి పేర్చుకొని దానిపై పద్మాసనాసీనుడయ్యెను. సీతాలక్ష్మణులతో "మీరు నాహృదయములో నివసింపు" డని విన్నవించుకొనుచు, యోగాగ్నిలో తన శరీరమును భస్మముచేసుకొనెను. శ్రీరామునిదయవలన మహాముని వైకుంఠమునకు చేరెను. అది గాంచుచున్న అచ్చటి ఋషులెల్లరు శ్రీరామచంద్రుని శరణాగతరక్షకునిగా ప్రశంసించుచు జయజయధ్వనులు చేసిరి.

పిమ్మట శ్రీరామచంద్రుడు వనమునకు బయలుదేరెను. వారివెంట మునిశ్రేష్ఠులును బయలుదేరిరి. మార్గమున పడియున్న ఎముకలగుట్టలను చూచి రామచంద్రుడు ఇవియేమని మునుల నడిగెను.

మునులు ఇట్లు బదులుచెప్పిరి.

"ఓ స్వామీ? అన్నీ మీకుతెలియును. ఎరిగి ఎరుగనట్లు అడుగుచున్నారు. అయిననూ విన్నవించెదము. మునుల మాంసమును రాక్షసులు తిని నెత్తురులు త్రాగి ఎముకలు పారవేసిరి."

అది వినగానే రామచంద్రుడు కన్నీరు విడుచుచూ లోకములో నరభక్షకులగు రాక్షసులు లేకుండా చేసెదనని ప్రతిజ్ఞ చేసెను. "ఓ ఋషులారా! మీ మీ ఆశ్రమములలో నిర్భయముగా ఉండుడు" అని వారందరికి అభయమిచ్చెను.

అగస్త్యమునికి సుతీక్ష్ణుడు అను ఒకశిష్యుడు కలడు. అతనికి భగవానుని యందు అనన్యమైనభక్తిగలదు. మనసా వాచా కర్మణా శ్రీరామచంద్రుని కొలుచుచుండెను. ఇతరదేవతలను ఎన్నడూ కలలోనైనా స్మరించడు. ప్రభువు ఈ వనమునకు వచ్చుచున్నాడని విని ఆయనరాకకై ఎదురు చూచుచుండెను. ఆముని రాముని చూడగానే పరుగెత్తు కొని వెళ్ళెను, "హే భగవాన్! దీనబంధువైన రఘునాథుడు నావంటి దుష్టునియందు దయచూపునా? మీరు దీనులను ఉద్ధరించువారు. నాకు దైవవిశ్వాసము లేదు. ఏలనంటే నాకు భక్తి జ్ఞాన వైరాగ్యము లేమీ లేవు. జపతపోయజ్ఞములు చేసియుండలేదు. ప్రభునిపాదములందు దృఢానురాగము లేదు. నిస్సహాయులకు ప్రభువు ప్రియుడు" అని ఆనందమగ్నుడై తన మనస్సులోనే "భవబంధములను వదిలించగల శ్రీరామచంద్రుని ముఖారవిందమును చూచి, నేటికి నానేత్రములు ధన్యమైనవి" అని తలంచుచుండెను. ఓ భవానీ! ముని ప్రేమలో మునిగి తన్మయు డయ్యెను.



దానిని నేను వర్ణించజాల నని పార్వతీదేవితో చెప్పి ఈశ్వరుడు గూడ తన్మయు డయ్యెను. మునికి దిక్కులు, మార్గము ఏమీ తెలియలేదు. "నేను ఎవడను? ఎచ్చటకు పోవుచున్నాను?" అనికూడా తెలియక వెనుకకు, ముందుకు, అటు–ఇటు పరుగెత్తుచూ, రాముని గుణగణములు గానముచేయుచూ, ఆడుచూ, పాడుచుండెను. ముని ప్రగాఢప్రేమభక్తిలో మునిగిపోయెను.

రామచంద్రుడు వృక్షముచాటునుండి అతని ప్రేమోన్మత్తస్థితిని చూచుచుండెను. మునియొక్క అత్యంతప్రేమను చూచి వాని హృదయములో భవభయములను దూరముచేసే శ్రీరామచంద్రుడు ప్రవేశించెను. ముని ఆనందమగ్నుడై మార్గమధ్యములో కూర్చుండెను. అది చూచి రామచంద్రుడు అతనిని సమీపించి అతనిభక్తికి మీగుల ఆనందించెను. వాని వద్దకు వెళ్ళి వాని పారవశ్యమునకు సంతోషపడి మునిని మేల్కొలుప సాగెను. కాని ముని భక్తిపారవశ్యములో నుండుటవలన మేల్కొనలేదు. తన నిర్మల హృదయములో, ధ్యానములో, భక్తి తన్మయత్వంలో అతడు నిమగ్నుడై పోయెను. అంత ప్రభువు తన నిజరాజరూపమును దాచి చతుర్భుజ రూపమును ప్రకటించెను. ముని మణి పోగొట్టుకొనిన సర్పమువలె వ్యాకులపడెను, కొంచెము సేపటికి కన్నుల ఎదుటనున్న సీతారామ లక్ష్మణులను గాంచి అమితానందముపొంది రామచంద్రుని పాదములమీద సాష్టాంగముగా పడెను.

అంతట ప్రభువును తన ఆశ్రమమునకు తీసుకొనివచ్చి అనేక విధములుగా ఆయనను పూజించి "ఓ ప్రభూ! నా ప్రార్థన వినండి. నేను మిమ్ములను ఏ విధముగా స్తుతించగలను? మీ మహిమ అపారమైనది. నాబుద్ధి అతిస్వల్పమైనది. నేను మీ సేవకుడను. మీరు నాకు ప్రభువులు" అనెను.

మునివాక్యములు విని రామచంద్రుడు అమితముగా ఆనందించి మునిని ఆదరముతో కౌగిలించుకొనెను. శ్రీరామచంద్రుడు సుతీక్ష్ణుని చూచి "నీవు ఏదైనా వరము కోరుకొనుము" అనగా అతడు "నేను వరము ఎన్నడూ అడిగియుండలేదు. ఏది సత్యమో, ఏది అసత్యమో (ఏది అడుగవలెనో, ఏది అడుగకూడదో) నాకు బోధపడుటలేదు. ఏది మంచిదో మీరే ఆలోచించి ఇవ్వండి" అనెను.

అంత శ్రీరామచంద్రుడు "ఓ మునీ! నీకు ప్రగాఢ భక్తి, వైరాగ్యము, విజ్ఞానము కలుగుగాక! సమస్త సద్గుణములు నీయందు పూర్తిగా నిండియుండుగాక" యని చెప్పెను. ముని యిట్లనెను. "మహాత్మా! నాకు మీరు ఏ వరము ఇచ్చితిరో అది తీసికొంటిని. కానీ సీతాలక్ష్మణులతో కూడ మీరు నాహృదయములో స్థిరముగా నుండండి".

అంత రామచంద్రుడు తథాస్తు! అని ఆశీర్వదించి అగస్త్యమహర్షి ఆశ్రమమునకు బయలుదేరెను.

వారి ప్రయాణమును సుతీక్ష్ణుడు చూచి "స్వామీ! నేను గురువు గారి ఆశ్రమమునకు వెళ్ళి చాలారోజులు అయినది. ఇప్పుడు నేనుకూడ మీతో వచ్చెదను. ఇందు నీ మీద కృతజ్ఞతతో కాదు" అని చెప్పగా ముని చాతుర్యమునకు శ్రీరాముడు సంతోషించెను, అతనిని వెంటతీసికొని సీతా రామలక్ష్మణులు బయలుదేరిరి. మార్గములో ముని తన అఖండభక్తిని వర్ణించుచుండెను. అందరును అగస్త్యుని యాశ్రమము చేరుకొనిరి, ముందుగా సుతీక్ష్ణుడు తన గురువుగారివద్దకు వెళ్ళి నమస్కరించి "గురువర్యా! రేయింబవళ్ళు మీరు జపించే శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణులతో కూడమిమ్ములను కలుసుకొనుటకు వచ్చుచున్నాడ"ని చెప్పెను.

అది వినగానే అగస్త్యముని లేచి రామునివద్దకు పరుగెత్తుకొని వచ్చెను, వారిని చూడగానే మహాముని అమితానందముపొందెను. రామలక్ష్మణులు



అగస్త్యమునికి నమస్కరించిరి. అతడు ఆదరముతో వారిని లేవదీసి ప్రేమతో కౌగిలించుకొనెను. అంత మహాముని వారిని తన ఆశ్రమమునకు తీసికొనివెళ్ళి భక్తితో పూజించి "ఓ భగవాన్! నావంటి అదృష్టవంతుడు మరియొకడు లేడు" అనెను అంత మహాముని శ్రీరామచంద్రుని తదేకదృష్టితోచూచి బ్రహ్మానందము చెందెను. అంత రామచంద్రుడు అగస్త్యమహామునితో "నేను తమదగ్గర ఏమియు దాచను. ఏ కారణముచేత వచ్చితినో తమకు తెలుసును, నేను చెప్పనవసరములేదు. ఋషులకు ద్రోహముచేసే రాక్షసులను హతమార్చగల విధానము చెప్పండి" అనెను. ఆ మాటలకు మహాముని చిరునవ్వు నవ్వి యిట్లనెను. "ఓ దేవాదిదేవా! తెలిసియు తెలియనట్లు అడుగుచున్నారు. మీ భజనప్రభావమువలన కొద్ది పాటి మహిమ నాకు వచ్చినది. తమమాయ మేడిచెట్టువంటిది బ్రహ్మాండము లన్నియు దానిపండ్లు. మీరు యమునినైనను గెలువగలరు. అన్ని మీకు తెలిసియు తెలియనట్లు మానవునివలె నడుగుచున్నారు. మాకు ఈ వరము నివ్వండి. సీతాలక్ష్మణులతోగూడ మీరు సదా నాహృదయములో నివసించి ఉండండి. ప్రగాఢభక్తి, వైరాగ్యము, మీ పాదములయందు స్థిరమైన ప్రీతి నాకు సర్వదా కలిగియుండుగాక! ఇదే వరమునివ్వండి. మీకనేక రూపములున్ననూ మీ యీ సుగుణసుందరరూపమునే చూడగోరుచున్నాను. సేవకులకు గొప్పతనమునిచ్చుటకు నన్ను తమ రడుచున్నారు. పరమ మనోహరమైన పవిత్రస్థానము "పంచవటి" గలదు. మీరు దండకారణ్యమును పవిత్రముచేయండి. గౌతమముని కఠోరశాపమును పోగొట్టండి. మునుల మీద దయయుంచి అచటనే నివసించండి" అని పల్కిన అగస్త్య మహాముని యాజ్ఞపై సీతారామలక్ష్మణులు పంచవటికి వెంటనే చేరుకొనిరి.

అచ్చట వారు జటాయువును కలుసుకొనిరి. అంత శ్రీరామచంద్రుడు గోదావరీనదీ సమీపమున పర్ణకుటీరము నిర్మించుకొని అందు నివసింప సాగెను. శ్రీరామచంద్రుడు అచ్చట నివసించుచుండగా మునులు, యక్షులు

సుఖముగనుండిరి. భయము నశించెను. పర్వతములు; వనములు, నదులు శోభించుచుండెను. పశువులు, పక్షులు ఆనందించుచుండెను. తుమ్మెదలు ఝుంకారము చేయుచుండెను. ఆ వనమును వర్ణించుటకు శేషునికికూడ తరముకాదు.

ఒకసారి రామచంద్రుడు సంతోషముతో కూర్చొనియుండెను. ఆ సమయమున లక్ష్మణుడు ప్రేమతో నిట్లనెను. "ఓ స్వామీ! నేను మిమ్ములను గురువుగా భావించి అడుగుచున్నాను. నాకు బాగా తెలియునట్లు బోధించండి. భక్తిని గురించి చెప్పండి. స్వామీ! ఈశ్వరునకును జీవులకును గల భేదమేమి? మోహము, శోకము పోవుమార్గము అడుగుచున్నాను" అని అడుగగానే శ్రీరామచంద్రుడు ప్రేమతో "నాయనా! లక్ష్మణా! నేను కొద్దిమాటలతో నీకు అంతా తెలియునట్లు చెప్పెదను. అన్నిటికీ మూలకారణము నేను, నాది, నీవు, నీది, యని అనుకొనుటయే మాయ. ఇదే సమస్త జీవులను వశపరచుకొనుచున్నది. ఇందు ఏ విషయములపై మనసెంతవరకు పోవునో అది అంతయు మాయ యని ఎరుగవలయును ఒకటి విద్య, రెండు అవిద్య. ఈ రెంటి భేదములను వినుము. అవిద్య దోషయు క్తమైనది. అది అత్యంత దుఃఖము కలుగజేయును. దానికి పశులై జీవులు సంసారకూపములో పడుచుందురు. మరియు విద్య లోకమును సృష్టించును. అది ప్రభువువలన ప్రేరితమైనది దానికి స్వీయబలములేదు. అభిమానము గాక మరే దోషములేనిదే జ్ఞానము. జ్ఞానియైనవాడు అందరిలో సమానముగా బ్రహ్మమును చూచును. సిద్ధులన్నింటిని, త్రిగుణాలను గడ్డిపరకవలె విడిచి పెట్టినవానినే పరమవైరాగ్యవంతునిగా చెప్పవలయును.

దంభము, హింస, క్షమారాహిత్యము, ఆపవిత్రత, ఆచార్యసేవా నియమవిముఖత, అస్థిరత్వము, మనస్సును నిగ్రహించకపోవుట, ఇంద్రియ విషయములందాసక్తి, అహంకారము, జన్మమృత్యుజరావ్యాధిమయ జగత్తు నందు మతిబుద్ధి, పుత్ర మిత్ర కళత్ర గృహములయం దాసక్తి మరియు



మమత్వము, ప్రీతి అప్రీతికరమయిన వస్తువులు ప్రాప్తించినపుడు హర్షము శోకము, ఏకాంతములో మనస్సు లగ్నము కాకపోవుట, విషయలోలురైన వ్యక్తులతో స్నేహము చేయవలెనను అభిలాష, కుటిలత్వము ఈపై గుణములు ఎవనిలో ఉండవో, ఎవడు నిత్యము ఆధ్యాత్మిక చింతనలో ఉంటూ తత్త్వజ్ఞానముద్వారా తెలుసుకొనదగిన పరమాత్మను నిరంతరము దర్శించు చుండునో అతడే జ్ఞానియని చెప్పబడుచుండును. మాయను, ఈశ్వరుని తన స్వస్వరూపాన్ని ఎవడు తెలుసుకొనలేడో అతడు జీవుడు. కర్మాను సారముగ జీవులకు బంధన మోక్షములిచ్చువాడు అందరికి అతీతుడు, మాయను ప్రేరేపించువాడు ఈశ్వరుడు, ధర్మాచరణవలన వైరాగ్యము, వైరాగ్యము వలన జ్ఞానము, జ్ఞానమువలన మోక్షము లభించునని వేదములయందు చెప్పబడెను.

మహాత్ములయందు ఎవనికి అత్యంత ప్రీతిఉండునో మనసా, వాచా, కర్మణా హరి భజనలయందు ఎవడు దృఢనియమము కలిగియుండునో, ఎవడు నన్నే తండ్రిగా, తల్లిగా, గురువుగా, పతిగా, దేవతగా భావించి నాసేవలో దృఢముగా నుండునో, నా గుణగణములను గానముచేయునపుడు ఎవని శరీరము పులకిత మగుచుండునో, ఎవని వాణి గద్గదమగుచుండునో, నేత్రములనుండి ప్రేమాశ్రువులు రాలుచుండునో అట్టివారికి నేను సదా వశమైయుందును.

ఈ భక్తియోగాన్ని విని లక్ష్మణుడు మిగుల సంతసించెను. శ్రీరాముని పాదములకు నమస్కరించెను. వైరాగ్యము, జ్ఞానము, భక్తిగురించి ఎన్నోవిషయములు చెప్పుకొనుచు వారు పంచవటిలో పర్ణశాలయందు కొన్ని దినములు గడపిరి.

రావణునికి శూర్పణఖయను సోదరి కలదు. ఆమెహృదయము త్రాచుపాము విషమువంటిది. ఒకసారి పంచవటిలో తిరుగుచు రామలక్ష్మణులను జూచి కామపీడితురాలయ్యెను.

ఓ గరుడా! శూర్పణఖ ధర్మశూన్యురాలైన కాముకురాలు. దుష్ట స్త్రీ. మనోహరులైన పురుషులను చూచినపుడు అతడు సోదరుడైనను, తండ్రియైనను, పుత్రుడైనను మోహించును. మనస్సు నిగ్రహింపజాలదు ఎట్లు సూర్యకాంతమణి సూర్యునిచూడగనే కరగిపోవునో అట్లే ఆమె మనస్సుకరగిపోయెను. శూర్పణఖ సుందరవేషము ధరించి శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళి నవ్వుచు నిట్లనెను.

"ఈ లోకములలో నీతో సమానుడైన పురుషుడు లేడు. నాతో సమానమైన సుందరి లేదు. విధాత మనల నిద్దరిని పతిపత్నులుగా సమకూర్చెను. ప్రపంచమంతా వెదకినా నాకు తగిన సుందరుడైన పురుషుడు దొరకక యింతవరకు నే నవివాహితగానే ఉండవలసి వచ్చినది. ఇప్పుడు నిన్నుచూచినప్పటినుండి నామనస్సులో భ్రమ కల్గినది" అని విన్నవించెను. శ్రీరామచంద్రుడు సీతవైపు చూచుచు "ఈమె నా భార్య. అడుగో! అతడు లక్ష్మణుడు. నా సోదరుడు, యువకుడు" అని చెప్పెను. శూర్పణఖ లక్ష్మణునివద్దకు వచ్చి తన గొడవ అంతయూ విన్నవించెను. అంత లక్ష్మణుడు ఈమె శత్రుసోదరి యని గ్రహించి ప్రభువువైపు చూచుచు వినయముతో నిట్లనెను. "ఓ నారీ! నేను శ్రీహరి సేవకుడను. పరాధీనుడను. కనుక నావలన నీకు సుఖము ఉండదు. ఆయన కోసలరాజు, సమర్థుడు, దేనినైనను స్వేచ్ఛగా చేయగలడు. సేవకుడు సుఖముకోరినా, భిక్షుకుడు సన్మానము కోరినా, వ్యసనపరుడు ధనముకోరినా వ్యభిచారి శుభఫలితము కోరినా, లోభి యశస్సుకోరినా, అభిమాని ధర్మార్థకామమోక్షములను కోరినా పొందజాలరు".

శూర్పణఖ రామునివద్దకు మరలవచ్చెను రామచంద్రుడు లక్ష్మణుని వద్దకు తిరిగి పంపెను.

ఇట్లామెను "వారని వీరు, వీరని వారు" అవహేళనచేసిరి. అందు మీద ఆ రాక్షసి అమిత కోపముతో భయంకరరూపమును ధరించి సీతాదేవిని



మ్రింగబోయెను. శూర్పణఖనుచూచి సీత భయకంపితురాలయ్యెను ఆమె భయపడుట చూచి రామచంద్రుడు లక్ష్మణునికి సైగచేసెను. అంత లక్ష్మణుడు మహోగ్రుడై "ఓ క్రూరురాలా! సిగ్గులేకుండా పురుషులవద్దకు వచ్చి కామమును తీర్చుమని అడుగుదువా?" యని దాని ముక్కుచెవులను కోసివేసెను. అది రావణునకు సవాలుచేసినట్లయ్యెను. ముక్కుచెవులు కోసి నందున రాక్షసి మరింత భయంకరురాలయ్యెను. పర్వతగుహనుండి జలధార ప్రవహించినట్లు ఆమె శరీరమునుండి రక్తము ప్రవహించుచుండెను. ఆ రాక్షసి పెద్దగా శోకించుచు ఖరదూషణుల వద్దకు వెళ్ళి వారితో "సోదరులారా! మీకు శౌర్యము, పౌరుషము లేదు"అని పలికి వారికి పౌరుషము నెక్కించెను. వారు ఏమి జరిగినదని యడుగగా జరిగినదంతయు చెప్పెను. అదంతయు విని రాక్షసులు సేనను సమకూర్చుకొని బయలుదేరిరి రెక్కలు గల పర్వతములవలె రక్కసిదళములు బయలుదేరెను. అనేకవిధములైన వాహనములు, ఏనుగులు, గుఱ్ఱములు అధిష్ఠించి చెవులు, ముక్కు తెగి నటువంటి అమంగళకరమైన ముఖముగల శూర్పణఖను ముందుపెట్టుకొని ఆమె వెనువెంట బయలుదేరిరి. వారు మార్గమున వెళ్ళుచుండగా అనేక అపశకునములు ఎదురయ్యెను. కాని మృత్యువు సమీపించినందున వారు వాటిని లెక్కచేయలేదు. రాక్షసులు ఎగురుచు, దూకుచు, సవాలుచేయుచు వెళ్ళుచుండిరి. ఉత్సాహవంతులైన రణయోధులు సంతోషముతో ఇట్లు పలుకుచుండిరి. "సోదరుల నిద్దరిని కొట్టి చంపండి. లేదా బలవంతముగా తీసుకొనిరండి".

అంత రామచంద్రుడు లక్ష్మణుని పిలిచి "భయంకరమైన రాక్షస సేన వచ్చుచున్నది. జానకిని తీసుకొనివెళ్ళి పర్వతగుహలో నుంచి నీవు అక్కడ ఆమెను కాపాడుచుండుము" అనిపల్కెను. ప్రభువు వాక్యములు విని లక్ష్మణుడు ధనుర్బాణములను ధరించి సీతాదేవిని తీసుకొని వెళ్ళెను. అంత రామచంద్రుడు రాక్షససేన వచ్చుచుండుట చూచి ధనుస్సు నెక్కు పెట్టి జడలు పైకి ఎగగట్టి ఎదురుచూచుచుండెను.

రాక్షససేనలు పెద్దగా అరచుచు రాముని ముట్టడించెను. అది బాలసూర్యుని ఒంటరివానిగా చూచి మందేహ రాక్షసులు ముట్టడించి నట్లుండెను. అమిత సౌందర్యవంతుడైన శ్రీరామచంద్రుని చూచి రాక్షససేన అంతయు బలహీనమయ్యెను. అందువలన రాక్షస సేనాపతులు బాణములు వేయలేక మంత్రిని పిలిచి ఖరదూషణాదులతో నిట్లు చెప్పుమనిరి. "ఈ రాజరాజకుమారుడు మానవుడు గాడు. దేవతలు, నాగులు, రాక్షసులు, మనుష్యులలో ఇట్టివారెవరూ లేరు. జీవితములో ఇట్టి సుందరాకారులను చూచి యుండలేదు." ఏదిఏట్లు అయినను మనసోదరిని కురూపినిగా చేసిరి. వారిద్దరిని వధించక వదలి వారివెంటనున్న స్త్రీని బలవంతముగా తీసుకురండి. ఈ మాటలు వారికి చెప్పండి. వారేమిచెప్పిరో వచ్చి మాకు చెప్పండి."

దూతలు వెళ్ళి వారు చెప్పిన దంతయు శ్రీరామునికి విశదీకరించిరి. వారి మాటలు విని రామచంద్రుడు నవ్వుచు నిట్లనెను. "మేము క్షత్రియులము. వనములో వేటాడుటకు వచ్చియున్నాము, మీవంటి దుష్టపశువుల కోసమై వెదకుచున్నాము. బలవంతుడైన శత్రువును చూచి మేము భయపడము. మాతో పోరాడుటకు యముడు వచ్చిననూ యుద్ధము చేయుదుము. మేము మానవులమే అయినను దైత్యులను సంహరించి ఋషులను రక్షించే వారము. మేము బాలురమే అయినను దుష్టులను దండించేవారము. శక్తి లేనిచో ఇంటికి తిరిగిపొండు, యుద్ధములో వెనుతిరిగి పోవువానిని చంపము, యుద్ధమునకు వచ్చి కపటము, చాతుర్యముచేయుట, శత్రువుపై దయ చూపునట్లు నటించుట అది పిరికివాని లక్షణము."

దూతలు వెళ్ళి రామునివాక్యములు చెప్పగనే ఖరదూషణులు విని మండిపడి వానిని బంధించండని రాక్షసులతో చెప్పిరి. వారు ఆయుధములను ధరించి శ్రీరాముని ముట్టడించిరి, అంత రామచంద్రుడు ధనుస్సు నెక్కుబెట్టి బాణము సంధించెను. ఆ శబ్దము విని రాక్షసులు చెవిటివారై మిగుల



వ్యాకులత్వము చెంది స్పృహతప్పి పడిపోయిరి రాక్షసులు రాముడు గొప్ప బలవంతుడని గ్రహించి అనేక బాణములు, కత్తులు, కటారులు, ఒకేసారి విసిరిరి, శ్రీరామచంద్రుడు తనశరములతో వాటిని ముక్కలు ముక్కలుగా చేసి వేయుచుండెను. బాణముల ధాటికి ఆగలేక రాక్షసులు వెనుకకు పరుగెత్తి పోవుచుండిరి. ఖరదూషణులు కోపముతో, పరుగెత్తే వారి నందరినీ మే మే హతమార్చెదమని హెచ్చరించగా ఆదివిని ఏ విధముగానైన మరణము తప్పదని పారిపోవు వారందరూ తిరిగివచ్చి పెక్కు ఆయుధములను శ్రీరాముని పై ప్రయోగించిరి. శ్రీరాముడును అనేక బాణములు వారిపై వేసెను. రాక్షసులు ఆ బాణముల వలన తునాతునుకలై పోయిరి. వారి శిరస్సులు, భుజములు, పాదములు తెగి భూమిమీద పడుచుండెను. యోధులు ఖండ ఖండము లగుచుండిరి. మరల వారు లేచి పోరాడుచుండిరి, ఆకాశమున అనేక భుజములు శిరములు ఎగురుచుండెను. కాకులు, గ్రద్దలు, నక్కలు భయంకర శబ్దములు చేయుచుండెను. భూతప్రేత పిశాచములు నెత్తురు పీల్చుచుండెను రామచంద్రుని బాణములు రాక్షసయోధుల వక్షః స్థలములను, భుజములను ముక్కలు ముక్కలు చేయుచుండెను పడిపోయిన సైనికులు మరలలేచి సాహసముతో పోరాడుచుండిరి తన సైన్యము వ్యాకులతను చూచి ఖరదూషణులు శ్రీరాముని మీద ఒకే పర్యాయము అనేక బాణములను ప్రయోగించిరి. ప్రభువు క్షణకాలములో వాటి నన్నింటిని త్రుంచి వేసి వారిపై అనేక బాణములు వేసెను, యోధులు భూమిపై పడుచుండిరి. మరలలేచి యుద్ధము చేయుటకు ప్రయత్నించుచుండిరి, ఇది చూచి దేవతలు పదునాలుగు వేలమంది రాక్షసులను రాముడొక్కడే ఎట్లు జయించునని భయమొందుచుండిరి. అది చూచి శ్రీరామచంద్రుడు తన మాయచే రాక్షసులలో ఒకరికి మరొకరు రాముడుగా కనబడునట్లు చేసెను. "ఇదుగో వీడే రాముడు వీడిని చంపుము" అని కేకలువేయుచు చంపుచుండిరి. శరీరములు విడిచినవారు మోక్షమును పొందుచుండిరి.

రాక్షసులందరు హతమైనందిన దేవతలు మిగులసంతోషముతో ఉప్పొంగి పూలవర్షము కురిపించిరి. ఆకాశములో నగారాలు మ్రోగెను. మునులు, దేవతలు, మానవులు నిర్భయులైరి. అంత లక్ష్మణుడు సీతా దేవిని తీసుకొనివచ్చెను. తన పాదములపై బడిన లక్ష్మణుని ప్రభువు ప్రేమతో లేవనెత్తి గట్టిగా కౌగిలించుకొనెను. సీతాదేవి శ్రీరాముని శ్యామల వర్ణ శరీరము పరమప్రేమతో చూచుచుండెను.

శ్రీరామచంద్రుడు వనములో నివసించుచు దేవతలకు, మునులకు సుఖముకల్గించే పనులు చేయుచుండెను. ఖరదూషణులు మరణించుట చూచి శూర్పణఖ విభ్రాంతిచెంది రావణుని వద్దకు వెళ్ళి అతనిని రెచ్చగొట్టెను. ఆమె దుఃఖముతో ''నీవు త్రాగుచు స్త్రీలోలుడవై రాత్రింబవళ్ళు నిద్రపోవుచున్నావు శత్రువు నెత్తిమీదనే యున్నాడని నీవు తెలుసుకొన లేదు. శత్రువు, రోగము, అగ్ని, పాపము, యజమాని, సర్పము దీనిని అల్పమని యెంచకూడదు.'' ఇట్లు చెప్పుచు శూర్పణఖ అనేకవిధములుగ శోకించెను. అది విని రావణుని సభ యంతయు వ్యాకులపడెను. "నీవు బ్రతికి యుండగనే నాకిట్టి దుర్గతి పట్టిన" దని ఏడ్చుచున్న సోదరిని ఆదరముగా ఆమె భుజమును పట్టుకొని లేవదీసి రావణుడు "ముందు నీ ముక్కు చెవులు కోసినవాడెవడో చెప్పుము?" అని అడుగగనే శూర్పణఖ "రాముని తమ్ముడైన లక్ష్మణుడు కోసెను. నేను మీసోదరినని తెలిసి అనేక విధములుగా నన్ను అవమానించిరి, నాఘోష విని ఖరదూషణులు సేనతో సహాయ పడుటకు వచ్చిరి. వారిని రాముడు హతమార్చెను" అని చెప్పెను.

రావణుడు ఖరదూషణుల మరణము విని వార లందరూ నాయంతటి బలముకలవారు. ఒక్కడు ఎట్లు చంపె" నని తనలోతాను ఆశ్చర్యచకితుడై పైకి శూర్పణఖతో తన శక్తి సామర్థ్యములు చెప్పి వెంటనే యింటిలోనికి వెళ్ళిపోయెను.

ఆ రాత్రి అంతయు రావణుడు ఆలోచింపసాగెను. "పదునాలుగువేల మంది రాక్షసులను ఒక్కడు చంపుట అసాధ్యము. అతడు నరుడు కాడు, దేవదేవుడే కావచ్చును. దేవతలను రక్షించుటకు భూభారమును తగ్గించుటకు, అవతరించి ఉండవచ్చును. నేను భయపడి ఊరుకొనినను వచ్చిన వాడు నన్ను చంపకుండా వెళ్లడు. ఒకవేళ అతడు సాధారణ రాజకుమారుడైన నేను వానిని జయించి భూమండల మంతయు ఎదురులేకుండ నేలెదను లేక అతడు భగవంతుడయితే వానిచే చంపబడి కైవల్యము పొందెదను. నాది తామస శరీర మగుటవలన జప తపోహోమములు చేసి స్తుతించలేను." అని అనుకొని రథమెక్కి రావణుడు ఒంటరిగా సముద్ర తీరమున నున్న మారీచుని వద్దకు వెళ్ళెను.



ఓ ఉమా! శ్రీరామచంద్రుడు ఆలోచించి లక్ష్మణుడు కందమూల ఫలములకు వెళ్ళినపుడు సీతాదేవితో నిట్లు చెప్పెను. "ఓ సీతా! నేను రాక్షస సంహారము కొఱకు కొన్ని సాహసపుపనులు చేయవలెను. కనుక నీవు అంతవరకును అగ్నిలో దాగియుండుము. తరువాత మరల రావచ్చును." అని చెప్పగా సీతాదేవి రామునికి నమస్కరించి హృదయములో తనభర్తను స్మరించుచు తన ఛాయను అక్కడనుంచి తాను అగ్నిలో ప్రవేశించెను. ఇది లక్ష్మణునికి కూడ తెలియదు.

స్వార్థపరుడైన రావణుడు మారీచుని వద్దకు వెళ్ళి నమస్కరించెను. ఓ పార్వతీ! దుష్టుడు వినయముతో నమస్కరించిననుకూడా ప్రమాదమే! మారీచుడు లంకేశ్వరుని జూచి 'రావణా! అకస్మాత్తుగా ఒక్కడివే యెందుకు వచ్చితివి?' అని అడిగెను. రావణుడు అహంకారముతో రామలక్ష్మణులు శూర్పణఖకు చేసిన అవమానమంతయు చెప్పి ''వారికి తగినశాస్తి చేయవలెను. కనుక నీవు కపటమృగవేషము ధరించి రాముని దూరమునకు గొనిపొమ్ము. నేను రాముని భార్య సీతను తీసుకొనివచ్చెదను. నేను వారు చెసిన అపకారమునకు తప్పక ప్రతీకారము చేసి వారిని అవమానపరచెదను" అని పల్కెను. అది విని మారీచుడు భయపడి "రావణా! రాముడు మానవుడు కాడు. లోకములన్నిటికి ఆధారభూతుడైన భగవానుడు. చావు పుట్టుకలు

లేనివాడు. వానితో విరోదము వద్దు. ఒకప్పుడు ఈ రాముడు యజ్ఞసంరక్షణార్థమైవచ్చెను. అప్పుదు నేను యజ్ఞమును ధ్వంసముచేయుటకు వెళ్ళితిని. అగ్ని బాణము వేసి సుబాహుని భస్మము చేసెను. సాధారణబాణమేయగా నేను నూఱుయోజనముల దూరములో పడితిని నాదశ తుమ్మెద పురుగువలె అయినది. ఇప్పటికిని రామలక్ష్మణులు నా కనులయెదుట కన్పించుచున్నారు. వారు మనుష్యులుగా కన్పించుచున్నను అసహాయశూరులు. వారు తాటకను సంహరించిరి. శివ ధనుస్సును విరచిరి. ఖరదూషణాదులను వధించిరి. వారితో వైరము వద్దు. నేను చెప్పినట్లు వచ్చినదారినే తిరిగి పొమ్ము. నీకు క్షేమము కలుగును" అని హితము చెప్పగా మారీచుని మాటలు విని రావణుడు మండిపడి "నా కన్న నీకు ఎక్కువ ఏమి తెలునును? మూర్ఖుడా! నాకే గురువువలె ఉపదేశించుచున్నావా? ఈ ముల్లోకములలో నన్ను జయించు వాడెవ్వడు? ఎదురు చెప్పినయెడల ఈ చంద్రహాసముతో నీతల నరికివేయుదును" అనగా మారీచుడు భయపడెను. ఎందుకనగా శస్త్రధారులు, మర్మజ్ఞులు, సమర్థప్రభులు, మూర్ఖులు, ధనవంతులు, వైద్యులు, భ్రష్టులు, కవులు, వంటవారు ఈ తొమ్మండుగురతో విరోధముపెట్టుకొన్నచో ఉపద్రవము తప్పదని పెద్దలు చెప్పుదురు 'రావణునిచేతులలో మరణించుట కంటే రాముని చేతులలో మరణించుట మంచిది.' అని తలచి మారీచుడు "నాయనా! మీ యిష్టమువచ్చినట్లు చేసెదన"ని చెప్పి రాముని స్మరించుచు రావణునితో రథమెక్కి రామచంద్రుడు నివసించుచున్న ఆశ్రమమువద్దకు వచ్చెను. మారీచుడు బంగారులేడియై ఆశ్రమముముందర తిరుగసాగెను. సీతాదేవి మనోహరమైన ఆ లేడిని చూచి "నాథా! ఈ లేడి చాలా అందముగా నున్నది. నాకు దానిని తెచ్చి ఇవ్వండి"అని కోరెను. రామచంద్రుడు అది కపటమృగమని తెలిసియు కూడ దేవతల రక్షణార్థము సంతోషముతో ఆయుధములను ధరించి "లక్ష్మణా! రాక్షసులు గుంపులు గుంపులుగా తిరుగుచున్నారు. సీతను జాగ్రత్తగా కాపాడుచుండు''మని చెప్పి



రామచంద్రుడు మృగమువెంటపడెను. ప్రభువును చూచి బంగారులేడి పరుగెత్తు చుండెను. కానీ రామచంద్రుడు దానిని వదలలేదు. వేదములుకూడా వర్ణించలేని, ఈశ్వరుడు ధ్యానములోకూడా పొందలేనటువంటి దేవదేవుడు మాయ లేడివెంట భ్రాంతితో పరుగెత్తుచుండెను. అది అందీ అందక, కనపడీ కనపడకుండా చాలా దూరము పరుగెత్తిపోయెను. అంత రామచంద్రుడు కోపముతో గురిపెట్టి బాణమును వేసెను. అది తగులగనే ఆ లేడి "హా! లక్ష్మణా!"యని పెద్దగా కేకవేసి మనసులో రాముని స్మరించుచు ప్రాణము విడిచెను. అంత ఆ రాక్షసునకు స్వస్వరూపము వచ్చెను.

ఇచట సీత "హా లక్ష్మణా! యన్న కేకవిని "లక్ష్మణా! నీయన్న గారికి ఏదో ఆపదవచ్చినట్లున్నది. కనుకనే నిన్ను పిలిచిరి. నీవు వెంటనే వెళ్ళి వారికి సహాయపడుము" అని పల్కెను. లక్ష్మణుడు "అమ్మా, మా అన్నగారి కేమియు భయములేదు. వారి నెవరూ ఏమీ చేయలేరు వారికి కోపము వచ్చినయెడల లోకమంతా తారుమారగును. స్వప్నములోకూడ ఎవ్వరూ అన్నగారి నెదిరించలేరు" అని ధైర్యము చెప్పెను. ఆ మాటలకు సీతాదేవి లక్ష్మణుని అపార్థము చేసుకొని అనేక విధములుగా దూషించెను. విధివశముచే ఆమె మాటలకు రోషము వచ్చి లక్ష్మణుడు సీతాదేవిని వన దేవతకు అప్పగించి రాముడు వెళ్ళిన మార్గమున బయలుదేరెను. అది గాంచి రావణుడు సన్యాసి వేషము ధరించి ఎవరూ లేనిసమయము కనిపెట్టి సీతాదేవి వద్దకు వెళ్ళెను. ఎవరి భయమువలన దేవతలు, రాక్షసులు నిద్రాహారములు లేక భయపడుచుందురో అట్టి రావణుడు ఇటూ అటూ చూచుచు దొంగవలె లోనికి ప్రవేశించెను. "చెడుపని చేయువానికి తేజస్సు, బుద్ధిబలము లేశమాత్రమును ఉండదు"

రావణుడు అనేక విధములయిన చక్కని మాటలు చెప్పి సీతను మోసగింప చూచెను. వాని పలుకులకు భయపడి సీతాదేవి వానినిచూచి "ఓరి మూర్ఖుడా! నీవు క్రూరునివలె మాటాడుచున్నావు" అని పల్కగా

రావణుడు తన పేరు చెప్పుచు నిజరూపమును చూపెను. సీత రావణుని పేరు వినగానే భయపడి కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని యిట్లనెను. "ఓరీ దుష్టుడా! ప్రభువువచ్చు వేళ అయినది. నిబ్బరముగా నిలబడుము. ఆడుసింహమునకు కుందేలు ఆశపడునట్లు, నీవు నన్ను ఆశించి మరణము పొందెదవు" అని బెదరించెను. రావణునికి కోపము వచ్చెను. కాని మనస్సులో సీత పాదములకు నమస్కరించి ఆనందించెను. క్రోధముతో లంకేశ్వరుడు సీతను తన రథముమీద కూర్చుండబెట్టుకొని తొందరపడుచు ఆకాశ మార్గమున వెళ్ళుచుండెను. అంత దీనురాలైన సీత యిట్లు విలాపము చేయసాగెను. "ఓ రామా! నీవు నన్ను మరచితివి. నీకు నేనేమి అపకారము చేసితిని. శరణాగతరక్షకా! రఘుకులతిలకా! ఓ లక్ష్మణా! నీయందు దోషము లేదు. నేను నిన్ను నీచముగా తూలనాడితిని. ఆ ఫలము నిప్పుడు అనుభవించుచున్నాను. ప్రభువు చాలా దయకలవాడేకాని ఏమి చేయును? చాలా దూరమున ఉన్నాడు. ప్రభువునకు ఈ విపత్తును గూర్చి ఎవరు చెప్పెదరు? ఆహా! యజ్ఞప్రసాదమును గాడిద తినగోరుచున్నది.

అంత జటాయువు సీతాదేవి విలాపమును వినెను. ఆమె శ్రీరామచంద్రుని పత్నియనియు, నీచుడైన రాక్షసుడు బలవంతముగా సీతను తీసుకొని వెళ్ళుచున్నాడనియు గ్రహించెను. అంత జటాయువు సీత నుద్దేశించి "ఓ పుత్రీ! నేనున్నాను. భయపడకుము. ఈ రాక్షసుని సంహరించెదను" అని కోపముతో గగనమార్గమున రావణు నడ్డగించి "ఓరి దుష్టుడా! నిలువుము! నిలువుము! నీవు ఎక్కడికి వెళ్ళెదవు? నీపాలిటి యముడను నేను" అనెను. అంత రావణుడు, "వీడు మైనాకపర్వతమా! లేక సుమేరు పర్వతమా! లేక పక్షులకు రాజైన గరుడుడా! అయితే వారికి నా బలము సంగతి బాగా తెలియునే" అని తలంచుచుండెను. ఇంతలో జటాయువు దగ్గరకు రాగా రావణుడు గుర్తించి యిట్లనెను. "ఓరీ! ముదుసలీ! జటాయువా! నాచేతిలో తప్పక నీవు మరణించెదవు" అనగానే జటాయువు కోపముతో



నిట్లనెను. "ఓరీ! రావణా! నామాట విని జానకిని వదలి క్షేమముగా నింటికి వెళ్ళిపొమ్ము, లేనిచో శ్రీరామచంద్రుని క్రోధాగ్నిలో నీవూ నీ వారలూ భస్మమై పోవుదురు."

జటాయువు పలుకులకు రావణుడు సమాధాన మివ్వలేదు. జటాయువు కోపముతో రావణునిమీది కురికి తలను పట్టుకొని రథమునుండి భూమిమీద పడవేసెను. సీతను ఒకచోట కూర్చుండబెట్టి రావణుని శరీరము గోళ్ళతో ముక్కుతో రక్కి గాయపరచెను. ఒక్క గడియలో రావణుడు హతమారి పోయేవాడు. రావణుడు ఎట్లో తేరుకొని కోపగించి అత్యంత భయంకరమైన కరవాలముతో జటాయువు రెక్కలను నరికివేసెను. అంత జటాయువు రాముని స్మరించుచు భూమిపై పడిపోయెను. రావణుడు తిరిగి సీతను రథముమీద నెక్కించుకొని వెళ్ళిపోయెను.

సీతాదేవి వానివశములో పడియున్న పక్షివలె ఆకాశములో విలాపము చేయుచుండెను. ఒక పర్వతము పై కూర్చున్న కొందరు వానరులను చూచి సీత తన ఆభరణములను మూటగట్టి ఆ మూటను క్రిందపడవేసెను. ఈ విధముగా రావణుడు సీతాదేవిని తీసుకొనివెళ్ళి ఆశోకవనములోనుంచెను. ఆ రాక్షసుడు అనేకవిధముల భయపెట్టెను. ప్రేమచూపెను. కాని సీతాదేవి వానికి లొంగనందున ఆశోకవృక్షముక్రింద ఆమెను ఉంచెను. రామచంద్రుడు కపటమృగమువెంట ఏ విధముగా పరుగెత్తెనో ఆ దృశ్యమును సీత తన హృదయములో ఉంచుకొని రామనామమును స్మరించుచుండెను.

ఇక్కడ శ్రీరామచంద్రుడు లక్ష్మణుడు ఎదురు వచ్చుటచూచి మిగుల చింతించెను. ఆయన తన తమ్మునిగాంచి "సోదరా! నీవు జానకిని ఒంటరిగా వదలివచ్చితివి. నా ఆజ్ఞ నుల్లంఘించితివి. ఇచ్చట క్రూరులైన రాక్షసులు గుంపులు గుంపులుగా వనములో తిరుగుచున్నారు. సీత ఆశ్రమములో లేనట్లుగా నాకు తోచుచున్నది."అని పల్కెను.

లక్ష్మణుడు రామునిపాదములు పట్టుకొని "అన్నయ్యా! ఇందులో నా తప్పులేదు" అనెను. అంత వారు గోదావరీ తీర మందున్న తమ ఆశ్రమమునకు వెళ్ళిరి. ఆశ్రమమంతటను వెదకి ఎచ్చటను సీత కన్పింప లేదు. జానకీదేవి లేకపోవుట చూచి రామచంద్రుడు సాధారణ మానవుని వలె శోకించెను. లక్ష్మణుడు ఎంతగా నచ్చచెప్పినను శ్రీరాముడు ఊరటనందక లతలను, వృక్షములను చూచి "మీరు సీతను చూచినారా?" అని అడుగుచు విరహముతో పిచ్చివానివలె అరణ్యమంతయు తిరుగుచుండెను.

కొంత దూరము ముందుకు వెళ్ళిన తరువాత రాముడు భూమిమీదపడి భగవానుని స్మరించుచున్న జటాయువును చూచి తన హస్తములతో దాని శిరస్సును స్పృశించెను. ప్రభుదర్శనముచే, కరస్పర్శనముచే జటాయువు బాధ అంతయు నశించెను. అతడు ధైర్యముతో శ్రీరామునిజూచి ఇట్లనెను. "జననమరణముల భయమును హరింపచేయు శ్రీరామచంద్రా! నేను వాని నెదుర్కొంటినిగాని దుష్టుడైన రావణుడు నాకీ దుర్దశను కలిగించెను. అతడు జానకిని దక్షిణాదిశగా తీసుకొని వెళ్ళెను. సీతాదేవి విలాపము చేయుచుండెను. నేను మీ దర్శనము కొరకు ప్రాణములు నిల్పుకొని యున్నాను" అని చెప్పగా శ్రీరామచంద్రుడు నూరేండ్లు జీవించుమని పలికెను.

అంతట జటాయువు నవ్వుచు నిట్లనెను. "స్వామి! మరణసమయమున మీ నామమును స్మరించినచో అధముడైనను ముక్తిపొందునని వేదములు చెప్పుచున్నవి మీరు నా యెదుట నిలచియున్నారు. ఇప్పుడు ఏ లోటును పూర్తిచేసుకొనుటకు నేను బ్రతుకవలెనని" కన్నీరు విడుచుచుండెను. రామ చంద్రుడు 'జటాయూ! నీయొక్క శ్రేష్ఠ కర్మము వలన అనన్యసాధ్యమైన పుణ్యగతి పొందితివి, ఇతరులకు హితముచేయు వానికి జగత్తులో దుర్లభమయిన దేదియును లేదు' అని పల్కెను.

అంతట జటాయువు దేహమును వదలి శ్రీహరి రూపములో విలీనమైపోయెను. జటాయువు అపర కర్మలను శ్రీరామచంద్రుడు తన చేతితో



యథావిధిగా పూర్తిచేసెను. అల్పజీవియైన పక్షికి కూడ రామచంద్రుడు ముక్తినిచ్చెను. ఓ జనులారా! ఎవరు భగవానుని విడిచి విషయభోగ లాలసులగుదురో అట్టి వారు అదృష్టహీనులు.

రామలక్ష్మణులు సీతను వెదకుచు ముందుకుసాగిరి. అతి భయంకరమైన ఆ యరణ్యములో ఏనుగులు, సింహములు, శార్దూలములు, భల్లూకములు రకరకాల మృగములు పలువిధములైన పక్షులు నివసించుచుండెను. రామలక్ష్మణులు మార్గమున వచ్చుచుండగా కబంధుడనే రాక్షసుడు వారిని తన బాహువులలో బంధించెను. రామలక్ష్మణులు ఖడ్గముతో వాని కరములు ఖండించి వానిని సంహరించిరి. అప్పుడు వారితో కబంధుడిట్లనెను. "దుర్వాసముని శాపమువలన నాకీ వికారరూపము వచ్చెను, మీ దర్శనము వలన నాశాపము నశించెను. నాపూర్వరూపము నాకు ప్రాప్తించెను."

అంతట శ్రీరామచంద్రుడు లక్ష్మణసమేతుడై శబరిఆశ్రమునకు వచ్చెను. మాతంగముని తనతో చెప్పిన విషయము జ్ఞాపకమురాగా ఆమె చాల సంతోషపడెను. రాముని పాదములను ప్రేమతో పట్టివేసెను. ప్రేమ పారవశ్యము చేత నోటమాట రాక రాముని పాదములను కడిగి ఆయనను ఆసనము పై కూర్చుండ పెట్టెను. పిమ్మట కందమూల ఫలములను ముందుగా తాను రుచిచూచి మధురమైనవి ఏర్చిఏర్చి ఎంగిలి పండ్లను రామచంద్రుని కిచ్చెను. అంతట రామచంద్రుడు సందేహింపక ఆ ఫలములను భుజించెను. శబరి అనేకవిధముల ప్రభువును ప్రశంసించుచు "రామా! నేను చదువులేని మూర్ఖురాలను, నీచజాతి దానను, ఎట్లు మిమ్ములను స్తుతించగలను" అని పల్కెను. శబరిని జూచి శ్రీరామచంద్రుడు "ఓ భక్తులారా! నాకు భక్తియే ముఖ్యము. జాతితో, కులముతో సంబంధము లేదు. ధనము, కుటుంబము, విద్య ఇవన్నియు ఉన్నను భక్తిలేని మనుష్యులు జలములేని మేఘములు. భక్తి నవ విధము. దానిని గురించి చెప్పుచున్నాను.

వినుము, సత్పురుషుల సాంగత్యము, నా కథా ప్రసంగము మీద ప్రేమ, అహంకారము లేకుండుట, గురుసేవచేయుట, కపటస్వభావమును వదలి నా గుణములను గానము చేయుట, నా మంత్రమును జపించుట, నాపైన దృఢవిశ్వాసము, భోగములయందు వైరాగ్యము, నిరంతరము సత్పురుషుల ధర్మోపదేశములలో నిమగ్నమైయుండుట, జగత్తు నంతను సమభావముతో చూచుట, దొరికినదానితో తృప్తి చెందుట, స్వప్నములో కూడా పరుల దోషములను ఎంచకుండుట, సరళత్వము, అందరి పట్ల ప్రేమ, నాయందు అనురాగముతో కూడా ధైర్యముగా నుండుట, మోద ఖేదముల సమానముగా నెంచుట ఇవి భక్తుల లక్షణములు. ఎన్నియున్నను భక్తిలేని వాని జీవితము నీరులేని నది వలె నిరర్థకము. ఇవి అన్నియు నీయందు ఉన్నవి కాబట్టి నీ మీద నాకు ప్రేమ కలుగుచున్నది. అందుచే ఓ శబరీ! దుర్లభమైన నాలోకము నీకు సులభముగా లభించుగాక!" అని దీవించెను. తర్వాత "అమ్మా! జానకి ఎచ్చటనున్నది నీకు తెలియునా? అని అడిగెను శబరి "మీరు పంపా సరోవరమునకు వెళ్ళండి, అచ్చట సుగ్రీవునితో మైత్రి చేయండి, మీకు అన్ని సంగతులు తెలియగలవు." అని చెప్పుచు భగవాన్! మీకు అన్నియు తెలిసియు ఏమియు తెలియనట్లు నన్నడుగుచున్నారు." అని పలుకుచు శబరి ప్రభువుకు నమస్కరించి తదేక దృష్టితో శ్రీరాముని చూచుచు యోగాగ్నిలో తన దేహమును భస్మముచేసికొనెను. ఇట్లు శబరి దుర్లభమైన కైవల్యము పొందెను.

అంతట రామచంద్రుడు లక్ష్మణ సమేతుడై ఆ ప్రదేశమును వదలి ముందుకు వెళ్ళెను. సోదరులు మహాబలశాలురు, సింహముల వంటివారు ప్రభువు విరహవేదనతో నిషాదమునందుచు రక్తితో కూడిన కథలు చెప్పుచు లక్ష్మణునితో వెళ్ళుచుండెను.

''ఓ లక్ష్మణా! ఈ వనసౌందర్యము, చూడుము. పశుపక్షి సముదాయమంతయు తమతమ స్త్రీలతో కలిసియున్నవి. అవి నన్ను



నిందచేయు చున్నట్లు నాకు తోచుచున్నది. మునులకు కూడా కామ క్రోధ లోభములు కడు దుష్టమైనవి. క్షోభ కలగజేయునవి. లోభమునకు కోరిక. బలము, కామమునకు కామిని బలము, క్రోధమునకు కఠోర వాక్యములు బలమని పెద్దలు చెప్పియున్నారు.'' అని పలుకుచు రామచంద్రుడు ముందునకు పోవుచుండెను. ఇట్లు సంభాషించుచు నారు పంపా సరోవరమునకు చేరుకొనిరి. సత్పురుషుల హృదయము వలె అందలి జలము మిగుల నిర్మలముగా నుండెను. మనస్సుకు, ఆహ్లాదము కలిగించు నాలుగు ఘట్టములు నిర్మితమై యుండెను. అందు వివిధములైన జంతువులు, పక్షులు నీరు త్రాగుచుండెను. మాయచే కప్పబడిన నిర్గుణ పరబ్రహ్మము వలె తామరాకులచే నిండియుండుటచే సరస్సులోని జలము వెంటనే కంటికి కన్పింపకుండెను. రంగురంగుల కమలములు వికసించి సుందరముగా శోభించుచుండెను. తుమ్మెదలు మధుర మధురముగా ఝంకారము చేయుచుండెను. నీటికోళ్ళు, హంసలు, ప్రభువును చూచి అమితానందము పొందుచుండెను. అందమైన పక్షుల కిలకిలారానములు బాటసారులను పిలుచు చున్నవా యన్నట్లుండెను. ఆ సరోవర సమీపమున ఋషులు అనేక ఆశ్రమములు నిర్మించుకొని తపములు చేసుకొనుచుండిరి. శ్రీరామ లక్ష్మణులు స్నానము చేసి ఒక సుందర వృక్షచ్ఛాయలో సుఖాసీనులైరి వారు కందమూల ఫలముల నారగించిరి.

రాముని విరహవేదన తెలిసి నారదుని మనస్సు వికలమయ్యెను. "నా శాపమువలన శ్రీరాముడు అనేకవిధములుగా కష్టపడుచున్నాడు. ప్రభువును చూచి పరామర్శించవలెనని నారదమౌని వారివద్దకు వచ్చెను. ఆదరముతో క్షేమ సమాచారముల నడిగెను. రామచంద్రుని భక్తితో ప్రస్తుతించెను. అంతట రామచంద్రుడు నారదుని జూచి "ఓ నారదా! నా స్వభావము నీకు తెలియనిది కాదు. నాభక్తుల వద్ద నే నేమియు దాచను. నీవేల వచ్చితివి, నీకేమి కావలెనో అడుగు" మనెను. నారదుడు ప్రభువుకు నమస్కరించి "స్వామీ! ప్రభువునకు

అనేక నామములున్నవి. ఒకదాని కంటే మరొకటి గొప్పదని వేదములు చెప్పుచున్నవి. రామనామము అన్ని నామముల కంటె గొప్పదిగా నుండునట్లు నాకు వరమివ్వండి" అని అడిగెను.

ఇది విని శ్రీరాముడు సంతసించి "తథాస్తు" అనెను. అంతట నారదుడు ప్రభువుకు నమస్కరించి, నీవు మాయచే నన్ను మోహింప చేసితివి, నేను వివాహమాడుటకు సంకల్పించితిని, దానిని నీవెందుకు అడ్డు పెట్టి యుంటివి?" అని ప్రశ్నించెను. శ్రీరామచంద్రప్రభువు ఇట్లు బదులు చెప్పెను. "మునీశ్వరా! దాని రహస్యము చెప్పుచున్నాను వినుము. అన్ని వదలి నన్ను భజించిన యెడల వారిని అన్ని కాలములలోను, నేను కన్ను మూయక కాపాడుచుండెదను. కన్నతల్లి చిన్నబిడ్డను రక్షించు కొనునట్లు నేను నాభక్తులను సర్వదా రక్షించుచుందును. చిన్న పిల్లవాడు సర్పమును కాని అగ్నిని కాని పట్టుకొనును. అప్పుడు తల్లి వెంటనే పరుగెత్తు కొనివెళ్లి కాపాడును. వయస్సు వచ్చిన తర్వాత తల్లి ప్రేమించును. కాని వెనుకటి ప్రకారము వలె కాపాడుటకు వేగిరపాటు చూపదు. వయస్సు వచ్చినవాడు తనకు తానే కాపాడు కొనగలడు. కనుక పసిపాపను జాగ్రత్తగా కనిపెట్టి నట్లు అతనిని చూడదు. నిర్భయముగ నుండును. జ్ఞాని వయస్సువచ్చిన వానితో సమానము. తనను తాను రక్షించుకోగలడు భక్తుడు నాకు పసిపాప వంటివాడు. నా సేవకులకు నేనే బలము, కామ క్రోధ లోభ మోహములు అజ్ఞాన సంజనితములు. వానిలో మాయారూపిణి అయిన స్త్రీ అత్యంత దారుణ దుఃఖము నిచ్చునది. నాయందే ఆధారపడియున్న భక్తుల రక్షించు బాధ్యత నామీదనున్నది.

అన్ని అవగుణములకు మూలము స్త్రీ. బాధలు కల్గించే అగ్నిజ్వాల స్త్రీ. దుఃఖములకు నిలయము స్త్రీ. కనుకనే నీకు వివాహము జరుగకుండా అడ్డుపడితిని అని పల్కెను."



అంత నారదుడు "ఓ రఘువీరా! మహాత్ముల లక్షణములెట్టివో చెప్పండి" అని అడిగెను, రాముడు ఇట్లు చెప్పెను. "కామ, క్రోధ, మోహ, మద, లోభ మాత్సర్యములను జయించి అన్ని ఆశలు త్యజించి లోపల వెలుపల పవిత్రముగ నుండి మితాహారము సేవించుచు మంచిపనులు ఆచరించు వారే మహాత్ములు. సరళ స్వభావము కల్గి అందరిని ప్రేమించుచుందురు."

శ్రీరాముని మాటలు విని నారదమహర్షి భగవానునికి నమస్కరించి బ్రహ్మలోకమునకు వెళ్ళిపోయెను. ఈ చరిత్ర శ్రద్ధతో చదివినవారు భక్తితో విన్నవారు ఇహపర సౌఖ్యములు పొందెదరు.

**అరణ్యకాండ సంపూర్ణము**

* * *

# శ్రీ తులసీరామాయణము
## కిష్కింధాకాండము

రామలక్ష్మణులు సీతాదేవిని వెదకుచూ వెదకుచూ ఋశ్యమూక పర్వతము వద్దకు వచ్చిరి. ఆ పర్వతముపై మంత్రులతో మాటలాడుచున్న సుగ్రీవుడు బలాఢ్యులైన వారిని చూచి భయపడి హనుమంతుని గాంచి ఓ హనుమా! నీవు వారి వద్దకు వెళ్ళి వారెవరో తెలుసుకొని మనకు మిత్రులైతే యిచ్చటకు తీసుకొనిరమ్ము. లేక వాలి పంపిన గూఢచారులైతే అచ్చట నుండియేసైగ చేయుము: ఇచ్చట నుండియే మేము పారిపోయెదము" అని పలికెను. హనుమంతుడు బ్రాహ్మణవేషము ధరించి రామలక్ష్మణులను సమీపించి వారికి నమస్కరించి 'మహాత్ములారా! మీరెవరు? ఎచటనుండి వచ్చుచున్నారు? దుస్సహములైన యీ ఎండ వానలను సహించుచు కఠినమైన యీ నేలపై ఎందుకు తిరుగుచున్నారు? మీరు క్షత్రియుల వలె కన్పించుచున్నారు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో ఎవరు మీరు? లేక మీరిద్దరూ నరనారాయణులా? ప్రజలను భవసాగరము నుండి తరింపచేయుటకు భూభారమును హరించుటకై మానవరూపములో అవతరించిన భగవంతులా?' అని అడుగగా రాముడు ఈ విధముగా సమాధానము చెప్పెను. 'మేము కోసల రాజైన దశరథ మహారాజు పుత్రులము. ఇరువురము సోదరులము. తండ్రి అజ్ఞానుసారముగా వనమునకు వచ్చితిమి. మావెంట నా పత్నియు వచ్చియుండెను. మేము లేని సమయము కనిపెట్టి ఒక రాక్షసుడు ఆమెను అపహరించెను. మేము ఆమెను వెదకుచున్నాము. మాసంగతి చెప్పితిని, ఇక మీరెవరో తెలియజేయండి అని పల్కెను.'

అంత హనుమంతుడు అతడు తన ఇష్టదేవతయని గ్రహించిసాష్టాంగ దండప్రణామము చేసెను. తన్మయుడై కన్నీరు గార్చుచు 'స్వామీ! నేను మిమ్ములను తెలియక అడిగితిని. అట్లే మీరును నన్నడుగుచున్నారు. మీరు



తాపస వేషములో ఉండుట వలన నేను మిమ్ములను గుర్తించలేక పోతిని. అదియును గాక నేను వానరుడను. అజ్ఞానిని. మోహవశుడనై యున్నాను. ఓ దీనబంధూ! నన్ను రక్షించుము, రక్షించుము.' అని పలుకుచు తన నిజరూపముతో శ్రీరాముని పాదముల మీద పడెను.

అంతట రామచంద్రుడు హనుమంతుని ఆదరముతో లేవనెత్తి "నాయనా! దుఃఖింపకుము. నీవు లక్ష్మణుని కంటె నాకు ఎక్కువ ప్రియుడవు. అందరూ నన్ను సమదర్శనుడని అందురు. నాకు ప్రియులు, అప్రియులు అంటూ ఎవరునూ లేరు. కానీ నా భక్తుడు నామీదనే ఆధారపడి యుండును. కనుక వారికి నేనే సదా రక్షకుడను. నేను సేవకుడననే భావం ఎప్పుడూ ఎవరికి ఉండునో వారికి చరాచర జగత్తు సర్వమును భగవద్రూపంగానే కనపడుచుండును. నా అనన్యభక్తుల లక్షణమిది' అని పల్కెను.

స్వామి అనుకూల వాక్యములు విని హనుమంతుడు సంతసించి 'ఓ దేవా! ఈ పర్వతముపై వానరరాజు సుగ్రీవుడు నివసించుచున్నాడు. అతనితో మీరు స్నేహముచేయండి. అతడు వానరులను పంపించి మీ భార్యను ఎచ్చట నున్నను వెదకించి తీసుకొని వచ్చి మీకు అప్పగించగలడు' ఇట్లు చెప్పి హనుమంతుడు తన భుజములపై శ్రీరామలక్ష్మణులను కూర్చుండ బెట్టుకొని సుగ్రీవుని వద్దకు తీసికొని వచ్చెను.

సుగ్రీవుడు రామలక్ష్మణులను జూచి వినమ్రుడై నమస్కరించెను. వారి దర్శనమువలన తన జన్మ తరించినదని, తన కష్టములు తొలగునని అతడు మనస్సులో సంతోషించుచుండెను. అంత హనుమంతుడు ఉభయుల కష్ట సుఖములను వివరముగా చెప్పి మీరు స్నేహముతో నున్న యెడల ఉభయులకు క్షేమము కలుగునని చెప్పి వారిద్దరిచేత అగ్నిసాక్షిగా ప్రమాణములు చేయించెను.

పిమ్మట సుగ్రీవుడు 'నేను ఒకప్పుడు ఈ పర్వతముపై మంత్రులతో కూడి సంభాషించుచుండగా ఒక స్త్రీ ఒక మూటను క్రింద పడవేసెను.

నేనామూటను భద్రపరచితిని' అని చెప్పి ఆ మూటను తెచ్చి రామచంద్రుని ముందుంచెను. శ్రీరాము డా మూటను విప్పి అందలి ఆభరణములు సీతాదేవివని తెలుసుకొని మిగుల దుఃఖించెను.

అది చూచి సుగ్రీవుడు 'మీరు ఎంత మాత్రము దుఃఖించవలదు. జానకీదేవి ఎచ్చట నున్నను తెప్పించి మీకు అప్ప చెప్పగలను' అని దైర్యము చెప్పెను. ఆ మాట విని రాముడు ఆనందించి "ఓ సుగ్రీవా! నీవు ఈ పర్వతము మీద ఉండుటకు కారణమేమి?" అని అడుగగా సుగ్రీవుడు తన కథ యిట్లు చెప్పెను.

'శ్రీరామచంద్రా! వినండి. వాలి నేను సోదరులము, మా పరస్పర ప్రేమ యింతింతని చెప్పజాలను. ఇట్లుండగా ఒకనాడు మయుడనే రాక్షసుని పుత్రుడైన మాయావి అర్ధరాత్రి సమయమున మా నగరపు పొలిమేర వద్దకు వచ్చి "నన్ను గెలువగలవారు మీ నగరములో ఎవరైన వుంటే రండి" యని కేకలువేసెను. మా అన్నగారిది విని సహింపజాలక వాని యొద్దకు పరిగెత్తెను. అది చూచి నేనుకూడా వారివెంట వెళ్లి యుంటిని. ఆ రాక్షసుడు మా యిద్దరిని చూచి భయపడి పారిపోయెను. వానిని వదలక మేము వెంటాడితిమి. అంతట అతడు పరుగిడుచు పోయిపోయి ఒక పర్వత గుహలో జొరబడెను. అది చూచి మా అన్నగారు 'ఈ దుష్టుని వదలకూడదు. నీవు నాకొరకు పదునైదు రోజులవరకు ఈ గుహాముఖమున కాచి యుండుము. అప్పటికిని నేను రానియెడల నేను మరణించితినని తలంచి నీవు నగరమునకు వెళ్లుము' అని నాతో చెప్పి ఆ పర్వతగుహలో జొరబడెను.

రామచంద్రా! అన్నగారు చెప్పినట్లు నేను పదునైదురోజులే గాక నెలరోజులు అన్నరాకకై ఎదురు చూచితిని. ఆ గుహనుండి వెలుపలకు రక్తము ప్రవహించుచుండెను. అది చూచి మా అన్నగారిని ఆ రాక్షసుడు చంపి యుండునని ఊహించి వాడు వచ్చినచో నన్నుకూడా చంపునని



భయపడి ఆ గుహకు ఒక పెద్ద బండరాయిని అడ్డము పెట్టి నేను నగరమునకు వచ్చివేసితిని.

జరిగిన సంగతి అంతయు మంత్రులకు, నగరవాసులకు చెప్పితిని. అది విని వారు వాలి మరణమునకు చింతిల్లి నగరమునకు రాజులేనియెడల కీడు కలుగునని భావించి నేను వలదన్నను నన్ను కిష్కింధా నగరమునకు రాజుగా చేసిరి.

కొలది దినముల తర్వాత మా అన్నగారు వాలి రాక్షసుని సంహరించి నగరమునకు వచ్చెను. నేను రాజుగా సింహాసన మెక్కి ఉండుటను చూచి ఆయన మండిపడెను. నేను రాజు కావలెనను దుర్బుద్ధితో గుహకు రాతిని అడ్డముగా వేసి వచ్చి సింహాసనముపై రాజునై కూర్చుంటినని తలంచెను. నేను ఎంతగా చెప్పిననూ నామాట నమ్మక నా సర్వస్వమును, నా భార్యను అపహరించి నన్ను నగరమునుండి వెళ్లగొట్టెను.

అప్పటి నుండి నేను నిస్సహాయుడనై లోకమంతా తిరుగుచున్నాను. శాపవశమున వాలి ఈ పర్వతముపైకి రాజాలడు. కనుక ఈ పర్వతము మీద ఉన్నాను" అని చెప్పెను. రామచంద్రుడు సుగ్రీవుని దుఃఖమును చూచి వ్యాకులత చెంది ఉగ్రుడై "ఓ సుగ్రీవా! నీ అన్న ఎంత బలవంతుడైనను ఒక్క బాణముతోనే నేను వానిని సంహరించెదను. బ్రహ్మ, రుద్రుడు అడ్డుపడినను వానిని రక్షింపజాలరు"అని పలికి పవిత్రమైన మిత్ర ధర్మమును ఇట్లు వివరించెను.

"మిత్రుడైనవాడు తన మిత్రుల కష్టములను తనవిగా భావించి వారికి సహాయపడవలెను. మిత్రుని దుఃఖమును చూచి ఎవడు దుఃఖింపడో వాడు పాపాత్ముడు. తన దుఃఖమెంత పెద్దదైనను స్వల్పముగానే భావించవలెను. మిత్రుని ఎదుట పొగడి వాని వెనుక విమర్శించు వాని స్నేహమును విడిచిపెట్టవలెను" శ్రీరాముని వాక్యములు విని సుగ్రీవుడు "ఓ రామచంద్రా!

వాలి మీ రనుకున్నంత బలహీనుడు కాడు. అతడు మహాబలవంతుడు, సాహసవంతుడు. రణధీరుడు" అని పలికి వాలి జయించిన దుందుభి యను రాక్షసుని అస్థిపంజరమును ఆ సమీపమందున్న ఏడు తాటిచెట్లను రామునకు చూపించెను. రాముడు చిరునవ్వునవ్వి తన కాలి బొటనవ్రేలితో దుందుభి యస్థిపంజరమును తన్నగా అది ఎగిరిపోయి కొన్ని యోజనముల దూరములో పోయిపడెను. అనంతరము శ్రీరామచంద్రుడు వింటనారి సంధించి ఒకేఒక బాణముతో ఆ సప్త తాళవృక్షములను ఒక్క మాటుగా పడగొట్టెను. అనంతమైన రాముని బలమును సుగ్రీవుడు గుర్తించి సంతోషించెను. అతనికి రాముడు వాలిని తప్పక సంహరింపగలడని దృఢ విశ్వాసము కుదిరెను.

సుగ్రీవునకు నమ్మకము కలుగగానే అతడు శ్రీరామునితో ఇట్లు పలికెను. "ఓ రామచంద్రా! మీ దర్శనము వలన నామనస్సు కుదుటపడెను నా సుఖము, సంపత్తి, పరివారము అన్నిటిని విడిచి మీ పాదసేవ చేసెదను. దుఃఖమును నశింపచేసే మిమ్ములను దర్శింప గల మహాభాగ్యము నా సోదరుని మూలముగా నేడు నాకు లభించినది. కాన అతడు నాకు శత్రువయ్యును అప్పుడే అయ్యెను లోకములో శత్రు మిత్రులు, సుఖ దుఃఖములు అంతా మాయా కల్పితములు; వాస్తవములు కావు. సర్వమును విడిచి నిత్యము మిమ్ములనే నేను భజించునట్లు నన్ను ఆశీర్వదించండి."

సుగ్రీవుని క్షణిక వైరాగ్యమును చూచి రాముడు చిరునవ్వు నవ్వి యిట్లనెను. "ఓ సుగ్రీవా! నీవు చెప్పినది నిజమే కాని నా వాక్యములు వృథాకావు. వాలి తప్పక మరణించును. నీవు రాజు వగుదువు."

అనంతరము రాముడు ఆయుధములను ధరించి వాలితో పోరాడుటకై సుగ్రీవుని ప్రోత్సహించెను. అంత సుగ్రీవుడు రాముని ఆశీర్వాదము పొంది వాలి సమ్ముఖమునకు వెళ్ళి గర్జించెను. అతని కేకలు విని వాలి మిక్కిలి కోపముతో పరుగెత్తి వచ్చుచుండగా అతని భార్య తార అడ్డువచ్చి "మీరిపుడు



పోరాడుటకు వెళ్ల కండి. అయోధ్యా రాజకుమారులైన రామలక్ష్మణుల అండచూచుకొని ఇదివరలో మీతో పోరి పారిపోయిన సుగ్రీవుడు మీ పైకి యుద్ధమునకు వచ్చియున్నాడు. వారు చాలా బలశాలురు. యముని నైనను జయించగలరు" అని హితవు చెప్పెను.

అప్పుడు మహాబలశాలియైన వాలి తారను చూచి "ఓ ప్రియులారా! శ్రీరాముడు బలశాలి అయినచో నేను బలహీనుడనా? ఇంతవరకు అనేక యోధానుయోధులను యుద్ధములో హతమార్చితిని. నీవు ఎందుకు భయపడెదవు? శ్రీరామచంద్రుడు సమదర్శనుడు. నేను ఏమి కీడు చేసితినని ఆ రాముడు నన్ను చంపును? నేను ఒకవేళ వాని చేతిలో మరణించిన యెడల కైవల్యము పొందెదను అని చెప్పి వానరవీరుడైన వాలి భార్య మాటను ధిక్కరించి అహంకారముతో బయలుదేరెను.

వాలి సుగ్రీవులు హోరాహోరిగా పోరాడుచుండిరి. కాని వాలి బలమైన దెబ్బలకు సుగ్రీవుడు తాళజాలక రాముని వద్దకు పరుగెత్తుకొనివచ్చి "దేవా! మొదటనే నేను మీకు చెప్పలేదా? వాలి నా అన్న కాదు నా పాలిటి కాలయముడు" అని వాపోయెను.

అంతట రాముడు సుగ్రీవుని శరీరమును స్పృశించెను. వాని బాధలు పోయి శరీరము వజ్రము వలె కఠినమయ్యెను. "సుగ్రీవా! మీరిద్దరూ ఒకే రూపముతో ఉండినందున ఎవ రెవరో గుర్తింపలేక నేను బాణమును వేయలేదు" అని వానిని ఓదార్చెను. ఈ పర్యాయము శ్రీరాముడు సుగ్రీవుని కంఠమున జయమాల వేసి ఆశీర్వదించి యుద్ధమునకు పంపెను. సోదరు లిద్దరూ ఘోరముగా పోరాడుచుండిరి అది చూచి రాముడు చెట్టుచాటున ఉండి వాలి వక్షఃస్థలమునకు గురిపెట్టి బాణము ప్రయోగించెను. అది తగులగనే అతడు అమిత వ్యాకులపడుచు భూమిపై పడిపోయెను. శ్రీరాముడు ముందుకురాగా చూచి వాలి ఎట్లో లేచి కూర్చుండెను. శ్యామల శరీరి, ధనుర్ధారి అయిన భగవానుని మాటిమాటికి ధ్యానించుచు స్వామి

పాదపద్మములలో తన మనస్సును లగ్నముచేసెను. ప్రభువును గుర్తించి తన జన్మ చరితార్థమైనదని తలంచెను. అతని హృదయంలో ప్రేమ యున్నను పైకి కఠోరముగా నిట్లు పలికెను.

“ఓ మహాత్మా! ధర్మ రక్షణార్థమై మీరు భూలోకములో అవతరించిన పుణ్యమూర్తులు. కొని నన్ను కిరాతునివలె చెట్టుచాటున నుండి చంపితిరి. నేను మీకు ఏమి అపరాధము చేసితిని? నేను మీకు విరోధినా? సుగ్రీవుడు మీకు చుట్టమా?” అని వాలి అనెను.

అంత రామచంద్రుడు వాలిని చూచి “ఓయీ! మూర్ఖుడా! సోదరుని భార్య, చెల్లెలు, కోడలు, కూతురు ఈ నలుగురు సమానులు. వారిని ఎవరు చెడుదృష్టితో చూచెదరో వారిని చంపినను పాపము లేదు. నీవు నీ సోదరుని భార్యను చేపట్టితివి, సుగ్రీవుని వెడలగొట్టితివి. నీవు నీ భార్య చెప్పినను వినిపించుకొనక అహంకారివై నన్ను సుగ్రీవుడు ఆశ్రయించెనని తెలిసి కూడా నిరపరాధియగు సుగ్రీవుని చంపదలచితివి” అనెను.

అంత వాలి “ఓ మహాత్మా! ఇక నీముందు నా చాతుర్యము పనికిరాదు. అంత్యకాలములో మీ బాణముతో మోక్షము ప్రాప్తించనుండగా మిమ్ముల నెదిరించి నేనెందుకు పాపాత్ముడను కావలెను” అనెను. వాలి పలికిన వినయ వాక్యములు విని శ్రీరామచంద్రుడు వాని శిరస్సును స్పృశించి “ఓ వాలీ! నీకు శరీరమును ఇచ్చెదను, ప్రాణము ప్రసాదించెదను” అని చెప్పగా వాలి యిట్లనెను.

“ఓ జగన్నాయకా! మునులు, ఋషులు, జప, తపోహోమములు చేసినను అంత్యకాలమున మీ నామస్మరణ చేయగలుగుట చాల కష్టము. మీ నామ ప్రభావము వలన కాశీక్షేత్రములో ఈశ్వరుడు అందరికి ముక్తిని కలుగజేయుచున్నాడు. అట్టి మీరు నా యెదుట నిలిచియున్నారు. ఇట్టి సదవకాశము మరల నాకు ఎన్నడైనా కలుగునా? అస్థిరమైన యీ శరీరము నాకెందులకు? ఎన్నిజన్మలలో నైనను మీ పాదభక్తి కలిగియుండునట్లు వరము



దయచేయండి. నా పుత్రుడు అంగదుడు బలములో, వినయములో నాయంతటివాడు, అతనిని తమ దాసునిగా స్వీకరించండి” అని పలుకుచు వాలి శ్రీరామచంద్రుని తదేక దృష్టితో చూచుచు సులభముగ తన ప్రాణము వదలెను. అతనికి భగవానుడు పరమ పదమును ప్రసాదించెను.

వాలి మరణవార్తవిని నగరములోని వారందరు శోకించుచు పరుగెత్తికొని వచ్చిరి. తార మిగుల దుఃఖించుట చూచి శ్రీరాముడు ఆమెకు ఇట్లు జ్ఞానోపదేశము చేసెను. “ఓ పతివ్రతా శిరోమణీ! ఈ శరీరము పంచభూతములతో ఏర్పడినది. అది నీయెదుటనే నేలమీదపడి నిద్రించు చున్నది. జీవుడు మరణించువాడు కాడు. కాబట్టి నీవు ఎవరికొరకు దుఃఖించుచున్నావు?”

అది వినగానే ఆమెకు జ్ఞానోదయము కలిగి భగవంతుని పాదముల యందు గాఢభక్తిని అనుగ్రహింపుమని వర మడిగి వెళ్ళిపోయెను. రామచంద్రుని ఆజ్ఞానుసారము సుగ్రీవుడు వాలికి అంత్యక్రియలు చేసెను.

శ్రీరామచంద్రుడు లక్ష్మణుని పిలిచి నీవు కిష్కింధకు వెళ్లి సుగ్రీవుని రాజుగను, అంగదుని యువరాజుగను పట్టాభిషిక్తులను చేసిరమ్ము” అని చెప్పగా అది విని లక్ష్మణుడు రామునికి నమస్కరించి నగరమునకు వెళ్ళి వానరులను పిలిపించి వారియెదుట సుగ్రీవుని వానర రాజ్యమునకు పట్టాభి షిక్తుని చేసి అంగదుని యువరాజుగా చేసెను.

‘ఓ పార్వతీ! రామచంద్రునివలె హితము కలిగించువాడు మరొకడు లేడు. ఎందుకనగా ఎప్పటినుండియో సుగ్రీవుడు వాలివలన బాధపడు చుండెను. అట్టి వానికి రామచంద్రుడు రాజ్యము నిచ్చి సుఖము కలుగజేసెను.

‘ఓ సుగ్రీవా! నేను తండ్రి అజ్ఞానుసారముగా పదునాలుగేండ్ల పర్యంతము పల్లెలకు, పట్టణములకు వచ్చుటకు వీలులేదు. కనుక నేను ఈ పర్వతగుహలో ఉండెదను. గ్రీష్మఋతువు గడచెను. వర్షాకాలము వచ్చెను. శరదృతువులోగాని ప్రయాణమునకు వీలులేదు. కనుక అంత వరకు

అంగదునితో కలిసి రాజ్యము పాలించుము నీ సుఖ భోగములలో నాపనిని మాత్రము మరువవద్దు' అని శ్రీరాముడు సుగ్రీవుని హెచ్చరించి పంపెను.

వానరు లందరు కిష్కింధానగరమునకు వెళ్ళిపోయిరి. ఆ కొండ గుహలో రామచంద్రుడు నివసించగలడని ముందుగానే నిశ్చయిమయ్యెను దేవతలు ఆ గుహను అందముగా అలంకరించిరి. రామలక్ష్మణులు ప్రవర్షణ పర్వతగుహలో నివసించుచుండిరి. వనములో రామచంద్రుడు నివసించు నప్పటినుండి ఫలపుష్పములతో ఆ వనము మిగుల శోభిల్లుచుండెను. శ్రీరామ చంద్రుడు లక్ష్మణునకు భక్తి, జ్ఞాన, వైరాగ్య కథలను చెప్పుచుండెను. వర్షాకాలమున ఆకాశమున మేఘములు గర్జించుచుండెను. రామచంద్రుడు లక్ష్మణునితో నిట్లనెను. ''ఓ లక్ష్మణా! మేఘములను చూచి నెమిళ్ళు సంతోషముతో నాట్యము చేయుచున్నవి చూడుము! సర్వనదులు సముద్ర ములో చేరి స్తిమితపడినట్లు జీవులు భగవంతునితో చేరి సుస్థిరులై యుండెదరు."

"ఓ లక్ష్మణా! వర్షఋతువు గడచెను. శరదృతువు వచ్చెను. కానీ సీతాదేవి యెచ్చటనున్నది.? జాడతెలియదు. ఆమె ఎచ్చట నున్నది? నాకు జాడ తెలిసినచో యమునినైనను ఎదిరించి తీసికొని రాగలను. నావలన సుగ్రీవుడు రాజ్యమును, భార్యను, ఐశ్వర్యమును పొందియు నా కార్యము మరచి పోయెను. వాలిని చంపిన బాణము నావద్దనే యున్నదని మరచి పోయెనేమో?" అనెను.

ఆ మాటలు విని లక్ష్మణుడు ఆయుధములు ధరించి అమిత కోపముతో కిష్కింధకు బయలుదేరెను. కోపముతో లక్ష్మణుడు బయలుదేరుటనుచూచి రాముడు "నాయనా! సుగ్రీవుడు మనకు మిత్రుడు. తొందరపడి వానిని చంపవద్దు. అతడు లేనిచో మన కార్యము చెడిపోవును" అని పలికెను.

లక్ష్మణుడు నగరమునకు వెళ్ళెను. వానరు లతని కోపోద్రేకమును చూచి భయపడి పారిపోయిరి. అతడు కోపముతో ఈ నగరమును భస్మము చేసెదనని కేకలు వేయుచుండెను.



ఇచ్చట సుగ్రీవుడు విషయ భోగములలో పడి శ్రీరాముని కార్యమును మరచిపోయెను. అంతట హనుమంతుడు సుగ్రీవుని వద్దకు వెళ్ళి మీరు ప్రభువు కార్యమును మరచితిరి. అందువల్ల ప్రమాదము కల్గును" అని వినయముగా చెప్పెను. అది విని సుగ్రీవుడు "ఓ హనుమా! మన వారలు ఏయే వనములలో నున్నారో వారివద్దకు మన దూతలను పంపించి పదునైదు దినములలో తప్పక రావలెనని నా ఆజ్ఞగా చెప్పుము. అట్లు రానిచో వారి నందరిని వధించెదనని చెప్పి పంపుము" అనిపలికెను. రాజాజ్ఞ ప్రకారము హనుమంతుడు దూతలను పంపెను.

లక్ష్మణుని కేకలు విని సుగ్రీవుడు భయపడి యిప్పుడు వానియెదుటకు వెళ్ళుట మంచిదికాదని తలచి అంగదుని పంపెను. అతడు లక్ష్మణునికి నమస్కరించి వానరసేన కొఱకు ఇదివరకే దూతలను పంపించి యుంటిమి అని విన్నవించగా లక్ష్మణుడు శాంతించి సంతోషించెను. తర్వాత సుగ్రీవుడు వచ్చి లక్ష్మణునికి నమస్కరించగా అతనిని ఆదరించి కౌగిలించు కొనెను.

లక్ష్మణుడు, సుగ్రీవుడు మున్నగు వానరయోధులను శ్రీరాముని వద్దకు తీసికొనివెళ్లెను.

సుగ్రీవుడు శ్రీరామునకు నమస్కరించి 'ఓ ప్రభువా! మీ మాయ అత్యంత ప్రబలమైనది. దానిని ఎవరును దాటలేరు. మీ కృపయున్నగాని ఆ మాయను తెలియలేరు. స్త్రీల వాలుచూపులకు ఎవరు లొంగరో, ఎవరు క్రోధాగ్నికి మండిపడరో, లోభానికి ఎవరు తల ఒగ్గరో వారు మీ దయకు పాత్రులగుదురు. సాధనమువలన, అదృష్టమువలన ఏ కొద్దిమందికో ఆ స్థితి ప్రాప్తించగలదు' అని పలికెను.

ఆ మాటలు విని శ్రీరామచంద్రుడు "సుగ్రీవా! నీవు నాకు భరతుని వంటి సోదరుడవు. సీత యెచ్చటనున్నది తెలుసుకొనుము''. అని చెప్పుచుండగా వానరసైన్యము గుంపులు గుంపులుగా వచ్చి, సుగ్రీవునకు నమస్కరించి శ్రీరామునకు పాదాభివందనము చేయుచుండిరి. ఆ అపార సైన్యములలో ప్రతి ఒక్కని క్షేమసమాచారములు రామచంద్రుడు తెలిసికొనెను.

వానరరాజు సుగ్రీవుడు వానరసైన్యముతో "ఇది రామచంద్రుని కార్యము. నా అనుజ్ఞ. మీరందరును నాలుగు దిశలకు వెళ్ళి జానకీదేవిని వెదకండి మాసమురోజులలో తిరిగివచ్చి నాకు ఏ సంగతి వచ్చి చెప్పండి. ఇది నా శాసనము. దీనిని అతిక్రమించిన వారికి మరణమే శరణము" అని చెప్పగా వానరవీరులు అన్ని వైపులకు సీతాన్వేషణార్థమై పరుగెత్తుకొని వెళ్ళిరి.

తదుపరి అంగదుడు, జాంబవంతుడు, హనుమంతుడు, నలుడు, నీలుడు మొదలగు వానర ప్రముఖులను పిలిచి సుగ్రీవుడు "యోధులారా! మీరందరూ దక్షిణదిశగా వెళ్లి ఎన్ని కష్టములుపడియైనను జానకీదేవి జాడ తెలిసికొని రావలెను" అని ఆజ్ఞాపించెను. చివరకు హనుమంతుడు రామునితో పాటు అందరికిని నమస్కరించెను అతడు తన కార్యము నెరవేర్చగలడని తలచి శ్రీరామచంద్రుడు అతనికి తన వ్రేలి యుంగరము నీయగా అతడు దానిని తీసికొని తన జన్మ చరితార్థమైనదని తలచి రాముని స్మరించుచు బయలుదేరెను.

తదుపరి వానరవీరులు పట్టణములు, పల్లెలు, అడవులు, గుట్టలు, లోయలు పెద్ద పెద్ద పర్వతములు వెదకుచు పోవుచుండిరి. ఎచ్చటనైనను మునులు కనబడినయెడల జానికి జాడ గూర్చి అడుగుచు వెళ్ళుచుండిరి.

ఇట్లు వానరు లందరు తిరుగుచుండగా వారికి అమితముగా దాహమయ్యెను. వారెంతగా వెదకినను నీరు కనిపించలేదు. నీరులేనిచో తన వారు మరణించగలరని హనుమంతుడు తలచి ఒక పర్వతశిఖరముపై నెక్కి నలుదిశలు పరికించిచూచెను. ఒకచోట భూమిలోపలగా నున్న ఒక గుహ కనిపించెను. హంసలు, గ్రద్దలు, కాకులు ఎగురుచుండెను. అనేక పక్షులు లోనికివెళ్ళి వచ్చుచుండెను. అది చూచి అచ్చట వీరు ఉండవచ్చునని ఊహించి హనుమంతుడు వానరుల దగ్గరకు వెళ్లి వారికి ఆ గుహను చూపించెను, హనుమంతుని ముందుంచుకొని వానరులు అందరూ



గుహలోనికి పోయిరి. అందులో ఒక యుద్యానవనము కలదు. దానిలో ఒక తటాకము. అందొక అందమైన దేవాలయము, ఆ ఆలయములో తపస్విని యైన ఒక స్త్రీ కూర్చొనియుండెను. వానరు లందరు ఆమెకు నమస్కరించిరి. వారు వచ్చిన కారణమును ఆమె అడుగగా, వారు కథ అంతా విన్నవించిరి. అంతట ఆమె "మీరు మధురమైన పండ్లు, ఫలములు భుజించండి" అని చెప్పగా వారట్లే చేసిరి. వారు నీరు త్రాగి దప్పిక తీర్చుకొనిరి. ఆమె వారికి ఇట్లు చెప్పెను.

"నేను శ్రీరామభక్తురాలను. మీరు రామునికార్యముకొరకు తిరుగుచున్నారు. మీ పని తప్పక నెఱవేరును. నేను రామునివద్దకు వెళ్ళుచున్నాను. ఇచ్చట నుండి మీరు కండ్లు మూసుకొని శ్రీరాముని ధ్యానించండి. మీరు సునాయాసంగా గుహను విడిచి వెలుపలకు వెళ్లగలరు. మీరు సీత జాడ తప్పక తెలిసికొనగలరు నిరాశపడకండి."

కండ్లుమూసి తెరువగనే సముద్రతీరమున వారు నిలబడియున్నట్లు గ్రహించిరి అంత అంగదుడు మిక్కిలి దుఃఖముతో ఇట్లనెను.

"ఇంతవరకు సీతజాడ తెలియలేదు. సుగ్రీవుని గడువు పూర్తి గావచ్చినది, ఆమె జాడ తెలియకుండా వెళ్లినయెడల రామచంద్రుడు మనలను క్షమించినను సుగ్రీవుడు వధించక మానడు. మా తండ్రి వధింపబడిన నాడే నన్ను అతడు చంపియుండేవాడు. మా తండ్రికి వలెనే నాకు కూడా అకాల మరణము కలిగి యుండెడిది. కాని శ్రీరాముడే నన్ను రక్షించెను. ఇందు సుగ్రీవుని దయ ఏ మాత్రమును లేదు. ఇప్పుడు మరణము తప్పదు. సందేహము లేదు' అని అంగదుడు మాటిమాటికి చెప్పుచు దుఃఖపడుచుండెను. వానరయోధులు అంగదుని మాటలు వినుచుండిరి. కాని మరల మాట్లాడ లేకపోవుచుండిరి. ఒక క్షణముసేపు అందరూ ఆలోచనలో మగ్నులైయుండిరి. కొంతసేపైన పిమ్మట వానరులందరు అంగదునితో నిట్లనిరి. 'అంగదా! సీతమ్మ జాడతెలుసుకొనకుండా మనము

తిరిగి వెళ్లుట అసంభవము' అని చెప్పి లవణసాగరము ఒడ్డుకువెళ్లి అచ్చట దర్భలు పరచుకొని కూర్చుండిరి.

జాంబవంతుడు అంగదుని దుఃఖము చూచి అతనిని ఓదార్చెను. ఉపదేశములతో కూడిన అనేక కథలు చెప్పెను. "ఓ యువరాజా! శ్రీరాముని మానవునిగా తలచుచున్నావా? అతడు పరబ్రహ్మస్వరూపుడు, అజేయుడు, అమేయుడు, సగుణ బ్రహ్మమైన శ్రీరాముని యందు ప్రీతి వలన మన మెల్ల రము అదృష్టవంతులము. గో బ్రాహ్మణ, దేవతా సంరక్షణము కొరకు ప్రభువు అవతరించును. సగుణోపాసకులు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములైన మోక్షములను విడిచి వారి సేవలోనే నిమగ్నులైయుందురు."

ఈ మాటలు పర్వతగుహలో నున్న సంపాతి వినెను, అతడు వెలుపలకు వచ్చి వానరులను చూచెను. "నాకు చాలా రోజులనుండి ఆహారము లేదు. నేను ఇల్లు కదలకుండగానే విధాత ఒకేసారి చాలా ఆహారము పంపించెను." అని పలికెను. ఆ మాటలు విని ఏ విధముగానైనా యిప్పుడు మనకు మరణం తప్పదు అని వానరులు భయపడసాగిరి. జాంబవంతుడు ఆలోచనలో పడెను.

అప్పుడు అంగదుడు "జటాయువు వంటి అదృష్టవంతుడు మరొకడు లేడు. శ్రీరాముని కార్యము కొరకు తన ప్రాణము విడిచి పరంధామము చేపట్టెను." అని వచించెను.

హర్ష, శోకములతో కూడిన ఆ పలుకులు విని సంపాతి మెల్లగా వానరుల వద్దకు వచ్చెను. వానరు లా పక్షీంద్రుని చూచి భయపడసాగిరి. సంపాతి వారికి అభయమిచ్చి, జటాయువు సంగతి అడిగెను. అప్పుడు కథ అంతయు వారు వినిపించిరి. తన ప్రియసోదరుడైన జటాయువు మరణవార్త విని సంపాతి అనేక విధముల శోకించి రఘునాథుని మహిమను వర్ణించెను. ఆయన వానరులతో మీరు నన్ను సముద్రపు ఒడ్డునకు తీసుకొని వెళ్లండి. నేను నాసోదరుడైన జటాయువునకు శ్రద్ధాంజలి ఘటించెదను.



ఈ ఉపకారానికి ప్రత్యుపకారముగా సీతమ్మ ఎచ్చటనున్నది మీకు తెలిపెదను" అనెను. అంతట వానరవీరులు పక్షి సంపాతిని సముద్ర తీరమునకు మోసుకొనిపోయిరి. సంపాతి స్నానము చేసి తమ్ముడైన జటాయువునకు తిలాంజలి యిచ్చి తన కథ యిట్లు చెప్పసాగెను. "అయ్యలారా! వినండి. మే మిద్దరము సోదరులము. మేము మంచి యౌవనములో నున్నప్పుడు ఒక పర్యాయము సూర్యుని చెంత కెవరుముందు చేరగలరో అని పందెము పెట్టుకొని పైకి ఎగిరితిమి. అట్లు చాల పైకి ఎగురుచుంటిమి. జటాయువు సూర్యకిరణముల వేడికి తాళజాలక క్రిందికి దిగిపోయెను. కాని నేను గర్విష్ఠిని కనుక భయపడక సూర్యుని సమీపమునకు వెళ్ళిపోతిని. సూర్యుని వేడిమికి నా రెక్కలు కాలి భస్మమైపోయెను. నేను అరచుచు తీక్ష్ణమైన కిరణములకు గిలగిల కొట్టుకొనుచు భూమిమీద పడిపోతిని. నా దీనావస్థను చూచి అచ్చట నున్న చంద్రుడను మునికి దయగల్గెను. ఆయన నాకు జ్ఞానోదయము చేసెను. దేహసంబంధమైన అహంకారమును పోగొట్టెను. తదుపరి ఆ మహామహుడు నాతో "త్రేతాయుగములో సాక్షాత్ శ్రీమన్నారాయణమూర్తి మానవుడుగా అవతరించును. వారి సతీమణిని రాక్షసుల రాజు అపహరించును. వారిని దర్శించగానే నీకు రెక్కలు మొలచును. వారికి నీవు సీతమ్మ ఉన్న తావు తెలుపుము" అని చెప్పెను. ఆ మహాముని చెప్పిన మాటలు ఇప్పుడు నిజమయ్యెను. ఇప్పుడు నాకు రెక్కలు వచ్చినవి. ఇక మీరు ప్రభు కార్యమును నిర్వర్తించ వచ్చును."

"ఇక సీతాదేవి సంగతి వినండి. త్రికూట పర్వతము మీద లంకా నగరము గలదు. దానిని రావణుడు పరిపాలించుచున్నాడు. ఆ నగరమున అశోకవనము గలదు. అందులో సీతాదేవి ఉన్నది. ఆమె చాలా విచారముతో నున్నది. నా కన్నుల కామెరూపము కనబడుచున్నది. కాని మీరు చూడలేరు. గ్రద్దలు చాల దూరమువరకు దృష్టిని సారించి చూడ గలవు. నాకు ఇప్పుడు వృద్ధాప్యము వచ్చినది. మీకు నేను సాయపడజాలను? నూఱు యోజనముల వెడల్పు గల సముద్రము మీలో ఎవరు దాటగలరో వారు సీతమ్మను

చూడగలరు. ఇట్లు చెప్పితినని మీరు నిరాశ పడకండి. నన్ను చూచి ధైర్యము తెచ్చుకొనండి శ్రీరాముని కృపవలన రెక్కలులేని నాకు రెక్కలు వచ్చినవి. పాపాత్ములు కూడా ఆ రామనామాన్ని స్మరించి భవసముద్రమును దాటగలరు. మీరు రాముల వారి దూతలు. కనుక పిరికి తనము వదలి శ్రీరాముని కార్యమును తలచి ధైర్యము తెచ్చుకొనండి."

ఈ విధముగా చెప్పి సంపాతి వెళ్లిపోయెను. అప్పుడు వానరులు ఆశ్చర్యపడిరి. వారిలో వారు తమతమ బలమును చెప్పుకొనుచుండిరి. కాని సముద్రమును దాటుటకు అందరు సందేహించుచుండిరి. అంతట జాంబవంతుడు "నేను ఇప్పుడు ముసలివాడినైతిని. శరీరములో మొదట నున్న బలములో లేశ మాత్రమైనను లేదు. ఖర రాక్షసునకు శత్రువైన శ్రీరాముడు వామనుడుగా అవతరించి నప్పుడు నేను వయస్సులో నుంటిని. అప్పుడు మంచి బలశాలిని. బలిని బంధించినప్పుడు ప్రభువు వర్ణింప సాధ్యపడనంతగా తన శరీరమును పెంచెను. కాని నేను రెండు గడియలలో పరుగెత్తు కొని వెళ్ళి విశాలమైన ఆ శరీరము చుట్టు ఏడుసార్లు ప్రదక్షిణము చేసి యుంటిని. కాని యిప్పుడా బలము నాకు లేదు" అని చెప్పెను. ఆ వాక్యములు విని అంగదుడు నేను శతయోజన విస్తీర్ణమైన సముద్రమును దాటి వెళ్లగలను. కాని తిరిగి రాగలనో లేదో" అని సందేహమును వ్యక్తము చేసెను.

"నీవు యువరాజువు. మా అందరకు నాయకుడవు. నిన్నెట్లు పంపగలము" అని జాంబవంతుడు అనెను.

పిమ్మట హనుమంతునితో అతడిట్లు పలికెను. "ఓ హనుమా! వీరా గ్రేసరా! ఏమీ తెలియనివానివలె మౌనముగా నున్నా వేమి? నీవు వాయు సూనుడవు. బలములో వాయువుతో సమానుడవు. బుద్ధి వివేక విజ్ఞానాలకు నీవు నిధివి. ప్రపంచములో నీవు చేయజాలని కఠినకార్యమేదియును లేదు. శ్రీరాముని కార్యముకొఱకే నీవు అవతరించితివి."



ఈ మాటలు వినగానే హనుమంతుడు పట్టరాని సంతోషముతో పొంగిపోయెను. అతడు ఉత్సాహముతో దేహమును పెంచి పర్వతా కారుడయ్యెను.

ఆంజనేయుని శరీరము బంగారపు రంగుతో శోభిల్లుచుండెను. రెండవ మేరుపర్వతమా యన్నట్లు ప్రకాశించుచుండెను. ఆయన వానరులను చూచి "సోదరులారా! ఈ ఉప్పు సముద్రమును నేను అవలీలగా దాటగలను. రావణుని, అతని సహాయకులను సంహరించి త్రికూట పర్వతమును పెల్లగించి యిచ్చుటకు తీసుకరాగలను. ఇంకా ఏమి చేయవలెనో చెప్పండి చేసెదను" అని పల్కెను. జాంబవంతుడు హనుమంతుని పలుకులు విని ఆనందించి "నీవు వెళ్లి సీతమ్మవారిని చూచి తిరిగిరమ్ము. తన బాహుబలముతో రాక్షసులను సంహరించి సీతమ్మ వారిని శ్రీరాముడే తీసుకరాగలరు. అప్పుడు దేవతలు, నారదాదిమునులు ముల్లోకములవారు వారిని కీర్తించెదరు" అని వివరించెను.

ఈ కథ వినువారును, చెప్పినవారును, ఇహమందు శాంతియును, పరమందు పరమపదమును పొందగలరు.

* * *

# శ్రీ తులసీ రామాయణము
## సుందరకాండము

జాంబవంతుని ఉత్సాహవాక్యములు విని హనుమంతుడు సంతసించి, "ఓ వానర మిత్రులారా! నేను సీతమ్మ జాడ తెలిసికొని తిరిగి వచ్చునంత వరకు లభించిన కందమూల ఫలములను భుజించుచు ఇచ్చటనే నా రాక కెదురు చూచుచుండుడు" అని వారికి విన్నవించి సెలవు గైకొని బయలుదేరెను.

సముద్రతీరమున ఒక సుందర పర్వతము గలదు. హనుమంతుడు దానిపైకి దూకి శిఖరాగ్రమున నిలిచి అటనుండి ఆకాశమున కెగిరెను. అతడా పర్వతముపై తన పాదములు మోపగానే ఆ భారమునకు ఆ పర్వత మాగజాలక పాతాళమునకు క్రుంగిపోయెను. అంత హనుమంతుడు శ్రీరామచంద్రుని స్మరించుచు వేగముగా ముందుకు సాగెను.

ఆంజనేయుడు ఆకాశమార్గమున వెళ్ళుటను చూచి సముద్రుడు తనలో దాగియున్న మైనాకునితో "ఓ పర్వతరాజమా! శ్రీరాముని కార్యార్థమై ఆంజనేయుడు వెళ్ళుచున్నాడు. అతనికి అలసట తీర్చుము" అని యనగానే మైనాకుడు సముద్రమునుండి పైకివచ్చి తన శిఖరము పై విశ్రాంతి తీసికొనుమని హనుమంతుని ప్రార్థించెను. ఆ మాటలు విని "నేను శ్రీరాముని కార్యము నెరవేరువరకు ఎచ్చటను విశ్రమించను." అని అంజనాతనయుడు బదులు చెప్పెను. అట్లు చెప్పి అతడా పర్వతమును ఆదర పూర్వకముగా చేతులతో తాకి ముందుకు పోసాగెను.

దేవతలు హనుమంతుని బుద్ధిబలమును భుజబలమును తెలుసు కొనుటకు సర్పముల తల్లియగు సురసను పంపిరి. ఆమె హనుమంతునకు అడ్డుపడి "దేవతలు నిన్ను నాకు ఆహారముగ చూపిరి. నిలువుము, నిన్ను నేను తినెదను" అని గద్దించి పలికెను.



ఆ మాటలు విని హనుమంతుడు వినయముతో "అమ్మా! నేను శ్రీరామచంద్రుని కార్యముమీద వెళ్ళుచున్నాను. ప్రభువు పలుకులు సీతమ్మకు విన్నవించి ఆ అమ్మ సందేశమును ప్రభువున కెరిగించి తిరిగి వచ్చి నేను నీ కాహార మయ్యెదను. అప్పుడు నీవు తృప్తిగా నన్ను తినవచ్చును" అని పలికెను. ఆ సమాధానము విని కోపించి సురస–

"ఓరి వానరా! ఉపాయము చేత అపాయమును తప్పించుకొన వలెనని చూచుచున్నావు. నిన్ను నేను పోవివ్వను" అని అడ్డుగా నిలిచెను.

అప్పుడు హనుమంతుడు "అయితే యిపుడు నన్ను ఆరగించలేవు. ఇదిగో నాశక్తిని చూడుము." అని పలుకగా సురస ఒక యోజనము వెడల్పుగా తన నోరు తెరచెను. వెంటనే హనుమంతుడు రెండు యోజనములు తన శరీరమును పెంచెను. అంతట సురస నాలుగు యోజనములు నోరు తెరవగా, ఆంజనేయుడు తన శరీరమును ఎనిమిది యోజనములు పెంచెను. అట్లు సురస యెంతంత వెడల్పుగా నోరు తెరచుచుండెనో హనుమంతుడు దానికి ఇబ్బడిగా తన శరీరమును పెంచుచుండెను. చివరకు సురస నూఱు యోజనములు నోరు విప్పెను.

హనుమంతుడు ఆలోచించెను. ఇట్లు అయిన యెడల శ్రీరామచంద్రుని కార్య మాలస్యమగునని అతడు తలంచి వెంటనే సూక్ష్మరూపము ధరించి ఆమె కుక్షిలో జొరబడి వెలుపలకు వచ్చి సెలవడిగెను.

అప్పుడు సురస సంతోషించి "ఓ హనుమా! నీ బుద్ధిబలమును పరీక్షించుటకు దేవతలు నన్ను నీ వద్దకు పంపిరి. రామ కార్యమును నీవు నిర్విఘ్నముగా నెరవేర్చ గలవు. సుఖముగా వెళ్లి రమ్ము." అని ఆశీర్వదించి ఆమె వెళ్ళిపోయెను. హనుమంతు డానందముతో ముందుకు సాగెను.

సముద్రగర్భములో సింహిక యను నొక రాక్షసి నివసించుచుండెను. ఆకాశమున కెగురు పక్షుల నీడలను నీటిలో చూచి మాయచే వాని ఛాయను

లాగివేయుచుండెను. అంతట పక్షులు పై కెగురలేక సముద్రములో పడిపోవుచుండెను.

అట్లే హనుమంతుని కూడా భక్షింపవలెనని అ రాక్షసి ప్రయత్నించెను. ఆమె మోసమును గ్రహించి అతడు దానిని చంపి సముద్రమును దాటెను. అచ్చట సముద్రతీరమున నొక వనముండెను ఆంజనేయుడు వనసౌందర్యమును గాంచెను. మధువు కొఱకు తుమ్మెదలు ఝుంకారము చేయుచుండెను. వివిధములైన వృక్షములు ఫలపుష్పాదులతో మిగుల శోభాయమానముగా కనువిందుచేయుచుండెను. అచ్చటగల పలురకముల పక్షులను, మృగములను తిలకించి అతడు మిగుల ఆనందించెను. ఎదుటను ఒక విశాలమైన పర్వతమును చూచి అత డెగిరి దానిపై కూర్చుండెను.

“ఓ పార్వతీ! యిదంతయు హనుమంతుని గొప్పతనముకాదు. శ్రీరామచంద్ర ప్రభువుయొక్క ప్రతాపము. ఆ మహత్వము కాలుని గూడ మ్రింగివేయగలదు” అని ఈశ్వరుడు పార్వతీదేవితో చెప్పెను.

పర్వతాగ్రమున కూర్చుండిన హనుమంతుడు లంకానగరమును కలయజూచెను. అచ్చట వివరించి చెప్పుటకు వీలుగాని మిక్కిలి విశాలమైన కోట గలదు. అది మిగుల ఎత్తయినది. దానికి నలువైపుల సముద్రము గలదు.

అత్యంతము విలువైన మణులతో పొదగబడి బంగారముతో కట్టబడిన ప్రహరీగోడలు ప్రకాశించుచుండెను. వాని లోపల సుందరములైన అనేక మహోన్నత భవనములు విరాజిల్లుచుండెను.

అందమైన తోరణములు, విశాలమైన వీథులు, అనేక విధముల, అలంకరింపబడిన ఆ పట్టణ సౌందర్యము నెవరు వర్ణింపగలరు? ఆ నగరరాజము నందలి ఏనుగులను, గుఱ్ఱములను, కంచర గాడిదలను, రథ సమూహములను ఎవరు లెక్కింపగలరు? అచ్చట అనేక రూపములతో నొప్పుచున్న రాక్షసుల సైన్యము గలదు. వారి బాహుబలము వర్ణనాతీతమై యుండెను.



తోపులు, ఉద్యానవనములు, చెరువులు, బావులు, మొదలగువానితో ఇంకా నగరము మిగుల శోభాయమానముగానుండెను. మనుష్యులు, నాగులు, దేవతలు ఆ పురమందు విహరించుచుండిరి. అందలి గంధర్వ కన్యలు తమ సౌందర్యముచేత మునులను సహితము మోహింప జేయుచుండిరి. ఒక్కొక్కచోట పర్వతాకారులైన మల్లులు సింహములవలె గర్జించుచుండిరి. మల్లయుద్ధము చేయు అనేక ప్రదేశములలో వారు పోరాడుచుండిరి.

భయంకర శరీరధారులైన అనేక యోధానుయోధులు జాగ్రత్తగా కంటికి రెప్పవలె లంకానగరమును కావలి కాయుచుండిరి. దుష్టరాక్షసులు మనుష్యులను, ఎద్దులను, ఆవులను, మేకలను చంపి తినుచుండిరి.

హనుమంతుడు అసంఖ్యాకులైన ఆ కావలి వాండ్రను చూచి అత్యంత సూక్ష్మాతి సూక్ష్మరూపము ధరించి రాత్రి సమయమున లంకానగరమున ప్రవేశించవలెనని తలంచెను.

అంతట హనుమంతుడు దోమవంటి మిక్కిలి సూక్ష్మ రూపమును ధరించి శ్రీరామచంద్ర ప్రభువును స్మరించి లంకా నగరమువైపు పయనించెను. లంకానగర సింహద్వారము వద్ద లంకిణి అనే ఒక రాక్షసి యుండెను. అది ఆంజనేయుని చూచి “ఓరీ! ఎవరు నీవు? నా ఆజ్ఞ లేకుండా ఎచ్చటకు వెళ్ళుచున్నావు? నా సామర్థ్యము నీకు తెలియదు. ఎంతమంది దొంగతనంగా ఈ నగరంలో ప్రవేశించారో వారెల్లరు నాకాహారమైరి అని అరచుచు హనుమంతుని అడ్డగించెను.

వాయునందనుడు పిడికిలి బిగించి ఆ రాక్షసిని ఒక గ్రుద్దు గ్రుద్దెను. ఆమె నెత్తురు కక్కుచు భూమిమీద పడిపోయెను. కొంత సేపటికి సంబాళించుకొని ఆమె లేచెను. భయముతో చేతులు జోడించి లంకిణి హనుమంతునితో ఇట్లు విన్నవించెను. “స్వామీ! క్షమించండి! పూర్వము బ్రహ్మ రావణునకు వరము లిచ్చునపుడు నాతో ‘ఓ లంకిణీ! ఒక వానరునిచే

దెబ్బతిని నీవు వ్యాకులపడినపుడు రాక్షస వినాశమగు' నని చెప్పెను. అది యిప్పుడు నిజమయ్యెను. శ్రీరామచంద్రుని దూతను చూడగల్గిన భాగ్యము నేడు నాకు కలిగెను. త్రాసులో నొకవైపు స్వర్గసుఖములు, మోక్షమును ఉంచి రెండవ వైపు సత్సంగము ఉంచిన రెండవ వైపే మొగ్గును. దయానిధియైన శ్రీరామచంద్రుని హృదయములో స్మరించుకొనుచు నగరములో ప్రవేశించుము. అన్ని కార్యములు సఫలమగును. విషము అమృతమగును, శత్రువులు మిత్రులగుదురు. అగ్ని శీతలమగును. ఓ వానరవీరుడా! శ్రీరామచంద్రమూర్తి ఒక పర్యాయము కృపాదృష్టితో చూచిన యెడల మేరు పర్వతము కూడా దూదివలె తేలికయగును."

లంకిణి పలికిన పలుకులు విని హనుమంతుడు సూక్ష్మరూపధారియై ప్రభువును స్మరించుచు లంకా నగరములో ప్రవేశించెను. ఒక్కొక్క భవనములో ప్రవేశించుచు అచ్చట నున్న అసంఖ్యాకులైన యోధులను చూచుచు క్రమముగా ఆంజనేయుడు రావణుని భవనములో అడుగిడెను. ఆ భవనము కన్నులకు మిఱుమిట్లుగొలుపు చుండెను. రాక్షస రాజైన రావణుడు నిద్రించుచుండెను. అచ్చట జానకీదేవి కనబడలేదు. ఆ భవనము నకు సమీపంలో సుందరమైన భగవానుని మందిరముండెను. ఆ భవనము శ్రీరాముని ధనుర్బాణ చిహ్నములతో అంకితమై యుండెను. అచ్చట తులసీ వనములు కళకళలాడు చుండెను. హనుమంతుడు వానిని చూచి సంభ్రమాశ్చర్యచకితు డయ్యెను. "లంకంతా రాక్షస మయమని చెప్పుదురు. ఇచ్చట ఇటువంటి సాధుపురుషులు ఎట్లా ఉందురు?" అని అతడు తనలో తాను తర్కించుకొనుచుండెను. ఆ సమయమున విభీషణుడు లేచి రామ నామస్మరణ చేయుచుండెను. అతనిని చూడగానే సజ్జనుడని గ్రహించి అతనితో పరిచయము చేసుకొనిన మంచిదని హనుమంతుడు తలచెను. "సత్పురుషుల వలన కార్యహాని జరుగదు, జరిగిన ఏదైనా ఉపయోగమే జరుగును" అని భావించి బ్రాహ్మణరూపము ధరించి విభీషణుని పిలిచెను. అతడు వెలుపలకు



వచ్చి బ్రాహ్మణ వేషములో నున్న హనమంతునకు నమస్కరించి కుశల ప్రశ్నలు వేసి "మీరెవరు? శ్రీహరి భక్తులలో ఎవరై యుందురు? మిమ్ములను చూడగానే నా హృదయములో ప్రేమ పొంగుచున్నది దీనులను ఉద్ధరించే శ్రీరామచంద్రుడే మీరని నాకు తోచు చున్నది. నాకు దర్శనము నిచ్చి నన్ను కృతార్థుని చేయుటకు వేంచేసిన పుణ్యాత్ములని తలంచుచున్నాను" అని పలికెను.

హనుమంతుడు తాను వచ్చిన కథ అంతయు విశదీకరించి శ్రీరాముని గుణగణములను వర్ణించెను. శ్రీరాముని గుణగానముచే ఉభయులును తన్మయులైరి అప్పుడు విభీషణుడు హనుమంతుని జూచి "నా సంగతి వినుము. దంతముల మధ్య నాలుకవలె నే నిచ్చట నివసించుచున్నాను. నన్ను అనాథునిగా తలంచి శ్రీరామచంద్రుడు నాపై దయ చూపునా? నాది తామసశరీర మగుటవలన నేను జపతపో హోమములు చేయజాలక పోయితిని కాని యిప్పుడు మీ దర్శనమగుట వలన శ్రీరామునికి నాపై దయ యున్నదని నాకు గట్టిగా తోచుచున్నది" అని పలికెను.

ఆ మాటలు విని హనుమంతుడు "ఓ విభీషణా! ప్రభువు ఎప్పుడును సేవకులనే ప్రేమించును. అన్ని విధముల నేను తక్కువ వాడను అయినను ప్రభువు నన్ను మిక్కిలి ప్రేమతో చూచు చున్నాడు."అని చెప్పెను. భగవానుని దివ్యగుణములను గానము చేయుచుండగా అతని నేత్రములలో ప్రేమాశ్రువులు నిండిపోయెను. ఈ విధముగా అ యిరువురును శ్రీరాముని గుణములను స్మరించుచు అనిర్వచనీయమైన ఆనందానుభూతిని పొందిరి.

ఇట్టి ప్రభువును మరచి తుచ్ఛ విషయ భోగముల పైపు పరుగిడువారు ఏల దుఃఖితులు కాకుందురు?

జానకీదేవి లంకా నగరములో ఎట్లా ఉంటున్నది? ఆ కథ అంతా విభీషణుడు హనుమంతున కెరిగించి అచ్చటకు వెళ్ళుటకు అన్ని గుర్తులు చెప్పెను.

విభీషణుని వద్దనుండి సెలవు తీసికొని ఆంజనేయుడు సూక్ష్మరూపము ధరించి అశోకవనమునకు వెళ్ళెను. అచ్చట సీతమ్మవారిని చూడగానే అతడు మనస్సులోనే వందనము చేసెను. సీతాదేవి బక్క చిక్కి కృశించియుండెను. ఆమె తల యంతయు జడగట్టి యుండెను. మనస్సులో శ్రీరాముని పదేపదే స్మరించుచుండెను. తల వంచుకొని శోకదేవతవలె కూర్చుని యున్న సీతాదేవిని జూచి హనుమంతుడు మిగుల దుఃఖించెను.

హనుమంతుడు రాత్రి రెండుజాముల వేళ అచ్చట గల వృక్షము పైనెక్కి కొమ్మల నడుమ ఆకులలో దాగి యుండెను. ఆ సమయమున వివిధాలంకార విభూషితుడై రావణడు మండోదరి మొదలగు పెక్కుమంది స్త్రీలను వెంటబెట్టుకొని సీతాదేవి సమీపమునకు వచ్చెను. రాక్షసరాజు సీతకు తన బాహుబలమును, ధైర్య సాహసములను, అనేక విధములుగా వర్ణించి చెప్పెను. సామ దాన భేదములను జూసి ఆమెను తనవైపు ఆకర్షించుకొన వలెనని ప్రయత్నించెను.

“ఓ ప్రేయసీ! మండోదరి మొదలుగా గల అందరు రాణులు నీకు పరిచారికలై యూడిగము చేయుదురు. ఒక్కసారి నన్ను కనికరించుము” అని రావణుడు సీతముందు బహురీతుల ప్రాధేయపడెను.

సీతాదేవి ఆ మాటలకు ఏమీ చలించలేదు. ఒక గడ్డి పరకను త్రెంచి దానిని అడ్డముగా పెట్టుకొని యిట్లనెను “ఓరీ దశకంఠుడా! మిణుగురు పురుగు వెలుతురుకు కమలములు వికసించునా? ఓ రాక్షసాధమా! శ్రీరామచంద్రుని బాణముల ప్రభావము నీవు రుచి చూడలేదు. నీవు మిణుగురు పురుగుతో సమానుడవు. శ్రీరాముడు సూర్యునితో సమానమైన వాడు”

సీతాదేవి వాక్యములు విని క్రోధముతో రావణుడు చలించిపోయెను. అతడు ఆగ్రహావేశముతో ఒరలోనుండి చంద్రహాసమును తీసి ఇట్లు పలికెను. “సీతా! ఇంతమంది సమక్షములో నన్ను హీనముగ పలికితివి. అవమానము చేసితివి, ఈ చంద్రహాసముతో నీ శిరస్సును వ్రక్కలు చేసిన ఇక్కడ నీకు



దిక్కెవ్వరు? ఇప్పటికైనా జాగుసేయక వెంటనే నామాట పాటింపుము. లేదా ప్రాణముల మీద ఆశ వదలుకొమ్ము.”

రావణుని పరుష భాషణములకు సీతాదేవి ఏ మాత్రం భీతిచెందక చంద్రహాసమా! శ్రీరాముని విరహాగ్నిని హరించి నా మంటను చల్లార్చుము” అని తనలో తాను అనుకొనెను.

ఆ వాక్కులు వినగానే రావణు డామెను వధింప ప్రయత్నింపగా మండోదరి అనేక నీతివచనములు పలికి ఆయనను వారించెను. అంత రావణుడు అచ్చట కావలియున్న వారిని చూచి “మీరు సీతను అనేక విధముల భయపెట్టుడు. ఆమె మనస్సును మార్చుడు” అని రాక్షస స్త్రీలకు చెప్పి “ఒక నెలలోగా నీవు నేను చెప్పినట్లు అంగీకరింపనిచో ఈ కరకు కత్తితో నీ తల నరికివేయుదును” అని సీతను బెదరించి తన రాజభవనమునకు వెడలిపోయెను.

రాక్షస స్త్రీలు అనేక రూపములు ధరించి సీతమ్మవారిని భయపెట్టసాగిరి. వారిలో త్రిజట అనే ఒక రాక్షస బాలిక యుండెను. శ్రీరాముని చరణము లనిన ఆమెకు అత్యంత ప్రీతి, జ్ఞానవంతురాలు. ఆమె అందరిని పిలిచి తన స్వప్న వృత్తాంతమును వారితో ఇట్లు వివరించి చెప్పెను.

“ఒక వానరుడు లంకానగరము నంతయును కాల్చి వేసెను. రాక్షసుల సైన్య మంతయు వధింపబడెను. రావణుడు దిసమొలతో గాడిద నెక్కి తెగిన తలలతో విరిగిన భుజములతో దక్షిణ దిశగా వెళ్ళుచుండెను. విభీషణుడు లంకా నగరమునకు రాజయ్యెను. నగరములోని ప్రజలందరు శ్రీరామునకు జయము పలుకుచుండిరి. ప్రభువు సీతమ్మ వారిని పిలిపించుకొనెను.” పై స్వప్నవృత్తాంతమును చెప్పి “నా స్వప్నము నాలుగు దినములలో నిజము కాగలదని ఘంటాపథంగా చెప్పుచున్నాను. సీతాదేవిని సేవించి కళ్యాణము పొందండి” అని చెప్పెను.

త్రిజట పలికిన వాక్యములు విని రాక్షస స్త్రీలు జానకీదేవి పాదములపై పడిరి. పిమ్మట వారెల్లరు తమతమ స్థానములకు వెళ్లి పోయిరి. "ఒక నెల గతించిన పిమ్మట దుర్మార్గుడైన రావణుడు నన్ను చంపి వేయును" అని సీతాదేవి మనస్సులో చింతిల్లుచుండెను. ఆమె త్రిజటను చూచి చేతులు జోడించి "అమ్మా! నీవు నా విపత్తును పంచుకొనుచున్నావు. నేను ఈ శరీరమును విడిచిపెట్టుటకు వెంటనే తగిన ఉపాయము చెప్పుము. ఈ విరహాగ్నిని సహించలేక పోవుచున్నాను. కట్టెలు తెప్పించి చితి పేర్పించి అగ్ని వెలిగించుము. తల్లీ! రావణుని శూలములవంటి వాక్యములు ఈ చెవులతో విన లేకున్నాను" అని పలికెను.

సీతాదేవి వాక్యములు విని త్రిజట ఆమె పాదములు పట్టుకొని యిట్లు నచ్చచెప్పెను. "ఓ సుకుమారీ! నీ ప్రయత్నము విరమింపుము. రాత్రి సమయమున అగ్ని దొరకదు" అని చెప్పి శ్రీరామచంద్ర ప్రభువు యొక్క బల ప్రతాపములను సత్కీర్తిని వివరించి చెప్పి ఆమెను ఓదార్చి త్రిజట తన యింటికి వెళ్లిపోయెను.

సీతాదేవి మనస్సులో ఇట్లనుకొనసాగెను "ఇప్పుడు నేను ఏమి చేయుదును? విధాత అంతా విపరీతము చేసెను. నిప్పు దొరకదు. పీడ విరుగదు. ఆకాశములో అగ్గినిప్పులు కనబడుచున్నవి భూమి మీద ఒక్కటైనా పడుటలేదు. చంద్రునిలో అగ్ని పర్వతమున్నదని చెప్పుదురు. కాని అతడైనా నిప్పుల వర్షము కురిపించి నా బాధలను దూరము చేయుటలేదు. ఓ ఆశోకవృక్షమా? నా ప్రార్థనను విని నా శోకమును హరింపుము. ఓ ఆశోకవనమా! నీ నామమును సార్థకపఱచుకొనుము. నీ సన్నని ఆకులు అగ్నితో సమానము. కాని అవి నా విరహమును అంతము చేయుటలేదు"

సీతాదేవి విరహాగ్నితో ఇట్లు తపించుచుండగా హనుమంతుడు చెట్టు పైనుండి యుంగరమును సీతాదేవి ఒడిలో పడవేసెను. ఆశోకవృక్షమే అగ్నికణములను పడవేసెనా! అన్నట్లుండెను. అది చూచి సీతాదేవి



సంతోషముతో తన ఆ యుంగరమును చేతిలోనికి తీసుకొని ఆశ్చర్య చకితురాలై తదేక దృష్టితో దానివైపు చూచుచు విషాదమును సంతోషమును చెందెను.

"శ్రీరామచంద్రుడు సర్వసమర్థుడు. వారిని ఎవరు జయింపగలరు? మాయచేత ఈ యుంగరమును ఎవరు తయారు చేయజాలరు." అని సీతాదేవి అనుమానముతో ఆలోచింపసాగెను. ఆ సమయమున హనుమంతుడు శ్రీరాముని దివ్యగుణములను, వారి సాహస చరిత్రమును మధురాతి మధురముగా గానము చేసెను. అది వినగానే ఆమె దుఃఖమంతయు నశించెను శ్రద్ధాసక్తులతో ఆ మాటలు వినసాగెను. హనుమంతుడు మొత్తము జరిగిన చరిత్ర అంతయు వివరముగా వినిపించెను. అది విని సీతాదేవి యిట్లు పలికెను "శ్రవణములకు ఆనందము కల్గించు చరిత్ర అంతయును చెప్పితివి సోదరా! నీవు ఎక్కడ నున్నావు? ఎందుకు నాముందుకు రావు."

అది విని ఆంజనేయుడు మెల్లగా చెట్టుదిగి సీతాదేవి వద్దకు వచ్చి నిలిచెను. అతనిని చూచి సీత తన ముఖమును ప్రక్కకు త్రిప్పుకొనెను.

అది గాంచి ఆంజనేయుడు "అమ్మా! ఈ ముద్దుటుంగరమును నేను తెచ్చితిని. నేను శ్రీరాముని దూతను. శ్రీరామచంద్రమూర్తి పాదము మీద ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. ఈ యుంగరము నీకు గుర్తు చూపుటకు ప్రభువు నాకు ఇచ్చి పంపెను" అనెను. అంత సీతాదేవి హనుమంతుని జూచి "నర వానరులకు స్నేహ మెట్లు కుదిరెను?" అని అడిగెను.

శ్రీరామప్రభువుతో తమకు మిత్రత్వ మెట్లు కుదిరెనో హనుమంతుడు వివరముగా చెప్పెను. అతని వాక్యములు విని అతనియం దామెకు మంచి విశ్వాసమేర్పడెను. ఇతడు త్రికరణశుద్ధిగా శ్రీరామభక్తుడే నని సీత చక్కగా గ్రహించెను. అంత ఆమెకు అతని యందు ప్రీతి కలిగెను. ఆ నేత్రములు ఆనంద బాష్పములతో నిండిపోయెను.

సీతాదేవి హనుమంతుని జూచి యిట్లు పల్కెను. "ఓ హనుమా! విరహ సముద్రములో మునిగిపోవుచున్న నాకు నావ వలె నీవు తోడ్పడితివి. నా మరది లక్ష్మణుడు నా ప్రభువు శ్రీరామచంద్రుడు క్షేమముగా నున్నారా? శ్రీరఘురాముడు అత్యంత ప్రేమగలవాడు దయానిధి. ఏ కారణముచేత ఇంత ఆలస్యము చేసినారో? సేవకులకు సంతోషము కలుగజేయు నా స్వామికి నేను జ్ఞాపక మున్నానా? కోమల శరీరుడైన ఆ శ్యామలాంగుని ఎప్పటికైనా చూడగలుగుదునా? హా నాథా! నన్ను పూర్తిగా మరచి పోయితివా? ఇక నాకు దిక్కెవరు?" అనుచూ ఆమె కన్నీరు మున్నీరుగా దుఃఖింప సాగెను.

సీతాదేవి విరహముతో అమితముగా దుఃఖపడుటను గాంచి హనుమంతుడు "అమ్మా! ప్రభువు సోదరునితో సహా కుశలముగానే యున్నారు. కాని తమను తలచుకొని తలచుకొని మరి మరి దుఃఖించుచున్నారు. మీరు మనస్సులో లేశమైనా దుఃఖపడవద్దు ప్రభువును గూర్చి మీరు బాధపడే కంటే ఎక్కువగానే మీగురించి ఆయన దుఃఖించుచున్నారు. ఇక ప్రభువు సందేశము వినండి" అని చెప్పి హనుమంతుడు పారవశ్యములో మునిగి పోయెను. ఆయన నేత్రముల నుండి ప్రేమాశ్రువులు రాలసాగెను. అతడు శ్రీరామచంద్రుని సందేశము నిట్లు వివరించెను.

"ఓ సీతా! నీ వియోగము వలన నాకు సమస్త పదార్థములు రుచి తప్పెను. వృక్షముల చిగురుటాకులు అగ్నివలెను, రాత్రి కాళరాత్రి వలెను, చంద్రుడు సూర్యునివలెను, మేఘములు సలసల కాగుచున్న నూనె కళాయిలవలెను, హితులు బాధితులుగాను, శీతల మంద సుగంధ మారుతములు విషవాయువుల వలెను తోచుచున్నవి. ఈ మనస్సులో గల దుఃఖము ఆప్తులకు చెప్పుకొనుట వలన తగ్గును. కాని మన ప్రేమను ఇంకొకరి ద్వారా నీకెట్లు చప్పుకోను? నాలోని దుఃఖము ఎవరును తెలుసుకొన లేరు. మన యిద్దరి మధ్య గల ప్రేమ నాకు మాత్రమే తెలియును.



నా మనస్సు ఎల్లప్పుడూ నీ సన్నిధి యందే యున్నది. నా ప్రేమ సర్వస్వము అంతా తెలుసుకొనుము."

ప్రభువు ప్రేమసందేశము వినగానే జానకీదేవి ప్రేమలో మగ్నురాలయ్యెను. ఆమెకు శరీరస్మృతి తప్పెను.

అప్పుడు హనుమంతు డిట్లు పల్కెను. "అమ్మా! భయపడకుము. ధైర్యముతో నుండుము. శ్రీరామప్రభువును స్మరించు చుండుము. నా మాటలు విని పిరికితనమును వదలుము. రాక్షసుల సమూహము మిడుతల గుంపువంటి వారు. శ్రీరాముని బాణములు అగ్నితో సమానము. రాక్షసులు ఆ అగ్నిలో పడి భస్మము కాక తప్పదు. నీ వెచ్చటనున్నది ప్రభువునకు తెలియక యింత ఆలస్యము జరిగినది. రామబాణ మనే సూర్యుడు ఉదయించిన మీదట రాక్షసుల సేన యనే అంధకారము ఇక ఎచ్చట నుండగలదు? తల్లీ! యిప్పుడే నిన్ను తీసుక వెళ్లగలను. కాని రామాజ్ఞలేదు. కాన అమ్మా! కొంతకాలము ఓపిక పట్టుము. త్వరలోనే రామచంద్రుడు వానర సైన్యముతో కలిసి వచ్చి రాక్షసులను సంహరించి నిన్ను తీసుకొని వెళ్ల గలడు."

ఆంజనేయుని మాటలు విని సీతాదేవి "రాక్షసులు బలవంతులు. పర్వతాకారులు. వానరులు వారి నెట్లు జయంపగలరు?" అని సందేహము వెలిబుచ్చెను. అంతట హనుమంతుడు తన శరీరమును మహోన్నతముగా పెంచెను. అది యెట్లున్నదనగా సుమేరు పర్వతమా? లేక హిమవత్పర్వతమా? అన్నట్లు ఆకాశమంటి యుండెను. రణరంగములో భీకర శత్రువులకు సైతము భయోత్పాతము కల్గించగల మహాబలవంతుడుగా హనుమ కనబడెను. అతనిని చూచి సీతాదేవికి గల సందేహము దూరమయ్యెను. పిమ్మట ఆంజనేయుడు ఎప్పటివలె సూక్ష్మరూపము ధరించెను.

"అమ్మా! ఇదంతయు వానరుల బలము, బుద్ధి విశేషముగాదు. ప్రభువు ప్రతాపము వలన మిక్కిలి చిన్న సర్పము గూడ గరుడుని మ్రింగగలదు.

అత్యంత దుర్బలుడు కూడా మహా బలవంతులను హతమార్చగలడు” అని హనుమంతుడు సీతతో చెప్పెను.

భక్తి, శక్తి, ప్రతాపము, తేజముతో గూడిన హనుమంతుని వచనములు విని సీతమ్మ మిగుల సంతసించెను. అతడు శ్రీరామునకు ప్రియ భక్తుడని గ్రహించి “నీవు బలమునకు, శీలమునకు నిధివి అగుదువుగాక” అని అతనిని ఆమె ఆశీర్వదించెను. ఇంకను ఆమె ఇట్లు పలికెను. ‘‘పుత్రా! నీవు ఆజరామరుడ వగుదువు గాక. ప్రభువు నిన్ను అందరి కన్నా మిన్నగా ప్రేమించు గాక.” “ప్రభువు మిన్నగా ప్రేమించుగాక” అనే వాక్యము వినగానే అతడు పూర్తిగా భక్తి పారవశ్యములో నిమగ్నుడై పోయెను. మాట మాటకు సీతాదేవి చరణములకు నమస్కరించు అతడు నమ్రతతో “అమ్మా! ఇంతవరకు నన్ను తండ్రిగారే ఆశీర్వదించిరి. ఇప్పుడు తల్లిగారి ఆశీర్వాదముకూడా లభించినది. మీ ఆశీర్వాదము అమోఘమైనది. ఇప్పుడు నేను కృతార్థుడ నైతిని. ఇక ఇచ్చటి వృక్షముల ఫలములు చూడగానే నాకు ఆకలి వేయు చున్నది” అని పలికెను.

ఆ వాక్యము వినగానే సీతాదేవి, ‘‘కుమారా! ఈ వనమును యోధాగ్రేసరులైన రాక్షసులు కావలి కాయుచున్నారు.” అని చెప్పెను. అంతట హనుమంతుడు “అమ్మా! మీరు దయతో ఆజ్ఞ యిచ్చినచో వారి వలన నాకెట్టి భయము లేదు” అనెను.

ఆ మాటలకు “బిడ్డ! నీవు శ్రీరాముని స్మరించుచు మధుర ఫలములను భుజించుము” అని సీతమ్మ చెప్పగానే అత డామెకు నమస్కరించి వనములో జొరబడి ఫలములను తిని వృక్షములను పెరికి వేయసాగెను.

అచ్చట కావలి కాయచున్న పెక్కుమంది యోధానుయోధులలో కొందరు అడ్డుపడగా వారిని కొట్టి చంపివేసెను. మిగిలిన వారు భయముతో రావణుని వద్దకు పరుగెత్తి ఇట్లనిరి. “ఓ ప్రభూ! ఒక వానరుడు వన వృక్షములను



పెరికి వేసెను. మాలో చాలా మందిని చంపివేసెను.” ఆ మాటలు విని రావణుడు చాలా మంది యోధులను పంపెను. వారిని చూచి హనుమంతుడు గర్జించుచు పెక్కుమందిని చంపి వేసెను. మిగతా వారిని కొట్టి గాయపరచెను. చచ్చి బ్రతికిన వారు అరచుకొంటూ రావణుని వద్దకు వెళ్లిరి.

రావణుడు హనుమంతునిపై అక్షకుమారుని పంపెను. అతడు రాక్షస యోధులను వెంట తీసికొని వెళ్ళెను. హనుమంతుడు వారిని చూడగానే ఒక విశాల వృక్షమును పెకలించి దానితో వారిలో కొందరిని చావగొట్టెను. కొందరిని నలిపివేసెను. కొందరిని ధూళిలో కలిపివేసెను. అక్షకుమారుడు కూడా మరణించగానే హతశేషులు రావణుని వద్దకు వెళ్లి కోతి చాల బలమైనదని చెప్పిరి.

పుత్రుని దారుణ మరణవార్త విని రావణుడు మిగుల ఖిన్నమనస్కుడై కోపోద్రిక్తు డయ్యెను. ఇంద్రుని జయించిన తన పెద్ద కుమారుడైన మేఘనాదుని పిలిచి “ఆ కోతిని చంపకుండా బంధించి తీసుకరమ్ము. ఎచ్చట నుండి అది వచ్చినదో తెలిసికొనవలసి యున్న” దని చెప్పెను.

తన ప్రియసోదరుని వధవార్త విని మిగుల కోపోద్దీప్తుడై మేఘనాదుడు అనేక రాక్షసవీరులను వెంట బెట్టుకొని బయలు దేరెను.

హనుమంతుడు వారిని చూచి ఇప్పుడొక మహాయోధుడు వచ్చు చున్నాడని తెలుసుకొని పండ్లు పటపట కొరుకుచు గర్జించెను. ఒక పెద్ద వటవృక్షమును పెల్లగించి మేఘనాదుని రథముపై విసరివేసెను. రథము విరిగి పోగా అతడు క్రిందకు దూకెను. అతని వెంటనున్న అనేక రాక్షస యోధులను హనుమంతుడు కొట్టెను, తన్నెను, నలిపి వేసెను. వారిలో పెక్కు మందిని చంపిన పిమ్మట మేఘనాదునిపై కలియబడెను. మదించిన రెండు గజరాజములు పోరాడు కొనుచున్నవా యన్నట్లు వారు యుద్ధము చేయుచుండిరి. హనుమంతుడు బలముగా మేఘనాదుని ఒక గ్రుద్దు గ్రుద్ది

వృక్షము పైకిఎక్కి కూర్చుండెను. క్షణము సేపు మేఘనాదుడు మూర్ఛిల్లి పోయెను.

కొంతసేపటికి మేఘనాదుడు తెప్పరిల్లి లేచి సామాన్య బాణములతో హనుమంతునితో పోరాడిన జయించుట దుర్ఘటమని తలంచి బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. దానిని ఎదించినచో బ్రహ్మాస్త్రము యొక్క మాహాత్మ్యము పోవునని హనుమంతుడు మదిలో తలంచి లోబడుటకు నిశ్చయించుకొనెను. అది తగులగానే అతడు వృక్షము నుండి క్రింద పడిపోయెను. నేలమీద పడిపోవు సమయమున గూడా అతడు చాలా మంది రాక్షసులను చంపి వేసెను.

హనుమంతుడు క్రింద పడగానే మేఘనాదుడు అతనిని నాగ పాశముతో బంధించి రావణుని వద్దకు తీసుకొని వెళ్లెను.

పరమేశ్వరుడు పార్వతీదేవితో "ఓ భవానీ! ఎవరి నామస్మరణ మాత్రము చేతనే మనుష్యుడు సంసార సాగరమును దాటునో అట్టి ప్రభువు దూతను రాక్షసులు బంధింప గలరా? హనుమంతుడే ప్రభువు కార్యము నిమిత్తము బంధితుడయ్యెను" అని పలికి తర్వాతికథ చెప్పెను.

హనుమంతుని బంధించి తీసికొని వచ్చుచున్నారని తెలియగానే అతనిని చూచుటకు లంకానగరములోని రాక్షసులు తండోపతండములుగా పరుగెత్తుకొని వచ్చిరి.

హనుమంతుడు రావణుని సభామందిరమును చూచి మిగుల ఆశ్చర్యపడెను. ఆ శోభ, ఆ వైభవము మాటలలో చెప్పుటకు వీలుపడదు. అచ్చట దేవతలు, దిక్పాలకులు చేతులు జోడించి రావణుడు ఏమి ఆజ్ఞాపించునో యని భయముతో వణకుచు ఎదురు చూచుచుండిరి. అంతటి ప్రతాపముతో నున్న రావణుని చూచి కూడా హనుమంతుడు లేశ మాత్రమైనా భయపడ లేదు. సర్పముల గుంపులో గరుత్మంతుడు నిర్భయముగా



నిలబడినట్లు అతడు రాక్షసుల నడుమ నిలబడెను. అతనిని చూచి రావణుడు కఠినముగా దూషించి హేళనగా నవ్వెను. ఇంతలో తన పుత్రుడైన అక్షకుమారుని మరణము గుర్తుకు రాగా అతడు మిగుల విషాదము చెందెను.

లంకాధిపతి రావణుడు హనుమంతుని జూచి ఇట్లనెను. "ఓరీ! వానరాధమా! ఎవడవు నీవు? ఎచ్చట నుండి వచ్చితివి? నా పేరు నా కీర్తి నీవు వినలేదటరా! నా యెదుట నిర్భయముగా నిలిచియున్నావు. రాక్షసులు ఏమి అపరాధము చేసిరని నీవు వారిని చంపితివి! ఓరీ! మూర్ఖుడా? "నీకు ప్రాణభయము లేదా?"

హనుమంతుడు రావణుని మాటలు విని ఇట్లు బదులు చెప్పెను. ఓరీ! రావణా! ఎవరి శక్తి వలన మాయ సంపూర్ణమైన బ్రహ్మాండమును సృజించు చున్నదో, ఎవరి బలము వలన త్రిమూర్తులు సృష్టి, స్థితి, లయములను చేయుచున్నారో, ఎవరి సామర్థ్యము వలన సహస్ర ఫణములు గల శేషుడు పర్వతములతో కూడిన సమస్త భూమండలమును తన శిరమున ధరించి మోయుచున్నాడో, ఎవరు శిష్టులను రక్షించుటకు నీవంటి దుష్టులను హతమార్చుటకు అనేకములయిన అవతారములు ధరించు చున్నాడో, ఎవడు కఠినమైన శివధనుస్సును తేలికగా విరిచివేసి రాజుల గర్వమును అణచి వేసెనో, ఎవడు అతులిత బలధాములైన ఖరదూషణ త్రిశిరాది రాక్షసులను సంహరించెనో, ఎవని బలము నాధారముగా చేసుకొని నీవు ముల్లోకములను జయింప గల్గితివో, ఎవరి ధర్మపత్నిని నీవు దొంగతనముగా అపహరించి తెచ్చితివో అట్టి శ్రీరామచంద్ర ప్రభువు దూతను నేను. ఓరీ! రావణా! నీ గొప్పతనమును నేను బాగుగా ఎరుగుదును. వెయ్యి చేతులు గల కార్తవీర్యార్జునునితో పోరాడితివి. వాలితో యుద్ధము చేసి యశము గాంచితివి" అని హనుమంతుడు అనగానే రావణుడు అట్టహాసము చేసెను. ఒక్క నవ్వు నవ్వి విషయమును తప్పించి వేసెను.

హనుమంతుడు మరల అందుకొని యిట్లనెను "ఓ రాక్షస రాజా! రాక్షసుల నెందుకు చంపితినో వినుము. ఆకలై నది అందువలన ఫలములు భుజించితిని. వానర స్వభావము వలన కొన్ని చెట్లను పెల్లగించితిని. అంత మాత్రముననే మీ రాక్షసులు నన్ను చుట్టిముట్టిరి, తిట్టిరి, కొట్టిరి. అందుకు నేను వారిని హతమార్చితిని. అందరికిని శరీరము ప్రియమైనది కదా! అందు మీదట నీ పుత్రుడు నన్ను బంధించి తెచ్చెను. అంత మాత్రము చేత నేను భయపడుట లేదు. సిగ్గు పడుట లేదు. నా ప్రభువు కార్యమును నేను పూర్తిచేయ తలంచితిని. ఓ రాక్షస ప్రభూ! నేను చేతులు ముకుళించి ప్రార్థించి మనవి చేయుచున్నాను. అహంకారమును వదలి నా హితవును వినుము. పవిత్రమైన బ్రహ్మ వంశము నీది. అది గమనించి యైనా అన్ని దుర్భ్రమలను వదలి భక్తుల భయమును పోగొట్టే భగవానుని భజించుము. దేవతలను, రాక్షసులను, చరాచర ప్రాణులను మ్రింగివేయు యముడు కూడా ఎవనికి మిగుల భయపడుచుండునో అట్టిరామునితో వైరము పెట్టుకొనవద్దు. నేను చెప్పినది విని జానకీదేవిని శ్రీరామునకు సమర్పించుము. రామచంద్రుడు శరణాగత రక్షకుడు, దయాసముద్రుడు, శరణు జొచ్చినచో నీ అపరాధ ములను మరచి తన సన్నిధిలో నిన్ను ఉంచుకొనును. నీవు ఇప్పటికైనా శ్రీరాముని పాద పద్మములను మదిలో తలంచి స్థిరముగా నీవు నీ రాజ్యమును పారిపాలించు కొనుము. నీ తాత గారైన పులస్త్యబ్రహ్మ యశస్సు నిర్మలమైన చంద్రునితో సమానమైనది. దానికి కళంకము తెచ్చి పెట్టకుము. రామనామము లేని వాక్కు శోభించదు. మద మోహములను వదలి ఆలోచించుము. సుందర స్త్రీ యెన్ని ఆభరణములు ధరించినను చీర ధరించనిదే శోభించదు. ఐశ్వర్యము, అధికారము, ఉండినను కూడా అవి నశించిపోవును. తిరిగి వాటిని పొందుటకు వీలు పడదు. ఏ నదుల మూలములో నీరు లేదో వర్షాకాలం గతించిన తర్వాత ఆ నదులు వెంటనే ఎండిపోవును. ఓ రావణా! వినుము. నిశ్చయముగా ప్రతిజ్ఞ చేసి



చెప్పుచున్నాను. రామచంద్రునకు విముఖుడైన వానిని ఎవరును రక్షింపజాలరు. శ్రీరామచంద్ర ప్రభువునకు ద్రోహము చేసిన నిన్ను త్రిమూర్తులు కూడా కాపాడజాలరు. మోహము అజ్ఞానమునకు మూలము. అనేక కష్టములను కలిగించు అంధకారమనే అహంకారమును వదలుము. రఘుకులస్వామిని శ్రీరామచంద్రుని భజించుము."

ఈ విధముగా భక్తి, జ్ఞాన, వైరాగ్యములతో కూడిన అనేక హిత వాక్కులను హనుమంతుడు చెప్పినప్పటికివి అహంకారి అయిన రావణుడు వ్యంగ్యముగా నవ్వుచు ఇటుల పలికెను. "నేటికి జ్ఞానోపదేశం చేసే కోతి గురువు" మాకు లభించినాడు. ఓరీ! దుష్టుడా! నీకు మృత్యువు సమీపించినది. నాకు ఉపదేశ మిచ్చుటకు మొదలుపెట్టావు. ఇక కట్టి పెట్టుము" అని తిరస్కరించి పలుకగా హనుమంతుడు "మృత్యువు నాకు కాదు నీకు సమీపించినది. కనుకనే తలక్రిందుగా మాట్లాడు చున్నావు. నేను ప్రత్యక్షముగా అంతయును తెలుసుకొంటిని" అని పలికెను.

హనుమంతుని వాక్యములు విని రావణుడు కోపోద్రిక్తుడయ్యెను. "ఓ రాక్షసులారా! యీ దుష్టుని ప్రాణము వెంటనే తీయక యింకా చూచు చున్నారేమి?"అని పెద్దగా అరచెను. అంతట రాక్షసులు హనుమంతుని చంపుటకు చుట్టుముట్టిరి. ఆ సమయమున తన మంత్రులతో కలిసి విభీషణుడు అచ్చటకు వచ్చెను.

రావణునకు నమస్కరించి విభీషణుడు "సోదరా!" యేమి చేసినను దూతను చంపుట రాజనీతికి విరుద్ధము. ఇంకేదైనా తేలిక శిక్షవిధించుడు" అని పల్కెను. సభలోని వారెల్లరు ఆ సలహా బాగుగ నున్నదని పలికిరి. అదివిని రావణుడు నవ్వుచు "అయితే ఈ కోతికి అవయవములు భంగముచేసి పంపించండి. కోతులకు తమ తోక మీద ఎక్కువ ప్రీతియుండును. కాబట్టి నూనెలో గుడ్డలు ముంచి తోకకు చుట్టి అగ్ని ముట్టించండి. అప్పుడు ఈ కోతి తోక లేకుండా తన యజమాని వద్దకు

వెళ్ళి చెప్పుకొని అతనిని ఇచ్చటకు తీసుకొని వచ్చును. అపుడు నే నతని సామర్థ్యమును చూచెదను" అనెను.

ఈ మాటలు విని హనుమంతుడు మనస్సులో నవ్వుకొనెను. రాక్షసభటులు రావణుడు చెప్పినట్లు చేయ మొదలిడిరి. తోకకు చుట్టుటకు ఆ నగరములోగల మొత్తమునూనె, వస్త్రములు తెచ్చిరి. హనుమంతుడు అంతకంతకు తన తోకను పెంచుచుండెను. నగరములోని జనులు ఆ తమాషా చూచుటకు వచ్చిరి రాక్షస భటులు హనుమంతుని కాళ్ళతో తన్ని పరిహాసము చేసిరి, నగరమంతా త్రిప్పిరి. తోకకు నిప్పు అంటించిరి.

హనుమంతుడు సూక్ష్మరూపము ధరించెను. బంధనములన్ని విడిపోయెను. పెద్ద పెద్ద భవనములపై కెక్కెను. అదిగాంచి రాక్షస స్త్రీలు భయవిహ్వలలైరి. ఆ సమయమున భగవానుని ప్రేరణవలన ప్రచండమైన గాలి వీచుచుండెను.

హనుమంతుడు అట్టహాసముచేసి గర్జించి ఆకాశమునకెగిరెను. దేహము ఎక్కువగా పెంచెను. అతడు సునాయాసముగా ఒక భవనము నుండి మరియొక భవనమునకు ఉరుకుచు ఎగురుచు నగరమంతా తిరుగుచు తగులబెట్టుచుండెను. జనులు అల్ల కల్లోలములగుచుండిరి. నిప్పు రవ్వలు ప్రజ్వరిల్లుచుండెను. "అయ్యో! బాబూ! యీ అవస్థలో మమ్ములను కాపాడువారెవరు? ఇది మేము ఇంతకు ముందే చెప్పియుంటిమి. ఇతడు అందరి వంటి వానరుడుకాడు. వానర రూపముతో వచ్చిన దేవత" అవి ప్రజలు వాపోవుచుండిరి. సత్పురుషులను అవమానించిన ఫలముగా నగరమంతయు క్షణకాలములో భస్మమైపోయెను. ఒకే ఒక విభీషణుని గృహము మిగిలి పోయెను.

ఓ పార్వతీ! అగ్నిని సృష్టించిన భగవానునిదూతయే హనుమంతుడు. అందువలన అతనిని అగ్ని బాధింపలేదు. లంకానగరమంతటిని అతడు అగ్నికాహుతి చేసెను. పిమ్మట సముద్రములో దుమికి తన తోకకు



అంటియున్న అగ్నిని చల్లార్చు కొనెను. అలసటతీర్చుకొనెను. తర్వాత హనుమంతుడు సూక్ష్మరూపము ధరించి మరల జానకీ దేవిని సమీపించి చేతులుజోడించి "అమ్మా! సెలవిమ్ము వెళ్ళి వచ్చెదను. నాకు ఏదైన వస్తువు గుర్తుగానిమ్ము" అని పల్కెను.

అంత సీతాదేవి తన చూడామణిని తీసి హనుమంతునకు ఇచ్చెను. దానిని అతడు తీసుకొని కనులకద్దుకొని సంతసించెను. సీతాదేవి హనుమంతునితో ఇటుల చెప్పెను. "శ్రీ రామునకు నా నమస్కారములు చెప్పిఇట్లు ప్రార్థించితినని విన్నవింపుము. మీరు పరిపూర్ణకాములు. మీకు కావలసినది యేమిలేదు. అయినను దీనులను రక్షింతునని మీరు ప్రతిజ్ఞచేసియుంటిరి. నాథా! ఆ ప్రతిజ్ఞను జ్ఞాపకము తెచ్చుకొనండి; ఈ దీనురాలి దుఃఖమును దూరము చేయండి! హనుమా! నా మాటలు స్వామికి విన్నవించి ఇంద్ర పుత్రుడైన జయంతుని కథను, రామబాణము ప్రతాపమును శ్రీరామచంద్ర మూర్తికి గుర్తుచేయుము. నెలరోజులలో రానియెడల ఈ సీతను జీవించి యుండగాచూడలేరని నానాథునితో విన్నవించుము. హనుమా! నేను ఏట్లు ప్రాణములను నిల్పుకొనియుందును? నిన్ను చూడగానే నామనస్సు కొంత చల్లబడినది. నీవుకూడ వెళ్ళిపోవుచున్నావు. ఇక నా దుఃఖమునకు అంత మెప్పటికో!"

ఇట్లు పలుకుచున్న జానకీదేవికి హనుమంతుడు అనేక విధములుగా ధైర్యము చెప్పి నమస్కరించి సెలవు తీసుకొని బయలుదేరెను. వాయు నందనుడు సముద్రపు అవతలతీరమునకు చేరి హర్షధ్వని చేసెను. వానరులా ధ్వని విని తాముబ్రతికి బయటపడినట్లు సంతోషించిరి. వారు హనుమంతుని సమీపించి అతని ముఖములోని ప్రసన్నత, తేజస్సు, సంతోషముచూచి శ్రీరామ చంద్రుని కార్యము నెరవేర్చెనని తలంచిరి. లంకలో జరిగిన వృత్తాంత మంతయు హనుమంతుడు వివరించి చెప్పగా వానరులెల్లరు మిగుల సంతోషించిరి. అందరు కలసి ఆనందాతిశయముతో ఆడుచు పాడుచు శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళిరి.

స్ఫటిక శిలపై కూర్చున్న రామలక్ష్మణులు సంతోషాతిశయముతో వచ్చుచున్న వానరులను చూచి తమ కార్యము చక్కగా నెరవేర్చియుండ వచ్చునని తలంచుచుండగా వారెల్లరు శ్రీరాముని సమీపించి పాదాభి వందనము చేసిరి. శ్రీరామచంద్రమూర్తి ప్రేమతో వారిని లేవదీసి క్షేమసమాచారము లడిగెను.

అంత జాంబవంతుడు శ్రీరామునితో హనుమంతుడు లంకకు వెళ్ళి చేసి వచ్చిన సాహసోపేతమైన కార్యము లన్నియు వివరించి చెప్పెను. అది వినగానే శ్రీరాముడు సంతోషముతో హనుమంతుని కౌగిలించుకొని "నాయనా! సీత లంకలో ఎట్లున్నది? తన ప్రాణమును ఆమె ఎట్లు కాపాడు కొనుచున్నది?" అని అడిగెను. హనుమంతుడు, "తండ్రీ! సీతమ్మవారు క్షేమముగానే యున్నారు. అయితే తమ వియోగము వలన క్షణమొక యుగముగా గడుపుచున్నారు. నేను బయలుదేరు సమయమున గుర్తుగా అమ్మగారు తమ చూడామణి యిచ్చిపంపినారు" అని పలుకుచు చూడామణిని ప్రభువుకు అందించెను. రామచంద్రుడు ఆ మణిని ఆసక్తితో అందుకొని ప్రేమతో హృదయమునకు అద్దుకొనెను. పిమ్మట హనుమంతుడు శ్రీరాముని జూచి "ప్రభూ! సీతమ్మవారు కమలపత్రములవంటి నేత్రముల నుండి కన్నీరు కార్చుచు తమ కిట్లు విన్నవింపుమని చెప్పిరి. "నాథా! శరణాగత రక్షకుడవని ముల్లోకములవారు మిమ్ములను కీర్తించుచుందురే త్రికరణశుద్ధిగా మీనహధర్మచారిణినయిన నేను ఏమి అపరాధము చేసితినని నన్ను విడిచియుంటిరి. నేను ఒక తప్పు చేసితినని అంగీకరించుచున్నాను. మీయెడబాటు కలిగిననుకూడ ఈ పాపిష్ఠిప్రాణము ధరించియున్నాను. కాని ఆ తప్పు నాది కాదు. నానేత్రములది, విరహము అగ్ని, శరీరము దూది; శ్వాస వాయువు. అగ్నివాయువు కలిసినచో క్షణకాలములోనే శరీరము భస్మమైపోవును. కాని నేత్రములు ప్రభువును చూచి ఆనందింపవలెననే స్వార్థబుద్ధితో అశ్రుధారలు కార్చెను. ఆ కన్నీరు విరహాగ్నిని చల్లార్చి నందున నా దేహము భస్మము కాలేదు.



సీతాదేవి సందేశము విని ప్రభువు నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహింపసాగెను. అతడు హనుమంతునితో "హనుమా! మనోవాక్కాయ కర్మలతో నన్నే తనగతిగా నమ్మినవారికి స్వప్నములో కూడావిపత్తుకల్గునా!" అని పల్కెను. హనుమంతుడు "ప్రభూ! మిమ్ములను స్మరించువారికి తప్పక విపత్తువచ్చును. రాక్షసుల విషయము వేరుగా చెప్పవలెనా? మీరు శత్రువులను చెండాడి జానకీదేవిని తప్పక తీసుకొని రాగలరు" అని పల్కెను.

రామచంద్రుడు ఆ వాక్యములువిని "హనుమా! దేవతలలోను, మానవులలోను, మునులలోను, చివరకు దేహధారులైన మరెవ్వరిలో నీకంటె మహోపకారి నాకు మరెవ్వరు లేరు. నీకు నేనేమి ప్రత్యుపకారము చేయగలను? "నీ ఋణము ఎట్లు తీర్చుకొనగలను?" ఈ మాటలుపలికి ప్రభువు తదేక దృష్టితో చూచుచుండెను. స్వామి నేత్రములు ప్రేమాశ్రువులతో నిండి పోయెను. ప్రభువు పారవశ్యమును జూచి హనుమంతుడు ఆశ్చర్యము చెంది ప్రభూ! నన్ను రక్షించండి. రక్షించండి అని పల్కుచు శ్రీరాముని" పాదములమీద వ్రాలెను. ప్రభువు అతనిని లేవనెత్తుటకు ప్రయత్నించెను కాని ప్రేమలో మునిగియున్నందున అతడు లేవలేక పోయెను. అంతట ప్రభువు హనుమంతునిశిరస్సును మూర్కొనెను.

ఆ స్థితిని స్మరించి పరమశివుడు పరమానంద మగ్నుడయ్యెను. కొంత సేపటికి ఈశ్వరుడు నిబ్బరించుకొని ముందు కథ చెప్పసాగెను.

శ్రీరాముడు హనుమంతుని లేవదీసి గాఢముగా కౌగిలించుకొని తన వద్ద కూర్చుండ చెప్పుకొనెను.

ఓ హనుమా! రావణుని లంకలో నీవెట్లు ప్రవేసించగల్గితివి? అని ప్రభువు అడుగగా అహంకార రహితుడైన హనుమంతుడు ఇటుల పలికెను." స్వామీ! వానరుల బలము ఏపాటిది? వానరులు ఒక కొమ్మనుండి మరియొక కొమ్మ మీదకు దూకుచుందురు. సముద్రమును దాటుట, లంకానగరమును

కాల్చుట, మహావీరులైన రాక్షసులను హతమార్చుట యిది యంతయు మీప్రభావము గొప్పతనము గాని ఇందులో నాదేమియు లేదు. ప్రభువు ఎవరిమీద దయ గలిగియుందురో వారెంతటి కఠిన సమస్యల నైనను ఎదుర్కొన గలరు. తన ప్రభావము వలన దూదికూడ బడబాగ్నిని చల్లార్చి వేయగలదు. ఓ దేవా! అత్యంత సంతోషమును చెయు నీ నిశ్చలభక్తిని నాకు ప్రసాదించుము."

హనుమంతుని సరళస్వభావమును తెలుసుకొని ప్రభువు "తథాస్తు" అని ఆశీర్వదించెను.

ప్రభువు వాక్యములు విని వానరగణములు "కృపానిధి శ్రీరామ చంద్రమహారాజునకు జయము జయము" అని దిక్కులు పిక్కటిల్లునట్లు గొంతెత్తి బిగ్గరగా పలికిరి.

రామచంద్రుడు వానరరాజు సుగ్రీవుని పిలిచి "రావణునితో యుద్ధము తప్పదు. లంకకు వెళ్ళుటకు సిద్ధము కండి, ఆలస్యమెందులకు! వానరవీరులకు వెంటనే ప్రయాణమునకై ఆనుజ్ఞయివ్వండి" అని పల్కెను.

ప్రభువు యుద్ధమునకు సన్నద్ధమగుటను చూచి దేవతలు సంతోషముతో పూలవర్షము కురిపించిరి. సుగ్రీవుడు వానరవీరులను పిలువగానే వారు సైన్యములతో బయలుదేరి వచ్చిరి. వానరసైన్యములు, భల్లూకసైన్యములు గుంపులు గుంపులుగా వచ్చిరి. ప్రభువు పాదములకు తలవంచి నమస్కరించిరి. మహాబలవంతులైన వానరులు, ఎలుగు బంట్లు, బిగ్గరగా గర్జించు చుండిరి. శ్రీరాముడు వానరసేనను భల్లూకసేనను చూచెను. రాముని కృప వలన వారందరు అమితబలము పొందిరి. రెక్కలుగల పర్వతములా యన్నట్లు వారు కనపడుచుండిరి. వెంటనే లంకా నగరముపై జైత్రయాత్రకు అనేక శుభశకునములు కలుగసాగెను.

అన్నిశుభములతో నిండియున్న వీరాధివీరులగు వారు బయలుదేరు సమయమున మంచి శకునములు కలుగుట విధివిధానము.



జానకీదేవి ఎడమ అవయములు అదురుటవలన ప్రభువు బయలుదేరి యుండవచ్చునని ఆమె భావించెను.

రావణునకు కూడ ఎడమవైపు అవయవములు అదురుట వలన చెడుశకునములు కనపడసాగెను.

అసంఖ్యాకులైన వానరులు, ఎలుగుబంట్లు ఇచ్ఛానుసారముగా పర్వతములు, వృక్షములు అతిక్రమించుచు భూమ్యాకాశ మార్గముల మీదుగా వెళ్ళుచుండిరి. సింహముల వలె వారు గర్జించుచుండిరి. వారి గర్జనలకు అష్టదిగ్గజము లదిరి పోయెను. పర్వతములు కదలిపోయెను. సముద్రములు అల్లకల్లోలములయ్యెను. దేవతలు గంధర్వులు సిద్ధులు, మునులు "ఇక మా కష్టములు దూరమగు" నని సంతోషించిరి. అసంఖ్యాకులైన వానర యోధులు క్రోధముతో పళ్ళు కొరుకుచుండిరి' రామచంద్రునకు జయజయ ధ్వనులు చేయుచు పరుగెత్తు చుండిరి. సర్పరాజు ఆదిశేషుడు ఆ సేనా భారమును మోయజాలక. మిగుల బాధపడు చుండెను.

శ్రీరాముడు సేనావాహినితో సముద్రము తీరమునకు చేరుకొనెను.

హనుమంతుడు లంకానగరమును కాల్చి వేసి నప్పటినుండియు అచ్చటి రాక్షసులు భీతిల్లి తమ తమ యిండ్లలోపలనే కాలము గడుపుచు "ఇక మనకు రక్షణలేదు. వారిదూతయే యింతపని చేసి వెళ్ళగా వారే స్వయముగా వచ్చిన యెడల మన గతి యేమగును"? అని భయపడసాగిరి దూతల వలన నగరవాసుల వాక్యములు విని మండోదరి మిగుల వ్యాకులపడి ఏకాంతముగా నున్న తన ప్రాణనాథుని చెంత చేరి అతని పాదములు పట్టుకొని అతని మనస్సు కరుగుటకు వినయముతో "ఓ ప్రాణేశ్వరా! శ్రీహరితో వైరము నీకు తగదు. నేను నీ మేలునకే చెప్పుచున్నానని తలంచుము. వారిదూత చేసిన పనులు తలంచినంత మాత్రముననే స్త్రీల గర్భములు నష్టమగుచున్నవి. నీయొక్కయు, అందరియొక్కయు మేలుకోరినట్లయితే మంత్రిని తోడుగా ఇచ్చి మర్యాదగా సీతాదేవిని శ్రీరాముని

వద్దకు పంపి వేయుము. సీత రాక్షస జాతిని నశింపచేయుటకు వచ్చిన మృత్యుదేవత యని భావించుము. మీరు సీతను వారికి అప్పగించని యెడల త్రిమూర్తులు కూడ మిమ్ములను రక్షింపజాలరు. శ్రీరాముని బాణములు సర్పముల వంటివి. రాక్షస సమూహములు కప్పలతో సమానము. ఆ సర్పములు ఈ కప్పలను గుటుక్కున మ్రింగక ముందే మీరు హఠము వదలి అపాయము దీరు ఉపాయము ఆలోచించండి" అని ప్రార్థించెను.

అహంకారి అయిన రావణుడు అర్ధాంగి మండోదరి మాటలువిని పకపక నవ్వి "స్త్రీల స్వభావమే పిరికితనమునకు నెలవు. మంగళ కార్యములలో కూడా ఏవో యెట్లు జరుగునో యని వ్యర్థముగా భయపడుచుందురు వానరులు వచ్చినచో రానిమ్ము! భయమెందుకు? మనవారు వారిని తృప్తిగా కడుపునిండా భుజించుదురు. లోకపాలురు కూడా నాకు భయపడు చుండగా అట్టివాని అర్ధాంగ లక్ష్మివై కూడ నీవు భీతి చెందుట ఎంతటి హాస్యాస్పదము.

రావణుడు ఇట్లు ప్రగల్భములు పల్కెను. ఆమెను ఓదార్చి ధైర్యము చెప్పి సంతోషముతో కౌగిలించుకొని రాజసభకు వెళ్ళి పోయెను.

మహాసాధ్వి మండోదరి నాథునకు కాలము సమీపించినది కనుకనే తనహిత వాక్కులు కూడా ఆయన పాటించుట లేదని మనస్సులో మరింత చింతిల్లెను.

రావణుడు కొలువు కూటమునకు వెళ్ళి కూర్చొనగానే శత్రుసేనలు సముద్రము ఆవలి యొడ్డుకు చేరుకున్నారని వార్త వచ్చెను. అది విని రావణుడు మీసలహా యేమిటని మంత్రుల నడిగెను. "ఇందు మేము చెప్పునది యేమున్నది? దేవతలను, రాక్షసులను ఎందరినో జయించిన వారు మీరు. వీరాధివీరులైన మీకు మనుష్యులకు కోతులను గెలుచుట ఒక్క లెక్కలోనిదా?" అని వారు ప్రియోక్తులు పలికిరి. మంత్రులు, వైద్యులు,



గురువులు భయముచేగాని, లాభము పొందవలెననెడి ఆశచేగాని ముఖప్రీతిగా మాటాడుచుందురు. అట్టివారివలన క్రమముగా రాజ్యము. శరీరము, ధర్మము, నాశనమగును. రావణునకుకూడా అట్టివారే లభించిరి.

ఇదే సరియైన సమయమని తలంచి విభీషణుడు అచ్చటకు వచ్చెను. అన్నగారికి నమస్కరించి తన ఆసనము మీద కూర్చుండి అన్నగారి అనుమతి గై కొని ఇట్లు విన్నవించెను. "సోదరా! నా భావమును తెలుపుమని మీరడిగి యుంటిరి. అయితే వినండి. మీకు హితము కలుగుటకు నా బుద్ధికి తోచిన విషయము చెప్పుచున్నాను. తనకు శ్రేయస్సు, సౌఖ్యము, సత్కీర్తి, సద్గతి కావలెనని కోరు మనుష్యుడు పరస్త్రీలను తల్లివలె భావింపవలెను. పదునాల్గు లోకములకు ఒక్కడే అధిపతి అయినను అతడు కూడా జీవులతో వైరము పెట్టుకొనినచో తప్పక నశించును. మనుష్యుడెంతటి గుణవంతుడైనను, చతురుడైనను, లేశమైన అతనిలో లోభమున్న యెడల అతడు మంచివాడుగా పరిగణింపబడడు. కామ, క్రోధ, లోభ, మదములు నరకమునకు ద్వారములు. కాన వాటి నన్నిటిని త్యజించి శ్రీరాముని భజించుము. సత్పురుషులట్లు భజించిరి.

రాముడు మానవులకే రాజుకాడు. సమస్తలోకములకు ప్రభువు. కాలునకు కూడా కాలుడు. ఏ వికారములు లేనివాడు. జనన మరణములు లేనివాడు. అనంతుడు. సర్వవ్యాపకుడు. అజేయుడు. ఆ పరబ్రహ్మయే ఈ శ్రీరాముడు, భూభారమును తగ్గించుటకు, దేవతలను రక్షించుటకు, గో బ్రాహ్మణుల హితము కొఱకు మనుష్య శరీరముతో భగవంతుడే అవతరించెను సోదరా! సేవకులకు ఆనందము కలుగజేయువాడు, దుష్టులను దండించువాడు, వేదములను, ధర్మములను ఉద్ధరించువాడైన శ్రీరామచంద్రునితో విరోధము విడనాడుము. అతడు శరణాగత రక్షకుడు. అన్నయ్యా! నా మాటలు పాటించి సీతమ్మను ఆ ప్రభువునకు అప్పగించండి. ప్రయోజన మపేక్షింపక ప్రేమించే ఆ శ్రీరాముని సేవించండి.

మహాపాపాత్ముడైనను ప్రభువును శరణు వేడినచో ఆయన వానిని రక్షించును. వారి నామమును జపించిన యెడల ఆధ్యాత్మిక, అధిదైవిక. అధిభౌతిక తాపములు నశించును. అన్నా! పై విషయమును చక్కగా తెలిసికొనుము. ఓ దశకంధరా! మీ పాదములు పట్టుకొని మరి మరి ప్రార్థించు చున్నాను. మద మోహములను త్యజించి శ్రీరాముని శరణు వేడుము.

పులస్త్యముని తన శిష్యునిచే ఈ విధముగా కబురు పంపెను. ఇది సరియైన సమయమని మీకు చెప్పియుంటిని" అని విభీషణుడు ప్రబోధించెను.

రావణుని వద్ద మాల్యవంతుడను బుద్ధిశాలియైన మంత్రి యుండెను. అతడు విభీషణుని వాక్యములు విని మిగుల సంతసించి "లంకేశ్వరా! మీ సోదరుడు నీతిమంతుడు. బుద్ధిమంతుడు అతడు చెప్పినది చక్కగా ఆలోచించండి" అని పల్కెను.

రావణుడు వారి వాక్యములను విని "ఈ యిద్దరు మూర్ఖులును శత్రువులను గొప్పగా పొగడుచున్నారు. ఎవడురా అచ్చట! వీరిని దూరముగా పంపివేయండి" అని గర్జించెను.

ఇతడు ఎవరు చెప్పినా వినడు. రాక్షసులందరికి కాలము అసన్నమైనదని తలంచి మాల్యవంతుడు తన యింటికి వెళ్ళిపోయెను కాని విభీషణుడు చేతులు ముకుళించుకొని తిరిగి అన్న చెంత కరిగి యిట్లుచెప్పెను. "సోదరా! వేదములు, పురాణములు ఇట్లుచెప్పుచున్నవి. సుబుద్ధి, దుర్బుద్ధి అందరి హృదయములలో నుండును. సుబుద్ధి యున్నచోట అనేక విధములైన సంపదలు, సుఖములు కల్గును. దుర్బుద్ధి యున్నచోట దారిద్ర్యము, దుఃఖములు కల్గుచుండును. తమ బుద్ధి యిపుడు తలక్రిందులైనది. అందుచే మీరు హితులను అహితులుగాను, మిత్రులను శత్రువులుగాను చూచు చున్నారు. రాక్షస వంశమునకు వినాశకాలము దాపురించినది అందువలనే మీకు సీతమ్మ మీద మోహము కల్గినది. అన్నయ్యా! మీ పాదములను



పట్టుకొని ప్రార్థించుచున్నాను. ప్రాథేయపడుచున్నాను. ఈ సోదరుని మీద దయయుంచి సీతాదేవిని శ్రీరామునకు అప్పగించండి. మీరు సుఖపడండి"

రావణునకు అనర్థము కలుగ కుండుటకు గాను వేదములనుండియు, పురాణములనుండియు పండితులు చెప్పిన నీతి వాక్యములను చక్కగా ఉదాహరించి విభీషణుడు అన్నకు హితవు చెప్పెను ఆ వాక్యములు విని రావణుడు మహాక్రోధముతో లేచి "ఓ దుష్టుడా! నా అన్నము తిని బ్రతుకు చున్నావు. శత్రుపక్షమే మంచిదని బాహాటముగా చెప్పుచున్నావు. మూర్ఖుడా! లోకములో నా భుజబలముచేత నేమ గెలవని వీరుడెవడైనా యున్నాడా? చెప్పుము. నా శత్రువుల మీదనే నీకు ప్రేమ యున్నచో వారివద్దకే వెళ్ళి ఈ నీతులు వారికే బోధించుము" అని పలుకుచు కోపము పట్టజాలక గట్టిగా విభీషణుని ఒకతన్ను తన్నెను. ఐనను అతడు అన్న పాదములు పట్టుకొని మరిమరి ప్రార్థించెను.

"వింటివా పార్వతీ! సత్పురుషులు తమకు చెడుచేసినవారికి కూడా మేలు చేయుదురు. ఇది వారి స్వాభావికమైన గొప్పతనము" అని ఈశ్వరుడు పార్వతీదేవికి చెప్పెను.

"విభీషణుడు రావణునితో "మీరు నాతండ్రివంటివారు. మీరు తన్నినను మంచిదే! కాని మీరు సుఖపడవలెనన్నచో రాముని భజించండి"అని చెప్పి తన మంత్రులను వెంట తీసుకొని గగన మార్గమున బయలుదేరెను. అందరకు వినబడునట్లుగా విభీషణుడు "శ్రీరామచంద్రుడు సత్య సంకల్పుడు. అంతేకాదు. సర్వసమర్థుడు కూడా! రావణా! నీ వారెల్లరు కాలునకు వశీభూతులై యున్నారు కనుక నేను శ్రీరామచంద్రుని పాదముల నాశ్రయించుటకు వెళ్ళుచున్నాను. ఇది నా తప్పుగా పరిగణింపవద్దు." అని పలికి అచ్చటనుండి వెళ్ళిపోయెను అప్పుడే రాక్షసులకు ఆయుస్సు క్షీణమయ్యెను.

"ఓ భవానీ! సత్పురుషులను అవమానపరచువాడు ఆ పాప ఫలము వెంటనే అనుభవించును. విభీషణుడు వదలి వెళ్ళినప్పటినుండి రావణుని వైభవము నశించెను" అని ఈశ్వరుడు పార్వతీదేవికి తరువాతి కథ నిట్లు చెప్పెను.

అట్లు విభీషణుడు అనేక మధుర భావములు మనస్సులో తలయెత్తు చుండగా శ్రీరాముని దివ్యసన్నిధికి బయలుదేరెను. అతడు తనలో తానిట్లు ఆలోచించుకొనుచు వెళ్ళుచుండెను. "నేను ప్రభువు కోమల పాదపద్మములను కనుల విందుగా సందర్శించెదను. ఏ పాదములు సేవకులకు సుఖము నిచ్చునో, ఏ పాదస్పర్శవలన ఋషిపత్ని అయిన అహల్యాదేవి తరించెనో, ఏ పాదములు దండకారణ్య భూములను పవిత్రము చేసెనో, ఏ పాదములను జానకీదేవి తన హృదయములో పదిలపరచుకొనెనో, ఏ పాదపద్మములు సాక్షాత్ పరమేశ్వరుని హృదయ సరోవరములో విరజమై యున్నవో అట్టి దివ్యచరణములను నేను చూడగలను. ఏమి భాగ్యము! నా భాగ్యము!!

ఈ విధముగా భక్తిపారవశ్యముతో మైమఱచి అతడు సముద్రమునకు ఆవలవైపున ఉన్న శ్రీరాముని సేనను సమీపించెను.

వానర సేనానాయకులు విభీషణుని శత్రుదూతగా భావించి అతని మార్గమును అడ్డగించిరి. తమ ప్రభువైన సుగ్రీవున కావిషయము విన్నవించిరి. అతడు శ్రీరామచంద్రుని వద్దకు వెళ్ళి "రామచంద్రా! రావణుని సోదరుడు మిమ్ములను కలుసుకొనుటకు వచ్చియున్నాడు. రమ్మనెదరా? అనిపల్కెను. శ్రీరాముడు సుగ్రీవునిచూచి "సుగ్రీవా! ఈ విషయములో నీ అభిప్రాయ మేమిటి? అని అడుగగా "ఈ రాక్షసుల మాయ తెలిసికొన వీలుపడనిది. వారు ఇచ్ఛానుసారముగా ఏ రూపము కావలెనన్న ఆ రూపము ధరింపగలరు ఈ మోసగాడు ఏ ఉద్దేశము మనస్సులో పెట్టుకొని ఇచ్చటికి వచ్చినాడో తెలుసుకొనుట యెట్లు? మన రహస్యాలను తెలుసుకొనుటకే ఈ విభీషణుడు వచ్చియున్నట్లు నాకు తోచుచున్నది. కనుక వెంటనే వానిని



బంధించుటయే మంచిదని నా అభిప్రాయము" అని సుగ్రీవుడు సమాధాన మిచ్చెను.

శ్రీరాముడు సుగ్రీవునితో "మిత్రమా! నీవు రాజనీతి ననుసరించితివి. కాని శరణాగతుల పారద్రోలుటయేనా ప్రతిజ్ఞ? శరణు జొచ్చిన వారిని తనకు మేలు కలుగదనే అనుమానముతో ఏ వ్యక్తి విడిచి పెట్టునో వాడు పాపాత్ముడు. వానిని చూచుట కూడ పాపమే. నా సమక్షమునకు రాగానే జీవులు చేసిన కోట్ల జన్మాల పాపాలు నష్టమగును. పాపాత్మునకు సహజముగా నాయందు భక్తి కుదురదు. ఇతడు వాస్తవముగా దుష్టుడే అయినచో నా సమ్ముఖమునకు ఎట్లు రాగలడు? నిర్మల మనస్సు గల మనుష్యులే నన్ను పొందగల్గుదురు. నాకు కపటము, మోసము ఎంత మాత్రము నచ్చవు. ఒకవేళ మన రహస్యాలను తెలుసుకొనడానికే రావణుడు వీనిని పంపినప్పటికి సుగ్రీవా! మనము ఏ మాత్రము భయపడవలసినపనిలేదు. ఏలన మహావీరుడయిన మన లక్ష్మణుడు క్షణకాలములో జగత్తులో గల రాక్షసుల నందరను హతమార్చగలడు. అతడు భీతుడై నా శరణుజొచ్చుటకు వచ్చినచో నా ప్రాణమిత్రునిగా భావించి అతనిని కాపాడగలను. వానిని నా యెదుటకు తీసుకొనిరమ్ము." అని శ్రీరాముడు పల్కెను. "కృపాసముద్రుడైన శ్రీరామచంద్రమూర్తికి జయము జయము" అని పలుకుచు సుగ్రీవుడు అంగద, హనుమంతులతో వెళ్ళి విభీషణుని ఆదర పూర్వకముగా తీసికొనివచ్చి కరుణానిధి అయిన రాముని ముందు నిలబెట్టెను.

అత్యంత శోభాయమానముగా వెలుగొందుచున్న శ్రీరామచంద్రుని విభీషణుడు కన్నార్పకుండా తదేక దృష్టితో చూడసాగెను. విశాలమైన భుజములు, అరుణ పద్మములవంటి నేత్రములు, శ్యామల శరీరము, విశాలమైన వక్షఃస్థలము, కోటి కోటి కామదేవులను కూడ సమ్మోహితుల చేయగల సుందరవదనారవిందము, ప్రభువు యొక్క దివ్యమంగళ స్వరూపమును చూచి విభీషణుని నేత్రములలో ఆనందబాష్పములు

నిండిపోయెను. శరీరము పులకితమయ్యెను ధైర్యము తెచ్చుకొని అతడు శ్రీరామచంద్రునికి నమస్కరించి యిట్లు పలికెను.

"ప్రభూ! దశకంఠుడైన రావణుని సోదరుడను నేను. రాక్షస వంశమునందు జన్మించితిని. తామస శరీరుడను. గుడ్లగూబ అంధకారమును సహజముగా ప్రేమించినట్లు స్వాభావికముగా నేను పాపమునే ప్రేమించు చుందును. తమ సత్కీర్తిని విని వచ్చితిని. మీరు భవ భయమును పోగొట్ట గలరని, ఆర్త త్రాణ పరాయణులని, శరణాగత రక్షకులని, తెలుసుకొని వచ్చితిని నన్ను రక్షించండి. కటాక్షించండి. దేవదేవా!" అని అత్యంత వినమ్రతతో పలుకుచు అతడు ప్రభువు పాదములకు ప్రణమిల్లెను.

ఆ మాటలు విని శ్రీరాముడు మిగుల సంతసించి లేచి విభీషణుని తన హస్తములతో లేవనెత్తి హృదయమునకు హత్తుకొనెను. తన ప్రక్కన కూర్చుండ బెట్టుకొని ఇట్లు పల్కెను. "ఓ లంకేశ్వరా! నీకు కుటుంబ సహితముగా కుశలమేనా? నీవు అపవిత్ర స్థానమున నివసించుచున్నావు. రేయింబవళ్ళు దుష్టుల మధ్య నివాసము చేసితివి. అట్లయ్యునీ ధర్మాన్ని నీవెట్లా నిర్వర్తించగల్గితివో! నీ ఆచార వ్యవహారములు నాకు తెలియును. నీవు గొప్ప నీతి నిపుణుడవు. అవినీతి అనేది ఏ మాత్రము నీకు సరిపడదు. నరకములో నుండుటయైనను మంచిది కాని దుష్టుల సహవాసములో నుండుట మంచిదికాదు విధాత అట్లు చేయుగాక!!

ప్రభువాక్యములు విని విభీషణుడు ఇటుల విన్నవించెను. "శ్రీరామా! మీపాదములను దర్శించి కుశలుడనైతిని క్రొత్తవాడనైనను నాకు ఆశ్రయ మిచ్చు మీ సేవకునిగా నన్ను భావించి నాపై దయ చూపితిరి.

శోకమునకు మూలమైన కామమును విడిచి శ్రీరాముని సేవించనంత వరకు జీవులకు క్షేమము లేదు. స్వప్నములో కూడా అట్టివారికి శాంతి యుండదు కోదండపాణి అయిన శ్రీరామచంద్రుడు హృదయములో వసించనంత వరకు లోభ, మోహ, మద, మాత్సర్యములనే దుష్టశక్తులు జీవుల హృదయములో నివసించుచుండును.



మమత్వమనేది అమావాస్య రాత్రి వంటిది. రాగద్వేషములనే గుడ్లగూబలకు అది ఆశ్రయమిచ్చును. ప్రభువు ప్రతాపమనే సూర్యుడు ఉదయించనంత వరకు ఆ మమకారమనే రాత్రి జీవుని మనస్సులో ఏర్పడియుండును. ప్రభూ! మీ దివ్య చరణారవిందములను దర్శించి నంతనే నా భయమంతయు దూరమై పోయెను. మీరు ఎవరియందు అనుకూలముగా ఉందురో వారిని ఆధ్యాత్మిక, అధిదైవిక, అధిభౌతిక తాపములు ఏమీ చేయలేవు. నేను నీచస్వభావముగల రాక్షసుడను. నేనెప్పుడును శుభకర్మలు ఆచరించి యుండలేదు. ఏ మహాత్ముని రూపము తపోనిష్ఠా గరిష్ఠులైన మునీశ్వరులకు కూడా ధ్యానములో అందదో అట్టి ప్రభువు స్వయముగా నన్ను కౌగిలించుకొనెను. మహద్భాగ్యము నాకు లభించినది బ్రహ్మ, ఈశ్వరుడు ఆరాధించే ఆ పరమ పవిత్ర పాద పద్మములను నేను కన్నుల పండువుగా చూడగల్గితిని."

విభీషణుని వినయ బాషణములు విని "మిత్రమా! నా స్వభావము చెప్పుచున్నాను. వినుము, కాకభుశుండి, ఈశ్వరుడు, పార్వతీదేవి మాత్రమే దానిని ఎరుగుదురు. ఏ వ్యక్తి సంపూర్ణ చరాచర జగత్తుకు ద్రోహియో, అతడుకూడా భీతావహుడై నాశరణువేడి, మోహ, క్రోధములను, కపట ద్రోహములను విడిచివేయునో, అతనిని నేను వెంటనే సాధు పురుషునిగా చేయుదును. ఎవరు తల్లి, తండ్రి, సోదరులు, పుత్రులు, మిత్రులు, కళత్రము, శరీరము, ధనము, గృహము, పరివారము వీటన్నింటి యందు గల మమకారమనే దారములకు ఏర్చికూర్చి త్రాడుగా వేసి దాని ద్వారా తన మనస్సును నా పాదాలతో ఎవడు సమదర్శియో, ఎవనికి ఎట్టి కోరికలు లేవో, ఎవని మనస్సులో హర్షము, విషాదము, భయము ఉండవో అటువంటి సజ్జనుడు నా హృదయములో నిత్యము నివసించుచుండును. లోభి హృదయములో ధనము ఎల్లప్పుడు నివసించిన మాదిరిగా నీవంటి మహాత్ములలో నేను నిరంతరము నివసించుచుందును. నేను ఎవరి కొఱకు అవతరించుట లేదు. ఎవరు సద్గుణ పరమాత్మను ఉపాసించెదరో, ఇతరులకు

మేలుచేయుట లోనే నిమగ్నులై యుందురో ఎవరు నీతినియమములు తప్పక దృఢముగా నుందురో, అట్టి మనుష్యులు నాకు ప్రాణ సమానము. ఓ లంకాపతీ! నీయందు పేర్కొనిన అన్ని సుగుణములు కలవు. కనుక నీవు నాకు అత్యంత ప్రేమ పాత్రుడవైతివి" అని పల్కెను.

శ్రీరాముని వాక్యములు విని వానురరులెల్ల స్వామి కృపా విశేషమునకు మిగుల సంతసించిరి.

విభీషణుడు శ్రీరాముని జూచి యిట్లు పలికెను. "ఓ దేవా! శరణాగతరక్షకా! ఆపద్బాంధవా! నా హృదయములో దాగుకొనియున్న వాసనలు మీ పాదముల ప్రీతి అనే నదితో కొట్టుకొని పోయినవి పవిత్రమైన మీ భక్తిని నాకు ప్రసాదించండి" అని ప్రార్థించెను. "ఏవమస్తు" అని ప్రభువు వెంటనె పలికి సముద్రజలమును తెప్పించెను.

ప్రభువు విభీషణునితో ఇటుల పలికెను "మిత్రమా! నీకు కోరిక లేకపోయినను నా దర్శనము అమోఘమైనది. అది నిష్ఫలము కాదు." అని చెప్పి శ్రీరామచంద్రుడు విభీషణునికి రాజ్యాభిషేకము చేసెను. ఆ శుభసమయమున ఆకాశమునుండి పుష్పవర్షము కురిసెను.

రావణుని క్రోథాగ్ని విభీషణుని వచనములనే వాయువుతో ప్రజ్వలితము కాగా ఆ అగ్నిజ్వాలలో ఆహుతికానున్న విభీషణుని శ్రీరాముడు రక్షించెను. అంతియే గాక అఖండ సామ్రాజ్యము నిచ్చెను. తన పది తలలను బలి యిచ్చుటవలన ఏ మహా సంపద ఈశ్వరుని ద్వారా రావణుడు పొందగల్గెనో, అది విభీషణునకు శ్రీరాముడు ఆయాచితముగానే ప్రసాదించెను. అట్టి పరమ కృపాళువు అయిన రాముని విడిచి ఎవరు ఇతరులను సేవించెదరో వారు కొమ్ములు, తోకలు లేని పశువులు.

పిమ్మట సర్వాంతర్యామియైన రాముడు "ఓ సుగ్రీవా! ఓ విభీషణా! అగాధమైన ఈ సముద్రమును మనము ఎట్లు దాటవలెను? వివిధములైన తిమింగిలములు, మహామకరములు, సర్పములు, మత్స్యములతో నిండియున్న యీ సముద్రమును దాటుట చాల కష్టమైన కార్యము" అనెను.



అంతట విభీషణుడు "స్వామీ! మీరు ఒకే ఒక బాణముతో కోటి సముద్రములనైనను క్షణములో ఇంకింప జేయగలరు. అయినప్పటికి మొదట మీరు వెళ్ళి సముద్రుని ప్రార్థించుట ఉచితము. సముద్రుడు మీ వంశమునకు పురాణ బంధువు. కనుక ఆయన ఆలోచించి ఉచితోపాయము చెప్పగలడు. అప్పుడే సేన అంతా శ్రమ లేకుండానే సముద్రమును దాటగలదు." అని పల్కెను.

ఈ మాటలు విని శ్రీరామచంద్రుడు "మిత్రమా! చక్కని ఉపాయము చెప్పితివి. అట్లు చేయుటయే మంచిది. దేవుడు సహాయపడితే మన పని అనుకూలించును." అనెను.

ఈ సలహా లక్ష్మణున కేమాత్రము నచ్చలేదు. శ్రీరాముని వాక్యములు విని అతడు మిగుల దుఃఖించి యిట్లు పలికెను. "సోదరా! దేవుని మీద ఎందుకు ఆధారపడవలెను. కోపముతో సముద్రాన్ని ఇంకింప జేయండి. దైవము అనేది పిరికితనము గలవారికి ఊరట కల్గించే ఉపాయము మాత్రమే. సోమరులే "దైవము దైవ"మని ఆక్రోశించెదరు."

ఈ మాటలు విని నవ్వి "అట్లేచేయుదము. ధైర్యము కలిగి యుండుము" అని లక్ష్మణునకు అనేక విధాల నచ్చజెప్పి రఘునాథుడు సముద్రమును సమీపించెను.

మొదట రాముడు శిరస్సు వంచి సముద్రమునకు ప్రణమిల్లెను. పిమ్మట ఒడ్డున దర్భలు పరచుకొని దానిపై కూర్చుండెను.

విభీషణుడు లంకను విడిచి రామచంద్రుని వద్దకు చేరగానే రావణుడు అతని వెనుక దూతలను పంపెను. వారు కపటముతో వానరరూపములు ధరించి అన్ని లీలలు చూచిరి. వారు ప్రభువు గుణగణములను

శరణాగతులయందు ప్రభువునకు గల వాత్సల్యమును గ్రహించి తమ హృదయములలో ప్రశంసించుచుండిరి. పిమ్మట వారు నిజరూపములో ప్రకటితులై అత్యంత ప్రేమతో శ్రీరాముని స్వభావమును కొనియాడ ప్రారంభించిరి. తమ కపట వేషములను మరచిపోయిరి. వానరులు వీరు "శత్రుదూతలు" అని తెలుసుకొని వారిని బంధించి సుగ్రీవుని వద్దకు తోడ్కొనిపోయిరి. అతడు వారి నందరిని అవయవ విచ్ఛేదము చేసి వికృతాకారములతో తిరిగి పంపుడని ఆజ్ఞాపించెను వానరులు ఆ దుష్టులను బంధించి సేనచుట్టూ త్రిప్పి అనేకవిధాలుగా కొట్టుచు బాధింపసాగిరి. వారు దీనాలాపములు చేయుచున్నను వానరులు వారిని విడిచిపెట్టలేదు. మా చెవులను ముక్కులను కోయవద్దు మేము శ్రీరామునిపై ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాము అని వారు మొరపెట్టగా లక్ష్మణుడు వారలనందరిని తన వద్దకు పిలిపించుకొనెను. ఆయనకు వారిపై చాల దయ కల్గినది. రాక్షసులను విడిచిపెట్టించి అతడు వారితో ఇటుల చెప్పెను. రావణునకు ఈ ఉత్తరము నిచ్చి ఇట్లు చెప్పండి. "ఓరీ కులఘాతుకుడా! లక్ష్మణుని సందేశమును తెలుసుకొనుము. సీతాదేవిని శ్రీరామునకు అప్పగించని యెడల మృత్యుదేవత వద్దకు వెళ్ళుటకు సిద్ధము కమ్ము."

ఆ దూతలు లక్ష్మణునకు నమస్కరించి శ్రీరాముని గుణగణములను కీర్తించుచు ఉత్తరము తీసుకొని రావణుని వద్దకు వెళ్ళిరి. రావణునకు వారు నమస్కరింపగా అతడు నవ్వుచు "ఒరే! మీ క్షేమము త్వరగా చెప్పరేమిరా? అక్కడ విభీషణు డెట్టున్నాడురా? వానికి మృత్యువు సమీపించి అచ్చటికి వెళ్ళినాడు. చక్కగా రాజ్యపాలన చేయుచు సుఖింపలేక ఆ దౌర్భాగ్యుడు లంకానగరమును వదలి వెళ్ళిపోయినాడు. ఇప్పుడు వానిగతి "రెంటికి చెడ్డరేవడ"యగును. అక్కడ వానరుల, యెలుగుబంట్ల ఆవస్థయెట్లున్నదో! వానరులకు, రాక్షసులకు మధ్యలో సముద్రము అడ్డుగానున్నది. లేనిచో ఏనాడో; మన రాక్షసులు ఆ వానరులను, ఎలుగుబంట్లను మ్రింగి వేసి యుండేవారు. ఆ యిద్దరు తాపసులు ఎట్లున్నారు? బహుశః నా పేరు విని



వారు భయపడుచుందురు. వారినీ మీరు కలుసుకొంటిరా? వారు అక్కడ నున్నారా లేక నాకీర్తి ప్రతిష్ఠలు విని తిరిగి వెళ్ళిపోయారా? శత్రుసేనల తేజము, బలము చెప్పరేమిరా?" అని ఆవేగముతో ప్రశ్నల వర్షము కురిపించెను.

అప్పుడ దూతలు ఇటుల సమాధానము చెప్పిరి. ప్రభూ! ఎట్లు తమరు నెమ్మదిగా అడుగుచున్నారో, అట్లే దయచేసి కోపము విడిచి మేము చెప్పు మాటలు శాంతముతో వినండి. మీ సోదరుడు విభీషణుడు రాముని వద్ద సుఖముగానున్నాడు. అతడు వెళ్ళగానే రాముడు అతనిని లంకకు రాజుగా చేసివేసెను. మేము రావణుని దూతలమని యెఱిగి వానరులు మమ్ములను బంధించిరి. కొట్టిరి తిట్టిరి. మాముక్కు చెవులను కోయదలంచిరి. శ్రీరాముని మీద ఒట్టు పెట్టినందున వారు మమ్ములను ఏమీ చేయక విడిచి పెట్టిరి. శత్రుసేనను గూర్చి తెలుపుమని తమరు అడుగుచున్నారు వారి సేనలను కోట్ల ముఖములతో నైనను వర్ణించి చెప్పజాలము. రంగు రంగుల ఎలుగుబంట్లు, భయంకరులైన వానరులు. శక్తిమంతులైన యోధాను యోధులు. వానర వీరు లెల్లరు వానరరాజు సుగ్రీవునితో సమానమైన బల పరాక్రమములు గలవారు. లంకను కాల్చి అక్షకుమారుని వధించిన ఆ కోతి అచ్చటి వానరులందరి కంటె తక్కువవాడు. అతనికంటె బలాఢ్యు లెందరో నున్నారు. ద్వివిదుడు, మైందుడు, నలుడు, నీలుడు, గదుడు, అంగదుడు. వికటాస్యుడు, దధిముఖుడు, కుముదుడు, శతకంఠుడు, శరుడు, జాంబవంతుడు. ఆ సేనలో వీరు లంతా అమిత బలశాలురు. సుగ్రీవునితో సమానమైన బలముగలవారు. అట్టివారు ఒకరు ఇద్దరు కారు. కోటాను కోట్లమంది యున్నారు. ముల్లోకములను వారు గడ్డిపరకవలె చూచుచున్నారు. రాక్షస రాజా! కేవలము వానర సైన్యాధిపతులే పదునెనిమిది పద్మములున్నట్లు విన్నాము. ఆ సేనలో మనవారిని గెలువలేని వానరుడంటూ ఒకడైనా లేడు. అందరు కోపముతో గంతులు వేయుచున్నారు. ముందుకు దుముకుచున్నారు. చేతులు నలుపుచున్నారు. కాని రామాజ్ఞలేదని ఆగియున్నారు. "మహా

సముద్రమును మేము త్రుటికాలములో ఇంకించెదము. లేనిచో పెద్ద పెద్ద పర్వతాలతో దానిని నింపి పూడ్చివేయుదుము. క్షమించండి. రావణుని నలిపివేసి మట్టిలో కలిపివేయుదుము" అని వానరు లెల్లరు గప్పములు కొట్టుచుండిరి. రాక్షసరాజా! సహజముగానే వారు నిర్భయులు. "లంకా నగరమునే మ్రింగివేయ గోరుచున్నారా" అన్నట్లు వారు గర్జించుచున్నారు. వానరు లెల్లరు స్వాభావికముగానే వీరాధివీరులు. వారికి శిరోభూషణమై రామచంద్రుడు ప్రకాశించుచుండెను. వారు రణరంగములో కోట్లాది యముల నైనను జయింప గలరు. శ్రీరాముని తేజము, బలము, సామర్థ్యము, గొప్పతనము, బుద్ధి వీనిని లక్షలాది ఆదిశేషులు కూడా వర్ణింప జాలరు. వారు ఒకే బాణముతో వందలాది సముద్రజలములను ఇంకింప చేయగలరు. అయినను నీతి విశారదుడైన రామచంద్రుడు మీ సోదరుని ఉపాయ మడిగెను. అతని ఆలోచన ప్రకారము రాముడు మార్గ మొసగుమని సముద్రుని ప్రార్థించెను.

దూత ల వాక్యములు విని రావణుడు పకపక నవ్వుచూ "ఓరీ! ఇక ఆపండి! వట్టి పిచ్చివాడు కావుననే పోరాడుటకు కోతులను సహాయము తెచ్చుకొనెను. స్వాభావికముగా పిరికివాడైన విభీషణుని మాటలు నమ్మి రాముడు సముద్రుని ప్రార్థించినాడు. ఒరే మూర్ఖులారా! అబద్ధపు గొప్ప తనములు ఏమిచేయగలవు! నేను ఈ రాముని బలము, బుద్ధి అంతు తెలుసుకొంటిని. విభీషణుని వంటి పిరికిపందను మంత్రిగా పెట్టుకొన్నవానికి విజయము, ఐశ్వర్యము ఎట్లు లభించునురా!" అని పల్కెను.

దుష్టుడైన రావణుని వచనములు విని దూతలు కోపముతో యిదే మంచి సమయమని భావించి లక్ష్మణుడు ఇచ్చిన యుత్తరమును ఇచ్చిరి. "రాముని తమ్ముడైన లక్ష్మణుడు ఈ పత్రమును తమ కిమ్మని యిచ్చెను. దీనిని చదివి తమ ఆగ్రహమును చల్లార్చు కొనండి" అని పలికిరి.

రావణుడా ఉత్తరమును తీసుకొని మంత్రికి ఇచ్చి చదువుమని చెప్పెను. ఆ పత్రికలో ఇట్లు వ్రాసియున్నది.



"ఓరీ మూర్ఖుడా! మాటలతోనే మాకు కోపమును తెప్పించి నీ కులమును నశింపచేసికొనకుము శ్రీరామునితో వైరము పెట్టుకొని త్రిమూర్తులను శరణు వేడినను నీవు రక్షింపబడవు. అహంకారమును విడిచి విభీషణుని వలె ప్రభువు పాదములను ఆశ్రయింపుము లేనిచో రామబాణాగ్నిలో కుటుంబ సమేతముగా భస్మమగుటకు సిద్ధము కమ్ము. రెండింటిలో ఏది మంచిదను కొందువో దానిని చేయుము.

ఆ లేఖలోని వాక్యములు వినగానే రావణుడు భీతి చెందెను. కాని ముఖముపై చిరునవ్వు తెచ్చుకొనుచు అతడు ఇటుల పలికెను. "ఈ చిన్న తపస్వి భూమిమీదనిలబడి ఆకాశమును తన చేతులతో పట్టుకొనవలెనని ప్రయత్నించుచున్నట్లు ప్రగల్భములు పలుకుచున్నాడు."

ఆ మాట విని దూత ఇట్లనెను. "ప్రభూ! అహంకారస్వభావమును వదలి ఆ యుత్తరములో వ్రాసిన అన్ని విషయములు సత్యమని నమ్మండి. క్రోధమును విడిచి నా మాటలు వినండి. శ్రీ రామచంద్రునితో విరోధము పెట్టుకొనకండి. శ్రీరాముడు సమస్తలోకాలకు ప్రభువు. వారి స్వభావము అత్యంత కోమలమైనది. కలుసుకొనగానే ప్రభువు మీ మీద దయజూపును. మీ అపరాధ మొక్కటి గూడ వారు గమనింపరు. జానకీదేవిని రామునకు అప్పగించండి". ఈ దూత మాటలువినగానే రావణుడు మిగుల కోపగించెను. చివరి వాక్యము వినగానే కోపముతో దూతను తన్నెను. ఆ దూత కూడ విభీషణుని వలెనే రాముని సన్నిధికి వెళ్ళి తన కథ అంతా స్వామికి విన్నవించెను.

శ్రీరాముని కృపవలన అతడు మునిరూపము పొందెను.

"ఓ భవానీ! ఆ దూత జ్ఞాని అయిన ముని అగస్త్యుముని శాపము వలన రాక్షసుడై పోయెను శ్రీరామునకు మాటిమాటికి నమస్కరించుచు అతడు తన ఆశ్రమమునకు వెళ్ళిపోయెను."

ఇచ్చట మూడుదినములు గడచినను సముద్రుడు శ్రీరాముని ప్రార్థనమును మన్నించలేదు. "ఇట్టివారికి భయము లేనిదే భక్తి కుదరదు. లక్ష్మణా! ధనుర్బాణములు తీసుకరమ్ము. అగ్నిబాణముచే సముద్రమును ఇంకింపజేసెదను. మూర్ఖునిపట్ల వినయము, మోసగానిపట్ల ప్రేమ, లోభికి ఔదార్యమును ఉపదేశించుట, మమకారములో చిక్కుకున్న వ్యక్తికి జ్ఞాన కథలు చెప్పుట, అత్యంతలాలసునకు వైరాగ్యము చెప్పుట, కోపిష్ఠికి శాంతివిషయములు చెప్పుట, చవిటి నేలలో విత్తనములు చల్లుట నిష్ప్రయోజనము". ఇట్లు పలికి రఘునాథుడు ధనుస్సు నెక్కుపెట్టెను. అన్నగారు ఇట్లు చేయుటవలన లక్ష్మణుడు మిగుల సంతసించెను. అగ్నిబాణము సంధింపగా సముద్రములో అగ్నిజ్వాలలు చెలరేగెను అందుగల మొసళ్ళు, సర్పములు, తిమింగిలములు, చేపలు, వ్యాకులము చెందెను. అంతట తనలో గల ప్రాణులు భస్మమగుటను సముద్రుడు చూచి కంగారుపడి బంగారపు పళ్ళెములలో రత్నములను నింపుకొని, అహంకారము విడిచి బ్రాహ్మణరూపముతో శ్రీరాముని సన్నిధికి వచ్చెను.

"ఎన్ని ఉపాయాలతో నీరుపోసి పెంచినను అరటి గెల కోయనిదే పండదు. వినయముతో నీచుడు దారికి రాడు."

సముద్రుడు భీతిల్లి ప్రభువుకు నమస్కరించి "తండ్రీ! నా అవగుణములను క్షమించండి. పంచభూతములు స్వభావతః జడములు. మీ ప్రేరణ వలన మాయ వీనిని ఉత్పన్నము చేసెను. గ్రంథము లన్నియు ఇదే విషయము చెప్పినవి. ప్రభువు అనుగ్రహము ఎవరికి ఎట్లు ఉండునో వారు అటులనే జీవించుటలో ఆనందము పొందగలరు. ప్రభువు నాకు దండన విధించి మంచిపని చేసినారు.

ప్రభు ప్రతాపమువలన నేను ఇంకిపోదును. సేనలు దాటిపోగలవు. ప్రభువు ఆజ్ఞ అనుల్లంఘనీయము. అని వేదములు కీర్తించినవి. మీకు ఏది మంచిదో అట్లు వెంటనే నేను చేయుదును." అని పల్కెను.



సముద్రుని వినయవాక్కులు విని కృపాసముద్రుడయిన శ్రీరామ భద్రుడు "వానరసేన దాటగల ఉపాయము చెప్పు"మని అడిగెను.

సముద్రుడు ఇటుల సమాధానము చెప్పెను. "ప్రభూ! నీలుడు, నలుడు అనే యిద్దరు వానర సోదరులు మీ సేనలో గలరు. బాల్యములోనే వారు ఒక ఋషి నుండి శాపమువంటి ఆశీర్వాదము పొందియుండిరి. వారి స్పర్శ తగిలినచో ఎంతటి గొప్ప పర్వతమైనను సముద్రములో తేలగలదు. ఇట్లు నాపై సేతువు నిర్మించి సముద్రమును దాటిపోగలరు. నేను కూడా ప్రభువుయొక్క గొప్పతనమును మనస్సులో పెట్టుకొని నా శక్త్యనుసారము సహాయము చేయుదును. నన్ను పైన చెప్పినట్లు బంధించుటచే ముల్లోకములలో మీ కీర్తి కీర్తింపబడును. ఈ ఎక్కు పెట్టిన బాణముతో నా ఉత్తర తీరమందు వసించుచున్న పాపాత్ములను వధించండి."

సముద్రుడు ఇట్లు చెప్పగా రాముడు వెంటనే బాణము వేసి ఆ దుష్టులను హతమార్చెను.

శ్రీరాముని బలపరాక్రమములను చూచి సముద్రుడు మిగుల ఆనందించెను. ఆ దుష్టుల చరిత్ర అంతయు వినిపించెను పిమ్మట ప్రభువునకు నమస్కరించి సముద్రుడు సెలవుతీసికొని వెళ్ళిపోయెను.

శ్రీరామ చరిత్ర కలియుగమునందలి సమస్త పాపములను పటాపంచలు చేయును.

ఈ చరిత్రను శ్రద్ధతో వినువారు భవసాగరమును తరింపగలరు.

* * *

# శ్రీ తులసీరామాయణము

## లంకాకాండము

సముద్రుని వాక్యములు విని శ్రీరామచంద్రుడు మంత్రులను పిలిచి "యిక ఆలస్యమెందుకు? వారధి నిర్మించి దానిమీదుగా సేనను దాటించుడు" అని చెప్పగనే జాంబవంతుడు లేచి "మహాప్రభూ! అన్నిటికంటె గొప్ప సేతువు మీ నామము. మీ నామమనే నావ నాశ్రయించి మానవులు సంసార సముద్రమును దాటుచున్నారు. ఈ చిన్న సముద్రమును దాటుట యెంతలోనిది?" అనెను; ఆ మాటలు విని వాయుపుత్రుడు "ఓ ప్రభూ! మీ ప్రతామనే బడబాగ్నిలో ఇంతకు ముందే సముద్రము ఎండిపోయెను. కాని మీ శత్రుస్త్రీల కన్నీటిధారల వలన అది మరల నిండిపోయెను? అందువలననే అది ఉప్పునీరయ్యెను" అని పల్కెను.

హనుమంతుని యుక్తి యుక్త వాక్యములు విని వానరులెల్లరు సంతోషించిరి. జాంబవంతుడు నలనీలులను పిలిచి చరిత్ర అంతయు చెప్పి "మీరు శ్రీరాముని ప్రతాపమును స్మరించుచు సేతువును నిర్మించుడు. శ్రమలేకుండా అది పూర్తి యగు"నని చెప్పి వానరులను పిలిచి మీరెల్లరు హృదయములలో "శ్రీరాముని పాదములను తలంచుకొని వినోదమునకై ఒక ఆట ఆడండి! వానరులు ఎలుగుబంట్లు బయలుదేరండి. వృక్షములను, పర్వతసమూహములను పెల్లగించుకొనిరండి" అని చెప్పెను.

ఆ మాటలు విని వానరులు, ఎలుగుబంట్లు హుంకారము చేయుచు శ్రీరామునకు జయ జయ ధ్వనులు పలుకుచు బయలుదేరిరి. పెద్ద ఎత్తైన పర్వతములను, వృక్షములను అవలీలగా పెల్లగించి తీసుకువచ్చి, నల, నీలులకు ఇచ్చుచుండిరి. నలనీలులు వానిని బంతులవలె సునాయాసముగా తీసుకొని సముద్రములో చక్కగా వేసి పూడ్చుచు దృఢమైన చక్కని సేతువును నిర్మించిరి.



ఆ సేతవును గాంచి శ్రీరాముడు చాల సంతోషించెను. "ఈ ప్రదేశము మిగుల రమణీయమైనది. శ్రేష్ఠమైనది. అంతులేని దీని మాహాత్మ్యము వర్ణింపనలవి కాదు. ఇచ్చట నేను శివాలయమును ప్రతిష్ఠించెదను" అని పల్కెను.

శ్రీరాముని మాటలు విని వానరరాజైన సుగ్రీవుడు చాల మంది దూతలను పంపెను. వారెల్లరు వెళ్ళి ముని శ్రేష్ఠులను పిలుచుకొనివచ్చిరి. వారు విధిపూర్వకముగా అచ్చట శివలింగమును ప్రతిష్ఠించిరి.

పిమ్మట శ్రీరామచంద్రుడు ఇటుల చెప్పెను. "నాకు శివునితో సమానమైన ప్రియుడు మరొకడు లేదు. నా భక్తుడని చెప్పుకొనువా డెవడైనను ఈశ్వరుని నిందించినచో అట్టివాడు నన్ను పొందజాలడు. శంకరునకు భక్తులైన వారై నన్ను నిందించినవారును, నాకు భక్తులై శివుని దూషించినవారును ఆకల్పాంతము ఘోరనరకములో నివసించెదరు. నాచే నిర్మించబడిన ఈ రామేశ్వర మహాక్షేత్రమును సందర్శించినవారు శరీరమును వదిలిన తర్వాత నా సన్నిధికి చేరుకొనెదరు. ఎవరు గంగాజలములతో ఇచ్చటి శ్రీరామలింగ స్వామికి అభిషేకము చేయుదురో వారు కైవల్యము పొందెదరు. నాచే నిర్మింపబడిన ఈ సేతువును ఎవరు దర్శించెదరో వారు సులభముగా సంసార సముద్రమును దాటెదరు".

శ్రీరామచంద్రుని వాక్యములు విని అందరు ఆనందించిరి. తదుపరి దర్శించుటకు వచ్చిన మునులందరు తమ తమ ఆశ్రమములకు వెళ్ళిపోయిరి.

ఓ పార్వతీ! శ్రీరాముడు ఎల్లప్పుడును శరణాగతులను ప్రేమించుచుండును అని ఈశ్వరుడు మరల చెప్పసాగెను.

విశ్వకర్మలు చక్కగా సేతువును నిర్మించిరి. శ్రీరామునికృపవలన వారి కీర్తి దేశమంతట వ్యాపించెను. రాళ్ళు మునిగి యితరులను ముంచివేయును. ఆ రాళ్ళు ఇప్పుడు సముద్రములలో నావవలె తేలియాడి అందరిని

దాటించుచున్నవి. అది పరమాత్ముడైన శ్రీరాముని ప్రభాపము. ఇట్టి భగవానుని విడిచి యితర దేవతలను పూజించు వారుమంద బుద్ధిగలవారు.

నలుడు నీలుడు గట్టిగా కట్టిన సేతువును చూచి శ్రీరామచంద్రుడు మిగుల ఆనందించెను. సేనలు బయలు దేరును. వానర వీరులు గర్వించుచుండిరి. ముందుగా శ్రీరాముడు సేతువు మీదఎక్కి సముద్ర వైశాల్యమును చూచుచుండెను.

సముద్రములోగల జలచరము లన్నియు ప్రభువును చూడవలెనను ఉత్కంఠతో పైకి వచ్చినవి. సముద్రమందు అనేక విధములైన మొసళ్ళు, చేపలు, సర్పములు, కొన్ని యోజనముల విశాల శరీరముగల తిమింగిలములు నుండెను. వానిని భక్షించు పెద్ద జంతువులు కూడా కొన్ని యుండెను. అవి యన్నియు ప్రభువును దర్శించి ఆనందపడుచుండెను.

ఆ జంతువులు అడ్డుగా ఉండుట వలన సముద్రములోని నీరు కనబడుకుండెను. ప్రభువు ఆజ్ఞనుపొంది సేన బయలుదేరును. వానర సేన సంఖ్య యింతయని లెక్క పెట్టలేము. దాటుటకు సేతువు ఇరుకయ్యెను. అందువలన కొందరు వానరులు ఆకాశ మార్గము మీదుగా మరికొందరు జలచరములు మీదుగా ఎక్కి దాటివెళ్ళిరి. ఆవలి తీరము చేరి దేరాలు వేసి వానియందు ఉండిరి. రామాజ్ఞపై వానరులెల్లరు ఫలములు తినుటకు బయలుదేరి వెళ్ళిరి.

శ్రీరాముని సేవకొరకై అన్ని వృక్షములు ఋతుసమయము కానప్పటికి ఫలములు ఫలించి యుండెను. వానరులందరు ఆ వృక్షముల నెక్కి, కొమ్మలు ఊపుచు, ఫలములను తినుచు పర్వత శిఖరములను లంకవైపు విసిరివేయు చుండిరి. వనములలో తిరుగుచుండగా రాక్షసులు తటస్థ పడినయెడల వారిని చుట్టుముట్టి బాగుగా ఆడించుచుండిరి. తమ దంతములతో వారి ముక్కులను, చెవులను కొరికి ప్రభువును కీర్తించిన పిమ్మట పోనిచ్చుచుండిరి. ముక్కులు; చెవులు గాట్లుపడిన రాక్షసులు రావణుని వద్దకు వెళ్ళి ఈ సంగతి చెప్పిరి.



వానరులు సముద్రమును బంధించిరనెడి వార్తవిని రావణుడు ఆందోళనచెంది దశకంఠములతో పలుక ప్రయత్నించెను. తన దుఃఖమును మరచి పైకి నవ్వుచు భయము లేనివానివలె తన భవనమునకు వెళ్ళిపోయెను.

శ్రీరాముడు వచ్చియున్నాడనియు, తేలికగానే సముద్రమును బంధించె ననియు, తెలుసుకొనగానే మండోదరి రావణుని చేతులు పట్టుకొని అతనిని తన భవనములోనికి తీసుకువెళ్ళి మిగుల మనోహరమైన కంఠముతో ఇట్లు పలికెను. “ఓనాథా! శ్రీరామునితో విరోధము పెట్టు కొనుకుము. బుద్ధితో లేక బలముతో జయించగలవానితోనే వైరము పెట్టుకొనుట మంచిది. శ్రీ రఘురాము డెక్కడ? మీ రెక్కడ? సూర్యుని ప్రకాశమునకు, మిణుగురు పురుగు కాంతికి ఎంతభేదము ఉన్నదో అంతభేదము మీ యిరువురకు గలదు. వారత్యంత బలవంతులైన మధుకైటభులను విష్ణురూపములో సంహరించిరి. మహాశూరులైన దితి కుమారులను, హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను వరాహ నృసింహ అవతారములతో వధించిరి. వామన అవతారముతో బలిని బందించిరి. పరశురామావతారముతో కార్తవీర్యార్జునుని సహస్ర బాహువులను ఖండించి వధించిరి. ఆ భగవానుడు భూభారమును హరించుటకు రాముడుగా అవతరించెను. నాథా! వారితో ఎంతమాత్రము విరోధము పెట్టుకొనకండి. కాలము, కర్మము, జీవులు అందరు వారి ఆధీనములోనున్నారు. శ్రీరాముని శరణు జొచ్చి జానకీదేవిని అప్పగించండి. పుత్రునకు రాజ్యమును అప్పగించి వనమునకు వెళ్ళి శ్రీరాముని భజించండి.”

శ్రీరామచంద్రుడు దీనుల మీద దయ చూపువాడు. వారి సమ్ముఖమునకు వెళ్ళిన వానిని పులులు కూడా ఏమిచేయలేవు. మీరులోకములో ఏమి చేయవలెనో అది యంతయు చేసివేసిరి. దేవతలను, రాక్షసులను అందరిని జయించిరి. రాజులు వృద్ధావస్థలో వనమునకు వెళ్ళవలెనని మహాత్ములు చెప్పిరి. మీరు సృష్టి, స్థితి, లయాలకు కారకుడైన

పరమాత్ముని భజించండి. ఓ నాథా! మీరు విషయ సుఖములమీద మమకారము వదలి శరణాగతరక్షకుడైన ఆ భగవానుని భజించండి. ఏ పరమాత్మ కొఱకు రాజులు రాజ్యాలను వదలి వైరాగ్యాన్ని పొందుచున్నారో, శ్రేష్ఠ మునులు సాధన చేయుచుందురో ఆ కోసలా ధీశుడైన రామచంద్రుడు మీ మీద దయ ఉండుటవలననే మీ వద్దకు వచ్చుచున్నాడు. ఓ ప్రియతమా! నా మాట విని వారి శరణు వేడండి. లోకములో మీకు యశము కలుగును నా సౌభాగ్యమును నిలబెట్టండి." అని కన్నీరు కార్చుచు రావణుని పాదములు పట్టుకొని మండోదరి ప్రాధేయపడుచుండెను.

అంతట మూర్ఖుడైన రావణుడు "ఓ ప్రియురాలా! ఊరకే ఎందులకు భయపడెదవు? అష్ట దిక్పాలకులను జయించితిని. నా భుజబలముతో యముని సైతము గెలిచితిని. దేవతలు, దానవులు, మానవులు నా వశమైరి. ఎందుకు నీవు భయపడవలెను?" అని చెప్పి సంతోషముతో కౌగిలించుకొని రావణుడు గర్వముతో రాజసభకు వెళ్ళిపోయెను.

మృత్యువు సమీపిస్తున్నందున భర్త అహంభావము పెరిగినదని మండోదరి గ్రహించెను. శాత్రవునితో ఎట్లు యుద్ధము చేయవలెనని రావణుడు మంత్రులను అడిగెను. అంతట మంత్రులు "ప్రభూ! మాటి మాటికి మీరు ఎందుకు అడుగుచున్నారు? భయపడవలసిన విషయమేమున్నది? మనుష్యులు, కోతులు, భల్లూకాలు మనకు భోజన సామగ్రి. ఈ మాటలు విని రావణ పుత్రుడు ప్రహస్తుడుచేతులు జోడించి "ప్రభూ నీతికి విరుద్ధముగా ఏమియు చేయకూడదు. మంత్రులకు విశాల బుద్ధిలేదు. ఈ మూర్ఖులెల్లరు ముఖస్తుతి చేయుచున్నారు. వీరి మాటల వలన పనులు పూర్తికావు. ఒక వానరుడు సముద్రము దాటి వచ్చి యెంతెంత పనులు చేసెనో అందరకు తెలసినదే. ఆ కోతి లంకకు వచ్చినప్పుడు వీరు ఎందుకు అడ్డుకొనలేదు. అప్పుడు వీరికి ఆకలి లేదా? రోగమా? ఇట్టి మాటలు మీరు ఎంత మాత్రము నమ్మవద్దు. వీరి సలహాలు వినుటకు



ఇంపుగా నుండవచ్చును. కాని ముందు ముందు దుఃఖము కలిగించును. వారు సులభముగా సముద్రమును బంధించిరి. సేనతో సహా సుచేల పర్వతము మీద విడిది చేసిరి. మేము తిని వేయుదుమని మీరు చెప్పబడిన మనుష్యులేనా వారు? అందరు పిచ్చి పిచ్చిగా మాట్లాడుచున్నారు. ముఖ ప్రీతిగా మాట్లాడేవారు వినెడివారు ప్రపంచములో అత్యధికులు నుందురు. కాని వినుటకు కఠోరముగా నున్నను పరిణామములో అత్యంత హితమును కలిగించు మాటలు పలుకువారు, వినువారు చాల తక్కువ మందియే యుందురు. మొదట దూతలను పంపండి. పిమ్మట సీతాదేవిని సమర్పించి శ్రీరామునితో స్నేహము ఏర్పరచుకొనండి. ఆమెను పొంది వారు తిరిగి వెళ్ళిపోయినచో యుద్ధము తప్పునుగదా! వారు స్త్రీని పొందికూడా తిరిగి యుద్ధమునకు వచ్చినయెడల వారిని ఎదిరించి పోట్లాడండి. మీరు నా అభిప్రాయము మన్నించిన యెడల రెండువిధాల మీకు సత్కీర్తి కలుగును". పుత్రుని మాటలు విని రావణుడు కోపాద్రిక్తుడై ఓరీ! మూర్ఖుడా! నీకిట్టి పాడుబుద్ధి ఎవడురా నేర్పినాడు? ఇప్పటినుండియే నీకు సందేహము, భయము కలుగుచున్నవి. వెదురు వనములో అగ్నివలె నా వంశములో చెడపుట్టితివి.

తండ్రి కఠోర వాక్యాలువిని "మృత్యువశుడైన రోగికి మందుపని చేయనట్లు మీ హితము కోరి పలికిన మాటలు కూడా మీకు రుచించుటలేదు." అనిచెప్పి అతడు తన యింటికి బయలుదేరి పోయెను.

లంకానగరములో ఒకా నొకచోట విచిత్రమైన మహలు ఉండెను. అచ్చట గొప్ప నాట్యశాల యుండెను. రావణుడు అచ్చటకు వెళ్ళి కూర్చుండెను. కిన్నరులు వాని గుణములను గానముచేయ మొదలిడిరి. మృదంగము, వీణ వాయించుచుండిరి. శ్రీరాముని వంటి ప్రబల శత్రువు ఉన్నను ఏ విధమైన భయము, విచారము లేకుండా అతడు నిరంతరభోగ విలాసాలలో నిమగ్నుడైయుండెను.

ఇచ్చట శ్రీరాముడు సువేల పర్వతము మీద సేనతో దిగెను. ఆ పర్వతముపై చాల ఎత్తైన, పరమ రమణీయమైన, ఉజ్జ్వలమైన శిఖరాన్ని చూచి లక్ష్మణుడు మెత్తని ఆకులు, పువ్వులను పరచి పానుపుగా తయారు చేసెను. దాని మీద కృపాళుడైన శ్రీరాము డాసీనుడయ్యెను. ప్రభువు వానరరాజైన సుగ్రీవుని ఒడిలో తల పెట్టుకొని యుండెను. వారి ఎడమ వైపు ధనుస్సు, కుడివైపున అమ్ములపొది ఉంచబడెను. వారు ప్రభువు బాణములను తమ చేతులతో సరిచేయుచుండిరి. విభీషణుడు సలహా యిచ్చుచుండెను. అంగదుడు, హనుమంతుడు, ప్రభువు పాదాలను ఒత్తుచుండిరి. లక్ష్మణుడు నడుమునకు అమ్ములపొది కట్టుకొని ధనుర్బాణములు చేతబూని శ్రీరాముని వెనుక భాగమున శోభిల్లు చుండెను. ఈ ప్రకారముగా సౌందర్యరాశి, కృపానిధి అయిన ప్రభువు శోభిల్లుచుండెను.

తూర్పు దిక్కును చూచిప్రభువు చంద్రు దుదయించెనని తెలుసుకొని అందరితో నిట్లు పలికెను. "చంద్రుని చూడండి! సింహమువలె ఎంత నిర్భయంగా నున్నాడో? అతనిలో ఆ నల్లని మచ్చ యేమిటి? మీమీ బుద్ధ్యను సారము చెప్పండి," అని చెప్పగా సుగ్రీవుడు ప్రభూ! భూమి యొక్క ఛాయయె చంద్రునిలో మచ్చగా కనపడుచున్నది. అనగా "చంద్రుని రాహువు కొట్టిన ఆ దెబ్బయే నల్లని మచ్చగా కనపడుచున్నదని" మరొకడు చెప్పెను.

"మన్మథుని భార్య రతిదేవి ముఖమునకు అందము చేకూర్చుటకు గాను ధాత చంద్రుని సౌరభాన్ని తీసివేసెను. ఆ భేదమే చంద్రుని హృదయంలో ఉండెను. ఆకాశపు నల్లని ఛాయయే అందు కనబడుచున్నది." అనివేరొకడు పలికెను.

"విషము చంద్రునకు ప్రియసోదరుడు గనుకతనహృదయములో అతడు విషమును పెట్టుకొనెను. విషముతో కలసిన తన కిరణాలను వ్యాపింపజేసి అతడు విరహిణులైన స్త్రీ, పురుషులను తపింప చేయుచుండెను" అని ప్రభువు చెప్పెను.



"ప్రభూ! చంద్రుడు మీకు ప్రియభక్తుడు. మీ సుందర శ్యామల మూర్తియే అతని హృదయమలో వసించుచుండెను. ఆ శ్యామల వర్ణ ప్రతిబింబమే ఆ మచ్చ"యని హనుమంతుడు చెప్పెను.

వాయుపుత్రుడైన ఆంజనేయుని మాటవిని ప్రభువు నవ్వెను. దక్షిణదిశవైపు చూచి ప్రభువు "విభీషణా! దక్షిణదిశవైపు చూడుము. నల్లనిమేఘము లెట్లు దట్టముగా వ్యాపించి యున్నవో? భయంకర మేఘాలు గంభీరస్వరముతో గర్జించుచున్నవి. వడగళ్ళ వానకురియునేమో!" అని విభీషణునితో అనెను. విభీషణుడు ఇట్లు చెప్పెను. "ప్రభూ! అది మెరుపుకాదు. మేఘముల సమూహముకాదు. లంకాశిఖరముపై ఒక భవనముకలదు. దశకంఠుడైన రావణుడు అచ్చట నాట్యాలను తిలకించుచుండెను.

రావణుడు తన తలమీద మేఘాల సమూహమును గొడుగుగా ధరించి యుండెను. అదియే మేఘాల నల్లని సమూహము. మండోదరి చెవుల యందుగల పుష్పాలు కదలుచున్నవి? అదియే మెరుపువలె మెరయుచున్నది. తాళ, మృదంగములు మ్రోగుచున్నవి. ఆ మధుర ధ్వనియే గర్జన."

రావణుని అహంభావము గ్రహించి ప్రభువు చిరునవ్వు నవ్వెను. అతడు ధనుస్సు నెక్కుపెట్టి అతనిపై బాణాన్ని సంధించెను. ఒక బాణముతో రావణుని ఛత్రమకుటాలను, మండోదరి కర్ణ పుష్పములను క్రింద పడవేయించెను. అందరు చూచుచుండగానే అవి భూమిమీద పడెను. దీని రహస్యము ఎవరు తెలుసుకొనలేదు. ఇట్టి చమత్కారము చేసి ఆ బాణము తిరిగివచ్చి శ్రీరాముని అమ్ములపొదిలో ప్రవేశించెను.

భూకంపములేదు. తుఫానులేదు. అస్త్ర శస్త్రాల నేమీ చూడ లేదు. మరి యీ ఛత్రము, మకుటము; కర్ణ పుష్పాలు ఎట్లు తెగి క్రింద పడెనా అని అందరు దిగులుపడిరి. భయంకరమైన యీ అపశకునము గూర్చి చింతిల్లుచుండిరి.

సభాసదులు భయగ్రస్తులై యుండుటను గాంచి రావణుడు నవ్వి ఇట్లు పలికెను. "తలలు పడిపోవుట కూడా శుభమైయుండగా కిరీటము పడిపోవుట

అపశకున మెట్లగును? మీమీ ఇండ్లకు వెళ్ళి నిర్భయముగా నిద్రపొండి." అందరు తలవంచి యిండ్లకుపోయిరి.

పుష్పములు తన కర్ణములనుండి క్రిందపడిపోగానే మండోదరి చింతిల్లసాగెను. సజల నేత్రాలతో ఆమె రెండుచేతులు జోడించి "ప్రాణేశ్వరా! నా ప్రార్థన వినండి. శ్రీరామునిపై వైరము విడిచి పెట్టిండి. అతనిని మనుష్యునిగా భావించి మనస్సులో పట్టుదల చూపకండి. విశ్వమంతా అతని రూపమే. నా మాటలను నమ్మండి. పాతాళమే అతని పాదాలు బ్రహ్మలోకమే శిరస్సు. కనుబొమ్మలు తిరుగుటయే భయంకరమైన కామము. నేత్రములే సూర్యుడు. వెంట్రుకలే మేఘసమూహము. అతని నాసికయే అశ్వనీకుమారులు. కనురెప్పలు తెరచుట, మూయుటయే రాత్రింబవళ్ళు. అతని చెవులే పది దిక్కులు. శ్వాసయే వాయువు. వాక్కే వేదము. పెదవులే లోభము. దంతములే యమధర్మరాజు. నవ్వే మాయ. భుజములే దిక్పాలురు. ముఖమే అగ్ని. నాలుకయే వరుణుడు. సృష్టి, స్థితి, లయములే అతని చేష్టలు. అతని రోమాలే పదునెనిమిది రకాల మొక్కలు, చెట్లు వక్షస్థలమే పర్వతాలు. నరాలే నదులు, పొట్టయే సముద్రము, క్రిందనున్న ఇంద్రియములే నరకము. ఈ విధముగా ప్రభువు విశ్వరూపుడు. ఇక ఎక్కువగా ఊహించునది ఏమున్నది?

ఈశ్వరుడు ఎవనికి అహంకారమో, బ్రహ్మబుద్ధియో, విష్ణువు చిత్తమో ఆ చరాచర రూపుడైన భగవానుడే రామునిగా మనుష్యరూపములో వసించి యున్నాడు. ఇట్లు భావించి ప్రభువుతో విరోధము వదలి శ్రీరాముని ప్రేమించండి. నా మాంగల్యమును నిలబెట్టండి." అని మండోదరి చెప్పెను.

భార్య మాటలువిని రావణుడు నవ్వెను. అతడు ఇట్లు చెప్పెను. "మోహము చాల బలవత్తరమైనది. స్త్రీలకు ఎనిమిది అవగుణాలు గలవని అందరు చెప్పెడిమాట నిజమే. సాహసము, అబద్ధము, చంచలత్వము, మోసము, పిరికితనము, మూర్ఖత్వము, అపవిత్రత, నిర్దయత్వము అనెడి



అవగుణాలు స్త్రీల స్వభావాలు. నీవు శత్రువు గొప్పతనాన్ని చెప్పావు. నన్ను చాల భయపెట్టుటకే నాతో ఆ విషయమంతా చెప్పావు. ఓ ప్రియురాలా! ఈ చరాచర జగత్తు అంతా నావశములోనే యున్నది. నీ దయవలన నిప్పుడా విషయము తెలుసుకొన గలిగితిని. నా చాతుర్యము తెలుసుకున్నాను. ఈ నెపము మీద నీవు నా గొప్పతనాన్ని వర్ణించుచున్నావు. నీ మాటలు చాల నిగూఢమైనవి. వాటిని అర్థము చేసుకున్నచో సుఖము కల్గును, విన్నచో భయమువదలిపోవును."

తన భర్తకు కాలము సమీపించుచున్నందున మతి చలించినదని మండోదరి మనస్సులో నిశ్చయించుకొనెను.

గర్వాంధుడైన లంకాపతి రావణుడు ఉదయము రాజసభకు వెళ్ళెను.

మేఘములు అమృతము వంటి జలాన్ని వర్షించినను, బ్రహ్మ వంటి గురువు లభించినను, మూర్ఖునకు జ్ఞానోదయము కలుగదు.

సువేల పర్వతముపైన నున్న రాముడు తెల్లవారగనే మేల్కొనెను. ఇప్పుడేమి చేయవలెనని మంత్రులందరిని పిలిచి సలహా అడిగెను.

జాంబవంతుడు రామచంద్రునకు నమస్కరించి "ఓ అంతర్యామీ! అంగదుని దూతగా పంపండి. నాబుద్ధ్యనుసారముగా సలహా ఇచ్చుచున్నాను." అని విన్నవించెను.

ఈ సలహా అందరికి నచ్చెను. కృపానిధియైన శ్రీరాముడు అంగదునితో "నీవు నా కార్యము నిమిత్తము లంకానగరానికి వెళ్ళుము. నీవు చాల చతురుడవు. మన కార్యము పూర్తియగునట్లు శత్రువునకు శ్రేయస్సు కలుగునట్లు అతనితో మాట్లాడిరమ్ము" అని చెప్పెను.

ప్రభువు ఆజ్ఞను తలదాల్చి స్వామికి పాదాభివందనము చేసి అంగదుడు లేచి యిట్లు చెప్పెను. "ప్రభూ! ఎవరియందు మీరు దయ తలచెదరో వారే గుణనిధులగుదురు. ప్రభువు కార్యములన్నియు వాటియంతట అవియే పూర్తికాగలవు. ప్రభువు తనపని నిమిత్తము నన్ను పంపుట నాకు గొప్పతనము

చేకూర్చుటకే" అని చెప్పి అతడు బయలు దేరెను. ప్రభువును తన హృదయములో నిల్పుకొని స్వాభావికముగా నిర్భయుడైన వీరుడు అంగదుడు లంకా నగరములో ప్రవేశించగానే అచ్చట ఆటలాడుచున్న రావణుని పుత్రుని కలుసుకొనెను. వారిరువురిలో మాటల మీద మాటలు పెరిగి పోట్లాట హెచ్చెను. ఇద్దరు అద్వితీయ బలసంపన్నులు. రావణుని పుత్రుడు అంగదునిపై కాలెత్తెను. వెంటనే అంగదుడు ఆ కాలు పట్టుకొని గిరగిర త్రిప్పి నేల పై కొట్టెను. రాక్షసుల సమూహము భయము వలన కేకలు కూడా వేయలేక ఎచ్చటి వారచ్చట పారిపోయిరి.

రావణ పుత్రుడు మరణించినట్లు తెలుసుకొని రాక్షసులు భయపడి పారిపోవుటను చూచి నగరమంతట కోలాహలము చెలరేగెను. లంకను లోగడ భస్మముచేసిన వానరుడే తిరిగి వచ్చాడని ప్రజలు చింతిల్లసాగిరి. విధాత యిప్పుడిక ఏమి చేయునో అని అందరు అత్యంత భీతులై ఆలోచింప సాగిరి. అడుగకుండానే అంగదునకు రావణుని దర్బారుకు వెళ్ళుటకు మార్గము చెప్పుచుండిరి. ఎవనిని అతడు చూచునో అనివారు భయముతో వణకి పోవుచుండిరి.

శ్రీరాముని స్మరించుచు అంగదుడు రాజ్యసభా ద్వారము వద్దకు వెళ్ళెను. ధీరుడు, వీరుడైన అతడు సింహమువలె అటుఇటు చూచెను. వెంటనే అతడు ఒక రాక్షసుని తను వచ్చిన సమాచారాన్ని రావణునకు ఎఱింగించమనెను. అది వినగానే రావణుడు "పెద్దగా నవ్వి" వెంటనే పంపించుము. ఆ కోతి ఎచ్చటిదో చూచెదను" అని పలికెను.

దూతలు పరుగెత్తుకొని వెళ్ళి ఏనుగువంటి బలశాలియైన అంగదుని తీసుకొని వెళ్ళిరి. జీవముతో నున్న కాటుక కొండయా అన్నట్లు రావణుడు కూర్చొనుటను అంగదుడు చూచెను. అతని భుజములు వృక్షాలతో, శిరస్సులు పర్వత శిఖరాలతో సమానముగా నుండెను. అతని రోమాలు లతలవలె నున్నవి. నోరు, ముక్కు, నేత్రాలు, చెవులు పర్వత గుహలవలె నున్నవి.



అత్యంత బలశాలి సాహసోపేతుడైన అంగదుడు సభలోనికి వెళ్ళెను. అతనికి లేశమైన జంకు గొంకు లేదు. అంగదుని చూడగానే సభాసదులు లేచి నిలబడిరి. ఇది చూచి రావణుడు కినుక చెందెను. మత్తెక్కిన ఏనుగుల గుంపులో సింహము నిస్సంకోచముగా వెళ్ళుచున్నట్లు శ్రీరాముని ప్రతాపాన్ని హృదయములో స్మరించి నిర్భయుడై సభలో ప్రవేశించి తలవంచుకొని కూర్చొండెను.

"ఓరే కోతి! నీవెవడవురా!" అని రావణుడడుగగా "ఓ దశకంఠుడా! శ్రీరాముని దూతను నేను". నాతండ్రికి నీకు స్నేహము ఉండెను కదా. కనుక నీ మేలుకోరి వచ్చాను. నీది చాల ఉత్తమకులము. నీవు పులస్త్య ఋషి మనుమడవు. ఈశ్వరుని, బ్రహ్మను నీవు అనేక విధాలా పూజించితివి. వారివలన వరాలు పొందియుంటివి. అన్ని పనులు సిద్ధింపచేసుకుంటివి. లోకపాలురను, రాజులందరిని జయించితివి. రాజ్యమదముతో గాని, లేక మోహవశముతోగాని నీవు జగదంబ సీతాదేవిని అపహరించి తెచ్చితివి. ఇప్పుడు శుభమైన నా మాటలు వినుము. దాని ప్రకారము నీవు నడచుకొనినచో ప్రభువు నీ అపరాధాలన్నిటిని క్షమించగలరు. జానకిని సగౌరవముగా స్వామికి సమర్పించి "శరణాగత రక్షకా! నన్ను రక్షించుము. రక్షించుము" అని ప్రభువును ప్రార్థించుము. ప్రభువు నిన్ను తప్పక రక్షించును." అని అంగదుడు చెప్పగా రావణుడు "ఓరీ! వానరా! జాగ్రత్తగా మాట్లాడు. దేవతల శత్రువునైన నన్ను నీవు తెలుసుకొనుటలేదు. నీ పేరు, నీదుతండ్రి పేరేమిటో చెప్పరా? ఏ సంబంధాన్ని బట్టి నీ తండ్రితో నాకు స్నేహమున్నదో చెప్పుము" అని అడిగెను. "నా పేరు అంగదుడు. నేను వాలిపుత్రుడను. అతనిని నీ వెప్పుడు కలుసుకొని యుండలేదా?" అంగదుడు బదులు చెప్పెను.

అతని మాటలు విన రావణుడు కొంతసేపు తొట్రుపాటు చెంది అవునవును. జ్ఞాపకము వచ్చినది. నీవు వాలి పుత్రుడవా! వాలియని యొక

వానరుడుండెను. కుల నాశకుడా! నీవు కులమనే వెదురు వనములో అగ్నివలె పుట్టితివి. గర్భములోనే నీవు నాశనము కాలే దేమి? నీ జన్మ వృధా. ఇప్పుడు వాలి క్షేమముగానే యున్నాడా? అని రావణుడడుగగా అంగదుడు నవ్వి "కొన్ని దినాలలోనే నీవే స్వయముగా వాలివద్దకు వెళ్ళెదవు. అప్పుడతని క్షేమ సమాచారములు అడిగి తెలుసుకొనుము. శ్రీరామునితో వైరముపెట్టుకున్న వాలికి ఎటువంటి క్షేమము కలిగెనో అతడే నీకు పూర్తిగా వివరించగలడు. నిజమే నేను కులఘాతుకుడనే. నీవు కుల రక్షకుడవు. గ్రుడ్డివారు, చెవిటివారు కూడా ఇట్టి మాటలు పలుకరు. నీకు ఇరవై నేత్రాలు, ఇరవై చెవులు ఉన్నవి. ఈశ్వరుడు, బ్రహ్మ యిత్యాది దేవతలు, మునులు ఎవరి చరణ సేవ చేయగోరుచుందురో వారికి దూతగా నుండి నేను కులాన్నే ముంచివేసితినా? ఇటువంటి బుద్ధికలిగి కూడా నీ హృదయము బ్రద్దలు కాలేదేమి?"

అంగదుని కఠోర వాక్కులువిని రావణుడు కండ్లు ఉరిమిచూచెను. అతడు, "ఓరీ దుష్టుడా! నీతి, ధర్మము తెలుసుకున్న వాడనగుటచేత నేను నీ క్రూరవాక్కులు వినికూడా సహించియున్నాను." అని అనగా అంగదుడు "నీవు పరాయిస్త్రీని దొంగిలించిన విషయము వినగానే నీ ధర్మ శీలతను నేను తెలుకొంటిని. దూతను రక్షించిన విషయము నా కండ్లారా చూచియుంటిని. ఇట్టి ధర్మవ్రతాన్ని పాటించనినీవు ఎందులో నై నా పడి చావరాదా? ముక్కు, చెవులు కోసివేయబడిన చెల్లెలిని చూచి ధర్మాన్ని ఆలోచించెడినీవు క్షమించి యుంటివి. నీ ధర్మ తత్త్వం జగద్విదితము. నిన్ను దర్శించి నేను గొప్ప భాగ్యవంతుడనైతిని." అని వ్యంగ్యముగా పలికెను.

"ఓరీ వానరా! వ్యర్థముగా వాగకురా. ఓరీ మూర్ఖుడా! నా భుజాలవైపు చూడరా. లోకపాలుర విశాలబలమనే చంద్రుని గ్రహించుటకు వచ్చెడి రాహుకేతువులనీ, ఆకాశమనే చెరువులో నా భుజాలనే పద్మాలపై కైలాస సహితముగా శివుడు వసించి హంసవలె శోభను పొందిన విషయము నీవు వినియే యుందువు. నాలో యుద్ధము చేయగల వీరుడు నీ సేనలో



ఎవరైన యున్నారా? మీ యజమాని భార్యా వియోగములో శక్తి హీనుడై యున్నాడు. అతని తమ్ముడు ఆ దుఃఖముతోనే క్రుంగిపోయి యున్నాడు. నీవు, సుగ్రీవుడు ఇద్దరు నది ఒడ్డున గల వృక్షాలవంటివారు. నా తమ్ముడు విభీషణుడు చాల పిరికివాడు. మంత్రియైన జాంబవంతుడు వృద్ధుడు. ఇప్పుడు యుద్ధములో అతనేమి పోట్లాడగలడు? నలుడు, నీలుడు శిల్పకళలో ప్రవీణులు. వారికి యుద్ధము చేయుట ఏమి తెలుసు? బలశాలియైన ఒక వానరుడు ఉన్నాడు. అతడు ఇదివరకే వచ్చి లంకను తగలపెట్టిపోయాడు. రావణుని యీ చివర మాట వినగానే అంగదుడు "రాక్షసరాజా! నిజమే చెప్పుము నిజముగా వానరుడేనా నీ నగరాన్ని భస్మము చేసినది? జగద్విఖ్యాత వీరుడైన రావణుని నగరాన్ని ఒక చిన్న వానరుడు కాల్చివేశాడు. ఈ మాట ఎవరైన నమ్మెదరా? నీవు గొప్ప వీరునిగా పొగడిన ఆ వానరుడు మా సేనలో చాల తక్కువ బలం గలవాడు. వాడు చాలత్వరగా నడుచుచుండును. వాడు వీరుడు కూడ. వార్త తీసుకు రమ్మనమని వాడిని మేము పంపియుంటిమి. ప్రభువు ఆజ్ఞలేనిదే నిజముగా ఆ వానరుడు నీ నగరాన్ని భస్మముచేసి వేసెనా? బహుశః ఇందుకే అతడు సుగ్రీవుని వద్దకు రాక ఎచ్చటనో దాగుకొని యున్నాడు. మాసేనలో నీతో యుద్ధము చేసి శోభ పొందగల వారెవరును లేరు. నీవు చెప్పినది కూడ సత్యమే. స్నేహముగాని వైరముగాని సమానమైన వారితో చేయవలెను. సింహము కప్పలను చంపినచో అదేమి గొప్పగా చెప్పబడునా? నిన్ను వధించిన రామునకు చిన్నతనము, పెద్దదోషము. అయినప్పటికి రాజుల కోపము భరింపరానిది." అని అంగదుడు చెప్పగా రావణుడు పక్కున నవ్వి "కోతులలో ఒక గుణము ఉన్నది. అవి తమను పోషించిన వారికి అనేక యుక్తులతో మేలుచేయుటకు ప్రయత్నించును. తన యజమాని కొఱకు సిగ్గువిడిచి ఎచ్చట బట్టిన అచ్చట గెంతుతు, నాట్యముచేయుచు, ప్రజలను సంతోషపరచుచు యజమానికి లాభము కలిగించును. ప్రభుభక్తి గల జాతి నీది. నీవు నీ ప్రభువును కొనియాడకుండ ఎట్లుండగలవు? అంగదా! నేను గుణాలను గౌరవించెడి

వాడనగుటచే నీవెట్లు వాగుచున్నను లక్ష్యపెట్టుట లేదు.” అని చెప్పగా నీ వాస్తవిక స్వరూపము నాకు హనుమంతుడు వినిపించి యుండెను. అతడు నీ అశోకవనాన్ని ధ్వంసముచేసి, నీ పుత్రుని చంపి, నీ నగరాన్ని భస్మముచేసి వెళ్ళిపోయెను. నీవు నీ గుణగ్రాహకత్వము వలన అతడు నీకేమి అపకారము చేయలేదని తలంచితివి. నీ సుందర స్వభావము ఆలోచించి నేను కొంత దుష్టత్వము చేసితిని. నీకు లజ్జలేదు, క్రోధము లేదు, పౌరుషములేదని హనుమంతుడు నాతో చెప్పిన విషయము ఇచ్చట ప్రత్యక్షముగానే చూచాను.” అని అంగదుడు చెప్పగా “ఓరీ వానరా! నీ బుద్ధి అట్టిది కాబట్టియే నీవు నీ తండ్రిని మ్రింగితివి.” అని యనుచు రావణుడు నవ్వెను. “తండ్రినే తిన్నవాడిని నిన్నుకూడా తినేవాడను. కాని వెంటనే మరొక విషయము నాకు జ్ఞాపకము వచ్చినది. ఓ రావణా! వాలి నిర్మల కీర్తికి పాత్రుడవగుట వలన నిన్ను నేను చంపుటలేదు. ప్రపంచములో ఎంతమంది రావణాసురులు ఉన్నారో చెప్పుచున్నాను. వినుము. ఒక రావణుడు బలిని జయించుటకు పాతాళానికి వెళ్ళెను. పిల్లలు వాడిని గుఱ్ఱపుశాలలో బంధించివేసిరి. పిల్లలు ఆడుకొనుచు అతని వద్దకు వెళ్ళి కొట్టుచుండెడివారు. బలికి దయగలిగి అతనిని విడిపించివేసెను. ఒక రావణుని కార్తవీర్యార్జునుడు చూచి పరుగెత్తివెళ్ళి అతడొక విచిత్ర జంతువని తలంచి పట్టుకొనెను. ఇంటికి తీసుకువెళ్ళి భద్రముగా ఉంచెను. పులస్త్యముని వచ్చి వానిని విడిపించెను. ఒక రావణుని విషయము చెప్పుటకే సంకోచించు చున్నాను. అతడు చాల దినాల వరకు వాలి చంకలో నుండెను. పై ముప్వురిలో నీవు ఏ రావణుడవు? అహంకారము విడిచి నిజము చెప్పుము” అని అంగదుడు చెప్పగా రావణుడు “ఓరీ మూర్ఖుడా! నా భుజబలము కైలాస పర్వతానికి తెలుసు. నా తలలనే పుష్పాలుగా అర్పించి పూజించిన ఈశ్వరుడు నా శూరత్వము ఎరుగును. నా తల లనే పద్మాలను నా చేతులతోనే నరికి అనేక పర్యాయాలు త్రిపురారిని పూజించియుంటిని. నా భుజాల పరాక్రమము దిక్పాలురకు తెలుసు వారి హృదయాలలో అవి ఎప్పటికి నాటుకొని యున్నాయి. దిగ్గజాలు నా



వక్షఃస్థల కఠినత్వము ఎఱుగును. వాటితో నేను తరచువెళ్ళి డీకొన్నప్పుడల్లా నా వక్షఃస్థలములో గాట్లు పడలేదు. నా వక్షఃస్థలముతగులగనే ఆ దంతాలువాటంత టవియే విరిగి పోయినవి. నావపై మత్తెక్కిన ఏనుగు ఎక్కగానే అది ఎట్లు ఊగిసలాడునో నేను నడచునప్పుడు భూమి అట్లు కదులుచుండును. అట్టి జగద్విఖ్యాతుడైన ఆ రావణుడను నేనే. నాగురించి నీవు వినవే లేదా? అట్టి రావణుని నీవు తేలికగా మాట్లాడుచున్నావు. మనుష్యుని గొప్పగా పొగడుచున్నావు. నీ తెలివితేటలే ఇప్పుడు తెలుసుకొంటిని.” అని పలికెను.

అంత అంగదుడు కోపోద్రేకముతో ఇట్లనెను. “ఓరీ రావణా! ఆలోచించి జాగ్రత్తగా మాట్లాడు. ఎవని గండ్రగొడ్డలి కార్తవీర్యార్జునుని సహస్ర బాహువులను నరికివేసెనో, ఎవని గొడ్డలిచే అసంఖ్యాక రాజుల తలలు అనేక పర్యాయాలు తెగినవో అట్టి పరశురాముని గర్వము ఎవనిని చూచి మటుమాయమయ్యెనో ఆ రామచంద్రుడు కేవలము మనుష్యుడనియే అనుకొంటివా? నీవు దేవుడు కేవలము ధనుర్ధారి అనుకున్నావా! గంగను కేవలము నదియే అనుకొంటివా? కామధేనువును పశువే అనుకొంటివా? కల్పవృక్షము ఒక మామూలు వృక్షమేనా? గరుడుడు పక్షియేనా? శేషుడుసర్పమేనా? చింతామణిరాయియేనా? వైకుంఠము లోకమేనా? నీ సేన నంతటిని వధించి అశోకవనాన్ని, ధ్వంసముచేసి, నీపుత్రుని చంపి తిరిగి వెళ్ళిన హనుమంతుడు కోతియేనా? కపటమువిడిచి విను. కృపాసముద్రుడు శ్రీరఘునాథుని ఎందుకు భజింపవు? శ్రీరామునితో వైరము పెట్టుకున్నచో నిన్ను బ్రహ్మ, ఈశ్వరుడు కూడ రక్షింపలేరు. వ్యర్థముగా ఆడంబరాలు చెప్పుకొనకు. శ్రీరామునితో విరోధము పెట్టుకొన్నచో వారి బాణాలు తగులగనే నీ శిరస్సులు ముక్కలుముక్కలై భూమిమీద పడగలవు. శ్రీరాముడు యుద్ధములో కోపము తెచ్చుకొని తీక్ష్ణమైన బాణాలు విడిచిపెట్టినప్పుడు నీ గప్పాలు ఏమగును?”

అంగదుని వాక్యములు వినగనే రావణుడు మండుచున్న అగ్నిలో నెయ్యి వేసినట్లు కోపోద్రిక్తు డయ్యెను. అతడు ఇట్లు పలికెను.

"ఓరీ మూర్ఖుడా! కుంభకర్ణుడు నా సోదరుడు. ఇంద్రుని శత్రువైన మేఘనాథుడు నా పుత్రుడు సంపూర్ణ జగత్తును నా పరాక్రమము వలన జయించిన విషయము నీవు వినియే యుందువు. వానరుల సహాయముతో రాముడు సముద్రాన్ని బంధించినాడు. అదే అతని గొప్పతనము సముద్రమును అనేక పక్షులు దాటుటలేదా? అంతమాత్రముచే అవి వీరులు కావే! నా ఒక్కొక్క భుజమనే సముద్రము బలము అనెడి జలముతో నిండియున్నది. అనేక శూరవరులు, యోధాను యోధులు అందు మునిగిపోయిరి. అంతులేని ఈ యిరవై సముద్రాలను దాటగల వీరుడెవ్వడు? నీ ప్రభువు యుద్ధముచేయగల వీరుడైనచో దూతను ఎందుకు పంపినట్లు? శత్రువుతో సంధి చేసుకొనుటకు అతనికి సిగ్గు లేదా? కైలాసాన్ని మథించే నా భుజాలను చూడుము. తర్వాత నీ ప్రభువును పొగడుము. తన చేతులతో తలలు నరికి సంతోషముతో అనేక పర్యాయాలు అగ్నిలో హోమముచేసిన రావణునితో సమానమైన శూరవీరుడెవడున్నాడు? నా తలలు అగ్నిలో మండుచున్నప్పుడు మనుష్యుని ద్వారా నామృత్యువు ఉండగలదని విధాత నా నొసటపైన వ్రాసిన అక్షరాలను చదివి విధాత వాక్కు అసత్యమైనదని తెలిసికొని నేను నవ్వాను. ఆ మాట తెలిసికొని కూడా నాకు భయము కలుగలేదు. ముసలి బ్రహ్మ మతిచలించి అట్లు వ్రాసినాడని నాకు తెలుసు. నీవు లజ్జ, మర్యాద విడిచి నాముందు మాటిమాటికి ఇతరవీరుల బలము పొగడుచున్నావు."

"ఓరీ రావణా! నీతో సమానమైన లజ్జావంతుడు జగత్తులో ఎవడూ లేడు. సిగ్గుపడటం నీ సహజ స్వభావం. నీ గుణాల నెన్నడూ నీవు చెప్పుకొనవు. తలలు నరికి హోమం చేసిన, కైలాస పర్వతం ఎత్తిన ఘటనలు నీ మనస్సులో నాటుకొని ఉన్నాయి. కనుకనే ఎన్నోపర్యాయాలు ఆ ఘట్టాలనే చెప్పావు. సహస్రబాహువు, వాలి మున్నగు వీరులను జయించిన భుజాల బలాన్ని నీవు నీ హృదయములో దాచియుంచితివి. ఓరీ! అల్పమతీ! తలలు కోసుకొన్నంత మాత్రాన ఎవరైనా శూరవీరు లగుదురా? ఇంద్రజాలాన్ని



చేసేవారిని ఎవరును వీరులని చెప్పరు. గారడివాళ్ళు కత్తులతో తమ చేతులను, శరీరాన్ని కోసుకొంటారు. మిడుతలు అగ్నిలో పడి మాడిపోవును. గాడిదలగుంపు గొప్ప బరువు మోయుచుండును. ఈ కారణంచేత అవి శూరవీరులని పిలువబడవు. ఓరీ! దుష్టుడా! నా మాట వినుము. అభిమానమును విడిచిపెట్టుము. సంధి చేసుకొనుటకు ప్రభువు దూతగా నన్ను పంపలేదు. నక్కను చంపినచో సింహానికి కీర్తిరాదు. ప్రభు వచనాలను గ్రహించియే నేను నీ కఠోరవచనాలను, సహించితిని. లేనిచో నీ తలకాయలు విరిచి సముద్రములో పారవైచి మా సీతమ్మను తీసుక వెళ్ళియుండేవాడిని. ఒంటరిగానున్న పరాయి స్త్రీని నీవు అపహరించుటలో నీ బలమెంతో తెలుసుకొంటిని. నీవు రాక్షసుల రాజువు. నేను శ్రీరాముని సేవకుడైన సుగ్రీవుని దూతను. సేవకునకు సేవకుడను, శ్రీరాముని వలన భయపడకుండా యుంటే నిన్ను నేలమీద పడగొట్టి నీ సేనను సంహరించి నీ నగరమును నష్టం చేసి సీతాదేవిని తీసికొనిపోయి యుండేవాడివి. ఇట్లు చేసిన గొప్పతనమేమీ లేదు. మరణించిన వారిని చంపిన వీరత్వమే మున్నది? వామమార్గులు, కాముకులు, లోభులు, అత్యంత మూఢులు, అతి దరిద్రులు, చెడుపేరు తెచ్చుకున్నవారు, ముసలివారు, నిత్య రోగులు, నిరంతరం క్రోధంగా ఉన్నవారు; విష్ణువిముఖులు, వేదాలకు మహాత్ములకు విరోధులు, తన శరీరాన్నే పోషించుకొనువారు పరనింద చేయువారు, మహా పాపాత్ములు. ఈ పదునాల్గు రకాల ప్రాణులు జీవించియున్నను మరణించిన వారితో సమానులు. ఇట్లు ఆలోచించి నిన్ను నేను చంపుటలేదు. ఇప్పుడు నాలో కోపాగ్ని రెచ్చగొట్టకు."

అంగదుని మాటలు విని రావణుడు పళ్ళతో పెదవులు కొరుకుతూ కుపితుడై చేతులు నలుపుతూ "ఓరీ నీచవానరుడా! ఇప్పుడు నీవు చావాలని కోరుకుంటున్నావు. కనుకనే చిన్న నోటితో పెద్దమాటలు పలుకుచున్నావు. ఎవరి అండచూచుకొని నీవు చెడుమాటలు వాగుచున్నావో వానికి బలం, ప్రతాపం, బుద్ధి, తేజస్సు లేశమైనా లేదు. వాడు గుణ హీనుడని, మర్యాదా

హీనుడని తెలిసికొనియే, వానితండ్రి వానిని వనాలకు పంపివేసెను. అతడు వనవాస దుఃఖము, ఆ తర్వాత యువతిగా నున్న భార్యతో వియోగము, పిమ్మట రాత్రింబవలు నాభయము వీనితో బాధపడుతున్నాడు. ఎవని బలం చూచుకొని నీవు గర్విస్తున్నావో అట్టి మనుష్యులను అనేకులను రాక్షసులు రాత్రింబవలు తినుచున్నారు."

రావణుడు శ్రీరాముని నింద చేయగానే అంగదుడు క్రుద్ధుడయ్యాడు, ఏలనంటే విష్ణుభగవానుని, పరమేశ్వరుని నింద వినువానికి గోవధ చేసిన పాపం వచ్చునని శాస్త్రాలు చెప్పుచున్నవి.

అంగదుడు గట్టిగా పండ్లు కొరికెను. కోపాతిరేకాన్ని చూపుచు అతడు తన రెండు చేతులను పిడికిళ్ళు బిగించి భూమిమీద గ్రుద్దెను. ఆ దెబ్బకు భూమి దద్దరిల్లి కంపింపసాగెను. కూర్చున్న సభాసదులు మూర్ఛపడి లేచి భయంతో పారిపోయిరి. రావణుడు పడుతూ పడుతూ సంబాళించుకొని లేచెను. మిక్కిలి అందమైన అతని కిరీటాలు భూమిమీద పడ్డాయి. వానిలో కొన్నింటిని అతడు తీసుకొని తన తలలపై పెట్టు కొనెను. కొన్నింటిని అంగదుడు తీసి శ్రీరాముని సన్నిధికి విసిరివేసెను.

కిరీటాలు తమవద్దకు వచ్చి పడడం చూచి వానరులు పరుగెత్తారు. "పగటిపూటనే నక్షత్రాలు రాలి భూమిమీద పడ్డాయా!" అని వారు ఆలోచింపసాగిరి.

ప్రభువు నవ్వుతూ "భయపడకండి. ఇవి నక్షత్రాలుకావు, ఉల్కలు కావు, కేతువుగాదు, రాహువుగాదు ఇవి రావణుని కిరీటాలు. అంగదుడు విసరిగావేయగా వచ్చి పడ్డాయి." అని చెప్పెను.

హనుమంతుడు వానిని తీసుకొని ప్రభువు ముందరనుంచెను. వానరులు, ఎలుగుబంట్లు ఈ వింత చూచుచుండిరి. ఆ కిరీటాలు సూర్య కిరణాలవలె తళతళ మెరయుచుండెను.

అచ్చట రావణుడు ఆగ్రహావేశముతో "ఈ కోతిని పట్టుకొని బంధించండి, చంపండి" అని అరచెను. అంగదుడా మాటలు విని నవ్వెను.



రావణుడు మరల ఇట్లు పలికెను. "వీడిని చంపివేయండి, పరుగెత్తివెళ్ళి కోతులు, ఎలుగుబంట్లు ఎచ్చట కనబడితే అచ్చట వారిని చంపితినండి. భూమిమీద కోతులు, ఎలుగుబంట్లు లేకుండా చేయండి. వెళ్ళి ఆ తాపసు లిద్దరను ప్రాణాలతో పట్టుకొని నా దగ్గరకు తీసికొని రండి."

రావణుని క్రోధపూరితమైన మాటలు వినగానే అంగదుడు కోపోద్రిక్తుడై "గప్పాలు కొట్టులకు నీకు సిగ్గువేయుటలేదా? గొంతుకు ఉరివేసికొని చావుము. నా బలాన్ని రుచిచూచికూడా నీ వక్షఃస్థలం విరుగ లేదేమి? ఓరీ దుష్టుడా! కాముకుడా! సన్నిపాతం తగిలి చెడు మాటలు వాగుతున్నావు. నీవు మృత్యువుకు వశుడవై యున్నావు. దీని ఫలితం ముందు ముందు నీవు మా వానరులచే చెంపదెబ్బలు తిన్నప్పుడు అనుభవింపగలవు. రాముడు మనుష్యుడనే మాట పలుకగానే నీ నాలుకలుతెగి క్రిందపడలేదేమి? నీ నాలుకలేగాక శిరస్సులు కూడా యుద్ధభూమిలో క్రిందపడగల వనుటలో సందేహం లేదు. ఒకే బాణంతో వాలిని చంపినవాడు. మనుష్యుడేనా? ఇరవై నేత్రాలు కల్గియుండి కూడా నీవు గ్రుడ్డివాడవు. నీ జన్మకు ధిక్కారమగుగాక! ఇదిగో నీముందు నాపాదము నుంచుచున్నాను. నీవు నా పాదమును కదలించ కలిగితే రాముడు ఓడిపోయినట్లు భావించెదను." అని పల్కెను.

అంగదుని మాట వినగానే రావణుడు "రాక్షసవీరులారా, చూచె దరేమి! ఈ కోతి కాళ్ళుపట్టుకొని గిరగిరత్రిప్పి నేలపైకొట్టండి." అని పల్కెను. మేఘనాదుడు మొదలైన యోధానుయోధులు అనేకులు సంతోషముతో ముందుకువచ్చి అనేక విధములుగా అంగదుని పాదమును కదలించుటకు ప్రయత్నించారు. కాని అది ఏ మాత్రము కదలుటలేదు. అంతట వారు తలవంచుకొని తమతమ స్థానాలకువెళ్ళి కూర్చుండిరి. తరువాత రావణుడు స్వయంగా లేచెను. అతడు అంగదుని పాదములు పట్టుకొనబోయెను. అంగదుడు "రావణా! నా పాదాలు పట్టుకున్న నీకు రక్షణ కలుగదు. నీవు

శ్రీరాముని పాదాలు ఎందుకు పట్టుకొనవు?" అని పలుకగా రావణుడు మనస్సు చిన్నబుచ్చుకొని తిరిగిపోయెను.

రాక్షసరాజైన రావణుడు తల వంచుకొని సింహాసనము పై కూర్చుండెను. సకలజగత్తుకు ఆత్మ, సమస్తప్రాణలకు ప్రభువు శ్రీరాముడు. అతనికి విముఖుడుగా ఉన్నవానికి శాంతి ఎట్లు లభించును?

"శ్రీరాముడు తలచినచో జగత్తులు సృష్టింపబడును. నష్టములు కూడ అగును. అత్యంత దుర్బలుని బలశాలిగాను, బలశాలిని శక్తి హీనునిగాను ప్రభువు చేయగలడు."

అంగదుడు అనేక విధాలుగా రావణునకు నీతులు బోధించెను. కాని రావణుడు ఒప్పుకొనలేదు. అతనికి అంత్యసమయము సమీపించి నది కాబోలు!

అంగదుడు రావణుని చూచి "యుద్ధభూమిలో నిన్ను ఓడించి సంహరింపనిచో...ఇప్పుడే ఆ గొప్పతనము ఎందుకు చెప్పడం?" అని పలికెను. అంగదుడు సభలో ప్రవేశించక ముందే రావణుని పుత్రుని అతడు వధించెను. ఆ వార్త విని రావణుడు దుఃఖితుడయ్యెను.

అంగదుడు శ్రీరామచంద్రుని చరణసన్నిధికి చేరుకొనెను. అతడు సజల నేత్రాలతో పులకిత శరీరుడై యుండెను.

సాయంకాలమైనదని తెలిసికొని రావణుడు తన భవనమునకు వెళ్ళిపోయెను. పట్టపురాణి మండోదరి రావణునితో ఇట్లు విన్నవించెను. "ఓ నాథా! బాగా ఆలోచించండి దుర్బుద్ధిని విడువండి. మీకు రామునితో యుద్ధము శ్రేయస్కరముకాదు. ఆయన తమ్ముడు గీచిన రేఖ మీరు దాటలేక పోతిరి. ఇక మీ పురుషత్వ మేపాటిది? మీరు సంగ్రామములో అతనిని జయింపగల్గుదురా? అతని దూతయే సముద్రమును లంఘించి మన లంకలో నిర్భయంగా ప్రవేశించాడు. కాపలివారిని చంపి, అశోకవనమును ధ్వంసముచేసి అనాయాసముగా అక్షకుమారుని చంపి నగరాన్నంత



బూడిదచేసి వెళ్ళిపోయెను. అప్పుడు మీ బలం, మీ గర్వం, మీ అభిమానం ఎచ్చటకు వెళ్ళిపోయినవి? ఇప్పుడు వ్యర్థంగా గప్పాలు కొట్టకండి" నాథా! నేను చెప్పింది బాగా ఆలోచించండి.

శ్రీరఘుపతిని సామాన్యరాజుగా భావించకండి. అతడు అద్వితీయబల సంపన్నుడు, చరాచరలోకాలకు ప్రభువని గుర్తించండి. శ్రీరామబాణ ప్రతాపం మారీచుడు కూడా ఎరుగును. కాని అతని మాటలుమీరు వినలేదు. జనకుని సభలో అసంఖ్యాక రాజులు గలరు. అచ్చట అత్యంత పరాక్రమవంతులైన మీరు కూడా ఉంటిరి. అచ్చట శివధనుస్సును విరిచి శ్రీరాముడు సీతాదేవిని వివాహమాడగా అప్పుడు మీరతనిని యుద్ధములో ఎందుకు ఓడించలేదు.

ఇంద్రునిపుత్రుడు జయంతుడు. అతని బలం కొద్ది కొద్దిగా నాకు తెలియును. శ్రీరాముడతనిని పట్టుకొని ఒక కన్ను పెరికి ప్రాణాలతో వదలెను.

శూర్పణఖ అవస్థ మీరు చూచియే యున్నారు అయినప్పటికీ మీకు లజ్జ కలుగుటలేదు. శ్రీరాముడు విరాధ, ఖరదూషణాది రాక్షస వీరులను చంపెను. ఒకే బాణంతో వాలిని సంహరించెను. దీనినిబట్టియైనా అతని గొప్పతనం అర్థము చేసుకొనండి. అనాయాసముగా సముద్రాన్ని అతడు బంధించెను. సేనా సమేతంగా సువేల పర్వంపై దిగెను. కరుణాళువైన ఆ ప్రభువు మీ హితముకోరే మీ దగ్గరకు దూతను పంపెను; ఏనుగుల గుంపులో సింహం ప్రవేశించి వానిని ఛిన్నాభిన్నం చేసినట్లు అతడు సభలో ప్రవేశించి మీ బలాన్ని మథించి వేసెను.

అత్యంతబలకాలురు, భయంకరులైన వీరులు, అంగదుడు, హనుమంతుడు, మొదలగువారు ఆ శ్రీరాముని సేవకులు. అతనిని మీరు మాటిమాటికి మనుష్యుడనియే చెప్పుచున్నారు. ప్రియతమా! కాల వశం చేత ఇప్పటికి కూడా మీకు జ్ఞానం కలుగుటలేదు. కాలుడు కాల దండముతో ఎవరిని చంపడు. అతని ధర్మం, బలం, బుద్ధి ఆలోచనా శక్తిని హరించును, మరణ సమయం దతి చేరిన వారు మీవలె భ్రమ చెందుచుందురు.

మీ యిద్దరు పుత్రులు హతులైనారు. నగరం భస్మం అయింది. అయినదేదో అయినది. ఇప్పుడైనా మరల ఆ పొరపాటునే చేయకండి. శ్రీరామునితో వైరం విడవండి కృపాసముద్రుడైన శ్రీరాముని భజించి నిర్మల కీర్తి పొందండి” అని మండోదరి తన భర్తకు నచ్చ జెప్పెను.

రావణునకు భార్య పలుకులు ములుకులవలె తోచెను. అతడు వానిని ఏ మాత్రమును లక్ష్యపెట్టకుండా ఉదయం కాగానే సభలోనికి వెళ్ళిపోయెను. భయం వీడి జరిగినదంతా మరచి గర్వంతో ఉప్పొంగి సింహాసనంపై కూర్చుండెను.

సువేల పర్వతంపై గల శ్రీరాముడు అంగదుని పిల్చెను. అతడు వచ్చి ప్రభువు పాదాలకు ప్రణమిల్లెను; అతనిని ఆదరంతో తనవద్ద కూర్చుండ బెట్టుకొని శ్రీరాముడు నవ్వుతూ ఇట్లు పలికెను.

“అంగదా! నాకొక విషయం నిన్నడిగి తెలుసుకొనవలెనని కుతూహలం గానున్నది. నిజము చెప్పుము, రాక్షసుకుల తిలకుడు, ప్రపంచంలో అద్వితీయ బాహు బల సంపన్నుడుగా ప్రసిద్ధికెక్కినవాడు. అయిన రావణుని నాలుగు కిరీటాలను నీవు విసరివేసితివి. వానిని నీ వెట్లు పొందియుంటివి?”

అంగదుడు “ప్రభూ! అవి కిరీటములు గావు. అవి రాక్షస రాజుగారి నాల్గు గుణాలు సామ, దాన, భేద, దండములు. ఈ నాలుగు రాజు హృదయంలో వసించుచుండునని శాస్త్రములు చెప్పుచున్నవి. ధర్మానికి నాలుగు పాదాలు, రావణునిలో ధర్మం తగ్గెనని అవి తెలుసుకొని మీ వద్దకు వచ్చినవి” అనెను.

అంగదుని చాతుర్యంతో కూడిన వాక్యాలను విని శ్రీరాముడు నవ్వెను, అంగదుడు లంకానగరంలోని సమాచారంఅంతా చెప్పెను.

శత్రుసమాచారం అంతా తెలియగానే శ్రీరాముడు మంత్రులను పిలిచి “లంకకు నాలుగు పెద్ద పెద్ద ద్వారాలు గలవు. వానిపై ఎట్లు దాడి చేయవలెనో ఆలోచించండి” అని పల్కెను.



వానరరాజు సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు హృదయంలో శ్రీరాముని స్మరించిరి. ఆలోచించి కర్తవ్యాన్ని నిశ్చయించుకొనిరి. వానర సేనను, నాలుగు విభాగాలుగా విభజించిరి.

వారికి తగిన సేనాపతులను నియమించిరి. వారిని పిలిచి ప్రభువు ప్రతాపాన్ని అందరికి విన్నవించిరి. అది విని వానరులు సింహములవలె గర్జించి పరుగెత్తిరి. సంతోషంతో శ్రీరాముని పాదాలకు నమస్కరించి పర్వత శిఖరాలను ధరించికొని వానర వీరులు కోసలరాజు శ్రీరామచంద్రునకు జయం జయం అని కేకలు వేయుచు ముందుకు పరుగెత్తిరి.

లంకానగరపుకోట అజేయమైనదని తెలిసికూడా వానరులు ప్రభువు ప్రతాపం వలన నిర్భయంగా నిస్సంకోచంగా వెళ్ళిరి. నలువై పుల ఆవృతమైన మేఘముల సమూహంవలె లంకను నాలుగు దిశలనుండి ముట్టడించి నోటితోనే ఢంకాలు, భేరీలు మ్రోగింపసాగిరి.

అపరిమిత బలం గల వానరులు సింహములవలె ఉచ్ఛైస్స్వరంతో శ్రీరామునకు జయం, శ్రీలక్ష్మణునకు జయం సుగ్రీవునకు జయం అని గర్జింపసాగిరి.

లంకానగరంలో కోలహలం చెలరేగెను. అది విని రావణుడు “వానరుల దుండగం చూడండి” అని పలుకుచు రాక్షస సేనను పిలిపించి యిట్లు పలికెను.

“కోతులు కాలప్రేరణతో ఇచ్చటకు వచ్చారు. మన రాక్షసులందరూ ఆకలితో నున్నారు. విధాత మన యింటి వద్దకే భోజనం పంపాడు” ఇట్లా పలికి అతడు అట్టహాసం చేసెను. మరల ఇట్లనెను. “వీరులారా, మీరెల్లరు నాలుగు దిశలా వెళ్ళండి. వానరులను, ఎలుగు బంట్లను పట్టి తృప్తిగా తినండి.”

రాక్షసులు సకలాయుధాలను ధరించి బయలుదేరిరి. మాంసాహార పక్షులు ఎఱుపురాళ్ళ సమూహాన్ని చూచి మాంసం అని ఆశించి పైన

పడునట్టు వారు వెళ్ళిరి. యుద్ధవీరులైన కోట్లకొలది రాక్షసవీరులు వివిధములైన అస్త్ర శస్త్రాలను, ధనుర్బాణాలను చేతబూని బురుజుల మీదకు, కోటలమీదకు ఎక్కిరి. ఢంకాలు, భేరీలు మ్రోగించిరి. ఆధ్వని విని యుద్ధం చేయవలెనని రాక్షస విరులలో ఉత్సాహం రేకెత్తెను.

అగణితమైన భేరీ నినాదాలను విని పిరికివాండ్రు గుండెలు పగులుచుండెను. వారు అత్యంత విశాల శరీరం గల గొప్ప గొప్ప యోధాను యోధులైన వానర వీరుల, భల్లూకవీరుల సమూహాన్ని చూచిరి. వానరులు ముందుకు పరిగెత్తుచుండిరి. పర్వతాలను పగులగొట్టి మార్గం చేయుచుండిరి. కోట్లకొలది యోధులు గర్జించుచుండిరి.

ఇఱుపక్షాలవారు వారి వారి ప్రభువులకు జయజయ కారాలు చేయుచు వెంటనే యుద్ధానికి సన్నద్ధులైరి. రాక్షసులు పర్వత శిఖరాలను కుప్ప కుప్పలుగా విసురుచుండిరి. వానరులు గంతులువేయుచు వానిని పట్టుకొనుచుండిరి. తిరిగి వానిని వారిపైననే విసరుచుండిరి.

ప్రచండులైన వానరులు, భల్లూకాలు, పర్వత శిఖరాలను కోటపై వేయుచుండిరి. వారు పైకి ఉరుకుచుండిరి, రాక్షసుల పాదాలను పట్టుకొని భూమిపై వారిని పడవేసి పారిపోవుచుండిరి. కయ్యమునకు పిలుచుచుండిరి. చాలా చంచలులైన తేజస్సులైన వానరులు, భల్లూకాలు చురుకుగా ఎగురుచు కోటపై ఎక్కుచుండిరి. భవనాలలో జొరపడి శ్రీరాముని యశస్సును గానం చేయసాగిరి. పిమ్మట ఒక్కొక్క రాక్షసుని పట్టుకొని ఆ వానరులు ఆడించి ఏడిపించుచుండిరి. మీద రాక్షసులు క్రింద వానరులు ఈ విధంగా రాక్షసులు కోటపై నుండి భూమిమీదకు పడుచుండిరి. శ్రీరాముని ప్రతాపం వలన బలశాలురైన వానరులు రాక్షసవీరుల సమూహాలను నలిపివేయుచుండిరి. వానరులు కోటపైకి ఎక్కిరి.

గాలి వేగంగా వీచునప్పుడు మేఘముల సమూహం చెల్లా చెదురైనట్లు రాక్షసులు గుంపులు పటాపంచలై పరుగిడి పోయిరి. లంకా నగరమంతటా హాహారము వ్యాపించెను. పిల్లలు, స్త్రీలు, రోగులు ఏడ్వ నారంభించిరి.



రాజ్యపాలన చేయుచున్న రావణుడు మృత్యువును పిలుచు కొని వచ్చెనని అందరూ నిందింపసాగిరి. రావణుడు తన సేన వ్యాకుల పడుటకును విని పరిగెత్తి పోవుచున్న రాక్షసవీరులను వెనుకకు మరల్చి క్రోధముతో నిట్లు పల్కెను.

“ఎవరు యుద్ధరంగము నుండి వెనుకకు పరిగెత్తుదురో వారి కంఠములు నా కఠోరఖడ్గముతో ఖండించి వేయుదును నా ఉప్పు పులుసు అంతా తినిరి. రక రకాల భోగాలు అనుభవించిరి. ఇప్పుడు యుద్ధ భూమిలో ప్రాణాలు ప్రియమైపోయినవి.”

రావణుని కఠోర వాక్యాలు విని వీరులందరు భయపడిరి. లజ్జితులై క్రోధంతో యుద్ధం చేయుటకు తిరిగి వెళ్ళిరి. శత్రువుతో యుద్ధం చేసి మరణించుటలోనే వీరుడు శోభించగలడు.

అనేకములైన అస్త్ర శాస్త్రాలను ధరించి వీరులెల్లరు అట్టహాసములు చేయుచు పోరాడ సాగిరి. తమ శూలాలతో పొడిచి చంపుచు వానరులను వ్యాకుల పరచిరి.

“అంగదు డెక్కడ? హనుమంతు డెక్కడ? బలవంతులైన నలుడు, నీలుడు, ద్వివిదుడు ఎక్కడ?” అని గొంతెత్తి అరవసాగిరి.

తన దళం వారు భయభీతులగుటను హనుమంతుడు విన్నప్పుడు అతడు పశ్చిమ ద్వారం వద్ద నుండెను. అచ్చట అతనితో మేఘనాదుడు యుద్ధము చేయుచుండెను. ఆ ద్వారము విరుగుటలేదు. చాల గట్టిగా నున్నది. హనుమంతుడు చాల క్రోధము తెచ్చుకొనెను. కాలునితో సమానమైన వీరుడైన ఆంజనేయుడు తీవ్రంగా గర్జించెను. ఒక్కదుముకు దుమికి లంకకోట పైకి వచ్చెను. పర్వతాన్ని తీసుకొని మేఘనాదుని వైపు పరుగెత్తెను. వాని రథాన్ని విరుగ గొట్టెను సారథిని చంపి క్రింద పడవేసెను. మేఘనాదుని తన్నెను. రెండవ సారథి మేఘనాదుడు వ్యాకులపడుట చూచి రథంపై వేసికొని వెంటనే యింటికి తీసుకొని వెళ్ళెను.

హనుమంతు డొక్కడే కోటపైకి వెళ్ళెనని వినగానే అంగదుడు కూడా ఎగిరి కోటపైకి పోయెను. రణరంగంలో శత్రువులకు విరుద్ధంగా ఆ వానరులిద్దరు క్రోధావేశముతో విజృంభించి నిలిచిరి. శ్రీరాముని ప్రతాపమును స్మరించుచు వారిద్దరు పరుగెత్తి రావణుని రాజభవనము పైకెక్కిరి. రాముని ప్రశంసించుచు మాటాడిరి, కలశముతో కూడా ఆ రాజభవనమును కూల్చివేసిరి. ఇది చూచి రావణుడు భయపడెను. స్త్రీలు చేతులతో గుండెలు బాదుకొనుచుండిరి. ఈ పర్యాయము ఇద్దరు వానరులు ఒకేసారి వచ్చిరి. వానర లీలలు చేసి యిద్దరు రాక్షసులను భయపెట్టుచుండిరి, స్వర్ణ స్తంభములను పట్టుకొని ఉపద్రవము చేయవలెనని వారు పరస్పరము చెప్పుకొనుచుండిరి. వారు గర్జించి శత్రుసైన్యము మధ్యలో దూకిరి, తమ భుజబలములతో వారిని మర్దించసాగిరి కొంతమందిని తన్నుచు, మరి కొంతమందిని చెంపదెబ్బలు కొట్టుచు ఉండిరి. మీరు శ్రీరాముని భజింపనందుకు తగిన ఫలితము ఇదియే యని చెప్పుచుండిరి. ఒకరిని ఇంకొకరితో కలిపి నలిపి వేయుచుండిరి. తలలను విరిచి విసరివేయు చుండిరి. అవి రావణుని వద్దకు వచ్చి పడుచుండెను. గొప్ప గొప్ప యోధుల పాదాలను పట్టుకొని ప్రభువు వద్దకు విసరివేయుచుండిరి. విభీషణుడు వారివారి పేర్లను చెప్పుచుండెను. శ్రీరామచంద్రమూర్తి వారినెల్లరను పరమ పదానికి పంపుచుండెను. బ్రాహ్మణుల మాంసము తినిన ఆ దుష్టరాక్షసులు కూడా పరమగతిని పొందు చుండిరి. యోగులు కూడా ఎంతగా వేడుకొనినా సునాయాసముగా లభించని కైవల్యమును ఆ రాక్షసులు తేలికగా పొందిరి.

ఈశ్వరుడు పార్వతీదేవితో ఇట్లుచెప్పెను. "శ్రీరాముడు అత్యంత కోమల హృదయుడు. కరుణానిధి. రాక్షసులు తనను వైరభావముతో నైనను స్మరించిరని గ్రహించి వారలకు మోక్షమును ప్రసాదించెను. ఇట్టికృపాళువు ఎవరుందురు? ప్రభువు స్వభావము తెలిసికూడా ఎవరు మోహమును వదలి అతనిని భజించరో వారు దురదృష్టవంతులు, మందభాగ్యులు."



అంగదుడు, హనుమంతుడు కోటలో ప్రవేశించిరని విభీషణుడు శ్రీరామునితో చెప్పెను. రెండు మందర పర్వతములు సముద్రమును మథించినట్లు ఆవానరు లిరువురు లంకానగరాన్ని ధ్వంసం చేయుచుండిరి. భుజబలముతోశత్రుసైన్యాన్ని త్రొక్కుచూ నలుపుచూ ఉండిరి.

దినము గడువగనే హనుమంతుడు, అంగదుడు దూకి శ్రీరాముడున్న చోటికి చేరుకొనిరి. వారు ప్రభువు పాదాలకు ప్రణమిల్లిరి. ఆ ఉత్తమ వీరులను చూచి ప్రభువు మిగుల సంతసించెను. స్వామి చల్లని చూపుతో చూడగా వారికి అలసటపోయెను. పరమ సౌఖ్యమును పొందిరి. అంగదుడు, హనుమంతుడు వెళ్ళిరని తెలిసికొని వానరవీరులెల్లరు తిరిగిపోయిరి.

అంతట రాక్షసులు సాయంకాలపు బలమును పొంది రావణునికి జయజయ నాదములు చేయుచు వానరులపై విరుచుక పడిరి. రాక్షస సేన వచ్చుటను చూచి వానరులు తిరిగివచ్చిరి. ఆ వీరులు పళ్ళుకొరుకుచూ రాక్షసులను డీకొనసాగిరి. ఇరుపక్షాలవారు గొప్ప బలశాలురు, వీరులు; తెగించి పోరాడుచుండిరి. ఎవరు కూడ ఓటమిని అంగీకరించుట లేదు.

రాక్షసులెల్లరు వీరాధివీరులు వారు మిక్కిలి నల్లగా ఉండిరి. వానరులు విశాలకాయులు, పెక్కు రంగులతోనుండిరి. ఉభయ పక్షాలు బలమైనవి. రెండువైపుల సమానబలముగల వీరులు ఉండిరి. వారు క్రోధావేశముతో పోరాడుచుండిరి. యుద్ధములో తమతమ వీరత్వములు చూపుచుండిరి. వర్షాకాలము యొక్కయు, శరదృతువు యొక్కయు అనేక మేఘాలు వాయుప్రేరితములై పోరాడుచున్నట్లు రాక్షసులు వానరులు యుద్ధము చేయుచుండిరి. రాక్షస సేనాపతులైన అతికాయుడు, అకంపనుడు తమ సేనలు చెల్లాచెదరగుట చూచి మాయపన్నిరి. క్షణములో దిక్కులందు గాఢాంధకారము వ్యాపింప జేసిరి. రక్తము, రాళ్ళు, బూడిద వర్షముగా కురిపించిరి.

దశ దిశలలో దట్టమైన అంధకారమును చూచి వానరసైన్యములో అల్లకల్లోలము బయలుదేరెను. ఒకరికి మరొకడు కనిపించుట లేదు. ఎక్కడి వారక్కడ భయపడి కేకలు వేయుచుండిరి.

శ్రీరామచంద్రుడు ఈ రహస్యమును గ్రహించి అంగదుని హనుమంతుని పిలిచి విషయమంతయును వారికి చెప్పెను. అది విని వారిద్దరు క్రోధముతో అచ్చటికి పరుగెత్తిరి. శ్రీరామచంద్రుడు నవ్వుచు ధనుస్సును ఎక్కుపెట్టి అగ్నిబాణమును వేసెను. అంత అంధకార మంతా అంతరించెను. ప్రకాశము వ్యాపించెను. వానర భల్లూక సైన్యములు వెలుతురు చూడగనే భయమును వదలి సంతోషముతో ముందుకు పరుగెత్తికొని వచ్చిరి.

హనుమంతుడు, అంగదుడు యుద్ధములో గర్జించుచుండిరి. ఆ గర్జనలు వినగానే రాక్షసులు భయపడి పారిపోయిరి. పరుగెత్తుచున్న రాక్షసవీరులను వానర భల్లూక వీరులు పట్టుకొని నేలకువేసి కొట్టుచుండిరి. వారు తమయుద్ధ కౌశలము చూపుచుండిరి. రాక్షసులను పాదములు పట్టుకొని సముద్రములో విసరి పడవేయుచుండిరి. అందులోని మొసళ్ళు మొదలగు జలచరములు వారిని మ్రింగుచుండెను. కొందరు భయపడి యురుకుచుండిరి. శత్రుపక్షము వారందరిని చెల్లాచెదురు చేసి వానర, భల్లూకసైన్యములు మహోత్సాహముతో గర్జించుచుండిరి. వానరులు రాత్రిసమయమగుటచేత యుద్ధము మాని రామచంద్రుని వద్దకువచ్చిరి. రామచంద్రుడు వారందరిని కృపాదృష్టితో చూచెను. వారికి యుద్ధము నందలి బడలిక యంతము సమసిపోయెను.

లంకలో రావణుడు కొలువుతీర్చి మంత్రులను పిలిచి యుద్ధములో చనిపోయిన వీరులందరి పేర్లు తెలిపి దుఃఖించి "సేనలలో అర్ధభాగము నశించిపోయెను. ఇప్పుడు కర్తవ్యమేమి ఆలోచించి చెప్పండి"యని అడిగెను.

వారిలో మాల్యవంతుడనే రాక్షసుడు వృద్ధుడు, రావణునికి మాతామహుడు, అనుభవం గలవాడు, మంత్రులలో ప్రముఖుడు. అతడు ఇట్లు చెప్పెను. "లంకేశ్వరా! మీరు నా సలహావినండి. మీరు సీతాదేవిని ఇచ్చటికి తెచ్చినప్పటినుండి పెక్కు అపశకునములు కలుగుచున్నవి. ఆ రామునికి, విముఖులైన వారికి శాంతి, సుఖము ఉండదు. పూర్వము హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపులను, మధుకైటభులను సంహరించిన ఆ భగవానుడే



రాముడుగా నేడు అవతరించెను. అతడు కాల స్వరూపుడు. జ్ఞానమూర్తి. బ్రహ్మ, ఈశ్వరుడు ఆయనను సేవించుచుందురు. అటువంటి వానితో వైరము పెట్టుకొనుట తగదు. ఇప్పటి కైన హఠము మాని జానకీదేవిని శ్రీరామునకు అప్పగించుట మంచిది."

మాల్యవంతుని పలుకులు రావణునకు ములుకులవలె తగిలెను. అంతట రావణుడు ఓరీ! దౌర్భాగ్యుడా! రాక్షస వంశములో చెడబుట్టితివి. నాయెదుట నిల్వకుము. నీవు వృద్ధుడవు కాన చంపకుండా వదలి పెట్టు చున్నాను." అని మాల్యవంతుని దూషించెను. అది విని మాల్యవంతుడు రాముని చేతులలో ఇతనికి మరణము తప్పదని అనుకొనుచు వెళ్ళిపోయెను. ఇంతలో మేఘనాదుడు చాలా కోపముతో ఇట్లు పల్కెను "నాన్నగారూ! రేపు ఉదయము నా ప్రతాపము చూడండి! ఎంతపని చేయవలెనో అంతకు మించి చేసెదను."

పుత్రుని ప్రతాపము చూచి రావణునకు అమితమైన ఉత్సాహము కలిగెను. వెంటనే అతనిని ప్రేమతో కౌగిలించుకొని ముద్దాడెను. ఇంతలో తెల్లవారెను. వానర భల్లూక సేనాసమూహములు మామూలుగా కోట నాలుగు ద్వారాలు ముట్టడించిరి. లంకా నగరమంతయు కోలాహలముతో నిండిపోయెను. రాక్షసులు ఆయుధములు ధరించి రణరంగమునకు పరుగిడిరి. కోటయందలి పర్వత శిఖరాగ్రమును అధిరోహించి రాళ్ళను, వృక్షములను విసరివేయుచుండిరి. పిడుగులు పడినట్లుగా నుండెను. ప్రళయకాల ఝంఝూమారుతమువలె గర్జించుచుండిరి. వానరులు కూడ భయంకరముగ పోరాడుచుండిరి. వారి శరీరములు గాయములతో నిండిపోవుచుండెను, అయినను సాహసముతో రణమొనరించుచుండిరి. పర్వతములను పెకలించి కోటపైకి విసరివేయుచుండిరి. రాక్షసులు ఎచ్చటివారచ్చట పడిపోవుచుండిరి. మేఘనాదుడు వానరులు తిరిగి కోటను ముట్టడించినారని తెలుసుకొని మండిపడుచు కోటదగ్గరకు వచ్చి రణభేరి మ్రోగించెను.

"మేఘనాదుడు కోసలాధీశులైన రామలక్ష్మణులు ఎచ్చట? నల, నీల, సుగ్రీవ, హనుమంతులెచ్చట? అంగద, జాంబవంతులు ఎచ్చట? సోదరునికి ద్రోహముచేసి వచ్చిన విభీషణుడెక్కడ? ఆ దుష్టులందరిని హతమార్చెదను" అని పలుకుచు ధనుర్బాణములను సంధించెను. శత్రువులపై శరవర్షము కురిపింపసాగెను. అవి రెక్కలుగల సర్పాలు పరుగెత్తు చున్నవా యన్నట్లు ఉండెను. అదిగాంచి వానరులందరు గడబిడపడి పలాయన మగుచుండిరి. ఎదురుపడి నిల్వలేక పోవుచుండరి. యుద్ధము చేయవలెననే కోరికను మరచిరి. వాని బాణములు తగులకుండా బయటపడని వాడొక్కడూ లేడు. యోధులందరికి పదేసి బాణముల చొప్పున వేసెను. వానరులందరు నేల కొరిగిరి.

అంత మేఘనాదుడు ఉత్సాహముతో సింహమువలె గర్జించుచుండెను. తన సేన యావత్తు చిందరవందర యగుటను చూచి హనుమంతుడు క్రోధముతో కాలయముడే బయలుదేరివచ్చు చున్నాడన్నట్లుగా పరుగెత్తు కొనివచ్చి గొప్ప పర్వతమును పెకలించి మేఘనాదునిపైకి విసరెను. అంత మేఘనాదుడు పర్వతము తనమీద పడునని తెలుసుకొని ఆకాశముపైకి ఎగిరెను. ఆ పర్వతముపడి రథము సారధి, గుఱ్ఱములు ముక్కలైపోయెను. మాటిమాటికి హనుమంతుడు పోరాటమునకు సవాలు చేయుచుండెను. కాని మేఘనాదుడు సమీపమునకు వచ్చుటలేదు. ఎందుకనగా హనుమంతుని బలము అతనికి తెలియును.

మేఘనాదుడు శ్రీరాముని సమీపమునకు వెళ్ళి అనేక విధములుగా దూషించి అయనపై అస్త్ర శస్త్రములను, ఆయుధములను ప్రయోగించెను. కాని కృతకృత్యుడు కాడాయెను. అంత మేఘనాదుడు ఆకాశము నుండి అగ్నివర్షము కురిపించెను. భూమిపై జలధారలు ప్రవహింపసాగెను. అందు అనేక విధములైన పిశాచములు; భూతములు; దయ్యములు నాట్యము చేయుచు "కొట్టుడు, చంపుడు, తన్నుడు" అని కేకలు వేయసాగెను. చీము, నెత్తురు, ఎముకలు వర్షమువలె పై నుండి కురియసాగెను.



ఆ మాయనుగాంచి వానరులు వ్యాకులత చెందసాగిరి. ఈ విచిత్రమును చూచి రామచంద్రుడు నవ్వుకొని వానరులందరు భయపడినారని తలంచి ఒక్క బాణముతో ఆ మాయనంతటిని నశింపచేసెను. అంత రామచంద్రుడు తన సేనను కృపాదృష్టితో చూచెను. అప్పుడు వారికి గొప్ప బలము చేకూరెను. అంతట అంగదుడు హనుమంతుడు, జాంబవంతుడు మున్నగు ప్రముఖులను వెంటతీసికొని సర్వాయుధములు ధరించి శ్రీరామునకు నమస్కరించి శేషావతారుడైన లక్ష్మణుడు యుద్ధమునకు బయలుదేరెను. ఎర్రని నేత్రములతో, విశాలమైన వక్షఃస్థలముతో, బలిష్ఠములైన బాహువులతో; ఆ వీరశిరోమణి ఒప్పారు చుండెను.

రావణుడు గొప్పగొప్ప రాక్షస యోధులను రణరంగమునకు పంపెను. వారు అనేక విధములైన అస్త్ర శస్త్రములను ధరించి ముందున కురికిరి. పర్వతములను, వృక్షములను ఆయుధములుగా ధరించి వానర వీరులు రామునికి జేజేలు పలుకుచు వారితో తలపడిరి. వానరులు; రాక్షసులు ఒకరినొకరు ఎదుర్కొనుచుండిరి. వానరులు రాక్షసులను కొట్టుచూ, తన్నుచూ, పొడుచుచుండిరి. విజయకాంక్షాపరులైన వానరులు రాక్షసులు ఘోరముగా పోరాడసాగిరి. "కొట్టండి, చంపండి, తలలు నరకండి, భుజములు విరగదీయండి" అను కేకలతో భూనభోంతరములు దద్దరిల్లెను. తెగిన మొండెములు ఇటునటు పరిగెత్తుచుండెను. ఆకాశములో దేవతలు ఈ దృశ్యమును తిలకించుచుండిరి. ఒకప్పుడు ఆనందము, మరొకప్పుడు దుఃఖము పొందుచుండిరి. రక్తము గోతులనిండానిండి గడ్డకట్టెను. దానిపైన ధూళి క్రమ్మెను. అది నిప్పుమీద నివురు కప్పినట్లుండెను.

మేఘనాదుడు, లక్ష్మణుడు ఒకనొకరు డీకొనుచుండిరి. ఒకరినొకరు జయింపవలెనని పోరాడుచుండిరి. మేఘనాదుడు మాయా యుద్ధము చేయసాగెను. లక్ష్మణుడు క్రోధముతో భాణమునువేసి వాని రథమును, సారథిని ముక్కలుగా చేసివేసెను. అనేక విధములుగా లక్ష్మణుడు రాక్షసులను బాధించెను. రాక్షసుల ప్రాణములు మాత్రము మిగిల్చెను.

అంత మేఘనాదుడు తన ప్రాణములమీద ఆశవదలెను. అప్పుడు బాగా ఆలోచించి "వీరఘాతినీ" శక్తిని ప్రయోగించెను; ఆ తేజోవంతమైన శక్తివచ్చి లక్ష్మణుని హృదయమున తీవ్రముగా తగిలెను. వెంటనే లక్ష్మణుడు మూర్ఛిల్లెను. మేఘనాదుడు నిర్భయముగా లక్ష్మణుని వద్దకు వెళ్ళి వానిని ఎత్తుకొని తీసుకువచ్చుటకు ప్రయత్నము చేసెను. కాని అతనిని లేవదీయ లేకపోయెను. అంత అతడు సిగ్గుపడి వెళ్ళిపోయెను.

రామచంద్రుడు లక్ష్మణుడు ఎచ్చట? అని అడుగగా హనుమంతుడు వెళ్ళి వెదకి మూర్ఛితుడైన లక్ష్మణుని తీసుకొని వచ్చెను. సోదరుడు మూర్ఛచెందుటను చూచి శ్రీరాముడు దుఃఖింపసాగెను. జాంబవంతుడు. "ఓ స్వామీ! దుఃఖించవద్దు. ఇతడు మరణించలేదు. లంకలో సుషేణుడను వైద్యుడు కలడు. అతనిని తీసికొని వచ్చినయెడల లక్ష్మణుడు జీవించు"నని చెప్పగా హనుమంతుడు సూక్ష్మరూపము ధరించి వెళ్ళి వైద్యుని ఇంటితోసహా తీసుకొనివచ్చెను. అతడు శ్రీరాముని పాదారవిందములకు నమస్కరించి ఔషధము గల పర్వతము పేరు చెప్పెను.

రాముడు "ఓ హనుమా! నీవువెళ్ళి ఔషధమును తీసికొనివచ్చి తమ్ముని బ్రతికింపుమని ప్రార్థించెను. హనుమంతుడు రాముని స్మరించుచు వాయువేగముతో వెళ్ళెను.

అక్కడ గూఢచారి ఈ రహస్యమును రావణునకు విన్నవించెను. అదివిని రావణుడు చాలా విచారపడి కాలనేమి వద్దకువెళ్ళి అంతయు చెప్పి ఈ సమయమున మనప్రతిష్ఠ కాపాడుమని వేడుకొనెను. అదివిని కాలనేమి తల కొట్టుకొనుచు "లంకేశ్వరా! నీవు చూచు చుండగనే నగరమును తగులబెట్టినవానిని నేను ఎట్లు ఆపగలను? కాబట్టి నీవు క్రోధము మాని రాముని భజించినయెడల మనకు కళ్యాణము జరుగును". అని విన్నవించెను.

మూర్ఖుడైన రావణుడు కోపముతో "కాలనేమీ! వ్యర్థముగా వాగకు. నేను చెప్పినట్లు చేయుము లేనియెడల ఇప్పుడు నిన్ను ఈ చంద్రహాసముతో



హతమార్చెదను."అని పలుకగా భయపడి కాలనేమి ఈ దుష్టుని చేతిలో మరణించుటకన్న ఆ భగవానుని దూత చేతిలో మరణించుట మంచిదని తలంచి బయలుదేరెను.

మార్గమధ్యమున కాలనేమి మాయను కల్పించెను. ఒకచెఱువు, మందిరము, తోట, ఆశ్రమము సృష్టించెను అందు తాను మునియై కపట జపము చేయుచూ కూర్చుండెను. అంత హనుమంతుడు మునిని చూచెను. మాయను సృష్టించిన మహితాత్ముడైన శ్రీరామచంద్రుని దూతను వీడు మాయచేయగలడా?

హనుమంతుడు కపటమునికి నమస్కరించి రాముని వీరకథలు చెప్పసాగెను. ఇప్పుడు రామరావణ యుద్ధముజరుగుచున్నదని చెప్పెను. మాయముని రాముని గుణములను ప్రశంసించుచు "తప్పక రామచంద్రుడు గెలువగలడు. మేము తపోధనులము. ఎక్కడ ఏమి జరుగుచున్నదో, మాకు జ్ఞానదృష్టివలన తెలియగలదు. అనెను.

అంత హనుమంతుడు దాహమగుచున్నది జలమిమ్మని అడుగగా మాయముని కమండలము చూపించెను. ఆ కొద్ది నీటివలన తన దాహము తీరదని హనుము అనగా ప్రక్కనున్న చెఱువు చూపించి కడుపునింద జలము త్రాగిరమ్ము, నీకు దీక్ష యిచ్చెదనని చెప్పెను. హనుమంతుడుపోయి చెఱువులో దిగగానే ఒక మొసలి హనుమంతునికాలు పట్టు కొని లోనికి లాగసాగెను, హనుమంతుడు దానిని పట్టుకొని వెలుపలకులాగి గ్రుద్దిచంపెను. మకరి దివ్యరూపము ధరించెను. ఆ అప్సరస నిజరూపముతో విమానము ఎక్కి వెళ్ళుచూ ఇట్లనెను. "ఓ వానరవీరా! నీదర్శనము వలన నా పాపము నశించెను. నా శాపముపోయెను. వీడు నిజమైన మునికాడు. నిశాచరుడు" అని చెప్పి వెళ్ళిపోయెను. హనుమంతుడు నిశాచరునివద్దకు వెళ్ళి ముందు గురుదక్షిణ తీసుకొనుము తరువాత నాకు ఉపదేశము చేయవచ్చును." అని పలికి ఆ దొంగముని మెడకు తనతోకనుచుట్టి వానిని నేలమీదవేసి బాదెను. అంత ఆ రాక్షసుడు మరణించెను.

హనుమంతుడు వెంటనే పర్వతము వద్దకు వెళ్ళెను. ఓషధిని కనుగొనలేక పర్వతమును పెకలించి అర్ధరాత్రి సమయమున అయోధ్య మీదుగా వచ్చుచుండెను. అతనిని చూచి రాక్షసుడని భావించి భరతుడు బాణము వేసెను.

ఆ బాణము తగులగనే ఆంజనేయుడు "రామ! రామ!" యనుచు నేలమీదపడి మూర్ఛిల్లెను. అదివిని భరతుడు హనుమంతుని వద్దకువచ్చి అతనిని మేల్కొల్పసాగెను. ఎంత లేపినను అతనికి తెలివి రాలేదు. అప్పుడు భరతుడు భయపడి "నేను ఎప్పుడు ఏ పని చేసినను రామునికి వ్యతిరేకముగా అగుచున్నది. నేను త్రికరణ శుద్ధిగా శ్రీరాముని సేవించుచు ఉన్నట్లయితే రామచంద్రుడు నన్ను దయతో చూచుచున్నట్లయితే ఈ వానరుడు సునాయసముగా లేవగలడు."అని పలికినదే తడవుగా హనుమంతుడు లేచెను. రామస్మరణ చేయుచు అతడు కూర్చుండెను.

భరతుడు హనుమంతుడు రామభక్తుడని తలంచి కౌగిలించుకొని సీతా రామలక్ష్మణుల యోగక్షేమము అడుగగా హనుమంతుడు జరిగిన కథ అంతయు క్లుప్తముగా వివరించెను. అది విని భరతుడు "పరమేశ్వరా! లోకములో నీవు నన్ను ఎందుకుపుట్టించితివి? నేనుచేయు పనులన్నియు రామునికి వ్యతిరేకముగా అగుచున్నవి" అని పరిపరివిధముల చింతించెను. కొంతసేపటికి భరతుడు తెప్పరిల్లి హనుమంతునితో "నీవు మామూలుగా వెళ్ళినయెడల చాలా ఆలస్యమగును. ముందు జరుగవలసిన పని విషమించును. కనుక నా బాణముమీద నీవు పర్వతముతో సహా కూర్చుండుము. వెంటనే అచ్చటకు చేరెదవు." అనిచెప్పగా హనుమంతుడు అట్లైతే తనకు చిన్నతనమగునని తలంచి "నేను మిమ్ములను స్తుతించుచు బయలుదేరెదను. క్షణములో అచ్చటకు చేరుకొనెదను" అని పలికి హనుమంతుడు వెంటనే బయలుదేరెను.

రామచంద్రుడు మూర్ఛతో పడియున్న లక్ష్మణుని ముఖము చూచి సాధారణ మానవునివలె ఇట్లు దుఃఖింప సాగెను. "సోదరా! ఎప్పుడును



నాకు నీవు దుఃఖము కలుగచేయలేదు. నీ స్వభావము కోమల మైనది. నా కొఱకు నీవు నీ భార్యను, తల్లిని, వదలి నాతో వనమునకు వచ్చితివి. ఎన్నో కష్టములను సహించితివి. ఇప్పుడు నాతో ఎందుకు మాటాడవు? నామీద నీకు ఉండే ప్రేమ ఏమైనది? నా దుఃఖమును చూచియైన ఎందుకు లేవవు? ఈ వనములో నీతో ఈ విధముగా ఎడబాటు జరుగునని నాకు ముందుగా తెలిసియున్న యెడల తండ్రిగారి ఆజ్ఞ శిరోధార్యమైనప్పటికి వనమునకు వచ్చియుండెడి వాడను కాను. లోకములో ఐశ్వర్యము, గృహము, భార్యా పుత్రులు, పరివారము పోయినను మరల వచ్చును గాని సోదరుడు పోయినచో తిరిగి సంపాదించలేము. నేను ఇప్పుడు రెక్కలు లేని పక్షినైతిని. నీవు లేని నా జీవితము నిష్ఫలము. భార్య కొఱకు ప్రేమగల సోదరుని పోగొట్టుకొంటిని. ఇప్పుడు నేను అయోధ్యకు ఏ ముఖముతో వెళ్ళెదను? భార్యను పోగొట్టు కొనిన రామునిలో వీరత్వము లేదని జనులు పలికినను నేను సహింపగల నేమో గాని దుస్సహమైన నీ యెడబాటును ఎట్లు సహించగలను? నీ తల్లికి నీవు ప్రియమైన వాడవు. ఆమె నీ మీద ఎంతయో ఆశ పెట్టుకొనినది. నేను నీ మేలు కోరువాడనని తలచి ఆమె నిన్ను నాకు అప్పగించినది. ఇప్పుడు ఆమె "లక్ష్మణుడు ఏడి? అని అడిగిన నేను ఏమి చెప్పెదను? నా దుఃఖమును చూచియైనా నీవు లేచి నన్ను సంతోష పెట్టవా. హా! లక్ష్మణా! హా! లక్ష్మణా"

అర్ధరాత్రి యైనది. హనుమంతుడు రాలేదు. లోకములో అందరి దుఃఖములను నశింపచేయు ప్రభువు తానే మిగుల దుఃఖపడు చుండెను. రాముడు దుఃఖించుటను చూచి వానరులు కూడా ఏడ్వసాగిరి.

ఆ సమయమున హనుమంతుడు పర్వతమును తీసికొని వచ్చెను. సుషేణుడు ఆ పర్వతమున ఉన్న ఔషధమును గుర్తించి దాని సాయమున లక్ష్మణుని కాపాడెను. వెంటనే లక్ష్మణుడు నిద్రపోయినవాడు లేచినట్లు లేచి నవ్వుతూ కూర్చుండెను. శ్రీరాముడు వైద్యునకు తన కృతజ్ఞత తెలిపెను.

హనుమంతుడు వైద్యుని లంకలో యథాప్రకారముగా ఉంచి తిరిగి వచ్చెను. శ్రీరాముడు హనుమంతుని లక్ష్మణుని కౌగిలించుకొనెను వారిని చూచి వానరులు మిగుల ఆనందించిరి.

లక్ష్మణుడు తిరిగి బ్రతికిన సమాచారము గూఢచారి ద్వారా రావణుడు విని మిక్కిలి దుఃఖించెను.

రావణుడు కుంభకర్ణుని యొద్దకు వెళ్ళి అనేక విధాలుగా మేల్కొల్పెను. కొంతసేపటికి అతడు లేచి కూర్చుండెను. "స్వయముగా యముడే వచ్చి కూర్చుండెనా" అన్నట్లు అతడు అత్యంత భయంకరంగా కనపడుచుండెను.

"అన్నా! నీవు నన్నెందుకు లేపితివి? నీ ముఖము చిన్నపోయిన దేమి?" అని కుంభకర్ణుడు రావణుని అడిగెను.

అంత రావణుడు జరిగిన చరిత్ర అంతయు వివరించుచు ఇట్లు చెప్పెను. "మన సైన్యాధిపతులు, అతికాయ, మహాకాయులు, అకంపనాది ఇతర యోధానుయోధులు వానరుల చేతులలో మరణించినారు.

ఈ మాటలు విని కుంభకర్ణుడు మిక్కిలి చింతించి "ఓ రాక్షస రాజా! లోకమాత అయిన సీతాదేవిని నీవు అపహరించి తెచ్చితివి. నీకు క్షేమము కల్గునా? చాలా తప్పుపని చేసితివి. ఇప్పటికైనా రాముని భజింపుము. నీకు మేలు చేకూరును. సుగ్రీవుడు, హనుమంతుడు అంగదుడు; జాంబవంతుడు మున్నగు వానరవీరులు వారికి సేనాధిపతులుగా నున్నారు. అట్టి జగదేకవీరుని రాముని మానవుడని పలుకుచున్నావు. నీవు చేసిన పని చాల తప్పు. అది చేయబోయేముందు నాకీవిషయం చెప్పలేదు. ఆ దేవదేవుని బ్రహ్మ, ఈశ్వరుడు కూడా ఆరాధించు చుందురు. ఈ విషయము లోగడ నారదుడు నాకు చెప్పి యుండెను. అది నీకు చెప్పేవాడినే. కాని యిప్పుడా సమయము దాటిపోయినది. ఇప్పుడాలోచించిన ఏమీ ప్రయోజనం లేదు. మన యోధులు పెక్కుమంది మరణించినారు. ప్రేమతో కడసారిగా నన్ను



నీవు కౌగిలించుకొనుము. భగవానుని చూచి నేత్రానందము పొందెదను అని పల్కెను.

కుంభకర్ణుడు శ్రీరామచంద్రుని దివ్యనామం ఒక క్షణం మనస్సులో స్మరించి తన్మయుడయ్యెను. సమయం కనిపెట్టి రావణుడు అనేక పాత్రలలో కల్లు సారా, మాంసం నింపించి కుంభకర్ణుని ముందు పెట్టించెను. అతడా మాంసమును తిని కల్లు త్రాగి, పిడుగులు పడినట్లు భయంకర గర్జనలు చేయుచు కోట వెలుపలకు నిర్భయంగా ఒంటరిగా వెళ్ళెను.

విభీషణుడు కుంభకర్ణుని వద్దకు వచ్చి వానికి నమస్కరించి తన పేరు చెప్పుకొనెను. కుంభకర్ణుడు విభీషణుని తన సోదరునిగా భావించి కౌగిలించుకొనెను. అతనిని రామభక్తునిగా గ్రహించి ఆనందించెను.

విభీషణుడు చిన్నన్నతో ఇట్లు పల్కెను. "సోదరా! మన అందరికి క్షేమం కలుగు లాగున పెద్దన్న గారిని బ్రతిమ లాడితిని ఎన్నో విధాలుగా నచ్చజెప్పితిని. కాని అతడు కోపోద్రిక్తుడై నన్ను దూషించుచు తన్నెను. చివరకు దిక్కులేక శ్రీరాముని పాదాల నాశ్రయించితిని. శ్రీరామచంద్రుడు నన్ను కరుణించి తన సేవకునిగా చెంతకుచేర్చుకొనెను."

విభీషణుని మాటలు విని కుంభకర్ణుడు "నాయనా! విభీషణా! రావణుడు మృత్యువశుడై యున్నాడు. ఎవరు చెప్పినా వినే స్థితిలో అతడు లేడు. రాక్షస జాతికి కాలం దాపురించినది. నీవు శ్రీరాముని శరణు జొచ్చితివి. ధన్యుడవు. నీవు రాక్షస కులభూషణుడవు. భక్తితో శ్రీరాముని భజించుము. ఇప్పుడు నేను కూడా కాలవశుడనై యున్నాను. యుద్ధరంగంలో ప్రవేశించిన తర్వాత వీరు మావారు వీరు పరాయి వారని నేను చూడను కనుక నాకు నీవు ఎదురు పడవద్దు" అని చెప్పెను.

విభీషణుడు కన్నీరు కార్చుచు అన్నకు నమస్కరించి శ్రీరాముని వద్దకు వెళ్ళి "ఓ దేవ దేవా! పర్వతా కారుడైన కుంభకర్ణుడు ఇటు వచ్చుచున్నాడు" అని పల్కెను.

ఆ మాట వినగానే వానరులు పర్వతాలను, వృక్షాలను పెకలించి తీసుకవచ్చి ఒక్కుమ్మడిగా వాని మీద పడవేసిరి కుంభకర్ణుడు వానిని తేలికగా నులిమి వేసెను. హనుమంతుడు బలం కొద్దీ కుంభకర్ణుని ఒక గుద్దు గుద్దెను. ఆ గుద్దుకు కుంభకర్ణుడు వెల వెల పోయెను. కుంభకర్ణుడు హనుమంతుని ఒక పోటు పోడిచెను. ఆ పోటుకు హనుమంతుడు నేలపై కూలబడెను. అది గాంచి వానరసేవ భయపడి పారిపోసాగెను.

కుంభకర్ణుని ఎదుట ఎవ్వరును ధైర్యముతో నిలువజాలక పోయిరి. కుంభకర్ణుడు అంగద సుగ్రీవాది వానర యోధులందరిని మూర్ఛిల్లజేసెను. మూర్ఛనుండి తెలివిరాగానే హనుమంతుడు సుగ్రీవుని వెదక సాగెను. కాని సుగ్రీవుడు కనిపించలేదు.

సుగ్రీవుని కుంభకర్ణుడు చంకలో పెట్టుకొని లంకకు వెళ్ళుచుండెను. మార్గమధ్యములో సుగ్రీవునకు తెలివిరాగా కుంభకర్ణుని చంకలో నుండి జారిపోయెను. అతడు కదలక మెదలక నేలపై పడి యుండెను. సుగ్రీవుడు మరణించినట్లు తలంచి కుంభకర్ణుడు ముందునకు నడువసాగెను. అతడు వెంటనేలేచి కుంభకర్ణుని ముక్కు, చెవులు కొరికి ఆకాశం పైకెగిరి పోయెను. అదిచూచి కుంభకర్ణుడు కూడా ఎగిరి సుగ్రీవుని పాదాలు పట్టుకొని నేలపై కొట్టెను. సుగ్రీవుడు చురుకుదనంతో లేచి తిరిగి కొట్టి పిమ్మట శ్రీరాముని వద్దకు వచ్చెను.

ముక్కు, చెవులు తెగిన వానినిగా తన్నుతాను తెలుసుకొనగానే కుంభకర్ణుడు మిగుల దుఃఖించెను. స్వాభావికంగా అతడు భయంకరాకారుడు, పైగా ఇప్పుడు ముక్కు, చెవులు కొరుక బడినవాడు కనుక మరీ భయంకరుడైనాడు. వానిని చూడగానే వానరసైన్యంలో భయం ముంచుకొనివచ్చెను. "శ్రీరామచంద్ర మహారాజుకు జయం, జయం" అంటూ అందరూ ఒకేసారి పర్వతాలను, వృక్షాలను, అతని పై విసిరిరి.

కుంభకర్ణుడు క్రోధంతో వందల కొలది వానరులను పట్టుకొని తినసాగెను. పర్వతగుహలో మిడుతలు ప్రవేశించినట్లు వారు కుంభకర్ణుని



నోటిలో ప్రవేశించుచుండిరి. కోట్లకొలది వానరులను పట్టుకొని అతడు నలిపి నలిపి దులిపివేయుచుండెను. అతని పొట్టలోనికి వెళ్ళిన వానర భల్లూకాలు, అతని ముక్కులనుండి, చెవులనుండి, నోటినుండి వెలుపలకు వచ్చి దుమికి పారిపోవుచుండిరి.

యుద్ధోన్మత్తుడైన కుంభకర్ణుడు విధాత తనకు ప్రపంచమంతా అర్పించినట్లు దానిని అతడు మ్రింగదలచినట్లు భావించి గర్వించుచుండెను వీరులెల్లరు భయపడి పారిపోయిరి. ధైర్యముతో ఎవరు ఎదుట పడలేదు. వానరసైన్యములను కుంభకర్ణుడు చిందర వందర చేసెను. రామచంద్రుడు తన సేన భయపడుచుండుట, శత్రు సైన్యము విశేషముగా ముందుకు చొచ్చుకొని వచ్చుచుండుట చూచెను.

శ్రీరాముడు "సుగ్రీవా! విభీషణా! లక్ష్మణా! మీరు మన సైన్యాన్ని సంబాళించండి. వారికి ధైర్యము కలిగించండి" అని పలికెను.

శ్రీరాముడు ఆయుధాలను చేబూని శత్రుసైన్యమును సంహరించుటకు బయలుదేరెను. శ్రీరాముని ధనుష్టకారము వినగానే శత్రు పక్షము వారంతా చెవిటి వారైరి. పిమ్మట శ్రీరామచంద్రుడు లక్ష బాణములను వేసెను, అవి రెక్కలుగల కాలసర్పాలవలె వడిగా దూసుకొని పోయి రాక్షస వీరుల శిరస్సులను ఖండింప సాగెను. వారి పాదాలు, గుండెలు, భుజాలు తెగి క్రిందపడు చుండెను. ఉత్తమ వీరులు లేచి యుద్ధము చేయుచుండిరి. బాణం తగులగానే వారు మేఘాలవలె గర్జించు చుండిరి. పారిపోవు చుండిరి. తలలు లేకుండా మొండెములు పరుగిడుచుండెను. "పట్టుకోండి, పట్టుకోండి. చంపండి, చంపండి. అనే కేకలు మిన్నుముట్టెను.

ప్రభువు క్షణకాలంలోనే బాణాలు వేసి భయంకరమైన అసంఖ్యాక రాక్షసులను నరికి వేసిరి. ఆ బాణాలు తిరిగి శ్రీరాముని అమ్ములపొదిలో ప్రవేశించుచుండెను.

క్షణంలో శ్రీరాముడు రాక్షససేనను సంహరించినట్లు కుంభకర్ణుడు గ్రహించెను. అంతట మహాబలశాలియైన కుంభకర్ణుడు అత్యంత క్రోధములతో సింహగర్జన చేసెను.

కుంభకర్ణుడు క్రోధావేశముతో పర్వతములు పెకలించి వానర వీరులున్నచోట వేయుచుండెను. పెద్ద పెద్దపర్వతాలను ప్రభువు బాణాలు పిండి పిండి చేయుచుండెను.

శ్రీరాముడు కుపితుడై అత్యంత భయంకర బాణాలు వేసెను. అవి కుంభకర్ణుని శరీరంలో దూరి వీపునుండి వానికి తెలియకుండా వెడలి పోవుచుండెను. కాటుక పర్వతం నుండి ఎఱ్ఱమన్ను కాలువలు ప్రవహించు చున్నవా అన్నట్లు కుంభకర్ణుని నల్లని శరీరం నుండి రక్తం ప్రవహించు చుండెను.

వానర భల్లూకాలు తన సమీపానికి రాగానే కుంభకర్ణుడు గట్టిగా నవ్వెను. భయంకరముగా గర్జించెను. కోట్లకొలది వానరులను అతడు పట్టుకొని నేలపై వైచి కొట్టుచుండెను. తోడేలును చూచి గొర్రెల గుంపు పరుగుతీసినట్లు వానర భల్లూకాలు పరుగెత్తు చుండిరి. "రామచంద్రా! రామచంద్రా! రక్షించండి! మమ్ములను రక్షించండి!" అని వారు ఆర్తనాదం చేయుచుండిరి.

కరుణరస భరితములైన వారి కేకలు వినగానే ధనుర్బాణాలు చేత బూని మహాబలశాలియైన ప్రభువు కోపోద్రిక్తుడై సేనలను వెనుకకుఒత్తి గిల్లజేసి ఒంటరిగానే ముందుకేగెను.

ప్రభువు వంద బాణాలు వేసెను. అవి కుంభకర్ణుని శరీరంలో కలిసి పోవుచుండెను. బాణాలు తగులగానే అతడు ఆగ్రహావేశంతో పరుగెత్తెను. అప్పుడు పర్వతాలు చలించెను. భూదేవి అదిరిపోయెను. అతడొక పర్వతం పెకలించి శ్రీరాముని మీద వేయబోగా రాముడు బాణం వేసి అతని భుజాన్ని నరికివేసెను. అంతట ఎడమ చేతితో మరొక పర్వతాన్ని తీసుకొని వచ్చెను. ఆ భుజాన్ని కూడ ప్రభువు తన బాణంతో నేలమీద పడునట్లు కొట్టెను.



భుజాలు తెగిన పిమ్మట కుంభకర్ణుడు రెక్కలు లేని మందర పర్వతమువలె కనబడు చుండెను. "ముల్లోకాలను మ్రింగగోరు చున్నాడా?" అన్నట్లు అతడు తీక్ష్ణ దృష్టితో ప్రభువు వైపు చూచుచుండెను.

పెద్దగా హుంకారము చేయుచు అహంకారముతోనోరుతెఱచి కుంభ కర్ణుడు పరుగెత్తెను. ఆకాశమున సిద్ధులు, దేవతలు భయపడి హాహాకారములు చేయుచుండిరి.

దేవతలు భయ భీతు లగుటను చూచి కరుణాళువైన ప్రభువు బాణాలతో అతని నోటిని నింపివేసెను. అయినా మహాబలుడైన అతడు భూమి మీద పడి పోలేదు. నోటినిండా బాణాలు నిండి పోయిన అతడు ప్రభువు సమ్ముఖానికి పరుగెత్తెను. ప్రభువు తీక్ష్ణ బాణాలు వేసి వాని శిరస్సును వాని శరీరం నుండి వేరు చేసెను. ఆ శిరస్సు ఎగిరిపోయి రావణుని ముందు పడెను. రావణుడు దానిని చూచి మణిని పోగొట్టుకొన్న సర్పం వలె మిగుల దుఃఖించెను.

ప్రచండమైన కుంభకర్ణుని మొండెం ముందుకు పరుగెత్తు చుండెను. భూమి లోపలకు దిగి పోవుచుండెను. ప్రభువు బాణం వేసి ఆ మొండెమును రెండు భాగాలుగా చేసెను. ఆ రెండు మొండెములు ఆకాశం నుండి రెండు పర్వతాలు పడినట్లుగా పడిపోయెను. లక్షల కొలది వానరులు రాక్షసులు ఆ మొండెముల క్రింద పడి అణగిపోయిరి.

కుంభకర్ణుని తేజస్సు ప్రభువు ముఖంలో కలిసి పోయెను. అదిగాంచి దేవతలు, మునులు అందరు ఆశ్చర్య చకితులైరి. సంతోషముతో వారు ప్రభువును స్తుతించుచు పూల వర్షములు కురిపించిరి.

"ఓ పార్వతీ! నీచుడైన పాపాల రాశియైన రాక్షసునకు కూడా ప్రభువు పరంధామం ఇచ్చెను. అట్టి శ్రీరాముని భజించని వారు నిస్సందేహముగా మందబుద్ధి గలవారే." అని ఈశ్వరుడు పలికెను.

రాత్రి కాగానే ఉభయసేనలు తమ తమ మజిలీలకు వెళ్ళిపోయిరి. కృపారస పూర్ణములైన శ్రీరాముని దృష్టిప్రసరించగానే వానర సైన్యాలు తమ శ్రమ పోగొట్టుకొని సుఖముగా నుండెను.

మహా బలశాలియైన కుంభకర్ణుడు మరణించుటను తెలిసికొని రావణుడు మాటి మాటికి గుండెపై చేతులు హత్తుకొని ఏడ్చుచుండెను. స్త్రీలు కుంభకర్ణుని సాహస పరాక్రమములను వర్ణించుచు గుండెలను బాదుకొని విలపించుచుండిరి. తానే తన పుణ్య కార్యాలు చెప్పుకొన్నప్పుడు అవి ఏ విధంగా తగ్గిపోవునో అట్లే రోజురోజుకు రాక్షసుల సైన్యములు తగ్గిపోవు చుండెను.

ఆ సమయమున మేఘనాదుడు, వచ్చి అనేక విధాలుగా తండ్రికి ధైర్యము చెప్పెను. "నాయనగారూ! రేపు నా పౌరుషాన్ని చూపెదను. నేను నా యిష్టదేవతను పూజించి రథాన్ని, బలాన్ని పొందియుంటిని. ఇంతవరకు మీకవి చూపలేదు". అని పల్కెను.

ఇట్లు అనేక విధాలుగా తన గొప్పతనాన్ని చెప్పుకొనుచుండగా తెల్లవారెను.

వానరసైన్యాలు లంకానగరం నాలుగు ద్వారాలను ముట్టడించెను.

ఇటు కాలునితో సమానమైన వానరవీరులు అటు రణధీరులైన రాక్షసవీరులు, ఇరుపక్షాల వీరులు తమ తమ గెలుపు కొఱకు యుద్ధము చేయుచుండిరి.

మేఘనాదుడు ముందుచెప్పినట్లుగా మాయమైన రథాన్ని ఎక్కి ఆకాశంలోకి వెళ్ళిపోయెను. అచ్చట అట్టహాసం చేస్తూ గర్జించెను. అదిగాంచి వానరసైన్యంలో భయం వ్యాపించెను. ఆకాశం నుండి కత్తులు, శూలాలు, వజ్రాయుధాలు, గొడ్డళ్ళు, రాళ్ళు అనేక బాణాలు వర్షింపసాగెను. ఆకాశం దశదిశలూ బాణాలతో నిండిపోయెను. పర్వతాలను, వృక్షాలను, తీసుకొని



వానరులు ఆకాశంలోనికి విసరివేయుచుండిరి. కాని మేఘనాదుడు ఎచ్చటను కనిపించుట లేదు. వారు వ్యాకులచిత్తులై తిరుగుచుండిరి. మేఘనాదుడు మాయాబలంతో ఘట్టాలను, మార్గాలను, పర్వత గుహలను బాణాల పంజరంగా చేసివేసెను.

ఇప్పుడు మార్గం కనబడనందున ఎటువైపు వెళ్ళవలెనని వానరులు వ్యాకుల పడసాగిరి. హనుమంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు మొదలుగా గల వీరులనందరిని మేఘనాదుడు వ్యాకులపరచెను. అంతట అతడు లక్ష్మణుని, సుగ్రీవుని, విభీషణుని బాణాలతో కొట్టి వారి శరీరాలను జల్లెడవలె తూట్లు తూట్లు చేసెను. తర్వాత శ్రీరామునితో అతడు పోరాడ సాగెను. అతడు విడిచిన బాణాలు సర్పాలై వచ్చి తగులు చుండెను.

అఖండ నిర్వికారుడైన శ్రీరాముడు మేఘనాదుని నాగపాశానికి బంధితుడయ్యెను. యుద్ధానికి శోభచేకూర్చే నిమిత్తం ప్రభువు తనకు తాను నాగపాశంతో బంధితుడయ్యెను. అదిగాంచి దేవతలు మిగుల భయపడిరి.

"ఓ పార్వతీ! ఎవరి నామాన్ని జపించి మునులు భవబంధములను త్రెంచుకున్నారో, సర్వవ్యాపకుడైన ఆ ప్రభువు బంధములలో బంధింప బడునా? శ్రీరాముని లీలలు బుద్ధికి, వాణికి అందవు. ఇట్లు విచారించి జ్ఞానులు అన్ని సందేహాలను వదలి శ్రీరాముని భజన చేస్తుంటారు" అని ఈశ్వరుడు పార్వతీదేవికి చెప్పెను.

మేఘనాదుడు వానరసేనను వ్యాకులపరచి ప్రకటీభూతుడయ్యెను. అతడు అనేక దుర్వచనములు పలుకసాగెను. అంతట జాంబవంతుడు మేఘనాదునితో తలపడెను. అప్పుడు వాడు జాంబవంతుని జూచి "ఓరీ మూర్ఖుడా! నిన్ను ముసలివానిగా తలంచి విడిచిపెట్టితిని. ఇప్పుడు నన్నే నీవు సవాలు చేయుచున్నావా?" అని చెప్పి ప్రకాశించుచున్న త్రిశూలాన్ని వేసెను. ఆ త్రిశూలమును చేతితో పట్టుకొని జాంబవంతుడు బయలుదేరెను.

అతడు దానిని మేఘనాదుని గుండెకు గురిపెట్టి కొట్టగా అతడు గిర గిరా తిరిగి భూమిమీద పడిపోయెను. జాంబవంతుడు కోపముతో అతనిని లంకలోనికి విసరివేసెను. వరబలం వలన అతడు అంత పాటుబడినను చావలేదు.

దేవర్షి నారదుడు గరుత్మంతుని పంపెను. వెంటనే అతడు శ్రీరాముని వద్దకు వచ్చి నాగపాశమునందలి సర్పాలన్నింటిని భక్షించెను. వానరులెల్లరు ఆనందించిరి.

పర్వతాలు, వృక్షాలు, రాళ్ళు, గోళ్ళు ఆయుధములుగా చేబూని క్రోధంతో వానరులు పరుగెత్తుకొని రాగా నిశాచరులు భయంతో పారి పోయి కోటపైకి ఎక్కిరి.

మేఘనాదుని మూర్ఛ వదలెను. తాను చేసిన మాయ అంతయు నిష్ఫలమైనందుకు తండ్రివద్దకు వెళ్ళుటకు అతడు సిగ్గు పడుచుండెను. యుద్ధములో విజయముగాంచుటకు యజ్ఞం చేయవలెనని అతడు నిశ్చయించుకొని ఒక చక్కని పర్వత గుహలోనికి వెళ్ళెను.

“ప్రభూ! మేఘనాదుడు అపవిత్రమైన యజ్ఞం ప్రారంభించాడు. అందులో అతడు సిద్ధి పొందినచో అతనిని జయించుట దుస్సాధ్యం” అని విభీషణుడు శ్రీరామునకు చెప్పెను.

శ్రీరాముడు అంగదాది అనేక వీరులను పిలిచి “మీరంతా లక్ష్మణునితో కలిసి వెళ్ళండి. మేఘనాదుడు చేస్తున్న యజ్ఞాన్ని ధ్వంసం చేయండి. “లక్ష్మణా! యుద్ధంలో నీవతనిని వధింపవలెను, దేవతల భయం చూచి నాకు దుఃఖంకల్గుచున్నది, రాక్షసులను నాశనము చేయుము. ఉపాయంతో మేఘనాదుని వధింపుము. జాంబవంతుడా! సుగ్రీవా! విభీషణా! మీ ముగ్గురు సేన వెంట ఉండండి” అని చెప్పెను.

రణధీరుడైన లక్ష్మణుడు ఆయుధాలుచేబూని ప్రభువు ప్రతాపాన్ని హృదయంలో స్మరించి “నేడు నేను వానిని చంపకుండా వచ్చినట్లైతే



శ్రీరాముని సేవకునిగా పిలిపించు కొనలేను. వందలాది దేవతలు అతనికి సహాయం చేసినను నేను నేడు వానిని తప్పక వధించెదను” అని చెప్పి అతడు బయలు దేరెను. అతనివెంట అంగదుడు, నీలుడు, నలుడు, హనుమంతుడు మొదలగు ఉత్తమవీరులు ఉండిరి. వారు గుహవద్దకు వెళ్ళి చూచిరి. అతడు కూర్చుండి హోమము చేయుచుండెను. రక్తాన్ని, దున్నలను అర్పించుచుండెను. వానరులు యజ్ఞాన్ని ధ్వంసం చేయసాగిరి. అయినప్పటికి అతడు లేవలేదు. అంతట వారతనిని ప్రశంసింప సాగిరి. అప్పటికి లేవకపోగా వారువెళ్ళి అతనిని జుట్టు పట్టుకొని తన్ని వెళ్ళి పోయిరి. త్రిశూలం తీసుకొని మేఘనాదుడు వారి వెంట పడగా వానరులు లక్ష్మణుని వద్దకు పరుగెత్తుకొని వచ్చిరి.

మేఘనాదుడు అత్యంతకుపితుడై భయంకరముగా కేకలు వేయుచుండెను. హనుమంతుడు, అంగదుడు కోపంతో వచ్చి ఎదుర్కొనిరి. మేఘనాదుడు వారి వక్షఃస్థలాలను త్రిశూలంతో పొడువగా వారిద్దరు భూమిపై పడిపోయిరి.

పిమ్మట లక్ష్మణునిపై త్రిశూలం విడిచిపెట్టెను. అతడు బాణం వేసి దానిని రెండు ముక్కలుగా చేసివేసెను. హనుమంతుడు, అంగదుడు లేచి వానిమీద పడి కొట్టసాగిరి. కాని అతనికేమియు దెబ్బలు తగులుట లేదు.

మేఘనాదుని ఎంతగా చంప ప్రయత్నించినను అతడు చావడంలేదు. అంతట ఆ వీరులు వెనుకకు వెళ్ళిపోయిరి. మేఘనాదుడు గట్టిగా గర్జించుచు విజృంభించెను. లక్ష్మణుడు అనేక భయంకర బాణాలు వానిపై వేసెను.

వజ్రం వంటి కఠోరమైన ఆ బాణాలు తనవైపు రావడం చూచి అతడు అంతర్ధానమయ్యెను. వివిధ రూపాలను ధరించి యుద్ధం చేయ నారంభించెను.

ఎప్పటికిని మేఘనాదుడు మరణించనందున వానరులు భయపడిరి. ఈ దుష్టునితో చాలాసేపు ఆటలాడిరి. ఇక వీనిని అంతం చేయవలెనని లక్ష్మణుడు మనస్సులో నిశ్చయించుకొనెను. శ్రీరాముని ప్రతాపాన్ని స్మరించి అతడు వానిపై బాణం ప్రయోగించెను. అది మేఘనాదుని వక్షఃస్థలానికి తగిలెను. "రాము డెచ్చట? లక్ష్మణు డెచ్చట?" అని అంటూనే వాడు ప్రాణాలు వదలెను.

హనుమంతుడు శ్రమ లేకుండానే మేఘనాదుని శరీరమును ఎత్తి లంకా ద్వారం వద్ద ఉంచి తిరిగివచ్చెను అతని మరణ వార్తవిని దేవతలు, మునులు అందరూ సంతోషించిరి. వారు శ్రీరాముని నిర్మల కీర్తిని స్తుతించి వెళ్ళిపోయిరి.

పుత్ర వధ వార్త వినగానే రావణుడు మూర్ఛిల్లెను. మండోదరి గుండెలు బాదుకొనుచు అనేక విధాలుగా విలపింపసాగెను. నగర ప్రజ లెల్లరు దుఃఖితులైరి. అందరూ రావణుడు నీచుడని నిందింపసాగిరి.

"ఈ జగత్తు అంతా నాశనమయ్యేదే. విచారించుట అనవసర"మని రావణుడు స్త్రీలకు బోధించెను. అతడు స్వయంగా నీచుడు. కాని అతడు చక్కని జ్ఞానోపదేశం చేసెను. ఇతరులకు ఉపదేశం చేయుటలో చాలా మంది నిపుణులు. కాని తాము ఉపదేశించినవాటిని ఆచరణలో పెట్టగలవారు చాలా తక్కువ మందియే యుందురు.

రాత్రి గడచి తెల్లవారుజాముకాగానే వానర భల్లూకవీరులు లంకా నగరం నాలుగు ద్వారాలను ముట్టడించిరి.

"యుద్ధంలో శత్రువులతో పోరాడుటకు వెనుకాడు వారు ఇప్పుడే వెళ్ళిపోండి. యుద్ధరంగంలో పారిపోవుట మంచిది కాదు. నా భుజబలం పైనే వైరం పెంచుకొంటిని. కాన నేనే శత్రువునకు తగిన విధంగా బుద్ధి చెప్పెదను." అని రావణుడు వీరోక్తులు పలుకుచు వాయువేగంతో వెళ్ళగల



రథాన్ని అధిరోహించెను అద్వితీయ బలసంపన్నులైన రాక్షస వీరులు బయలు దేరిరి. ఆ సమయాన అపశకునాలు కల్గెను. తన భుజబల గర్వం వలన రావణుడు వానిని లెక్కచేయలేదు. ఆయుధాలు చేతుల నుండి జారిపోవు చుండెను. వీరులు రథములనుండి పడిపోవుచుండిరి. ఏనుగులు, గుర్రాలు ఘీంకారములు చేయుచు సకిలించుచు ప్రక్కలకు పరిగెత్తుచుండెను. నక్కలు, గ్రద్దలు, కాకులు, గాడిదలు అరచుచుండెను. కుక్కలు మొరుగుచుండెను. గుడ్లగూబలు భయంకర శబ్దములు చేయుచుండెను.

జీవులకు ద్రోహం చేయుటలో నిమగ్నుడై యున్నవాడు మోహవశుడు, రామవిముఖుడు, కామాసక్తుడు అగువానికి స్వప్నంలో కూడా శుభ శకునాలు, చిత్తశాంతి కలుగునా?

రాక్షసుల చతురంగ బలాలు బయలుదేరాయి. అనేక వాహనాలు, రథాలు, సవారీలు వెంట ఉండెను. మత్తెక్కిన ఏనుగులు గుంపులు గుంపులుగా బయలుదేరెను. రణరంగంలో శూరవీరులు రంగురంగుల దుస్తులు ధరించి అనేక విధాలైన మాయలు చేయుచుండిరి. సేన బయలు దేరినప్పుడు వారి పాద ధాటికి భూమిని మోయుచున్న దిగ్గజములు తొలగిపోయెను. సముద్రం క్షోభించెను. పర్వతాలు వణకసాగెను. ధూళి చెలరేగి సూర్యుని కనబడకుండా చేసెను. వాయువు స్తంభించి పోయెను. భూమి తల్లడిల్లిపోయెను. ప్రళయకాల మేఘాలు గర్జించునట్లుగా నగారాలు, భేరీలు, భయంకర ధ్వనితో మ్రోగసాగెను. రాక్షసులు సింహ నాదం చేయుచు తమ తమ బల పౌరుషాలను వర్ణించుకొను చుండిరి.

"వీరులారా! మీరు వానర భల్లూకాల గుంపును నలిపివేయండి. ఆ యిద్దరు రాకుమారులను నేను చంపెదను" అని రావణుడు తన సేనలను హెచ్చరించెను.

రావణుని వీరత్వమును శ్లాఘించుచు రాక్షసులు వానరుల మీదపడిరి.

ఉభయ సేనల వీరులు తమ తమ జోడీలను ఎంచుకొని తమతమ ప్రభువులకు జయ జయ నాదాలు చేస్తూ పోరాడసాగిరి.

రావణుడు రథమెక్కి తిరుగుచు రాక్షసులను యుద్ధానికి పురికొల్పు చుండెను. శ్రీరాముడు భూమి మీద నిలబడి తమాషా అంతయును తిలకించుచుండెను. విభీషణుడు నేలమీద నిలిచియున్న శ్రీరాముని చూచి "ఓ దేవా! మీకు రథములేదు. కవచం లేదు. కనీసం పాదరక్షలైనా లేవు. రావణునితో మీరు యెటుల పోరాడి జయించగలరు? అని సందేహం వెలిబుచ్చగా శ్రీరాముడు నవ్వుతూ యిట్లనెను. "ఓ విభీషణా! జయం పొందుటకు రథము ముఖ్యముకాదు. ధర్మమనే రథము నధిష్ఠింప వలెను. ఆ రథానికి ధైర్యశౌర్యాలే చక్రాలు. సత్యశీలాలే ధ్వజ పతాకాలు, బల, వివేక, పరోపకారాలే గుర్రాలు, దయా, క్షమా గుణాలే కళ్ళెములు. శంకరుని భక్తుడు సారధిగాను, జ్ఞాన, వైరాగ్య సంయమన సంతోషాలు అస్త్ర శస్త్రాలుగాను గలిగి యుండునో అట్టి ధర్మరథమెక్కిన రథికుడు యుద్ధంలో జయం పొందును. వానిని ఎదిరించగలవాడు ముల్లోకాలలో ఎవడూ ఉండడు" అని చెప్పెను.

ప్రభువు వాక్యాలు విని విభీషణుడు మిగుల సంతసించెను.

ఆకాశంలో బ్రహ్మాదిదేవతలు విమానారూఢులై యుద్ధ శోభను తిలకించుచు ఆనందించుచుండిరి.

"ఓ ఉమా! ఆ సమయంలో నేను కూడా అచ్చట ఉండి చూచుచుంటిని. శ్రీరాముని కృప వల్లనే వానరులకు గొప్పశక్తి కల్గెను." అని ఈశ్వరుడు పార్వతీదేవితో చెప్పెను.

ఉభయపక్షాలవారు ఒకరినొకరు సవాలు చేసుకొనుచు ఘోరంగా యుద్ధం చేయుచుండిరి. రాక్షసుల తలలను నరికి వాటితో ఇతర రాక్షసులను చంపు చుండిరి. రాక్షసులను పట్టుకొని భూమి మీద త్రిప్పి కొట్టుచుండిరి. పొట్టలు చీల్చుచుండిరి. భుజాలను మెలిత్రిప్పు చుండిరి. రాక్షస వీరులను



భల్లూకాలు భూమిలో పాతిపెట్టుచుండిరి. వాళ్ళను పండ్లతో కొరుకు చుండిరి. గద్దిస్తూ చెంపదెబ్బలు కొట్టుచుండిరి. రాక్షసుల చెక్కిళ్ళను చీల్చుచుండిరి. వారి పొట్టలలోని ప్రేవులను తీసి మెడలో మాలలవలె వేసుకొనుచు శ్రీనృసింహస్వామి అనేక శరీరాలను ధరించి క్రీడించుచున్నాడా అన్నట్లు ఉండెను. పట్టుకొనండి, చంపండి, కొట్టండి అనే భయంకర శబ్దాలతో భూనభోంతరాలు నిండిపోయాయి.

తన సైన్యం వికలమగుటను, భయపడి పారిపోవుటను చూచి తన యిరవై భుజాలలో పది ధనస్సులు పట్టుకొని రావణుడు రథమెక్కి తన సైన్యానికి ధైర్యం పురికొల్పు చుండెను. అతడు తెరపిలేకుండా బాణాలు వేయుచుండెను. వానరవీరు లెల్లరను అతడు నలిపివేయు చుండెను. "అంగదా! ఆంజనేయా! యీ దుష్టుడు మమ్ములను మ్రింగుచున్నాడు. రక్షించండి రక్షించండి" అంటూ వానరభల్లూకాలు హాహాకారం చేయసాగిరి. భూమ్యాకాశాలు, దశదిశలు బాణాలతో అతడు నింపివేసెను. వానరులు పారిపోయేదెక్కడకు? వారిలో కోలాహలం చెలరేగెను.

వారి ఆర్తనాదాలను విని లక్ష్మణుడు ధనుస్సు చేబూని శ్రీరామునకు ప్రణమిల్లి క్రోధంతో బయలుదేరెను. "ఓరీ! దుష్టుడా! వానర భల్లూకాలను చంపుచున్నావేమిరా? నీకు పౌరుషం ఉంటే నాతో పోరాడుము" అని లక్ష్మణుడు పలికెను.

"ఒరేయి! నా పుత్రుని పొట్ట పెట్టుకున్న దుర్మార్గుడా! నీకోసమే నేను వెదకుచున్నాను. ఈ రోజు నిన్ను నేను చంపి నా హృదయాగ్నిని చల్లార్చుకుంటాను" అని చెప్పి అతడు బాణాలు వేసెను. లక్ష్మణుడు వాటినన్నిటిని ముక్కలు ముక్కలుగా చేసివేసెను. రావణుడు కోట్లాది అస్త్ర శస్త్రాలను ప్రయోగించెను. వాటిని కూడా లక్ష్మణుడు ముక్కలు ముక్కలుగా చేసివేసెను.

పిమ్మట లక్ష్మణుడు తన బాణాలతో రావణుని రథాన్ని విరుగ గొట్టి సారథిని చంపివేసెను. రావణుని పదితలకాయలకు గురిచూసి నూఱు

నూఱు బాణాలు వేసెను. నూఱు బాణాలు అతని వక్షఃస్థలానికి వేయగా అతడు స్పృహ తప్పి పడిపోయెను. కొంతసేపటికి మూర్ఛ నుండి తెప్పరిల్లి బ్రహ్మ తన కొసగిన శక్తిని లక్ష్మణునిపై ప్రయోగించెను.

శక్తి సరిగా లక్ష్మణుని గుండెకు తగిలెను. వీరుడైన లక్ష్మణుడు మూర్ఛనొంది నేలమీద పడెను. అతనిని ఎత్తుటకు రావణుడు ప్రయత్నించెను. కాని ఈతని బలం అంతా వృథాఅయ్యెను. ఆ సమయాన హనుమంతుడు అచ్చటకు వచ్చెను. అతనిని చూచి రావణుడు తన బలం కొద్ది ఒక గ్రుద్దు గుద్దెను. అంతట ఆంజనేయుడు నేల కూలకుండా తన కాళ్ళ పైనే నిలబడి కోపంతో రావణుని ఒక గ్రుద్దు గుద్దెను. ఆ దెబ్బకు వజ్రాఘాతమునకు పర్వతం పడునట్లు రావణుడు నేలకూలెను.

మూర్ఛనుండి తెలివిరాగానే రావణుడు లేచెను. హనుమంతుని శౌర్యసాహసాలను పొగడసాగెను. "ఇది నా పౌరుషానికే తలవంపు. నాకు కూడా సిగ్గుచేటు. నీవింకా బ్రతికేయున్నావు" అని చెప్పి ఆంజనేయుడు సునాయాసంగా లక్ష్మణునెత్తుకొని శ్రీరాముని వద్దకు వచ్చెను. అది చూచి రావణుడు ఆశ్చర్యచకితుడయ్యెను.

"సోదరా! నీవు కాలభక్షుడవు. దేవతలకు రక్షకుడవు. తుదకు నీస్థితి యిట్లు అయ్యెను. లేలెమ్ము" అని శ్రీరాముడు లక్ష్మణునితో పలుకగా అతడు నిద్రలేచి కూర్చుండెను. రావణుడు ప్రయోగించిన ఆ భయంకర శక్తి ఆకాశమున కెగిరిపోయెను. లక్ష్మణుడు ధనుర్బాణాలను చేబూని వెంటనే రావణుని సమీపించి అతని రథాన్ని ముక్కలు ముక్కలు చేసి సారథిని చంపివేసెను. రెండవ సారథి నేలపై కూలిన రావణుని రథంపై కూర్చుండ బెట్టుకొని లంకానగరానికి తీసుకుని పోయెను.

మూర్ఛనుండి లేవగానే రావణుడు యజ్ఞంచేయ మొదలిడెను. "శ్రీరామా! మా అన్న యజ్ఞము చేయుచున్నాడు. అందు అతడు సిద్ధి



పొందినచో అతడు అనాయాసంగా చావడు. వెంటనే వానర వీరులను పంపండి, వారు యజ్ఞాన్ని ధ్వంసము చేయుదురు. అప్పుడు రావణుడు కోపించి యుద్ధానికి రాగలడు". అని విభీషణుడు శ్రీరామునితో విన్నవించెను.

తెల్లవారగనే ప్రభువు హనుమంతుడు అంగదుడు మొదలయిన వానరవీరులకు కబురుపెట్టగా వారు పరుగెత్తు కొనివచ్చిరి. వారు గెంతుచు దుముకుచు లంకానగరం చేరుకొనిరి. రావణుని రాజభవనములో జొర బడిరి. రావణుడు చేయుచున్న యజ్ఞాన్ని చూచి వానరులెల్లరు కోపోద్రిక్తులైరి. "రణభూమినుండి పరుగెత్తి వచ్చి యిచ్చట కొంగజపం చేయుచున్నావా?" అని అంగదుడు రావణుని తన్నెను. కాని రావణుడు అంగదుని వైపు చూడనేలేదు.

రావణుడు తమ వైపు చూడకపోవడంతో వానరులు క్రోధో ద్రిక్తులై దంతాలతో అతనిని కొరికి, కాళ్ళతో తన్నిరి. స్త్రీల కొప్పు పట్టుకొని యింటినుండి వెలుపలకు ఈడ్చిరి. వారు దీనముగా విలపింపసాగిరి. రావణుడు కాలయమునివలె లేచి క్రోధములో వానరుల పాదాలు పట్టుకొని నేలపై కొట్టెను. ఈ మధ్యలో కొందరు వానరులు యజ్ఞ సామగ్రి ధ్వంసం చేసిరి. పిమ్మట వానరులెల్లరు శ్రీరాముని వద్దకు వచ్చిరి. జయించగలననే ఆశను విడిచి రావణుడు కోపంతో బయలుదేరెను. దారినడుమ అనేకములగు అపశకునాలు కల్గినను అతడు మృత్యువశు డగుటవలన వాటిని లెక్కచేయలేదు.

మిడుతలదండు అగ్నిలో పడుటకు పరుగెత్తునట్లు రావణుడు రాక్షస సైన్యముతో ప్రభువు వద్దకు పరుగెత్తు కొనివచ్చెను. అతని వెంట అపారసైన్యం బయలుదేరెను. శ్రీరాముడు అనేక బాణాలు వేసెను. రాక్షసులు కరచరణాలు తెగి క్రిందపడుచుండిరి. రాముని బాణాలు తగులగనే కేకలు పెట్టుచు రాక్షసవీరులు నేలకొరుగుచుండిరి. వారి రక్తం నదివలె ప్రవహించుచుండెను.

వారి శవాలపై కాకులు వ్రాలి ఒకటి నొకటి లాగుకొని తినుచుండెను. గ్రద్దలు వ్రాలి ప్రేవులను లాగుచుండెను. చాలమంది వీరులు ప్రవాహంలో పడి కొట్టుకుపోవుచుండిరి. కోట్లాది మొండెములు తలలు లేకుండా పరుగెత్తసాగెను.

"నా అనుచరులైన రాక్షసులు నాశనమయినారు. ఇప్పుడు నేను ఒంటరిగా మిగిలాను. వానర భల్లూకాలు చాలామంది యున్నారు. కనుక ఇప్పుడు నేను మాయను సృజించాలి" అని రావణుడు యోజించెను.

ప్రభువు నేలపై నిలిచి రథం లేకుండా యుద్ధంచేయుట దేవతలు గాంచి మిగుల దుఃఖించిరి. ఇంద్రుడు వెంటనే రథం పంపెను. అతని సారథి మాతలి రథాన్ని సంతోషంతో దివినుండి భువికి తీసుకవచ్చెను.

తేజోవంతమైన ఆ రథంమీద శ్రీరామచంద్రుడు ఆసీనుడయ్యెను. ప్రభువు రథమెక్కి కూర్చుండుటను చూచి వానరులు నూతనోత్సాహంతో ముందుకు పరుగెత్తిరి.

రావణుడు రచించిన మాయ ఒక్క శ్రీరాముడు తప్ప తక్కిన వారెల్లరు నిజమేయని నమ్మిరి. వానరులు రాక్షస సేనలో అనేక రామ లక్ష్మణులను గాంచి వానరభల్లూకాలు భయభీతులైరి. లక్ష్మణుడు వానరులు ఎచ్చటి వారచ్చట నిలబడి చూచుచుండిరి. శ్రీరాముడు బాణంవేసి క్షణంలోనే రావణుని మాయ నంతటిని పటాపంచలు చేసెను.

"మీరు బాగా అలసిపోయారు. ఇప్పుడు నాకు రావణునకు జరిగే ద్వంద్వయుద్ధం చూడండి." అని రామచంద్రుడు రథాన్ని ముందుకు నడిపించెను. రావణుడు క్రోధంతో గర్జిస్తూ ఎదుటికివచ్చెను.

రావణుడు కోపముతో "ఒరే తాపసీ! నీవు యుద్ధంలో ఇదివరకు జయించిన వీరులవంటి వాడిని కాను నేను. నా పేరు రావణుడు. నా యశస్సు జగత్తు అంతటికి తెలుసు. లోకపాలురుకూడా నాకు ఖైదీలుగా



చిక్కియున్నారు. నీవు ఖర, దూషణ, విరాధ రాక్షసులను చంపితివి. వాలిని చెట్టుచాటున నుండి కిరాతకుని వలె చంపావు. కుంభకర్ణుని, మేఘనాదుని కూడా వధించావు. ఇప్పుడు ఈ యుద్ధభూమి నుండి నీవు పారిపోవనిచో నేను నిన్ను యముని వద్దకు పంపెదను" అని పలికెను.

శ్రీరాముడు రావణుని మాటలు విని అతడు మృత్యువశుడై యున్నట్లు తెలుసుకొని నవ్వుచు ఇట్లు పలికెను. "రావణా! నీ గొప్పతనం అంతా నీవు చెప్పినట్లు సత్యమే. కాని ఇప్పుడు వ్యర్థంగా వాగకు. ఇప్పుడు నీ పౌరుషాన్ని చూపుము. వ్యర్థంగా వాగి సుందరమైన నీ పేరు ప్రతిష్ఠలను నాశనం చేసుకొనకు. ప్రపంచంలో మూడు రకాల పురుషులు ఉన్నారు. గులాబి కేవలం పువ్వులొక్కటే యిచ్చును. మామిడి చెట్టు పువ్వులు, ఫలాలు యిచ్చును. పనసచెట్టు కేవలం ఫలములే ఇచ్చును. ఈ విధంగానే ఒకరు చెప్పుదురు గాని చేయరు. ఇంకొక రకంవారు చెప్తుంటారు, చేస్తుంటారు. మూడవరకంవారు చేయుదురు గాని చెప్పరు."

శ్రీరాముని వాక్యాలు విని రావణుడు గట్టిగా నవ్వెను. అతడు ఇట్లు పలికెను. "నీవు నాకు జ్ఞానము నేర్పునంతటి వాడవా? ఇప్పుడు నీకు నీ ప్రాణములమీద ఇంత ప్రేమ కలిగినది. వైరం పెట్టుకున్నప్పుడు నీవు భయపడలేదు." అని చెప్పి కోపోద్రిక్తుడై వజ్రసమానము లయిన బాణాలు వేయ మొదలిడెను. రకరకాల బాణాలతో దిశలు, భూమ్యాకాశాలు అన్నియూ నిండిపోయెను.

శ్రీరాముడు అగ్నిబాణం వేసెను. రావణుని బాణాలన్నియును క్షణంలో భస్మమైపోయెను. అతడు చిన్నపోయి భయంకరమైన శక్తిని ప్రయోగించెను. శ్రీరాముడు బాణంతో దానిని తిరిగి పంపెను. రావణుడు కోట్లకొలది చక్రాలను, త్రిశూలాలను వేయుచుండెను. ప్రభువు వాని నన్నింటిని అనాయసంగా కొట్టి ఖండించి వేయుచుండెను. అతడు శ్రీరాముని సారథిపై నూఱు బాణాలు వేసెను. అతడు శ్రీరామునకు జై అంటూనే పడిపోయెను. శ్రీరాముడు దయతో అతనిని లేవనెత్తెను.

ధనుస్సు నెక్కు పెట్టి శ్రీరాముడు అనేక భయంకర బాణాలు వేసెను. ప్రభువు మొదట రావణుని సారథిని, గుర్రాలను చంపివేసెను. పిమ్మట రథాన్ని ముక్కలు ముక్కలు చేసి ధ్వజాన్ని పతాకాలను క్రింద పడగొట్టెను. రెండవ రథంపై నెక్కి రావణుడు భయంతోనే అనేకములైన అస్త్ర శస్త్రాలను ప్రయోగించెను. కాని అవన్నియు నిష్ఫలమై పోయెను. రావణుడు పది త్రిశూలలు వేసెను. శ్రీరాముని రథమున కున్న నాలుగు గుర్రాలను నేలపై కూల్చెను. గుర్రాలను ఎత్తి రాముడు కోపగించి బాణాలు వేసెను. రావణుని పదితలలకు పది వేయగా అవి తలలకు తగిలి శిరస్సులనుండి రక్తం కాలువ వలె ప్రవహించసాగెను. అంత రావణుడు పారిపోవు చుండగా శ్రీరాముడు ముప్పది బాణాలు వేసి అతని యిరవై భుజాలను, పది శిరస్సులను నేలపై కూల్చివేసెను.

రావణుని తలలు చేతులు తెగినను మరల అవి మొలుచుచుండెను. మరల శ్రీరాముడు బాణాలు వేసి వాటిని నరికి నేలపై పడవేయుచుండెను. ఇట్లు పలు పర్యాయాలు ప్రభువు బాణాలు వేసి వాటిని నేలపై పడవేయడం, అవి తిరిగి మొలకెత్తుచుండడం జరుగుచుండెను. అతని తలలు నరికిన కొలది అవి పెరుగుచుండెను. శ్రీరాముడు ఆశ్చర్యపడుచుండెను. భూమ్యాకాశాలు తలలతో, భుజాలతో నిండిపోయెను. మొండెములు పరుగెత్తుచుండెను. శిరస్సులు కేకలు వేయుచుండెను. రక్తం కాలువవలవలె కారుచున్నను మూర్ఖుడైన రావణుడు లెక్కచేయక కోపోద్రిక్తుడై బాణాలు వేసి శ్రీరాముని రథాన్ని కనబడకుండా చేసెను. ఒక గడియ వరకు రథం కనపడలేదు. దేవతలలో హాహాకారం బయలుదేరెను. ప్రభువు ధనుస్సు నెక్కుపెట్టి బాణాలువేసి శత్రుబాణాలను తొలగించి శత్రువు తలలు నరికి వేసెను.

"లక్ష్మణు డెచ్చట?" "సుగ్రీవు డెచ్చట?" "రాము డెచ్చట?" యిట్లాకేకలు వేస్తూ రావణుని శిరస్సులు పరుగెత్తుచున్నవి. వాటిని చూచి వానరులు పరుగులు తీసిరి? శ్రీరాముడు బాణాలు వేసి ఆ తలలను ఛేదించుచుండెను.



రావణుడు క్రోధంతో ప్రచండశక్తిని ప్రయోగించెను. విభీషణుని మీదకు అది వచ్చుచుండగా శరణాగతులను రక్షించాలని శ్రీరాముడు విభీషణుని వెనుకకు నెట్టి తానే ఎదుటనిలిచి ఆ శక్తిని గ్రహించెను. శక్తి తగులగానే ప్రభువు మూర్ఛితుడయ్యెను. అది తన లీలగా చూపించెను. దేవతలు వ్యాకులపడిరి. విభీషణుడు కోపోద్రిక్తుడై చేతితో గద తీసుకొని రావణునిపైకి పరుగెత్తెను. అతడు అన్నతో ఇట్లు పలికెను. "ఓ అభాగ్యుడా! మూర్ఖుడా! నీవు దేవతలు, మనుష్యులు, నాగులు, మునులు అందరితో విరోధం పెంచుకొంటివి. నీవు ఈశ్వరునకు శిరస్సులు సమర్పించితివి. ఇట్లు చేసి ఒక్కొక్కదానికి బదులుగా అనేక వరాలు పొందితివి. ఆ కారణం చేతనే యింతవరకు నీవు మిగిలి యుంటివి. కాని ఇప్పుడు మృత్యువు నీతలపై నాట్యం చేయుచున్నది. రామవిముఖుడవై సుఖాన్ని నీవు పొందగోరుచున్నావు."అని చెప్పి విభీషణుడు రావణుని వక్షఃస్థలం మధ్య గదతో కొట్టెను. ఆ దెబ్బ తగులగానే అతడు నేలకూలెను. అతని పదిముఖాలనుండి రక్తం ప్రవహించ సాగెను. అతడు తిరిగి సంబాళించుకొని క్రోధంతో దుమికెను. అత్యంత బలశాలురైన యిరువురు వీరులు పోరాడుచుండిరి. రావణుని వంటి జగద్విజేతయైన వీరుని కూడా తనతో సమానంగా విభీషణుడు పరిగణించుట లేదు.

"ఓ పార్వతీ! విభీషణుడు రావణుని ఎన్నడూ కన్నెత్తి చూడ లేక పోయేవాడు. అట్టివాడు ఇప్పుడు యమునివలె అతనితో డీ కొని పోరాడు చున్నాడు. ఇది అంతా శ్రీరాముని ప్రభావం."

విభీషణుడు అలసిపోవుటను చూచి హనుమంతుడు ఒక పర్వతాన్ని చేతబూని బయలు దేరెను. ఆ పర్వతంతో అతడు రావణుని రథాన్ని, గుర్రాలను? సారథిని సంహరించెను. అతని వక్షఃస్థలం మీద తన్నెను.

రావణుడు నిలబడి యుండెను. కాని అతని శరీరం వణక సాగెను. విభీషణుడు శ్రీరాముని వద్దకు వెళ్ళిపోయెను.

రావణుడు హనుమంతుని కొట్టెను. హనుమంతుడు తోకను పెంచుతూ ఆకాశంలోనికి వెళ్ళిపోవుచుండెను. రావణుడు అతని తోకను పట్టుకొనెను. అతనిని కూడా తీసుకొని హనుమంతుడు పైకి పోవుచుండెను. తిరిగివచ్చి మహాబలశాలియైన హనుమంతుడు రావణునితో పోరాడటం మొదలుపెట్టెను. రెండు పర్వతాలు ఢీకొని పోరాడుచున్నాయా యన్నట్లు వారిరువురు ఆకాశంలో పోరాడుచుండిరి. ఇద్దరు సరిసమానమైన వీరులు.

రావణుని జయించుటకు తన బుద్ధిబలం పనిచేయ నందున ఆంజనేయుడు ప్రభువును స్మరించెను. మరల రావణుని కొట్టెను ఇద్దరూ భూమి మీద పడి మరల లేచి పోరాడుచుండిరి. దేవతలు ఇద్దరకు జయ జయ నాదాలు చేసిరి. హనుమంతుడు ఆపదలో చిక్కుకున్నట్లు చూచి వానరభల్లూకాలు కోపంతో పరుగెత్తి వచ్చిరి. యుద్ధమదోన్మత్తుడైన రావణుడు వారినెల్లరనూ తన ప్రచండ భుజాబలంతో నలిపి వేసెను.

శ్రీరఘువీరుని పిలుపు విని ప్రచండులైన వానరవీరులు పరుగెత్తి వెళ్ళిరి. రావణుడు విశాలమైన వానర సేనను చూచి తన మాయ వారిమీద ప్రయోగించెను. ఎంత మంది వానర భల్లూకాలు ఉన్నారో అంత మంది రావణులు ఎచ్చట ఉన్న వారికచ్చట కనబడుచుండిరి. క్షణకాలంలోనే అతడు అదృశ్యుడయ్యెను. పిమ్మట అనేక రూపాలుగా ప్రకటితుడయ్యెను. అదిగాంచి వానరభల్లూకాలు ఇటుఅటు పరుగెత్తసాగిరి. "హే లక్ష్మణా! రక్షించు, మమ్ములను రక్షించు." అని కేకలు వేయుచు వారు పరుగిడ సాగిరి. దశదిశలలో కోట్ల కొలది రావణులు భయంకర గర్జనలు చేస్తూ పరుగిడుచుండిరి. దేవతలు భయపడిరి. ఇక గెలుపు పొంద గలమనే ఆశను విడిచి పరుగెత్తిరి.

ఒక్క రావణుడే దేవతలనందరిని జయించెను. ఇప్పుడు లెక్క లేనంత మంది రావణులు వచ్చిరి. ఇక మనము పర్వత గుహలలో దాగు కోవాలని వారు నిశ్చయించుకొనిరి.



ప్రభువు ప్రతాపాన్ని ఎరిగిన వారు నిర్భయులై నిలబడిరి. వానరులు రావణుని మాయ నిజమని నమ్మిరి. "రక్షించండి! రక్షించండి! అని వారు కేకలు వేయగా విని హనుమంతుడు, అంగదుడు, నలుడు, నీలుడు పరుగెత్తి వచ్చి పోరాడసాగిరి. కోటి కోటి మాయా రావణులను వారు నలిపి వేయుచుండిరి.

దేవతలు, వానరుల దుఃఖమును చూచి ప్రభువు శార్ఙ్గధనుస్సుపై బాణం ఎక్కుపెట్టి విడిచిపెట్టగా మాయావులైన రావణులందరు హతులైరి.

సూర్యోదయం కాగానే అంధకారం పటాపంచలైనట్లు ప్రభువు ప్రయోగించిన ఒకే బాణంతో మాయ తొలగిపోయెను.

శ్రీరాముడు క్రిందపడియున్న వానరులను లేవనెత్తి తిరిగి పంపించెను. ప్రభువు ప్రేరణపై వారు బలాన్ని పుంజుకొని యుద్ధమైదానంలో అడుగిడిరి.

దేవతలు శ్రీరాముని స్తుతించుటను చూచి వీరి దృష్టిలో, నేనొ క్కడనే కాని వీరందరికంటె నేనొక్కడనే ఎక్కువని తెలియదని భావించి రావణుడు దేవతల వైపు పరుగెత్తెను. వారు హాహాకారములు చేయుచు పారిపోయిరి.

"దుష్టులారా! నా ఎదుట నుండి మీరెచ్చటకు వెళ్ళగలరు? అని రావణుడు గర్జింపగానే దేవతలు భీతినందిరి. దేవతల దుఃఖం చూచి అంగదుడు వచ్చి రావణుని పాదాలు పట్టుకొని నేలపై కొట్టెను. పిమ్మట అంగదుడు ప్రభువు వద్దకు వెళ్ళిపోయెను.

రావణుడు సంబాళించుకొని లేచి భయంకరంగా గర్జించెను. అనేక బాణాలను వానర సేనలపై వర్షంవలె కురిపించెను. వానరవీరులనెల్లరను గాయపరచి భయంకంపితులను చేసెను. శ్రీరాముడు అతని తలలు, భుజాలు, బాణాలతో త్రుంచివేసెను. కాని అవి అనేకముగా పెరిగి పోయెను. అది చూచి వానరులు భయకంపితులై పరువిడిరి. వీరులైన అంగదుడు, హనుమంతుడు, నలుడు, నీలుడు, సుగ్రీవుడు మొదలుగా గల బలవంతులు

వృక్షాలతో, పర్వతాలతో రావణునెదుర్కొను చుండిరి. వానితోనే అతడు వానరులను చంపుచుండెను.

కొందరు వానరులు గోళ్ళతో రావణుని శరీరాన్ని చీల్చి పారిపోవు చుండిరి. కొందరు తన్ని పోవుచుండిరి. నలుడు, నీలుడు, రావణుని తలపై కూర్చొని గోళ్ళతో అతని లలాటాన్ని చీల్చివేయసాగిరి. తన రక్తాన్ని చూచి అతడు చాలా దుఃఖించెను. వారిని పట్టుకొనుటకు చేతులెత్తెను. కాని వారు చేతులకు అందకుండిరి. చేతులు పైపైకి త్రిప్పుచుండెను. చివరకు వారు అతని చేతులకు చిక్కిరి. నేలమీద కొట్టుచున్నప్పుడు వారు అతని భుజములను నులిమి పారిపోయిరి.

రావణుడు కోపంతో బాణాలు వేసి ఆ వీరులను గాయపరచెను.

హనుమంతుడు మొదలగు వానరులందరిని మూర్ఛితులను చేసి సంధ్యాసమయం కాగానే రావణుడు సంతోషించెను. అంతట జాంబ వంతుడు పరుగెత్తెను. అతని వెంట పర్వతాలను వృక్షాలను చేబూని భల్లూకాలు వచ్చిరి. రావణుడు వారి పాదాలను పట్టుకొని నేలపై కొట్టి వేయుచుండెను. జాంబవంతుడు రావణుని గుండెపై తన్నెను. ఆ దెబ్బకు రావణుడు రథంనుండి నేలపై కూలెను. మరల జాంబవంతుడు ఒక తన్నుతన్ని ప్రభువు వద్దకు వెళ్ళెను.

రాత్రి కాగానే సారథి రావణుని రథంపై నుంచి అతనికి స్పృహ వచ్చే ఉపాయం ఆలోచించెను.

రావణుడు మూర్ఛపోగానే రాక్షసులెల్లరు భయభీతులై వానిని చుట్టుముట్టిరి.

ఆశోకవనంలో ఆ రాత్రి త్రిజట సీతాదేవి వద్దకు వచ్చి జరిగిన కథంతయు విన్నవించెను. రావణుని తలలు, చేతులు మరల మరల మొలచుట విని సీతాదేవి మిగుల భయపడెను. ఆమె త్రిజటతో "అమ్మా! ప్రజలందరకు బాధలు కలిగించే రావణుడు ఎట్లు మరణించును?



రామచంద్రుని బాణములకు అతని తలలు తెగినను కూడా మరణించలేదు. విధాత కథంతా విరుద్దముగా చేయుచున్నాడు. నా దౌర్భాగ్యమే అతనిని బ్రతికించుచున్నది. కపటమైన బంగారు లేడిని పంపించిన ఆ విధాతయే యిప్పటికి కూడా నాపై కోపంతో ఉన్నాడు. ఆ విధాతయే దుస్సహమైన వియోగ దుఃఖాన్ని నేను సహించేటట్లు, లక్ష్మణుని నేను దుర్వచనాలు పలికేటట్లు చేసాడు. శ్రీరాముని విరహమనే భయంకర విషబాణాలకు అనేక పర్యాయములు నన్ను గురిచేసి యింకా యిప్పుడు కూడా చంపుచున్నాడు. ఇప్పటికి కూడా నా ప్రాణం పోలేదు. ఆ విధాతయే అచ్చట రావణుని బ్రతికించుచున్నాడు. అనెను."

శ్రీరాముని స్మరించుచూ జానకీదేవి అనేక విధాలుగా విలపింప సాగినది. అంతట త్రిజట "ఓ రాకుమారీ! దుఃఖించవలదు. హృదయంలో బాణం తగులగనే రావణుడు చావగలడు. కాని ప్రభువు అతని హృదయానికి గురిచూచి బాణంవైచి చంపుటలేదు. ఏమంటే అతని హృదయంలో నీవు ఉన్నావు. నీ హృదయంలో ప్రభువు ఉన్నాడు. ప్రభువులో అనేక భువనాలు ఉన్నాయి. వానికి దెబ్బతగులునని రాముడు గురిచూచి బాణాలు సరిగా వేయుటలేదు" అని చెప్పెను.

సీతాదేవికి ఆ మాటలు సంతోషం, విషాదం కల్గించుటను చూసి త్రిజట మరల "అమ్మా! సందేహాన్ని వదలుము. మాటిమాటికి వాని తలలను నరకినచో వాడు మిగుల దుఃఖించును. అప్పుడు హృదయంలో వాడు నిన్ను ధ్యానించడు. ఆ సమయమున శ్రీరాముడు హృదయముపై బాణము వేసి అతనిని చంపును" అని అనేక విధాలుగా చెప్పి ఆమె తన గృహానికి వెళ్ళిపోయెను.

శ్రీరఘునాథుని స్వభావం స్మరించుకొని. సీతాదేవి విరహవేదనతో మిగుల బాధపడెను. రాత్రి యుగం వలె గడచు చున్నది. రాత్రిని, చంద్రుని ఆమె నిందింపసాగెను. ఆ దుఃఖంలో ఆమె వామ నేత్రం వామబాహువు

అదరెను. శ్రీరాముడు తప్పక కలుసుకొనగలడని ఆ శకునాలనుబట్టి గ్రహించి ఆమె ధైర్యం వహించెను.

అర్ధరాత్రివేళ మూర్ఛనుండి రావణుడు మేల్కొనెను. అతడు సారథిని కోపగించి "ఓరి మూర్ఖుడా! యుద్ధభూమినుండి నన్ను ఎందుకు వేరుచేసితివి? ఓరి అధముడా! ఎంతపాడుపని చేసితివి" అని నిందించసాగెను.

సారథి అతని పాదాలు పట్టుకొని అనేక విధాలుగా వినయంగా విన్నవించుకొనెను.

తెల్లవారగానే రథంపై నెక్కి రావణుడు మరల యుద్ధభూమికి పరుగెత్తెను. రావణుడు వస్తున్నాడని తెలుసుకొని వానర సేనలో అల్లకల్లోలం బయలు దేరెను. వానరవీరులు పర్వతాలను, పెద్ద పెద్ద వృక్షాలను పెకలించి పళ్ళుకొరుకుతూ వానిపైకి దుమికిరి. వారు వానితో కొట్టుచుండగా రాక్షసులు పారిపోయిరి. శత్రుసేనను విచలితం చేసిన పిమ్మట వానరవీరులు రావణుని చుట్టుముట్టిరి. నలువైపుల అతనిని రాళ్ళతో చెట్లతో కొట్టుచు, గోళ్ళతో అతని శరీరాన్ని చీల్చుచు వానరులు రావణుని చీకాకు పరచిరి.

వానరులు గొప్ప బలశాలురని తలంచి రావణుడు అంతర్ధానుడై క్షణంలోనే తన మాయను వ్యాపింపచేసెను. ఆ మాయవలన భయంకరమైన అనేక జీవులు ఉద్భవించెను భూతాలు, పిశాచాలు, బేతాళులు ధనుర్బాణాలు చేబూని ప్రత్యక్షమయ్యెను పిశాచములు ఒక చేతిలో కత్తి, రెండవ చేతిలో మనుష్యుల పుర్రెలు పట్టుకొని రక్తాన్ని త్రాగుతూ నాట్యాలు చేయసాగెను. పట్టుకొనండి చంపండి. అని అవి అరచుచుండెను. నోళ్ళుతెరచి అవి పరుగెత్తుతుంటే వానరులు భయపడి పారిపోయిరి. వానరులు ఎటు వెళ్ళినను అచ్చట వారికి మండుచున్న అగ్ని కనబడుచుండెను. అదిగాంచి వానరులు, భల్లూకాలు వ్యాకులపడిరి.



వానరులు అలసిపోవుట, దుఃఖితులగుట చూచి రావణుడు గర్వముతో గర్జించెను. లక్ష్మణుడు, సుగ్రీవాది వీరులెల్లరు నిశ్చేష్టులైరి. రావణుడు మరొకమాయను కల్పించెను. అనేక హనుమంతులను సృజించెను. రాళ్ళు తీసుకొని వారు పరుగెత్తిరి. నలువైపుల నుంచి వారు శ్రీరాముని ముట్టడించిరి. వారు తోకలు ఎత్తి ఎగురుచు పట్టుకొనండి, కొట్టండి వెళ్ళ నీయకండి" అని కేకలు వేయుచుండిరి.

శ్రీ రఘువీరుడు ఒకే బాణంతో ఒక నిముసములో రావణుని మాయ నంతటిని మాయముచేసెను. శ్రీరాముని బాణపరంపరలకు రావణుని తలలు, చేతులు తెగి క్రిందపడుచుండెను. అనేక పర్యాయాలు తలలు, భుజాలు తెగినను రావణుడు చనిపోవుటలేదు. కొట్టినకొలది తలలు ఎక్కువగు చుండెను. ఎంత కొట్టినను శత్రువు చావక పోవడంతో ప్రభువు విభీషణుని వంక చూచెను.

"రావణుని నాభిలో అమృతం గలదు. ఆ బలం వలన అతడు మృతిచెందుట లేదు." అని విభీషణుడు చెప్పెను. అది విని ప్రభువు హర్షించెను. ఆ సమయమున రావణునకు అనేక అపశకునాలు కల్గెను. కుక్కలు, నక్కలు, గాడిదలు, ఏడ్చుచుండెను. మండోదరి హృదయం కంపింపసాగెను. ప్రతిమల నేత్రాలనుండి నీరు ప్రవహింప సాగెను. ప్రచండ వాయువు వీచుచుండెను. భూమి ఊగిసలాడు చుండెను. మేఘాలు రక్తాన్ని, ధూళిని వర్షింపసాగెను. ఈ విధమైన ఉపద్రవాలు చూచి ఆకాశంలో దేవతలు జయజయ నాదాలు చేయ మొదలిడిరి.

ఈ పర్యాయము శ్రీరాముడు రావణుని నాభియందు గురి చూచి కొట్టెను. ఆ బాణం వలన అందలి అమృతం ఇంకిపోయెను. వెంటనే పదితలలకు పదిబాణాలు ఇరువది చేతులకు ఇరువది బాణాలు ఒక్క సారిగా వేసి వానిని నరకివేసెను. ఆ బాణాలు తలలను, హస్తములను ఎగుర గొట్టుకొని వెళ్ళెను. మొండెము నేలపై ఎగిరి ఎగిరి నాట్యమాడుచుండెను.

ప్రచండ వేగంతో అది ముందుకు పరుగెత్తుచుండెను. ప్రభువు బాణం తీసి దానిని రెండు ముక్కలు చేసి వేసెను. మరణించే ముందు "రాముడెచ్చట? నేనతనిని యుద్ధంలో చంపాలి" అని అది గర్జించెను.

రావణుడు పడిపోగానే భూమి చలించిపోయెను. రావణుని తలలను, భుజాలను మండోదరి ముందు పడవేసి ఆ బాణాలు శ్రీరాముని అమ్ములపొది చేరుకొనెను. రావణుని తేజస్సు ప్రభువు ముఖంలో ఐక్యమైపోయెను. లోకకంటకుడైన రావణుని మరణానికి దేవతలు, గంధర్వులు, ఋషులు, మిగుల సంతోషించి పూలవర్షములు కురిపించిరి.

భర్త తలలను చూడగానే మండోదరి మూర్ఛితురాలై నేలపై పడిపోయెను. స్త్రీలు ఏడుస్తూ ఆమె వద్దకు పరుగెత్తుకొని వచ్చి ఆమెను లేవనెత్తి రావణుని కళేబరం వద్దకు తీసుకు వచ్చిరి. పతి దుర్దశను చూచి ఆమె ఏడ్వసాగెను. "నాథా! నీ బలం ముల్లోకములను దద్దరిల్ల చేసెను, సూర్యుడు, చంద్రుడు, అగ్ని నీ ముందు తేజో విహీనులైరి. వరుణుడు, కుబేరుడు, ఇంద్రుడు, వాయువు, వీరిలో ఒక్కరూ యుద్ధంలో నీముందు నిలబడలేక పోయిరి. నీ భుజబలంతో యమధర్మరాజును కూడా జయించితివి. అట్టి పరాక్రమం, శౌర్యం గల నీవు నేడు దిక్కులేని వానివలె నేలపై పడియున్నావు. నీ గొప్పతనం జగత్ప్రసిద్ధము. శ్రీరామునకు విముఖుడవగుట వల్లనే నీకీ దుర్దశ కల్గినది. విధాత సృష్టి అంతా నీ వశమై యుండేది, లోకపాలురు నిన్ను చూచి భయభీతులై నీ ముందు తల వంచుచుండెడివారు. ఇప్పుడు నీ భుజాలను, తలలను, నక్కలు తినుచున్నవి. రామ వై ముఖ్యమున ఇటుల జరుగుట విచిత్రం కాదు. మృత్యువశుడవగుటవలన నీవు ఎవరు చెప్పి నను వినలేదు. చరాచర ప్రాణికోటికి ప్రభువు అయిన ఆ శ్రీరాముని మనుష్యునిగా నీవు భావించావు. ఈశ్వరుడు, బ్రహ్మాది దేవతలు ఎవ్వనికి నమస్కరించెదరో ఆ కరుణామయుడైన ప్రభువును నీవు భజించ లేదు. నీవు పుట్టినప్పటి నుండియు ఇతరులకు ద్రోహం చేయుటలోనే నిమగ్నుడవై యుంటివి. అయినప్పటికి



శ్రీరాముడు నీకు కైవల్యం ప్రసాదించినాడు. యోగులకు కూడా దుర్లభమైన పరమపదమును ప్రభువు నీకు అనుగ్రహించినాడు." అని విలపింపసాగెను.

దేవతలు, సిద్ధులు మునులు, నారదుడు, మహాదేవుడు మున్నగు వారందరు మండోదరి వాక్యాలను విని సంతసించిరి.

విభీషణుడు వచ్చి ఏడ్చుచున్న స్త్రీలను చూచి మిగుల దుఃఖించెను. శ్రీరాముని ఆజ్ఞచే లక్ష్మణుడు వచ్చి అనేక విధాలుగా నచ్చ చెప్పెను. ప్రభువు ఆజ్ఞానుసారం విభీషణుడు రావణునకు అంత్యక్రియలు చేసెను.

శ్రీరామచంద్రుడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు మొదలగు వానరయోధులను పిలిచి విభీషణునకు పట్టాభిషేకంచేసి రమ్మనిచెప్పగా వారెల్లరులంకకు వెళ్ళి విభీషణుని సింహాసనంపై కూర్చుండబెట్టి రాజ్యాభిషేకం చేసిరి. అంత వారందరు కలిసి శ్రీరామచంద్రుని వద్దకు వచ్చి నమస్కరించిరి.

ప్రభువు హనుమంతుని పిలిచి జానకీ సమాచారం తెలుసుకొని రమ్మని చెప్పగా అతడు లంకానగరం వెళ్ళెను. విభీషణుడు, రాక్షసులు అతనికి సంతోషంతో స్వాగతం పలికిరి జానకీదేవిని దూరం నుండియే చూపించిరి.

హనుమంతుడు వెంటనే జానకీదేవికి భక్తితో నమస్కరించెను. ఆమె అతనిని గుర్తించి "నాయనా! హనుమా! నా స్వామి శ్రీరామచంద్రుడు మరది లక్ష్మణుడు వానరసేనా సమేతంగా కుశలవంతులే కదా!" అని అడిగెను. హనుమంతుడు "అమ్మా! శ్రీరామ లక్ష్మణులు అన్ని విధాలా క్షేమంగా ఉన్నారు. వారు దశకంఠుడైన రావణుని యుద్ధంలో ఓడించారు. విభీషణుని లంకానగరానికి రాజుగా చేశారు."అని చెప్పెను. అది వినగానే సీతదేవి శరీరం పులకితమయ్యెను. సజల నయనాలతో ఆమె "హనుమా! ఇంత మంచి మాట చెప్పినందుకు నీకు నేనేమివ్వగలను? ముల్లోకాలలో ఈ వార్తతో సమానమైన సుఖము కలిగించేది మరొకటి లేదు" అని పలికెను. హనుమంతుడు "తల్లీ! యుద్ధంలో శత్రుసేనను పూర్తిగా హతమార్చి నిర్వకారుడైన శ్రీరామచంద్రుని చూడగల భాగ్యం అబ్బింది నాకు.

సకలలోకాలు పొందినంత ఆనందమైనది” అని అనగా ఆ మాటలకు సీతాదేవి ఎంతగానో సంతసించి “పుత్రా! సమస్త సద్గుణాలు మూర్తీభవించిన వాడవు నీవు. ప్రభువు, లక్ష్మణుడు నీయందెప్పుడూ ప్రసన్నులై యుందురు గాక! నేను ప్రభువును సందర్శించగల ఉపాయమాలోచించుము” అనెను.

సీతాదేవికి నమస్కరించి ఆంజనేయుడు శ్రీరాముని వద్దకు వెళ్ళి ఆయనకు ఆమె క్షేమసమాచారం విన్నవించెను.

శ్రీరాముడు అంగదుని విభీషణునిచూచి “మీరు హనుమంతునితో కలిసి వెళ్ళి సీతదేవిని తీసుకొని రండు” అని ఆజ్ఞాపించెను.

వెంటనే వారు సీతమ్మ ఉన్న చోటుకు చేరుకొనిరి. అచ్చట అనేక రాక్షసాంగనలు ఆమెకు వివిధరీతులలో పరిచర్యలు చేయుచుండిరి. వారు ఆమెకు స్నానం చేయించి ఆభరణములు అలంకరించి ఒక చక్కని పల్లకిపై కూర్చుండపెట్టిరి. ప్రభువును స్మరిస్తూ ఆమె అందు కూర్చుండెను. ఆమెను తీసుకుని వస్తుండగా వానరులు అందరు సీతమ్మను చూచుటకు త్రొక్కిసలాడిరి. అది శ్రీరాముడు తెలుసుకొని ఆమెను పాద చారిణిగా రమ్మనమనీ అట్లయిన అందరూ ఆమెను దర్శించుటకు వీలుండ గలదనీ చెప్పెను. వారట్లు చేసిరి.

సీతాదేవి సత్యమైన స్వరూపం మొదట అగ్నిలో ఉంచబడెను. దానిని ప్రకటింప చేయుటకు ప్రభువు కొన్ని కఠిన వాక్కులు పలికెను. వానిని విని రాక్షసులు, వానరులు దుఃఖించిరి.

“చాలారోజులు ఈమె లంకలో ఉన్నది. అగ్ని పరీక్ష చేసిన జనులు తృప్తి చెందెదరు” అని శ్రీరాముడు పలికెను.

ఆ మాటలు విని సీతాదేవి “లక్ష్మణా! అగ్ని కుండం త్రవ్వించి, కట్టెలు పేర్పించి అగ్నిముట్టింపుము.” అని పల్కెను. అతడు దుఃఖముతో అట్లు చేసెను.



అగ్నికుండంలో మంటలు చెలరేగుచుండగా సీతాదేవి అగ్నికి నమస్కరించి “నాకు శ్రీరాముని పాదాల యందు ప్రగాఢ భక్తియున్నచో ఈ అగ్ని చందనం వలె చల్లగా నుండుగాక” అని చెప్పి ఆ మంటలో ఆమె దూకెను. మాయాసీత భస్మమై అసలు సీతాదేవి ప్రత్యక్షమయ్యెను. ఈ మాయ ఎవరికీ తెలియదు.

సముద్రుడు లక్ష్మీదేవిని విష్ణుభగవానునకు సమర్పించినట్లు అగ్ని దేవుడు సీతాదేవిని శ్రీరామచంద్రునకు సమర్పించెను. ఆమె ప్రభువు వామ భాగమందు కూర్చుండెను.

బ్రహ్మాది దేవతలు, ఋషులు, గంధర్వులు అందరూ ప్రభువును అనేక విధాలుగా స్తుతించిరి. ఆ సమయమున దశరథుడు కూడా అచ్చటకు వచ్చెను. పుత్రులను చూచి అతని కళ్ళలో ప్రేమాశ్రువులు నిండెను. శ్రీరామ లక్ష్మణులు తండ్రిగారికి నమస్కరించిరి. అతడు వారిని ఆశీర్వదించెను. “తండ్రీ! మీ పుణ్య విశేషం వల్లనే నేను అజేయుడైన రావణుని జయించ గల్గితిని.” అని శ్రీరాముడు పలుకగా దశరథుని హృదయం ఆనందంతో నిండిపోయెను. కంఠం గద్గదమయ్యెను.

దశరథుడు భేదభక్తి చూపుట వలన అతడు కైవల్యం పొందలేదు. అతడు స్వర్గంలోనే నివసించుచుండెను. ఇంద్రుడు వచ్చి శ్రీరఘువీరుని అనేక విధాలుగా స్తుతించెను. అంతట శ్రీరాముడు సంతోషంతో “ఇంద్రా! వానర భల్లూకాలు నా నిమిత్తం యుద్ధంలో ప్రాణాలు కోల్పోయిరి. కనుక వెంటనే వారిని బ్రతికించుము”అని పల్కెను. ఇంద్రుడు వానరులమీద, రాక్షసుల మీద అమృతవర్షం కురిపించెను. కాని రాక్షసులు జీవించలేదు. కారణం వారు ఇదివరకే మోక్షం పొందిరి. వానరులెల్లరు దైవాంశసంభూతులు గనుక శ్రీరాముని పట్ల గల కోరికతో జీవించియుండి పోయిరి. రాక్షసు లెల్లరకు మోక్షం ప్రసాదించిన శ్రీరాముని వంటి మహామహుడెవరుంటారు!

"ఓ హైమవతీ! తన భక్తునకు గొప్పతనం ఇచ్చుటకు గాను శ్రీరామచంద్రుడు వానరులను బ్రతికించుమని ఇంద్రునితో చెప్పెను. సర్వజగత్తును సృష్టించినవానికి వానరులను బ్రతికించుట ఒక లెక్క లోనిదికాదు."అని ఈశ్వరుడు పార్వతితో చెప్పెను.

ఇంద్రుడు దేవదేవునకు నమస్కరించి తనలోకానికి వెళ్ళిపోయెను.

ఈశ్వరుడు వచ్చి చేతులు ముకుళించి శ్రీరాముని అనేక విధాలుగా స్తుతించి అయోధ్యకు వచ్చి మీ పట్టాభిషేక మహోత్సవాన్ని కన్నుల పండువుగా చూచి ఆనందించవలెనని అభిలాష గలదని చెప్పి నమస్కరించి వెళ్ళిపోయెను.

పిమ్మట విభీషణుడు ప్రభువు వద్దకు వచ్చి నమస్కరించి "మీరు రావణుని వంశమంతయు నిర్వంశం చేశారు. దీనుడైన నన్ను రక్షించారు. మీరు మీ గృహానికి దయచేసి మా ఆతిథ్యాన్ని స్వీకరించి మమ్ములను పావనం చేయండి. నాకుగల ఐశ్వర్యం అంతా మీది దానిని మీరు తీసుకొని వానరులందరకూ పంచిపెట్టండి. నేను మీతో అయోధ్యకు వచ్చి మీ పాదసేవ చేయుదును."అని అత్యంత వినయముతో పలికెను.

శ్రీరామచంద్రుడు ఖిన్నవదనుడై సజల నేత్రాలతో "నాయనా! విభీషణా! నీ ఐశ్వర్యం అంతా నాదే! సత్యమే!

భరతుని దశ తలంచుకొని క్షణమొక యుగముగా గడుపుచున్నాను. అతడు తాపసిగా జీవిస్తూ నానాటికి కృశించిపోవుచున్నాడు. నిరంతరం నా నామాన్నే జపిస్తున్నాడు. వెంటనే నేను అతనిని చూడవలెను. వ్యవధి దాటినచో అతడు బ్రతుకుట దుర్లభం. నీవు కల్పాంత పర్యంతం రాజ్యము ఏలుము. మనస్సులో నన్నే స్మరిస్తూ ఉండుము. మహాత్ములు పొందే పరమధామాన్ని నీవు కూడా పొందగలవు"అని పలికెను. విభీషణుడు శ్రీరామచంద్రుని పాదాలకు ప్రణమిల్లి తన గృహానికి వెళ్ళిపోయెను. అనేక మణులను, వస్త్రాలను, పుష్పక విమానంలో నింపి దానిని శ్రీరాముని ముందుకు తీసుకొని వచ్చి నిలిపెను.



శ్రీరాముడు "విభీషణా! విమానమెక్కి ఆకాశానికి వెళ్ళి మణులను, వస్త్రాలను భూమిపై కురిపించుము" అనెను. అతడు అట్లే చేసెను. ఎవరికిష్టమైన వస్తువులు వారు తీసుకొనుచుండిరి.

వానరులు మణులను ఏరుకొని ఫలాలుగా భావించి నోటిలో వేసుకొను చుండిరి. వాటని ఎంతగా కొరికినా ఏ రుచి లేనందున అవి తినే వస్తువులు కావని గ్రహించి పారవేయుచుండిరి. అది చూచి సీతారామలక్ష్మణులు నవ్వుకొను చుండిరి.

మునులకు, వేదాలకు అందని ఆ దేవదేవుడు రఘురాముడు వానరులతో కలిసిమెలసి వినోదాలతో ప్రొద్దు పుచ్చుచుండెను. వానరులు వస్త్రభూషణాలతో అలంకృతులై శ్రీరాముని సన్నిధికి వచ్చి నమస్కరించి నిలబడిరి.

"ఓ పార్వతీ! రాముని కృప పొందుటకు అనేక విధాలుగా జప, తపో, యజ్ఞ, దాన, వ్రత, నియమాలెన్నిచేసినా అవి అనన్య ప్రేమతో సాటికావు." అని ఈశ్వరుడు పార్వతీదేవితో చెప్పెను.

శ్రీరాముడు వానరులతో "మీ బలంతో నేను రావణుని జయింప గల్గితిని. విభీషణుని లంకాధిపతిగా చేసితిని. ఇప్పుడు మీరు మీ మీ యిండ్లకు వెళ్ళండి. నన్ను స్మరిస్తూ ఉండండి. మీరు దేనిని గూర్చి భయపడనవసరం లేదు." అని పలికెను.

వానరులందరూ ఈ మాటలు విని శ్రీరాముని ఎడబాటు కలుగు చున్నందుకు వ్యాకులపడి "మీరు ముల్లోకాలకు ప్రభువులు మావలననే మీరు గెలుపొందారని మమ్ము ప్రశంసించుటవల్ల మాకు సిగ్గు కల్గించుచున్నది. దోమ ఎచ్చటనైనా గరుడపక్షికి మేలు చేయగలదా?" అని విన్నవించిరి. వారికి ఇండ్లకు వెళ్ళి పోవలెనను కోరిక లేదు.

ప్రభువు ఆజ్ఞపై ఎట్టకేలకువారు విషణ్ణవదనాలతో తమ తమ యిండ్లకు వెళ్ళిపోయిరి.

సుగ్రీవుడు, నీలుడు, నలుడు, అంగదుడు, హనుమంతుడు, విభీషణుడు, వానరసైన్యాధిపతులు అందరూ శ్రీరామునివైపు తదేక దృష్టితో చూచుచుండిరి. వారి ప్రేమాతిశయమునకు ముగ్ధుడై రామచంద్రుడు వారి నెల్లరును విమానంపై ఎక్కించుకొనెను.

విమానం ఉత్తర దిశగా బయలుదేరెను. విమానంలో మిగుల ఉన్నతమైన మనోహరమైన సింహాసనం అమర్చబడి యుండెను. అందు ప్రభువు, సీతమ్మవారు విరాజ మానులైరి.

దిశలు, ఆకాశం నిర్మలంగా ఉండెను. శీతల, మంద, సుగంధ సమీరం చక్కగా వీచుచుండెను. నలువైపుల శుభప్రదమైన శకునములు కల్గుచుండెను.

శ్రీరాముడు సీతాదేవికి యుద్ధభూమి చూపించుచు ఇచ్చటనే లక్ష్మణుడు ఇంద్రుని జయించిన మేఘనాదుని వధించాడు. రావణుడు కుంభ కర్ణాదులు ఇచ్చట చంపబడిరి. ఇచ్చటనే వానరులు వారధి నిర్మంచిరి. ఈశ్వరుని ప్రతిష్ఠ యిచ్చట చేసి యుంటిమి." అని వనంలో ఎచ్చటెచ్చట తాను విశ్రాంతి గైకొనెనో, నివసించెనో ఆయా తావులను చూపుచు వాని పేర్లను సీతమ్మ వారికి చెప్పుచుండెను.

వెంటనే విమానం దండకారణ్యం చేరుకొనెను. అచ్చటనే అగస్త్యాది మహర్షులను సందర్శించి వారి ఆశీర్వాదాలను పొంది శ్రీరాముడు చిత్రకూట పర్వతానికి వెళ్ళెను. అచ్చట మునులను సంతుష్టులను చేసి యమునా నదిని పిమ్మట గంగానదిని దర్శించి అందరు నమస్కారం చేసిరి. పిమ్మట పుణ్యతీర్థమైన ప్రయాగక్షేత్రమును దర్శించిరి, పరమ పవిత్రమైన త్రివేణిలో స్నానము చేసిరి.

అనంతరం శ్రీరాముడు ఆంజనేయుని చూచి "హనుమా! నీవు అత్యంత పవిత్రమైన అయోధ్యానగరమునకు వెళ్ళి భరతునకు మా యోగ క్షేమములు తెలిపి వాని క్షేమసమాచారములు తెలుసుకొనిరమ్ము" అని పంపెను.



హనుమంతుడు వెంటనే అయోధ్యకు బయలుదేరెను. అంతట ప్రభువు భరద్వాజ మహర్షివద్దకు వచ్చెను. ముని అనేక విధాలుగా ప్రభువును స్తుతించి పూజించెను. ముని పాదాలకు వందనములు చేసి మరల విమానంపై ఎక్కి శ్రీరాముడు ముందుకు వెళ్ళెను. విమానం గంగానది ఒడ్డున దిగగా సీతమ్మవారు గంగను పూజించెను.

"నీవు చిరకాలం ముత్తైదువుగా నుండుదువుగాక" అని గంగాదేవి సీతమ్మను ఆశీర్వదించెను.

గంగానది ఒడ్డుకు ప్రభువు చేరుకున్నట్లు తెలియగానే నిషాదరాజు ప్రేమ విహ్వలుడై పరుగెత్తుకొనివచ్చి సీతారాములనుగాంచి శరీరస్మృతిని కోల్పోయి భూమిపై పడిపోయెను. ప్రభువు అతని భక్తివిశేషాలకు మిగుల సంతసించి అతనిని లేవనెత్తి కౌగిలించుకొనెను. నిషాదరాజును తన ప్రక్కన కూర్చుండబెట్టుకొని అతని క్షేమ మడిగెను.

సామాన్యుడైన నిషాదుని కూడా భరతుని వలె ప్రభువు కౌగిలించుకొనెను.

ఈ పవిత్ర చరిత్రను ఎవరు భక్తి శ్రద్ధలతో వినెదరో వారికి విజయం, వివేకం, వైభవం ప్రభువు ప్రసాదించును. కలికాలం పాపాలకు నిలయం. ఇందు పాపాలనుండి తప్పించుకొనుటకు శ్రీరామ నామం తప్ప మరొక ఆధారం లేదు.

* * *

# శ్రీ తులసీరామాయణము

## ఉత్తరకాండము

శ్రీరామచంద్రుడు తిరిగి అయోధ్యకు వచ్చుటకు ఒక దినము మాత్రమే గడువు ఉండెను. "ఇంకనూ రాలేదే కారణమేమా"యని నగరవాసు లందరు ఆందోళనతో అధైర్య పడుచుండిరి. కాని మంచి శకునములు అగుటవలన ప్రసన్నముగా ఉండిరి. నలువైపుల నుండి ఆశాజ్యోతి కనిపించుచుండెను. కౌసల్యాది రాజమాతలు రామలక్ష్మణులు వచ్చుచున్న శుభవార్త ఎవరు చెప్పెదరాయని ఎదురు చూచుచుండిరి.

భరతుని కుడి పార్శ్వము అదరసాగెను. అందుకు భరతుడు సంతసము, నిస్పృహ నందుచుండెను. ఎందుకనగా మంచి శకునములు కలిగినందుకు సంతోషము, ప్రభువు రానందుకు విచారపడుచుండెను. "ఏది ఎట్లయినను నేను జీవించుటకు ఒక రోజు మాత్రమే మిగిలి యున్నది." యని భరతుడు మనసులో అమితముగా బాధపడుచుండెను.

ఇంతవరకు ప్రభువు రాకపోవుటకు ఏమికారణము? నన్ను వారు మరువలేదు గదా. ఆ లక్ష్మణుడే ధన్యుడు. అదృష్టశాలి. శ్రీరామచంద్రుడు వానిని తన వెంట తీసుకువెళ్ళెను. కపటినని, కుటిలుడనని నన్ను తనవెంబడి రమ్మనలేదు."

"స్వామి తలచినట్లు అదీ నిజమే! వారి యెడల నేను చేసిన ద్రోహమునకు నూరు కల్పముల వరకు నాతో మాట్లాడకూడదు. నన్ను దగ్గరకు రానీయకూడదు."

"నాకు వారియందు ఆశయున్నది. ప్రభువు సేవకుల అవగుణములను మన్నింపరు. ఆయన దీనబంధువు, ప్రేమమయ హృదయుడు. ఇప్పటికి నాకు వారియందు గట్టినమ్మకము ఉన్నది. నన్ను దాసుడనని తప్పక రక్షించును. మంచి శకునములు కలుగుచున్నవి కాని సమయము దాటిన



పిమ్మట ప్రాణము నిలిచియున్నయెడల నావంటి దౌర్భాగ్యుడు మరియొకడు ఉండడు."

ఇట్లు భరతుడు శ్రీరామచంద్రుని ఎడబాటు అను సముద్రములో మునుగుచుండెను. ఆ సమయమున పవనపుత్రుడు హనుమంతుడు బ్రాహ్మణరూపము ధరించి భరతుని సన్నిధికి వచ్చెను. మునిగిపోవు చున్న వానికి నావ అడ్డుపడినట్లుగా నుండెను.

దుర్బల శరీరముతో చిక్కి, జడలు మకుటముగా ధరించి, "రామా! రఘురామా!!"యని జపము చేయుచు, కమలముల వంటి నేత్రములనుండి ప్రేమాశ్రువులు రాల్చుచు, దర్భాసనముపై కూర్చున్న భరతుని చూచి, హనుమంతుడు మిగుల సంతసించెను. చెవులకు ఆనందము కలిగించు రీతిలో "ఓ భరతా! ఎవరికొఱకు నీవు రేయింబవళ్ళు అన్న పానీయములు వదలి ఆలోచించుచున్నావో అట్టి రామచంద్రుడు రావణాది రాక్షస వీరులను జయించి సీతాలక్ష్మణులతో క్షేమముగా తిరిగి వచ్చుచున్నాడు." అని విన్నవించెను.

ఆ మాటలు వినగానే భరతుడు కష్టములన్నియు మరచి "నాయనా! నీ వెవరు? ఎచ్చట నుండి వచ్చుచున్నావు?" అని పల్కెను. హనుమంతుడు ఇట్లు పల్కెను.

"నేను వాయుపుత్రుడను. జాతికి వానరుడను. నన్ను హను మంతుడందురు. దీనబంధుడైన శ్రీరాముని సేవకుడను." అని చెప్పగనే భరతుడు హనుమంతుని ప్రేమతో కౌగిలించుకొని నేత్రముల నుండి ప్రేమాశ్రువులు రాల్చుచూ "హనుమా! నిన్ను చూడగనే నా దుఃఖములన్నియు నశించెను. రామునివలె నీవు నాకు అగపడుచున్నావు. నాయనా! రాములు క్షేమముగా ఉన్నారా? నన్ను వారు ఎప్పుడైన తలంచెదరా? నేను వారికి గుర్తుఉన్నానా? యని ఆసక్తితో అడుగగా హనుమంతుడు ఇట్లు చెప్పెను.

"నాయనా! భరతా! శ్రీరామచంద్రుడు నిన్ను తన ప్రాణముతో సమానముగా నెంచుచున్నాడు. త్వరలో నీ చెంతకు వచ్చుచున్నాడు"అని విన్నవించి నమస్కరించి సెలవు దీసికొని రామచంద్రుని వద్దకు వెళ్ళిపోయెను. హనుమంతుడు రామచంద్రునకు భరతుని భక్తిభావమును వెయ్యి నోళ్ళతో కీర్తించి చెప్పెను. అది విని శ్రీరామచంద్రుడు మిగుల సంతసించి పుష్పక విమానములో అయోధ్యకు బయలుదేరెను.

భరతుడు వసిష్ఠుల వారి వద్దకు వచ్చి నమస్కరించి సీతా రామలక్ష్మణులు క్షేమముగా నగరమునకు వచ్చుచున్నారని చెప్పి రాజ సౌధమునకు కబురు పంపెను. అది వినగానే అంతః పురములో తల్లులు అందరు ఆనందములో ఓలలాడిరి. నగరవాసు లందరికి చాటింపు వేయించెను. ప్రజ లెచ్చటి వారచ్చట లేచి పరుగెత్తుచు రామచంద్రుడు వచ్చుచున్నాడని ఒకరి కొకరు చెప్పుకొనుచు ఎదురుపోయిరి. ముత్తయిదువలు బంగరు పళ్ళెరములోపల నిండా పాలు, నెయ్యి, పెరుగు, మంగళకరమగు ఇతర వస్తువులు నింపుకొని మంగళ గీతములు పాడుచు బయలుదేరిరి. వృద్ధులు, రోగిష్ఠులు తప్ప అందరూ సంతోషముతో బయలుదేరిరి.

ఆ సమయమున మంద, సుగంధ మారుతము వీచుచుండెను. సరయూ నదీ జలములు నిర్మలముగా నుండెను. శ్రీరామునకు స్వాగతమిచ్చుటకు భరతుడు వశిష్ఠాది మహామునులను వెంటబెట్టుకొని బయలుదేరెను. స్త్రీలు మేడలమీద నిలచి శ్రీరాముడు పయనించే విమానము కొరకు ఆకాశము వంక చూచుచుండిరి. అనేక మంగళ వాద్యములు మ్రోగించెను. శ్రీరామ చంద్రుడు పూర్ణిమా చంద్రుని వంటివాడు. అయోధ్య సముద్రము వంటిది.

రామచంద్రుని చూచి అయోధ్య పొంగిపోవుచుండెను. పుష్పక విమానములో ఉన్న వానరులకు రామచంద్రుడు అయోధ్యను చూపించుచు ఇట్లు చెప్పెను. "ఓ సుగ్రీవా! విభీషణా! ఈ అయోధ్య పవిత్రమైనది. సుందరమైనది. జనులు వైకుంఠమును గొప్పగా చెప్పుకొనెదరు. ఎందుకనగా



అది వేదములలో అట్లు వర్ణింపబడింది. అయినను అయోధ్యతో సమానంగా నాకది ప్రియమైనది కాదు. అయోధ్య నా జన్మభూమి, కనుక అది అంటే నా కమిత ప్రేమ. దానికి ఉత్తరముగా పవిత్రమైన సరయూనది కలదు. అందు స్నానము చేయువారు ఏ శ్రమ లేకుండానే నా సాన్నిధ్యమును పొందగలరు."

శ్రీరాముని పవిత్ర వాక్యములు విని వానరు లందరు సంతసించిరి. భగవానుని నోట ప్రశంసింపబడిన అయోధ్యా నగరము ధన్యమైనది. తనను దర్శించుటకు తండోపతండములుగా వస్తున్న అశేష ప్రజావాహినిని శ్రీరాముడు చూచి విమానమును నగరమునకు సమీపముననే దింపుమని ఆజ్ఞాపించెను. అది క్రిందికి దింపబడెను. "ఇక నీవు నీ కుబేరస్వామి వద్దకు వెళ్ళవచ్చునని" విమాన చోదకునితో శ్రీరాముడు చెప్పెను. అతడు తన స్వామి వద్దకు వెళ్ళుటకు సంతసించుచుండెను. కాని రాముని ఎడబాటుకు విచారపడుచుండెను. మిక్కిలి బాధతో అతడు శ్రీరాముని ఆనతి వలన వెళ్ళిపోయెను.

శ్రీరామలక్ష్మణులు దూరమున నున్న వశిష్ఠ వాల్మీకాది మహా ఋషులను చూచి వారి వద్దకు పరుగెత్తివెళ్ళి వశిష్ఠుల వారి పాదములకు నమస్కరించిరి. అంత వశిష్ఠుల వారు రామచంద్రుని "క్షేమముగా వచ్చితివా నాయనా!" యని అదుర్దాతో అడుగగా "మీ దయవలన ఇంటికి చేరితి"నని శ్రీరాముడు విన్నవించెను.

అంత భరతుడు వచ్చి రామచంద్రుని పాదములను పట్టుకొనెను. అతడు లేవదీసినను లేవలేక పోవుచుండెను. బలవంతముగా శ్రీరాముడు లేవదీసి కౌగిలించుకొని కన్నీరు కార్చుచు భరతుని కన్నీరు తుడుచుచూ, "విధి ఎంత వారికైనను తప్పదు నాయనా?" అని భరతుని క్షేమ సమాచారము అడుగుట, ఓదార్చుచు తన దగ్గఱకు తీసుకొనెను.

ప్రభువు సంతోషముతో సోదరులను కౌగిలించుకొనెను. లక్ష్మణ, భరతులు ఇద్దరు సోదరులు అత్యంత ప్రేమతో ఆలింగనము చేసికొనిరి. లక్ష్మణుడు శత్రుఘ్నుని కౌగిలించుకొనెను. తదుపరి భరత శత్రుఘ్నులు సీతమ్మవారికి నమస్కరించిరి.

అయోధ్యా పురవాసులు ప్రభువును చూడగనే హర్షించిరి. వియోగము వలన ఏర్పడిన దుఃఖము అంతా నశించెను. తనను అత్యంత కుతూహలముతో కలుసుకొనగోరిన ప్రజలను చూచి శ్రీరాముడు అసంఖ్య రూపాలలో ప్రకటితుడయ్యెను. అందరితోను యథాయోగ్యముగా కలిసెను. శ్రీ రఘువీరుని కృపవలన స్త్రీ పురుషులెల్లరు శోకరహితులైరి. ఒక్క క్షణ మాత్రంలోనే ప్రభువు అందరిని కలుసుకొనెను. అందరినీ ఆనందపరుస్తూ శ్రీరాముడు ముందుకు పోవుచుండెను.

కౌసల్యాది రాజమాతలను ప్రభువు కలుసుకొనగా అందరు ఆనందించిరి. సుమిత్రాదేవి తన పుత్రుడు లక్ష్మణునకు శ్రీరాముని యందు ప్రేమ ఉండుటను తెలుసుకొని మిక్కిలి ఆనందించెను. శ్రీరామునితో కలుసుకొను సమయమున కైకేయి సిగ్గుపడెను. లక్ష్మణుడు అందరు తల్లులను కలుసుకొని నమస్కరించి వారి ఆశీర్వాదమును పొందెను అతడు మాటిమాటికి కైకేయిని కలుసుకొనుచుండెను. అయినను ఆమె మానసిక క్షోభ పోలేదు.

సీతాదేవి అత్తలెల్లరను కలుసుకొని వారలకు పాదాభివందనము చేసెను. వారు "నీ ముత్తయిదవతనము స్థిరముగా ఉండుగాక"యని ఆశీర్వదించిరి. తల్లులు బంగారు పళ్ళెముతో శ్రీరామునకు హారతి ఇచ్చుచుండిరి. కౌసల్యాదేవి శ్రీరామ లక్ష్మణులను చూచి "ఈ ఇద్దరు పిల్లలు బహు సుకుమారులు. లంకాధిపతియైన రావణుని మహా బలశాలులైన రాక్షస యోధులను ఈ ఇద్దరు ఎట్లా చంపగల్గిరి?" అని ఆలోచించుచుండెను.



లంకాధిపతి విభీషణుడు, వానరరాజు సుగ్రీవుడు, నలుడు, నీలుడు, జాంబవంతుడు, హనుమంతుడు, అంగదుడు, ఈ వానర వీరులెల్లరు మనోహరమైన మానవ రూపములు ధరించియుండిరి. వారెల్లరు భరతుని ప్రేమ, వినయ స్వభావము, వ్రత నియమములను తెలుసుకొని ఆదరముతో గొప్పగా అభినందించుచుండిరి.

శ్రీరాముడు తన సఖులను పిలిచి వశిష్ఠముని చంద్రుని పాదములకు నమస్కారము చేయుడని చెప్పెను. "వీరు మా కుల గురువులు. మా కుల మంతటికి పూజ్యులు వీరి దయ వల్లనే రాక్షసులు సంహరింపబడి"రని చెప్పెను. పిమ్మట గురువుగారితో "గురువర్యా! వారెల్లరు నా సఖులు. యుద్ధమనే సముద్రములో వీరు నావలవలె నాకు తోడ్పడిరి. నా మేలు కొరకు తమ ప్రాణములను కూడ నొడ్డిరి. భరతుని వలెనే వీరు నాకు అత్యంత ప్రియులు." అని పలికెను.

ప్రభుని వాక్యములు విని అందరు ఆనందములో నిమగ్నులైరి. పిమ్మట వారు కౌసల్యాదేవికి నమస్కరించిరి. మీ రెల్లరు నాకు రామునివలె ప్రియులు." అని ఆమె దీవించెను.

శ్రీరాముడు తన భవనములోనికి వెళ్ళిపోయెను. నగరములో గల స్త్రీ పురుషులు మేడలు మిద్దెలుఎక్కి వారిని దర్శించిరి. అందరు తమతమ ఇండ్లముందు మంగళముల కొరకు తోరణములు, ధ్వజములు, పతాకములు కట్టిరి. వీథులలో సుగంధ ద్రవ్యములు చల్లిరి. హర్షముతో మంగళ వాద్యములు మ్రోగించుచుండిరి స్త్రీలు మంగళ గీతములు గానము చేయుచుండిరి అయోధ్యా నగరమందలి స్త్రీలు తెల్ల కలువలు, అయోధ్య సరోవరము, శ్రీరాముని విరహము సూర్యుడు. ఈ విరహ సూర్యుని తాపము వలన వారు శుష్కించిరి. ఇప్పుడు ఆ విరహ సూర్యుడు అస్తమించగా శ్రీరాముడనే పూర్ణిమాచంద్రుని సందర్శించి వారు చక్కగా వికసించిరి.

ఓ పార్వతీ! కైకేయి సిగ్గుపడు చున్నదని శ్రీరాముడు తెలుసుకొనెను. కనుక ప్రభువు మొదట ఆమె భవనమునకు వెళ్ళెను. ఆమెకు అనేక విధాల నచ్చజెప్పి సంతృప్తి పరచెను.

ఒక శుభ ముహూర్తమున బ్రాహ్మణులు మంత్రోచ్చారణ చేయుచుండ. దేవతలు జయజయ ధ్వనులు నలుపుచుండ వశిష్ఠముని శ్రీరామునకు రాజతిలకమును దిద్దెను. గురువుగారి ఆజ్ఞపై బ్రాహ్మణులెల్లరు తిలకమును దిద్దిన పిమ్మట రాముడు రాజసింహాసనముపై ఆసీను డయ్యెను.

ముల్లోకములకు ప్రభువు శ్రీరాముడు అయోధ్యానగర సింహాసనముపై విరాజితుడై యుండుటను చూచి గగనమున దేవతలు నగారాలు మ్రోగించిరి. గంధర్వులు. కిన్నరులు మంగళ గీతములు పాడుచుండిరి. అప్సరసలు గుంపులు గుంపులుగా వచ్చి నాట్యము చేయుచుండిరి. దేవతలు, మునులు అది చూచి ఆనంద సంభరితులగుచుండిరి. బ్రాహ్మణులు, యాచకులు అనేకములైన దానములచే సంతుష్టులైరి.

శ్రీరాముడు సేవకులను పిలిచి తన మిత్రులెల్లరను స్నానము చేయించమని చెప్పగా వారు ఎల్లరకు స్నానములు చేయించిరి. రామ చంద్రుడు భరతుని పిలిచి అతని జడలను స్వయముగా విడదీసెను. తన సోదరు లెల్లరకు అభ్యంగన స్నానము చేయించి పిమ్మట శ్రీరాముడు స్నానము చేసెను.

దేవతలు వేరు వేరుగా ప్రభువు వద్దకు వెళ్ళి వారిని అనేక విధములుగా కొనియాడి తమ తమలోకాలకు వెళ్ళిపోయిరి. నాల్గువేదములును వందిమాగదుల రూపముతో శ్రీరాముని సన్నిధికి చేరుకొని అనేక విధముల ప్రభుగుణగుణములను కీర్తించి అంతర్ధానమై బ్రహ్మలోకమునకు వెళ్ళి పోయెను ఈశ్వరుడు వచ్చి అనేక రీతులలో ప్రభువును స్తుతించి, “మీ పాదపద్మముల యందు స్థిరభక్తి యిమ్మని, మీ భక్తుల సత్సంగము సదా



లభించునట్లు అనుగ్రహించుమని” వేడుకొంటూ కైలాసమునకు వెళ్ళి పోయెను.

ప్రభువు వానరు లెల్లరకు సకల సౌకర్యములతో సుఖముగానుండే విడుదులు ఏర్పాటు చేయించెను.

పరమ పవిత్రమైన యీ కథ దైహిక, దైవిక, భౌతిక తాపములను, జన్మ, మృత్యు భయములను నశింపజేయును. శ్రీరామచంద్రుని రాజ్యాభిషేక చరిత్ర నిష్కామ భావముతో విన్నవారు జ్ఞానము, వైరాగ్యము పొందెదరు ఎవరు కోరికతో వినెదరో వారు అనేక విధములైన సుఖములను, సంపత్తిని పొందెదరు. జగత్తులో దేవతలకు దుర్లభమైన సుఖములను అనుభవించి అంత్యకాలమందు శ్రీ రఘునాథుని పరంధామమునకు చేరుకొందురు. జీవన్ముక్తులు విన్నచో భక్తి, విరక్తులు విన్నచో ముక్తి, విషయ సుఖములు గోరువారు విన్నచో నూతన సంపత్తి పొందగలరు.

వైరాగ్యము, వివేకము, భక్తిని దృఢము చేయగలదు.

వానరు లెల్లరు బ్రహ్మానందములో నిమగ్నులైరి. ప్రభుపాదముల యందు అందరికి అత్యంతమైన ప్రేమ గలదు. ఇట్లు ఆరు నెలలు గడచిపోయెను. వారు తమ తమ యిండ్లనే మరచిపోయిరి. స్వప్నములో కూడా యిండ్లు ఎవరికి గుర్తు రావడంలేదు.

శ్రీ రఘునాథుడు మిత్రులందరిని పిలిచెను. అందరూ వచ్చి ఆదరముతో ఆయనముందు తలవంచి నిలబడిరి. అత్యంత ప్రేమతో శ్రీరాముడు వారిని కూర్చుండబెట్టెను. శ్రీరామచంద్రుడు ప్రసన్న మధురకంఠముతో వారందరిని చూచి ఈ విధముగా పల్కెను. “మీరు నాకెంతయో సేవచేశారు. మీ ఎదుటనే ఎట్లు మీ గొప్పతనము పొగడుదును? నా హితముకోరి మీరు ఇండ్లను, అన్ని సుఖములను విడచితిరి. కనుక మీ యందు నాకు అత్యంత ప్రేమ గలదు. నా సోదరులు, రాజ్యము సంపత్తి సీత, నా శరీరము, ఇల్లు

కుటుంబము, మిత్రులు వీరందరూ నాకు ప్రియులే, కాని వారెవరూ మీతో సమానము కాదు. ఇది నా స్వభావము, నేను అబద్ధము చెప్పుటలేదు. నా దాసుల యందు స్వభావతః నాకు విశేష ప్రేమ గలదు. ఇప్పుడు మీరు మీమీ యిండ్లకు వెళ్ళండి. దృఢ భక్తితో నన్ను భజిస్తూ ఉండండి. సర్వవ్యాపకునిగా, సర్వ హితాభిలాషిగా నన్ను గుర్తించి నా యందు అత్యంత ప్రేమ కల్గియుండండి."

శ్రీరాముని వాక్యములు విని అందరికి ఆనందము కలిగెను. అందరు ప్రేమ మగ్నులైరి. "మే మెవ్వరము? మే మెచ్చట నున్నాము?" అనే స్మృతియే వారికి లేకుండెను. చేతులను జోడించి తదేక దృష్టితో ప్రభువును చూస్తూ అట్లే ఉండిపోయిరి. అత్యంత ప్రేమ వలన వారు మాటాడలేకపోవుచుండిరి. వారి అగాధ ప్రేమను గాంచి ప్రభువు వారికి అనేక విధములుగా జ్ఞానోప దేశము చేసెను.

అనేక విధములైన సుందరమైన ఆభరణములను, చిత్రవిచిత్రములైన వస్త్రములను, ప్రభువు వారలకొరకై తెప్పించెను.

అందరి కంటె ముందు భరతుడు, వానరరాజైన సుగ్రీవునకు వస్త్రభూషణములు అలంకరించెను, పిమ్మట లక్ష్మణుడు విభీషణునకు వస్త్రాభరణములు అలంకరించెను. అంగదుడు కదలక మెదలక కూర్చుండెను. అతని ఉత్కృష్టమైన ప్రేమను చూచి ప్రభువును అతనిని పిలువలేదు.

శ్రీరాముడు స్వయముగా జాంబవంతునకు, నీలునకు అలంకారము చేసెను.

అంతట అంగదుడు లేచి శ్రీరామునకు నమస్కరించి వినమ్రతతో ప్రేమతోమధురముగానిట్లు పలికెను. "ఓ సర్వజ్ఞా! కృపాసముద్రా! దీనబంధూ! నా తండ్రి మరణించుసమయమున నన్ను తమకు అప్పగించెను. నన్ను



విడిచిపెట్టకండి. నాకు తల్లి, తండ్రి, గురువు, దైవము అన్నియూ తమరే. తమ పాదములను విడిచి నే నెచ్చటికి వెళ్ళుదును? తమరే చెప్పండి. తమను వదలి యింటిలో నేనేమి చేయుదును? నేను తమ వద్దనే ఉండి తమకు సేవచేస్తూ తమ పాదములను సందర్శించుకుంటూ సంసార సముద్రమును దాటెదను. "ప్రభూ! నన్ను రక్షించండి ఇంటికి పొమ్మని నాకు చెప్పకండి." అని అంటూ శ్రీరాముని పాదములపై పడెను.

అంగదుని వాక్యములు విని శ్రీరాముడు అతనిని లేవనెత్తి కౌగిలించు కొనెను. ప్రభువు నేత్రములు ప్రేమాశ్రువులతో నిండిపోయెను. తన కంఠమున కల తులసీమాల, ఉత్తరీయము, మణి అంగదునకు ధరింపజేసి అనేక విధముల నచ్చచెప్పి అతనికి సెలవు నొసగెను. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు అంగదుని ఊరిచివరవరకు సాగనంపిరి.

రామచంద్రుడు తిరిగి రమ్మనునేమో అని అంగదుడు మాటి మాటికి తిరిగి చూచుచుండెను.

శ్రీరాముని దర్శన, సంభాషణములను ప్రభువుతో కలసి నడచి వెళ్ళుటను గుర్తుకు తెచ్చుకుంటూ దుఃఖించుచుండెను. ప్రభువు వైఖరిని గమనించి హృదయములో ప్రభువును స్మరించుకుంటూ వెళ్ళెను. వానరులందరను వారి వారి విడుదులకు చేర్పించి సోదరులతోకూడ భరతుడు తిరిగివచ్చెను.

హనుమంతుడు సుగ్రీవుని పాదములపై పడి యిట్లు విన్నవించెను. "స్వామీ! పది దినములు శ్రీ రఘునాథుని పాద సేవచేసి ఆనంతరము తమను దర్శించగలను" అనగా సుగ్రీవుడు "ఓ హనుమా! నీవు పుణ్యాత్ముడవు. ప్రభువు నిన్ను తన సేవయందు ఉంచుకొనుటకు అంగీకరించెను. కృపానిధియైన శ్రీరామునకు సేవ చేస్తూ ఉండుము." అని పల్కెను. వానరులందరు కిష్కింధకు బయలుదేరిరి.

అంగదుడు ఓ హనుమా! ప్రభువుకు నా నమస్కారములు చెప్పుము. తడవ తడవకు ప్రభువుకు నన్ను జ్ఞాపకము చేయుచుండుము.” ఇట్లు చెప్పి అంగదుడు బయలుదేరెను.

హనుమంతుడు శ్రీరాముని సమీపించి వారి ప్రేమను వివరించెను. అది విని ప్రభువు ప్రేమమగ్నుడయ్యెను.

శ్రీరాముడు గుహుని పిలిచి వస్త్రములు, భూషణములు ఇచ్చి “ఇప్పుడు నీవు కూడా యింటికి వెళ్ళుము. అచ్చట నన్ను స్మరిస్తూ ఉండుము. మనసా, వాచా, కర్మణా ధర్మానుసారము నడచుకొనుము. నీవు నా మిత్రుడవు భరతుని వంటి సోదరుడవు. అయోధ్యకు వస్తూపోతూ ఉండుము.” అని పల్కెను.

ఈ మాటలు వినగానే గుహునకు మిగుల ఆనందము కల్గెను. అతని నేత్రములు ప్రేమాశ్రువులతో నిండిపోయెను. ప్రభువు పాదపద్మములను హృదయములో ప్రతిష్ఠ చేసికొని అతడు తన యింటికి వెళ్ళిపోయెను. అతడు తన కుటుంబము వారికి ప్రభువు పవిత్ర చరిత్రను వినిపించెను.

శ్రీరామచంద్రుని రాజ్యాభిషేకము జరిగినప్పటి నుండి ముల్లోకములలో ఆనందము నిండిపోయెను. ఎవరికి ఎవరితోను వైరము లేదు. శ్రీరాముని ప్రతాపము వలన ప్రజల హృదయములలో భేదభావములు అంతరించెను.

ప్రజలందరు తమతమ వర్ణాశ్రమాచారములప్రకారము వేదవిహిత మార్గమున నడచుచు సుఖించుచుండిరి. వారికి ఏ విషయమందు భయము లేదు. శోకము లేదు. ఏ రోగము లేదు. స్త్రీ పురుషులు అందరూ రామభక్తిలో నిమగ్నులైరి. చిన్నతనములోనే ఎవరూ మరణించుట లేదు. రాముని రాజ్యములో దరిద్రు లెవరూ లేరు. దుఃఖితులు లేరు. దీనులు లేరు. మూర్ఖులు లేరు. అందరూ ధర్మపరాయణులు. స్త్రీ పురుషులు, చతురులు, గుణవంతులు, అందరూ జ్ఞానులే.



శ్రీరామచంద్రుని పట్టాభిషేకమునకు ముల్లోకములు హర్షించెను. మానవుల సమస్త దుఃఖములు నశించెను. ప్రజలు విభేదములు మరచి పరస్పరము సఖ్యముతో మెలగదొడంగిరి. రాముని దయవలన తర తమ భేదములు లేక అందరు అన్యోన్యముగా నుండిరి. జనులందరు తమ తమ వర్ణాశ్రమములకు అనుగుణముగా ధర్మబద్ధముగా ప్రవర్తిల్లు చుండిరి. వేదానుసారము నడచుకొనుచు సుఖులై నిర్భయులై, దుఃఖమును, భయమును లేక పరిపూర్ణ ఆరోగ్యవంతులై యుండిరి.

రామరాజ్యములో దైహిక, దైవిక, భౌతిక తాపములు లేకుండెను. పరస్పరము ప్రేమతో కలసిమెలసి ప్రజలు వేదమునందు చెప్పినట్లు నీతిమంతులై తమతమ ధర్మములను నిర్వర్తించుచుండిరి. ధర్మము నాల్గు పాదముల (సత్యము; శౌచము; దయ; దానము) జగత్తున ప్రకాశించెను. స్వప్నమునందు గూడ పాపము కనబడకయుండెను. స్త్రీ పురుష లెల్లరూ రామభక్తి పరాయణులై మోక్షపదవికి అర్హులై యుండిరి.

రామరాజ్యమున అకాల మరణములు గాని, పొరుగు వారి బాధలు గాని లేవు. అందరూ ఆరోగ్యవంతులై అనురాగవంతులై యుండిరి. దరిద్రులు గాని, దుఃఖితులు గాని, దీనులుగాని, మూర్ఖులు గాని, మరి యే యితర శుభ లక్షణములు లేని హీనులు గాని లేరు.

రామరాజ్యమున జనులందరూ నిగర్వులై, ధర్మపరాయణులై, పుణ్యాత్ములై యుండిరి. స్త్రీ పురుషులెల్లరూ చతురులూ; గుణవంతులై యుండిరి. అన్ని సద్గుణముల సమాదరించు వారును, పండితులును, జ్ఞానులునై యుండిరి. అందరూ కృతజ్ఞులై యుండి నిష్కపటులై యుండిరి.

రామరాజ్యములోని జడ చేతనములు లోకమందు కాల కర్మముల యొక్క స్వభావము చేత వచ్చు ఎట్టి వ్యాధులు గాని, బాధలు గాని లేక సుఖముగా నుండెను. శ్రీరామచంద్రుడు సప్తసముద్రములతో కూడి యుండు

భూమి కంతటికి చక్రవర్తి. రోమ రోమము నందు అనేక బ్రహ్మాండములుండు అట్టి దేవాదిదేవుడు ఈ రాజ్యమునకు ప్రభువగుట అతిశయోక్తి కాదు.

జితేంద్రియులై మహాఋషులు సైతము రాముని రాజ్యము నందలి సంపత్తిని వర్ణింప ఆదిశేషుని కైననూ, సరస్వతీదేవి కైననూ అలవి కాదని చెప్పుచున్నారు. స్త్రీ పురుష లెల్లరూ ఉదార స్వభావులై, పరోపకారులై యుండిరి.

పురుషులెల్లరు ఏక పత్నీవ్రతులు; స్త్రీలు మనసా, వాచా, కర్మణా తమ తమ పతులకు సన్నిహితలై యుండిరి. రామరాజ్యములో దండన యనునది లేకుండెను. శత్రువు లెవ్వరూ లేకుండుటచే "జయించుట" అను శబ్దము "ఇంద్రియములు జయించుట" అనుటకు మాత్రము ఉపయోగింప బడుచుండెను.

వనములందు ఫల పుష్పములు సమృద్ధిగా పుష్పించి, ఫలించు చుండెను. క్రూరమృగములు సైతము పరస్పరము వైరము మాని స్నేహము కలిగి యుండెను శకుంతములు నిర్భయముతో విహరించుచూ, తియ్యని కూతలతో చెవులపండుగ కన్నులపండుగ చేయుచుండెను.

చల్లని సుగంధ పరిమళములు వెదజల్లుచూ మలయ మారుతములు వీచుచుండెను. తుమ్మెదలు శ్రావ్యముగా ఝుంకారము చేయుచుండెను. వృక్షములు లతలు కోరినంతనే మకరందమువంటి పానీయములు అందించుచుండెను. భూమి సస్యశ్యామలమై ముక్కారుపంటలు పండు చుండెను. ఆవులు సమృద్ధిగా పాలను ఇచ్చుచుండెను.

సమస్త జగత్తుకు ప్రభువైన శ్రీరామచంద్రుని గుర్తెరిగి పర్వతములన్నియు అనేకమణులను, రత్నములను ఓషధులను అందజేయుచుండెను.

సమస్త నదులు శ్రేష్ఠమైనచల్లనైన, నిర్మలమైన, సుఖప్రదమైన, ఆరోగ్య ప్రదమైన, జలములను ప్రవహించుచుండెను. సముద్రము తన హద్దుదాటక



ఉండెను. అలలద్వారా రత్నములను ఒడ్డునకుచేర్చగా జను లెల్లరూ వాటిని పొందుచుండిరి. చెరువులన్నియూ కమలములతో నిండియుండి కన్నులకు పండుగ చేయుచుండెను.

రామరాజ్యము నందు చంద్రుడు తన అమృతపూర్ణమైన కిరణముల ద్వారా అందరిని ఆహ్లాదపరచు చుండెను. సూర్యుడు వలయు నంత వేడిమి నిచ్చి సుఖపెట్టుచుండెను. మేఘములు తగినంత వర్షించి జలముల నిచ్చుచుండెను.

శ్రీరామచంద్రుడు పెక్కు అశ్వమేధ యాగములు చేసి, బ్రాహ్మణులకు అనేక దానము లొసంగెను. శ్రీరామచంద్రుడు వేదమార్గమున ధర్మపరాయణుడై రాజ్యమును పాలించుచు త్రిగుణములకు అతీతుడై, భోగముతో ఇంద్రునకు సమానుడై వెలుగొందెను.

శీలవతి, సౌభాగ్యవతి యగు సీత వినమ్రతతో సర్వదా పతికి అనుకూలవతియై యుండెను. ఆమె కృపాసాగరుడైన శ్రీరామచంద్రుని మహిమను గుర్తెరిగినదై మనఃపూర్వకముగా శ్రీరామచంద్రుని పాద కమలములను సేవించుచుండెను.

శ్రీరామచంద్రుని సోదరులు ఆ ప్రభువునకు అనుకూలవర్తులై ఆయనను సేవించుచుండిరి. వారెల్లరూ సుఖులై సంతుష్టులై యుండిరి.

సీతాదేవి లవకుశులను ఇరువురు పుత్రరత్నములను కనెను వీరిరువురూ సాక్షాత్తు భగవత్స్వరూపులై అత్యంత తేజోవంతులై శోభిల్లు చుండిరి. భగవానుడు ఇట్టి లీలలు చూపెట్టుచుండెను.

ప్రాతఃకాలమున సరయూ నదిలో స్నాన మాచరించి, మహాత్ములతో సభయందు ఆసీనుడై, ఉండగా వశిష్ఠమహర్షి వేద పురాణ కథలను చెప్పుచుండెను. అన్నియు తెలిసికూడ శ్రీరామచంద్రుడు వినుచుండును.

తోటి సోదరులతో కలసి శ్రీరామచంద్రుడు భోజనము చేయుచుండ తల్లులందరూ ఆనంద పరవశలై పోవుచుండిరి.

భరత శత్రుఘ్ను లిద్దరూ హనుమంతునితో ఉపవనమునకు వెళ్ళి శ్రీరామచంద్రుని గుణములు వర్ణించు కథలను అడిగెదరు. అంతట హనుమంతుడు ప్రేమపూర్వకముగా శ్రీరామచంద్రుని వర్ణించగా విని సోదరులు ఆనందపరవశు లగుచుందురు.

జనులెల్లరూ తమ తమ యిళ్ళ యందు శ్రీరామచంద్రుని కథలు చెప్పుకొనుచుండిరి. స్త్రీ పురుషులెల్లరూ శ్రీరామచంద్రుని గుణశీలములను వర్ణించుచూ ఆనందపరవశులై రేయింబవళ్ళను సైతము మరచుచుండిరి.

నారద, సనకాది మునులు కోసల రాజ్యాధిపతియైన శ్రీరామచంద్రుని వద్దకు నిత్యము వచ్చి, దివ్యమైన అయోధ్యానగరమును గాంచి ఆనందముతో మైమరచుచుండిరి. స్వర్ణమయమయిన ఎత్తైన భవనములను గాంచి ఆశ్చర్యపడుచుండిరి. నాలుగు వైపుల మిగుల ఎత్తైన కోట. దానికి నాలుగు వైపుల ఆకాశము నంటు బురుజులు, అసంఖ్యాకములైన సేనలు అమరావతిని తలంపునకు తెచ్చుచుండెను. రాజమందిరము సూర్యచంద్రుల ప్రకాశమును అధిగమించు దివ్యమణుల సముదాయముతో అలరారుచుండెను.

ప్రతియింట వెలయు సత్రశాలలందు శ్రీరామచంద్రుని చిత్తరు పులు అలరారుచుండెను. ప్రతి యింట పూలతోటలు కనులపండువు చేయు చుండెను. నెమిళ్ళు, హంసలు, సారసపక్షులు మొదలగునవి ఆటపాటలతో కేరింతలతో మనస్సును రంజింపచేయుచుండెను. బహు సుందరముగా కన్పట్టు రాజద్వారము యొక్క శిల్పసంపదను వర్ణింప జాలము.

అయోధ్యానగరము యొక్క ఉత్తరదిశయందు పరయూనది నిర్మల జలములతో సుమనోహరముగా ప్రవహించుచుండెను. నది ఒడ్డున చక్కని మెట్లు గలిగి మాలిన్యము లేక పరిశుభ్రముగా నుండును. ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు జంతువులు నీరు త్రాగుటకు పెద్ద పెద్ద తొట్లు ఉండెను.



స్త్రీ పురుషులెల్లరూ స్నాన మాచరించుటకు తగు వసతులు కల్గియుండెను. రాజప్రాసాదము మిగుల రమణీయముగా నుండెను.

నదీ తీరమున అనేక సుందర మందిరములు గలవు. అందుగల విగ్రహములు స్వతస్సిద్ధమైనవిగా సజీవమైనవిగా భ్రాంతి కలిగించు చుండెను. నదీ తీరములో తాపసులు, మునులు, యోగులు ఆశ్రమముల నేర్పరచుకొని బహు నిష్ఠతో జప తపములు పలుపుచుండిరి. అయోధ్యా నగర శోభను వర్ణింపజాలము. నగరము వెలుపల గూడా సుందర మైదానము లుండెను. శ్రీరామచంద్రుని దర్శన మాత్రముచే అన్ని పాపములు నశించుచుండెను. వనములు, ఉపవనములు, తటాకములు సరోవరములు మున్నగు వానితో అయోధ్య కడు రమ్యముగా నుండెను.

జనులు అచ్చటచ్చట శ్రీరామచంద్రుని గుణములు చెప్పుకొని తన్మయత్వమును పొందుచుండిరి. శ్రీరామచంద్రుడు అను సూర్యుడు ఉదయింపగనే ముల్లోకములు ప్రకాశమానములయ్యెను. ప్రజలెల్లరూ మిక్కిలి సుఖులైయుండిరి.

ఒక పర్యాయము శ్రీరామచంద్రుడు సోదరులతో, ప్రియుడైన హనుమంతునితో గూడి ఉపవనమును చూడ పయనించెను. ఆ యుపవనము ఫలపుష్పములతో మిగుల శోభిల్లుచుండెను. తగు సమయమని తలచి, సనకాది మును లచ్చటికి ఏతెంచిరి. వారి ముఖములలో తేజస్సు ఉట్టిపడుచుండెను. శీలము చేతను గుణములచేతను ఎల్లప్పుడూ బ్రహ్మానందములో మునిగి యుండిరి. నాలుగువేదములు ఆ బాలకులరూపముతో కన్పట్టు చుండెను. సమదర్శనులకు విశ్వమే వ్యాసంగము. రాముని కథ జరుగుచోట శ్రవణానందమును బడయుటయే వారికి మిగుల అభీష్టము.

భవానీ! సనకాది మునిశ్రేష్ఠులు వెళ్ళు చోటులకు అగస్త్యుల వారు కూడా వెళ్ళెదరు. అరణి యందు అగ్నిని ఉత్పత్తి చేయునట్లు శ్రీరామచంద్రుని కథల ద్వారా జ్ఞానోదయము కలిగించుటలో ఆయన సమర్థులు.

శ్రీరామచంద్రుడు వారి రాకను గాంచి దండ ప్రణామములతో స్వాగతమిచ్చి వారు ఆసీనులగుటకు తన శరీరముపైనున్న పీతాంబరమును పరచెను. సోదరులు ముగ్గురూ వారికి నమస్కరించి ఆనందింపజేసిరి. మునివర్యులు శ్రీరామచంద్రుని ముఖ సౌందర్యమును గాంచి ఆనందపరవశులైరి. కాలగతిని మార్పుజేయు శ్యామశరీరుని తదేక దృష్టితో చూచుచుండిరి.

అంత శ్రీరామచంద్రుడు వారికి నమస్కరించి ప్రేమాశ్రువులు ఉప్పొంగగా. ఆ మునివర్యులను పీతాంబరముపై కూర్చుండబెట్టి. యిట్లనెను "మునివర్యులారా! నేను ధన్యుడనైతిని. తమ దర్శన మాత్రము చేతనే సర్వపాపములు నశించును. గొప్ప అదృష్టము చేతనే సత్సంగము ప్రాప్తించును. అందువలన అవలీలగా జనన మరణ చక్రమును నశించును. సత్సంగము భవబంధనములను తొలగించుటకు, చెడ్డవారి సాంగత్యము జన్మ మృత్యు బంధనముల కల్గించుటకు తోడ్పడునని వేద పురాణ పుణ్యపురుషుల ప్రవచనము"

శ్రీరామచంద్రుని పలుకులకు ఆ మునివర్యులు మిగుల సంతసించి యిట్లనిరి.

ఓ దేవా నీకు జయముగాక! నీవు స్థిత ప్రజ్ఞుడవు; పావనుడవు; కరుణామయుడవు; నిర్గుణుడవు; జ్ఞానస్వరూపుడవు; మాకు నీయెడ నిశ్చల భక్తిని ప్రసాదించుమని అనేక రీతుల శ్రీరామచంద్రుని ప్రశంసించి వైకుంఠమునకేగిరి.

అంత సోదరులు ముప్పురూ శ్రీరామచంద్రుని ప్రశ్నింప సంకోచించి, హనుమంతుని వైపు తేరిపారచూచిరి. వారు శ్రీరామచంద్రుని దివ్యవాణిని వినగోరుచుండిరి. సర్వాంతర్యామి; సర్వజ్ఞుడగు రాముడు దానిని గ్రహించి హనుమంతునితో విషయమేమని ప్రశ్నించెను. అంత హనుమంతుడు.



"ప్రభూ! భరతుడు మిమ్ములను ప్రశ్నింప నుద్దేశించి సంకోచించుచున్నాడు" అనెను. "అంత ప్రభువు హనుమా! నీవు నా స్వభావమును తెలుసుకొనియే యున్నావు. భరతునికి, నాకు ఏమి భేదము గలదు? అనెను.

అంత భరతుడు రాముని పాదములను తాకి నమస్కరించి, యిట్లనెను. "నాకు సందేహ మేమియులేదు స్వప్నమందైననూ మోహ శోకములు లేవు. నేను నీ సేవకుడను. నాకుగల సందేహమును తీర్ప వేడుచున్నాను. వేద పురాణములు సత్పురుషుల కొనియాడుచున్నవి. స్వయముగా నీవే పలుపర్యాయములు సత్పురుషుల కొనియాడుచున్నావు. సత్పురుషులెవరో; సత్పురుషులు కానివారెవరో వారియొక్క లక్షణము లెట్టివో తెలుసుకొన వలయునని మిక్కిలి కుతూహలముగా నున్నది."

అని పలుకగా; శ్రీరామచంద్రుడు చిరునవ్వునవ్వుతూ యిట్లనెను. గొడ్డలికి; చందనపు చెక్కకు ఎంత భేదము గలదో సత్పురుషులకు, సత్పురుషులు కానివారికి అంత భేదము గలదు. గొడ్డలి దెబ్బతిన్న చందనము గొడ్డలి కానుగంధమును ఇచ్చుచున్నది. అట్టి సుగుణముచేత అది దేవతలకు సైతము ప్రియమైనది. ఇక గొడ్డలియో తన దుర్గుణమునకు ప్రతిఫలముగా అగ్నియందు కాల్చబడి సమ్మెట దెబ్బలు తినును.

సత్పురుషులు విషయ లంపటులుగారు. శీలవ్రతులు, సద్గుణ సంపన్నులు. వారు తోటివారి సుఖదుఃఖములను తమవిగా భావించుదురు. సమదర్శనులు; వారు సర్వులకు ప్రియులు. వారికి శత్రువు లెవ్వరూ ఉండరు. వారి హృదయము వైరాగ్యపూర్ణమైన నిర్మలమైన ఆనందమును పొందుచుండును. వారు భయరహితులై క్రోధ, లోభముల త్యజించెదరు. వారి హృదయము కోమలమైనది. మనసా వాచా కర్మణా నిష్కపటులై యుందురు. అభిమానరహితులై అందరిని గౌరవించెదరు. వారు నాకు ప్రాణసమానులు. వారికి కోరికలుండవు. వారు కామాసక్తులు కారు. నన్నే సర్వత్ర స్మరించుచుందురు. శాంతి, వైరాగ్యము, వినయము, ఆనందము

కలిగియుందురు. వారు మృదు స్వభావము, సరళత, అందరియెడ మిత్రత్వము కలిగియుందురు. పెద్దలయెడ పూజ్య భావము భక్తి గలిగి వారు ధర్మబద్ధులై యుందురు.

భరతా! ఈ అన్ని లక్షణములు ఎవరియందు గలవో వారు సత్పురుషులని గుర్తెరుగుము. వారు శమము (మనోవిగ్రహము) దమము (ఇంద్రియ నిగ్రహము) గలిగి, నీతి నియమములు తప్పక ఎన్నడునూ కఠినోక్తులను పలుకక యుందురు. గౌరవ తిరస్కారములను సమానముగా భావించి సర్వదా నా చరణ కమలములయందు ఆసక్తి కలిగి యుందురు. వారిని సద్గుణ సంపన్నులుగను, సుఖ సంపన్నులుగను, సత్పురుషులుగను గుర్తెరుగుము. అట్టి వారు నాకు ప్రాణసమానులు. ఇక సత్పురుషులు కాని వారి లక్షణములు వినుము.

పొరపాటున కూడా అట్టి వారి చెలిమి చేయకూడదు. వారి స్నేహము సర్వదా దుఃఖదాయకము. కపిల గోవును సైతము చెడు జాతి ఆవు చెరచునట్లు సజ్జనులను దుర్జనులు చెరిచెదరు. దుర్జనుల మనస్సు అధిక మనస్తాపము కలిగియుండును. వారు ఇతరుల సంపదలను జూచి అసూయపడెదరు. పరనిందలను అత్యంతాసక్తితో విని హర్షించెదరు. వారు కామ, క్రోధ, లోభ, మోహ, మద మత్తులై, నిర్దయులై; కపటము; కుటిలత్వము కలిగి పాపపరులై యుందురు కారణము లేకయే వైరములు పెట్టుకొనెదరు. మేలొనరించువారికి కీడు చేయుదురు. వారికి అసత్యము పలుకుట అన్న పానీయములు స్వీకరించుటతో సమానము. అసత్యమే వారియొక్క బ్రతుకుతెరువు. అసత్యమే వారియొక్క ఆశయము. వారు ఏ పని చేసినా అసత్యముతో సంబంధము గల క్రియాకలాపమునే చేయు చుందురు.

వారికి అబద్ధమే జీవనము, అబద్ధమే భోజనము, స్వప్నమందైననూ సత్యము పలుకరు. తాము అమిత ధనవంతులమని లక్షలకొలది ధనము దాన మిచ్చితిమని డంభములు పలుకుదురు పంచభక్ష్య పరమాన్నములతో విందారగించితిమని గప్పములు పలుకుదురు పరులను నిందించెదరు.



పరస్త్రీలను చూచి మోహపడెదరు. కామ క్రోధ మోహములకు లోనై విషయ లంపటులయి క్రోధముతో మండిపోవుదురు. పెద్దలయందు, గురువుల యందు తిరస్కారభావము కలిగియుందురు. ఇతరుల దుఃఖము చూచి సంతసించెదరు. ఇతరుల క్షేమము చూచి వ్యసనపడెదరు. తాము నష్టపడియైనను, ఇతరులకు కీడొనర్చెదరు. సత్పురుషుల సాంగత్యము మేలొసగునని తలచరు. పురాణములను, వేదములను నమ్మరు. నెమలి చూచుటకు అందముగానుండి ఆహ్లాదము గొలుపును. కాని విషసర్పములను ఆహారముగా గైకొనును. అటులనే యీ దుష్టులు పైకి అందరకు ఆకర్షవంతులై యుందురు. కాని వారి ప్రవర్తనము కడు హేయమై యుండును. తల్లిని దైవమును గురువును గౌరవించరు.

ఇట్టి నీచులు కృతయుగములో నుండరు. ద్వాపరయుగములో కొద్దిమంది అచ్చటచ్చట ఉందురు. కలియుగములో మెండుగా నుండెదరు. ఇతరులకు మేలొనర్చుటకన్నా మరొక ధర్మము లేదు. పరులకు దుఃఖ మొనర్చుటకన్నా పాప మింకొకటి లేదు. మానవుడుగా జన్మించికూడ ఇతరులకు కీడొనర్చువాడు జనన మరణ సముద్రమును దాటలేదు. స్వార్థము చేత ఘోరపాపములు చేయుచున్నాడు. అందుచేత అతడు ఇహ పర సౌఖ్యములను పొందలేడు అట్టివారికి నేను కాలయముడను. వారియొక్క మంచి చెడు కర్మల కనుగుణముగా ఫలముల నిచ్చువాడను. ఈ సత్యమును తెలిసిన జ్ఞానులు ఈ ప్రపంచము దుఃఖరూపమని గుర్తెరిగి సదా నన్నే భజించుచున్నారు.

ఇందువలన శుభాశుభ ఫలముల నిచ్చు కర్మలను త్యాగమొనర్చి, దేవతలు, మనుష్యులు, మునిశ్రేష్ఠులు నన్నే స్మరించెదరు. త్రిగుణముల నెరిగిన మనుజులు జ్ఞానులు). జనన మరణ చక్రములందు తగుల్కొనరు. ఈ లోకము మాయచే రచించబడినదగుటచే అనేక గుణ దోషములు కన్పట్టును. వాని వాస్తవికతను గుర్తెరిగి (వాస్తవముగా వాటికి సత్తా లేదని తెలుసుకొని) సత్యమును సందర్శించుటయే వివేకము.

శ్రీరామచంద్రుని ప్రేమపూరిత వచనములను విని సోదరులు మిగుల ఆనందించిరి. మీదుమిక్కిలి హనుమంతుడు పరమానందమును పొందెను. తదనంతరము శ్రీరాముడు తన రాజమందిరమునకు వెళ్ళెను. శ్రీరామ చంద్రుడు నిత్యమూ యిటుల లీలా వినోదములతో గడపుచుండెను. నారదముని తరచు అయోధ్యకు వచ్చి శ్రీరామచంద్రుని పవిత్ర గాథలను గానముచేయుండెను.

మునిశ్రేష్ఠులు ఇచ్చట క్రొత్త క్రొత్త చరిత్రలను విని బ్రహ్మ లోకమున కరిగి అచ్చట పునశ్చరణ గావించుచుండిరి. బ్రహ్మ అద్దానిని విని పరవశుడగుచుండెను. సనకాది మహర్షులు నారదుని ప్రశంసించుచుండిరి. వారు శ్రీరామచంద్రుని చరిత్రను వినుటలో సమాధి నిష్ఠలను కోల్పోవుచుండిరి. అట్టి మహామహులే పరవశులగుచుండ మానవులు శ్రీరాముని కథలయందు భక్తి ప్రేమలు కలిగియుండక పోయినయెడల అట్టి వారిని పాషాణ హృదయులని తెలిసికొనుము.

ఒక పర్యాయము శ్రీరామచంద్రుడు వశిష్ఠ వాల్మీక్యాది ఋషులను, మహాజనులను పిలిపించి సభ చేసి ఇట్లు పలికెను. “ఓ సభాసదులారా! నేను చెప్పునది శ్రద్ధగా వినండి. నా మనస్సులోని యథార్థ భావమును చెప్పుచున్నాను. శ్రద్ధగొని, మీకు న్యాయమని తోచిన అనుసరించండి. నా ఆజ్ఞలను మన్నించువారు ప్రియతములు. నేను చెప్పునది మీకు అనుచితమని తోచిన నాకు అభ్యంతరము తెలియచేయండి. పెక్కు జన్మల సుకృతముచే మనకు మానవజన్మ లభించినది. ఈ మానవజన్మ దేవతలకు గూడ దుర్లభమైనది మనము వివేకముతో మెలగి భగవంతుని స్మరించి సత్కర్మలు చేసినయెడల మోక్షము కరతలామలకము. తమ తమ తప్పులు గ్రహింపక కాలము, కర్మము భగవంతునిపై దోషము లెంచిన ప్రయోజనము లేదు. భగవంతుడు మనకు మానవ శరీరము ఇచ్చినది విషయ సుఖములను అనుభవించుటకు కాదు. స్వర్గభోగములు కూడా కొన్ని దినములే యుండును.



తదుపరి బాధలు తప్పవు. కావున విషయములందు తగుల్కొనుట మూర్ఖత్వము. అమృతము నిరాకరించి విషమును గ్రోలుటయే. బుద్ధిమంతులు విషయ సుఖములను ఆశించరు.

జీవుడు నశించువాడు కాడు. మాయాప్రేరణ చేత, కాలకర్మ స్వభావ గుణముల చేత, క్లేశము చేత జీవుడు ఎల్లప్పుడు జనన మరణ చక్రము నందుబడి తిరుగుచుండును. కర్మఫలములను అనుభవించుటకు దైవము మానవ శరీరము నిచ్చును. ఈ శరీరము భవ సాగరమును దాటుటకు నావ వంటిది. నా కృపయే ఈ నావకు అనుకూలమగు వాయువు. ఆ సద్గురువు అనువాడు ఈ నావకు చుక్కాని. క్రమబద్ధముగా సాధన నొనర్చిన సులభముగా ఇహ పర సౌఖ్యములు కలుగును. ఈ అవకాశములు పొంది గూడా భవ సాగరమును దాటలేనివాడు మూర్ఖుడు. వాడు అధోగతి పొందును. ఇహ పర సౌఖ్యములను గోరువాడు నా మాటను గ్రహించి హృదయమందు పదిలపరచుకొన వలెను. నాయొక్క భక్తి మార్గము మిగుల సులభము, సుఖదాయకము. వేద పురాణములు గూడా ఈ విషయమును విశదపరచినవి.

జ్ఞానమార్గము మిగుల జటిలమైనది. దానిని పొందుటలో అనేక విఘ్నములు వాటిల్లును. అది హృదయముతో సంబంధము లేనిది. భక్తి రహితమైనది నాకు అందు అనుర క్తిలేదు.

భక్తి మార్గము స్వతంత్రమైనది అన్ని సౌఖ్యములకు పుట్టినిల్లు. సత్సంగము లేక ఈ జీవుడు ఏమియు పొందలేడు. పూర్వజన్మ సంస్కారము లేక సత్సంగము అలవడదు. సత్సంగము లేక జనన మరణ చక్రము ఆగిపోదు. లోకములో పుణ్యము ఒక్కటే ఘనమైనది. దానికి సాటియైనది మరొకటి లేదు. మనసా వాచా కర్మణా అందరము పెద్దల యెడల భక్తి కలిగియుండవలెను కపటం లేక ప్రవర్తించవలెను. అందుకు దేవతలు, మహర్షులు సంతసించెదరు. మీకందరకు ఒక రహస్య మార్గము కలదు.

అది యేమనగా మీరెవ్వరూ శంకరుని భజించక నన్ను పొందజాలరు. భక్తి సాధనలో చిత్తశుద్ధితో పయనించువారు యోగసాధన చేయ నవసరము లేదు. జప, తపో, యజ్ఞములతో పనిలేదు. సరళత గలిగి, కుటిలత్వము లేకుండా యుండవలెను. ప్రాప్తించినదానితో సంతృప్తిపడి, ఎప్పుడు సంతోషముతో నుండి, నా భక్తుడనని చెప్పుకొనుచు ఆశ లేకుండుటయే నా భక్తుని లక్షణములు. వాని హృదయములో నేను నివసించెదను.

ఎవరితోడను వైరభావము లేకుండువాడును, జగడములు చేయని వాడును, భయాందోళనలు లేనివాడును, నాయందు విశ్వాసముంచి నే చెప్పినది చేయువాడును. తన హృదయమున నన్ను ప్రతిష్ఠించుకొనిన వాడగును. నేను అట్టి వాని వశములో నుందును. గృహము నందు మమత్వము లేకుండుట, సత్సాంగత్యములో ప్రేమ కలిగి యుండుట, స్వర్గసుఖములను గూడా తృణముగా నెంచుట, భక్తిభావన గలిగి యుండుట, పర మతములను విమర్శించకుండుట, తర్కములను నొనరింపకుండుట, నా గుణములను కీర్తించుట, మద మోహములను విడనాడుట, అంతటను పరమాత్మ స్వరూపమును గాంచుట నా భక్తుని లక్షణములు.

శ్రీరామచంద్రుని అమృతతుల్యమగు పలుకులకు మోదమంది సభ్యులెల్లరూ శ్రీరామచంద్రునికి ప్రణమిల్లిరి. అంతట వారిట్లనిరి. "దయామయా! మీరే మాకు తల్లి. గురువు దైవము, ప్రాణము, మీ కంటె అధికులు మరొకరు లేరు. అన్యు లెల్లరు స్వార్ధపరాయణులు. మీరు నిస్స్వార్ధపరులు."

ప్రేమాస్పదమగు సభ్యుల పలుకులకు శ్రీరామచంద్రుడు సంతోషించెను. ఋషిపుంగవులు మొదలగు సభాసదులెల్లరూ శ్రీరామచంద్రుని కొనియాడి సెలవు తీసికొని తమ తమ గృహముల కేగిరి.

ఉమా! అయోధ్యా వాసులెల్లరూ అదృష్టవంతులు; సచ్చిదా నందమూర్తి శ్రీరామచంద్రుడు వారికి రాజయ్యెను. ఒక పర్యాయము



వశిష్ఠమునిపుంగవుడు శ్రీరామచంద్రుని వద్దకు ఏతెంచెను. శ్రీరామచంద్రుడు ఆయనకు ఆర్ఘ్యపాద్యాల నిచ్చి చరణామృతమును గ్రోలెను. అంత ఆ మునివర్యుడు "కరుణామయుడవగు శ్రీరామచంద్రా! నీ చరణముల గాంచి నా హృదయము మోహ మొందినది. భగవత్స్వరూపా! నీ యొక్క మహిమకు అంతములేదు. నీ మహిమను వేదములు గూడా ఎఱుగవు. మఱి నేనెట్లు నిన్ను కొనియాడగలను? పౌరోహిత్యము కడు నీచమైనది. వేద పురాణములు, స్మృతులు, పౌరోహిత్యమును నిందించుచున్నవి. నేను సూర్యవంశము యొక్క పౌరోహిత్యమును తిరస్కరించినపుడు బ్రహ్మదేవుడు నాతో నిట్లనెను. "కుమారా! నీకు భవిష్యత్తున చాలా లాభము చేకూరును, స్వయముగా పరబ్రహ్మ మనుష్య రూపము దాల్చి రఘుకులమున రాజగును." అని అనగా నేను దేనికొరకు యోగ, యజ్ఞ, వ్రతములను దానములను చేయుచున్నానో దానిని నా పౌరోహిత్యము ద్వారా పొందగలుగు నపుడు, నాయీ వృత్తి ధర్మముకంటె సమానమై నది వేరొకటి లేదని తలంచితిని. అనేక తంత్రములు, వేద పురాణములు చదువుట, వినుటచే కలుగు ఫలము, అన్ని సాధనల యొక్క ఫలము, నీ యొక్క పాదకమలముల యందు ప్రేమ గలిగి యుండుటయే. మాలిన్యముతో మాలిన్యము తొలగింపబడునా? వీటిని మథించి, ఎవ్వరై ననూ నీతిని పొందగలరా? నిర్మలమగు ప్రేమజలములచే గాని అంతఃకరణ మాలిన్యము నశించదు.

నీ యొక్క చరణముల యందు ప్రేమ గలిగినవారే సర్వజ్ఞులు, సత్యస్వరూపులు, పండితులు, గుణవంతులు, విజ్ఞానఘనులు, వారే చతురులు, శుభలక్షణ యుక్తులు. ప్రభూ! శ్రీరామచంద్రా! నిన్ను ఒక వరమును అర్థించుచున్నాను. దయచేసి ఈ వరమును ప్రసాదించండి. మీ పాదకమలముల యందు జన్మ జన్మలకు నాకు గల ప్రేమ చలించకుండునట్లు ఆశీర్వదించుము. అటుల అర్థించి వశిష్ఠముని గృహమున కేగెను. శ్రీరామచంద్రుడు హర్షించెను.

తదనంతరము హనుమంతుని భరతాది సోదరులను నగరమునకు ఆవలకు తోడ్కొని పోయెను. అక్కడకు గుఱ్ఱములను, ఏనుగులను, రథములను తెప్పించెను. వాటిని చూచి మోదమందెను. కోరినవారి కెల్లరకు ఔచిత్యమును గుర్తించి దాన మిచ్చెను. వారంతట ఉపవనమునకు వెళ్ళిరి. అచ్చట భరతుడు తనపై నున్న వస్త్రమును పరచెను. శ్రీరామచంద్రుడు దానిపై ఆసీనుడయ్యెను. సోదరులెల్లరూ ఆయనకు సేవ చేయుచుండిరి ఆ సమయమున పవనపుత్రుడు హనుమంతుడు స్వామికి వింజామర వీచుచుండెను. ఆయన శరీరము పులకరించెను. నేత్రములయందు ప్రేమాశ్రువులు నిండెను. పార్వతీ! శ్రీరామచంద్రుని యందు ప్రేమగలిగిన హనుమంతునితో సరిసమానుడగు అదృష్టవంతుడు మరొకడు లేడు స్వయముగా శ్రీరామచంద్రుడే హనుమంతుని కొనియాడెను.

ఆ సమయమున నారదుడు వీణను ధరించి అచ్చటకు వచ్చెను. ఆయన శ్రీరామచంద్రుని అనేక రీతుల కీర్తించెను. తదుపరి వైకుంఠమున కరిగెను.

“పార్వతీ! నేను నాశక్త్యనుసారము పరమ పావనమైన శ్రీరామకథను నీకు చెప్పితిని. శ్రీరామ కథ అపారమైనది. శ్రుతులు, సరస్వతీదేవి కూడా వర్ణించజాలవు. శ్రీరామచంద్రుడు అనంతుడు. ఆయన గుణములు అనంతములు. ఆయన జన్మలు, కర్మలు, నామములు అనంతమైనవి. జలబిందువులను ధూళి కణములను లెక్కించవచ్చును గాని. శ్రీరామచంద్రుని గుణగణములను లెక్కించుటకు వలనపడదు. ఈ పవిత్ర గాథ భగవంతుని పరమపదమును ప్రసాదించును. దీనిని వినుటచే నిశ్చల భక్తి అలవడును. ఉమా! కాకభుశుండుడు గరుత్మంతునకు చెప్పిన ఈ రామకథను నీకు వినిపించితిని. శ్రీరామచంద్రుని గుణగుణములు కొన్నింటిని మాత్రము చెప్పితిని” అని పరమేశ్వరుడు పార్వతితో పలికెను.

అంత పార్వతీదేవి శ్రీరామచంద్రునిపవిత్రగాథనువిని చాలాసంతసించి మిగుల వినయముతో కోమలముగా ఇట్లనెను. “త్రిపురారీ! నేను



ధన్యురాలైతిని. జన్మ మృత్యు భయమును చాలించి శ్రీరామ చంద్రుని గాథను వింటిని. నా మోహము నశించెను. ప్రభూ! శ్రీరామ చంద్రుని మహిమను ఎరింగితిని. ప్రభూ! చంద్రుని వంటి మీ ముఖకమలము నుండి రఘువీరుని గాథలను అమృతము వర్షించెను. నాథా! నా మనస్సు శ్రీరామచంద్రుని కథామృతమును కర్ణపుటముల ద్వారా గ్రోలి తృప్తిపడుటలేదు. శ్రీరామచంద్రుని కథామృతమును గ్రోలి ఎవరైతే తృప్తిపడెదరో వారు జీవన్ముక్తులు. వారు కూడా భగవంతుని గుణములను నిత్యము శ్రవణానందముగా విందురు. సంసార సాగరమును దాటగోరువారికి శ్రీరామ కథ దృఢమైన నావ వంటిది. శ్రీరామ చంద్రుని కథ విషయాసక్తులైన వారికి గూడ శ్రవణానందము చేకూర్చునది. మానసోల్లాసము నిచ్చునదై యున్నది. జగత్తులో శ్రీరామ కథను అనురక్తితో ఆలకించి శ్రవణానందము పొందనివారెవరున్నారు? అట్లు అనురక్తులు కానివారు మూర్ఖులు; స్వయముగా ఆత్మహత్యను కావించుకొనెడి వారితో సమానులు తమరు శ్రీరామ చరితమును గానము చేసితిరి. దానిని గ్రోలి నేను పరమానందమును బడసితిని. ఈ సుందరమైన కథను కాకభుశుండి గరుత్మంతునితో చెప్పెనని చెప్పితిరి. మరి అయితే కాకభుశుండి కాకి రూపము దాల్చిగూడ, వైరాగ్యవంతుడు, జ్ఞాని ఎట్లయ్యెను? శ్రీరామచంద్రుని చరణమలములందు దృఢమైన ప్రేమ గలిగి, శ్రీరామచంద్రుని యందు భక్తితత్పరుడై ఎట్లుండెను? ఈ విషయములో నాకు మిగుల సందేహము కలుగుచున్నది.

త్రిపురారీ! వేలమంది మనుజులలో ఒకడు మాత్రము ధర్మ వ్రతుడై ఉంటాడు. కోటానుకోట్ల ధర్మవ్రతులలో ఏ ఒక్కడో విషయ చింతను త్యజించినవాడు, వైరాగ్యపరాయణుడు ఉంటాడు. కోటానుకోట్ల విరక్తులలో ఏ ఒక్కడో జ్ఞానమును పొందునని శ్రుతి చెప్పుచున్నది. కోట్ల కొలది జ్ఞానులలో ఏ ఒక్కడో జీవన్ముక్తుడగును. అట్టి వేల కొలది జీవన్ముక్తులలో సర్వసుఖముల నిధియగు బ్రహ్మమునందు విలీనమగు విజ్ఞానఘనుడైన

పురుషుడు, బహుదుర్లభుడు, ధర్మాత్ముడు, విరాగి, జ్ఞాని, జీవన్ముక్తుడు ఒకరికంటె నొకరు శ్రేష్ఠులు. బ్రహ్మలీనుడు, వీరందరికంటె శ్రేష్ఠుడు. ఓ దేవా! మద మాత్సర్యము లేని శ్రీరామచంద్రుని యందు భక్తి పరాయణుడై యుండు ప్రాణి అత్యంత దుర్లభుడు. ఇట్టి దుర్లభమైన హరిభక్తిని కాకి ఏ విధముగా పొందెనో తెలియజేయుము. శ్రీరామనామ పరాయణుడు జ్ఞాన నిరతుడు; గుణనిధియైన ఆ భుశుండు కాకి శరీరమును ఏ కారణము చేత పొందెను? ఓ కృపా సింధూ! ఆ కాకి ప్రభువు యొక్క పవిత్ర సుందరమైన చరిత్రను ఎక్కడ గ్రహించెను? మీరు ఈ కథను ఎట్లా వినియుంటిరో తెలుసు కొనవలెనని నాకు మిగలు కుతూహలముగా నున్నది.

గరుత్మంతుడు మహా జ్ఞానవంతుడు. సద్గుణరాశి, శ్రీహరి సేవకుడు, శ్రీహరికి మిక్కిలి దగ్గరగా నుండి ఆయన వాహనముగా నుండువాడు. ఆ గరుత్మంతుడు మునిగణములను విడిచి, కాకి వద్దకు ఎట్లు వెళ్ళెను. ఏ కారణము చేత కాకభుశుండికి గరుత్మంతునకు హరిభక్తి సంభాషణ జరిగెను?"

పార్వతీదేవి యొక్క సరళ సుందర మృదు భాషణమును విని పరమశివుడు ముదమొంది ప్రేమతో నిట్లు పలికెను. "పార్వతీ! నీవు ధన్యురాలవు. నీవు మాన్యురాలవు. శ్రీరామచంద్రుని పాద కమలము లందు నీకు అత్యంత ప్రేమ గలదు. ఇప్పుడు ఆ పరమ పవిత్ర చరిత్రను వినుము. దీనిచే ప్రపంచము నందుగల భ్రమ యంతయు నష్టమగును. శ్రీరామచంద్రుని పాద కమలములందు విశ్వాసము జనించు మనుజుడు సంసారరూపమగు సముద్రమును శ్రమలేకుండా దాటగలడు.

పక్షిరాజు గరుడుడు కూడా కాకభుశుండి వద్దకు వెళ్ళి ఇదేప్రశ్న వేసెను. నేను దానినంతయు చెప్పెదను. నీవు మనస్సును లగ్నపరచి వినుము. నీవు ఇంతకు మునుపు దక్షుని యింట జన్మించితివి. అప్పుడు నీ పేరు సతి దక్షుని యజ్ఞమున నీకు అవమానము కలిగెను. అంత నీవు కోపించి



ప్రాణత్యాగ మొనర్చితివి. అంతట నా పరివారము యజ్ఞమును ధ్వంసమొనర్చిరి. ఆ సంఘటన అంతయు నీవు ఎరిగియేయుంటివి. అంతట నా మనస్సు సంక్షోభించెను. ప్రియా! నీ వియోగముచే దుఃఖితుడనైతిని, నేను విరక్తుడనై సుందరమగు వనములందు, పర్వతము లందు, తటాకములందు విహరించుచూ తిరుగుచుంటిని. సుమేరు పర్వతమునకు ఉత్తర దిశగా చాలా దూరములో చాలా సుందరమగు నీల పర్వతము గలదు. ఆ పర్వతమునకు అందమైన స్వర్ణమయమైన నాలుగు శిఖరములు గలవు. ఆ నాలుగు సుందర శిఖరములు నా మనస్సునకు బాగుగా నచ్చెను. ఆ శిఖరము లన్నిటిపై, మర్రి, రావి, మామిడి వృక్షములు విశాలమైనవి గలవు. పర్వతముపైన ఒక సుందరమైన తటాకము గలదు. దానియొక్క మణిమయమైన మెట్లు గాంచినచో మనస్సు సంతసించెను. దాని యొక్క జలము శీతలము, నిర్మలము, మధురము. ఆ తటాకము రంగు రంగుల వికసించిన కమలములతో నిండియుండెను. అందు హంస గణములు మధుర స్వరములు పలుకుచుండెను. తుమ్మెదలు ఝంకారము గావించుచుండెను.

ఆ సుందర పర్వతము పై ఆ కాకభుశుండి నివసించుచుండెను. ఆ పర్వతము కల్పాంతమున గూడా నశించదు. మాయ, మోహము మదము మొదలగు దోషములు అచ్చట సమీపింపనేరవు అచ్చట నివసించి ఏ విధముగా ఆ కాకి హరిని భజించునో అద్దానిని ప్రేమతో వినుము. అది రావి చెట్టు క్రింద ధ్యానము, మర్రిచెట్టు క్రింద జపయజ్ఞము, మామిడి చెట్టు క్రింద మానసిక పూజ చేయుచుండును. శ్రీ హరి భజన తప్ప దానికి రెండవపని యేమియు లేదు. వటవృక్షము క్రింద శ్రీహరి కథలను చెప్పును. అచ్చటకు అనేక పక్షి సమూహములు వచ్చి వినుచుండును.

ఆ కాకి విచిత్రమగు రామ చరితము అనేక ప్రకారములుగా, ప్రేమ భరితముగా గానముచేయుచుండును. ఆ తటాకమున నివసించు బుద్ధి

కుశలత కలిగిన హంస లన్నియూ వినుచుండును. నేను అక్కడకు వెళ్ళి ఈ సుందర దృశ్యమును గాంచి హృదయమున మిగుల ఆనందించితిని. అంత నేను హంస రూపమును దాల్చి కొంతకాలము అచట నివసించితిని. ఆ రఘుపతి యొక్క గుణగణములను ప్రేమ మీరగ విని మరల కైలాసమున కేతెంచితిని. ఇపుడు పక్షిరాజగు గరుత్మంతుడు ఆ కాకభుశుండి వద్దకు వెళ్ళిన కథను వినుము.

శ్రీరామచంద్రుని కొన్ని లీలలను స్మరించిన నాకు సిగ్గగుచున్నది. మేఘనాదుని చేతులంద శ్రీరామచంద్రుడు బంధింపబడియుండెను. అంతట నారదుడు గరుత్మంతుని బంపెను. అంత గరుత్మంతుడు నాగపాశములను కొఱికి వైచెను. అప్పుడు అతని మనస్సులో మిగుల విచారము జనించెను శ్రీరామచంద్రుని బంధనమును స్మరించి, గరుడుడు అనేక రీతుల తర్కించుకొనెను. "సర్వవ్యాపకుడు, వికారరహితుడు, మాయా మోహములను త్యజించిన బ్రహ్మస్వరూపుడైన పరమేశ్వరుడు శ్రీరామచంద్రుడు భగవంతుని అవతారమని వినియున్నాను. కాని నేను ఆయన నేత్రము ఘనత చూచియుండలేదు. ఎవని నామమును జపియించి మనుజులు సంసార బంధమును తొలగించుకొందురో ఆ రామునే నేడు ఒక తుచ్ఛ రాక్షసుడు నాగపాశములచే బంధించెను."

గరుత్మంతుడు అనేకరీతుల మధనపడెను. కాని జ్ఞానము కలుగు లేదు. మనస్సును భ్రమ మిగుల ఆవహించెను. అట్లు దుఃఖితుడై మనస్సున కుతర్కము ముప్పిరి గొనగ ఆ గరుత్మంతుడు నీ వలెనే మోహ వశుడయ్యెను. అతడు వ్యాకులుడై దేవర్షి నారదుని వద్దకు వెళ్ళి తన మనస్సున గల సందేహమును వివరించెను. దానిని విని నారదునికి అతనిపై దయ కలిగెను అంత ఆ నారదుడు గరుత్మంతునితో "గరుత్మంతా! శ్రీరామచంద్రుని మాయ మిగుల బలీయమైనది. జ్ఞానుల చిత్తమును గూడ హరించి, వారి మనస్సులో గూడ మోహమును జనింపచేయు ఆ మహామాయ నన్ను గూడ తికమకలు



గావించెను. పక్షిరాజా! ఆ మాయ నీకు గూడ ఆవేశించెను. గరుత్మంతా! నా హృదయమున మిగుల మోహము ఆవేశించెను. నేను నిన్ను వెంటనే సమాధానపరచలేను. కావున నీవు బ్రహ్మ వద్దకేగి ఆయన చెప్పినటుల చేయుము." ఈ ప్రకారము చెప్పి నారదమహర్షి శ్రీరామచంద్రుని గుణముల కీర్తించుచు శ్రీహరి లీలలను వర్ణించుచూ తరలి వెళ్ళెను.

అంత పక్షిరాజు గరుడుడు బ్రహ్మవద్ద కేగి తన సందేహమును తెలియబరచెను. ఆ విషయ మంతయు విని విధాత శ్రీరామచంద్రునికి ప్రణమిల్లి ఆయన లీలల స్మరించి అత్యంత ప్రేమపూరితు డయ్యెను. బ్రహ్మ ఈ ప్రకారము తలపోసెను. "కవికోవిదులును, జ్ఞానులును అగు వారందరు కూడా మాయాధీనులు. భగవంతుని లీల అపారమైనది ఆయన మాయ నన్ను గూడా అనేక పర్యాయములు మోహపెట్టినది. ఈ చరా చర జగత్తంతయు నాచే రచింపబడినది. అయినను నేనే మాయావశుడనై భ్రాంతి చెందుచుందును. మఱి ఈ పక్షిరాజు మోహపరవశుడగుటలో ఏ మాత్రము ఆశ్చర్యము లేదు.'' ఇటుల తలపోసి పక్షిరాజుతో ''గరుత్మంతా! శ్రీరామచంద్రుని మహిమను మహాదేవుడైన శంకరు డెరుగును. నీవు అయన వద్దకు వెళ్ళుము. ఆర్యా! ఎచ్చటనూ, ఎవ్వరినీ అడుగవలదు. నీ సందేహము అచ్చటనే తీరును" అనెను. బ్రహ్మ పలుకులను వినినంతనే గరుత్మంతుడు కైలాసమునకు బయలుదేరెను.

అంత మిగుల వేగముతో గరుత్మంతుడు నా వద్దకు వచ్చెను. నేనా సమయమున కుబేరుని యింటికి వెళ్ళుచుంటిని. నీవు కైలాసమున నుంటివి. గరుత్మంతుడు ప్రేమపూర్వకముగా నా చరణములకు ప్రణమిల్లి, తన సందేహమును వినిపించెను. అతని పలుకులకు సంతసించి, ప్రేమపూర్వకముగా ఈ విధముగా చెప్పితిని– "గరుత్మంతా! నీవు నాకు దారిలో కలిసితివి. పయనము గావించుచు నేను నీకెట్లు సమాధానమిత్తును? ఎట్లు నిన్ను సమాధాన పరతును? చిరకాలము సత్సంగము చేసినయెడల

అన్ని సందేహములు తొలగును. ఆ సత్సాంగత్యమున మునులచే సుందరమగు హరికథలు వీనుల విందుగ వినవచ్చును. ఆది మధ్యాంత రహితుడగు శ్రీరామచంద్రుడే సాక్షాత్పరబ్రహ్మస్వరూపుడు, సోదరా! ప్రతిదినము హరికథలు గానమొనర్చబడుచోటుకు నిన్ను పంపెదను. నీ వచ్చుటకు వెళ్ళి వానిని వినుము. వానిని వినినంతనే నీ యొక్క అన్ని సందేహములు తొలగును. అంతియేగాక నీకు శ్రీరామచంద్రుని పాదకమలములందు అనన్యప్రేమ జనించును.

సత్సంగము లేక శ్రీహరి కథలను వినలేము. శ్రీహరి కథలను వినకుండా మోహము విడనాడదు. ఆ మోహము విడువనిదే శ్రీరామచంద్రుని పాదకమలములయందు అచంచలమైన ప్రేమజనించదు. ఆ ప్రేమ బడయక కేవలము యోగ, తపో, జ్ఞాన వైరాగ్యములచే శ్రీ రఘునాథుని బడయలేము.

ఉత్తర దిశ యందు సుందరమైన నీల పర్వతము గలదు అచ్చట పరమ సుశీలవంతుడైన కాకభుశుండి నివసించుచున్నాడు. అతడు రామ భక్తులలో అగ్రగణ్యుడు; జ్ఞాని; గుణనిధి. చిరకాలముగా అచ్చట నివసించుచున్నాడు. అక్కడకు వెళ్ళి శ్రీహరి గుణగణములను వినుము. వానిని వినుటచే మోహముచే జనించిన నీ దుఃఖము నశించును."

ఈ విధముగా నేను గరుత్మంతుని సమాధానపరచి చెప్పగా అంతట అతడు నా చరణములకు ప్రణామ మొనర్చి ఆనందపడి బయలువెడలెను. ఉమా! నేను వానికి ఏమియు బోధించలేదు. ఎందుకనగా రాముడే వాని సందేహము తీర్చగలడు. అతని అభిమానమును శ్రీరామచంద్రుడే పోగొట్టగోరుచుండెను. అంతియేగాక పక్షులను పక్షియే సమాధాన పరచగలదు భవానీ! ప్రభువు యొక్క లీల బహు బలవత్తరమైనది. ఆ మాయకు మోహమొందని జ్ఞాని ఎవ్వడు గలడు?

జ్ఞానులలో భక్తులలో అగ్రగామి, త్రిభువనములకు భర్తయైన శ్రీహరి వాహనమైన గరుత్మంతుని గూడా మాయ మోహమొందించెను. మరి



మనుష్యులు మూర్ఖులై గర్విష్ఠులగుదురు. ఈ మాయ శివుడనైన నన్ను, బ్రహ్మను గూడ మోహమొందించినపుడు తదితరులయిన వారెంతటి వారు? మనస్సులో ఈ విధముగా గుర్తెరిగియే మునిగణము ఆ మాయాధీశుడైన భగవంతుని భజింతురు.

గరుత్మంతుడు నిశ్చలమైన బుద్ధికుశలత గలవాడు. అతడు పూర్ణ భక్తుడైన కాకభుశుండి వద్దకు వెళ్ళెను. ఆ పర్వతమును గాంచి అతని మనస్సు పరమానందమును పొందెను. అంతియేగాక క్రమముగా మాయయు; మోహమును ఆలోచనయు అంతయు నశించుచుండెను. గరుత్మంతుడు తటాకమున స్నానమాచరించి, జలపాన మొనర్చి ప్రసన్న చిత్తుడై వటవృక్షము చెంతకు వెళ్ళెను. అచ్చట శ్రీరామచంద్రుని సుందర కథను వినుటకు వృద్ధ పక్షులన్నియూ వచ్చియుండెను. కాకభుశుండి కథను ఆరంభించు సమయమున గరుత్మంతుడు అచ్చటకు ఏతెంచెను. పక్షిరాజైన గరుత్మంతుడు వచ్చుట చూచి కాకభుశుండితో గూడి పక్షిగణమంతా పక్షిరాజునకు ఆదర సత్కారములు గావించి స్వాగతము పలికి కూర్చుండుటకు సుందరమైన ఆసనమిచ్చెను. కాకభుశుండి ప్రేమతో గరుత్మంతుని పూజించి మధుర వాక్కులతో నిట్లనెను.

"ఓ పక్షిరాజా! నీ యొక్క దర్శనముచే నేను కృతార్థుడనైతిని. నీ వేది ఆజ్ఞాపించిన నేనది చేయుదును. ప్రభూ! మీరు ఏ కార్యార్థమై ఇట కేతెంచితిరి?"

అంతట పక్షిరాజు మృదుమధురముగా ఇట్లనియెను. నీవు కృతార్థుడవు. నీ యొక్క మాహాత్మ్యము స్వయముగా ఆయన నోటితోనే ఉద్ఘాటించెను. ఆర్యా! వినుడు. నేనే కార్యార్థమై ఇట కేతెంచితినో, అది యంతయు నేనిచటకు వచ్చినంతనే పూర్తి అయ్యెను. ఇంకను నీ యొక్క దర్శనము కూడా అయ్యెను. నీ యొక్క పరమ పవిత్రమైన ఆశ్రమమును చూచియే నా యొక్క మోహ, సందేహములు, అనేక విధములైన భ్రమలు తొలగిపోవుచున్నవి. ఆర్యా!

యిప్పుడు నీవు నాకు అత్యంత పవిత్రమైనది, ఎల్లప్పుడు సుఖమిచ్చునది, దుఃఖములను పారద్రోలునదియైన శ్రీరామచంద్రుని కథను విన్పింపుము. నిన్ను మిగుల ప్రాధేయపడు చున్నాను.”

గరుత్మంతుని ప్రేమయుక్తమైన సరళమైన, వినయముతో కూడిన ఆ మధుర వాక్కులను కాకభుశుండి మనస్సున అమితోత్సాహమును పొంది శ్రీరామచంద్రుని గుణగణముల కీర్తించు కథను చెప్ప దొడంగెను.

భవానీ! మొదట అతడు మిగుల అనురక్తితో “రామచరిత మానస” స్వరూపమైన కథను విన్పించెను. తదుపరి నారదుని అపారమైన మోహము; రావణుని అవతార కథను చెప్పెను. తదుపరి శ్రీరామచంద్రుని అవతార కథను వర్ణించెను. తదనంతరము శ్రీరామచంద్రుని బాల లీలను చెప్పెను. మిగుల ఉత్సాహభరితుడై అనేక విధాల శ్రీరామచంద్రుని బాల లీలలను వర్ణించి విశ్వామిత్రుడు అయోధ్య కేతెంచుట వివరించెను. శ్రీరామచంద్రుని వివాహమును వర్ణించెను. తదుపరి శ్రీరామచంద్రుని పట్టాభిషేక ప్రసంగము; ఆ తర్వాత దశరథ మహారాజు కైకేయి కిచ్చిన వరములచే పట్టాభిషేకము ఆగిపోవుట; తదనంతరము నగరవాసుల విరహము, విషాదమగు శ్రీరామలక్ష్మణుల సంవాదమును వినిపించెను. అనంతరము శ్రీరామచంద్రుని వనగమనము, భరతుని ప్రేమ కథ; గంగానది దాటి ప్రయాగ యందు నివాసము; వాల్మీకి శ్రీరామచంద్రుల కలయిక; ఆ తర్వాత భగవానుడు చిత్రకూట పర్వతమున నివసించుట అంతయు చెప్పెను.

అనంతరము మంత్రియైన సుమంత్రుడు నగరమునకు మరలి వచ్చుట, దశరథమహారాజు యొక్క మరణము, భరతుడు అయోధ్య కేతెంచుట తెలిపి అతని ప్రేమనంతయు అనేక రీతుల వర్ణించెను. రాజు యొక్క అంత్యక్రియలు చేసి, నగరవాసులను తోడ్కొని భరతుడు సుఖనిధియైన శ్రీరామచంద్రునివద్దకు వెళ్ళుట శ్రీ రఘునందనుడు అనేక రీతుల భరతుని సమాధానపరచుట, చివరకు భరతుడు శ్రీరాముడిచ్చిన పాదుకలను తీసుకొని అయోధ్యా



నగరమునకు మరలుట, ఆ కథ యంతయు చెప్పెను. భరతుడు నందిగ్రామమున నివసించిన విధము, ఇంద్రుని కుమారుడైన జయంతుని గర్వభంగము, శ్రీరామచంద్రుడు, అత్రి మహర్షుల సమాగమమును వర్ణించెను. విరాధుని వధ; శరభంగుని శరీర త్యాగమును చెప్పి సుతీక్ష్ణుని ప్రేమను వర్ణించి, శ్రీరామచంద్రుని అగస్త్యుని సత్సంగ సమాగమమును వర్ణించెను. గుహుని స్నేహమును వర్ణించెను. తదుపరి పంచవటియందు నివసించి, మునుల భయమును పారద్రోలిన విధమును చెప్పెను. లక్ష్మణునకు ఉదాత్తమైన ఉపదేశ మొనర్చుట, శూర్పణఖను కురూపిని చేయుట మొదలగు వర్ణన చేసెను. ఆ తరువాత ఖర దూషణులను వధించుట, రావణుడు ఈ సమాచారమును గుర్తెరిగిన విధమును చెప్పెను. రావణ మారీచుల సంవాదమును చెప్పెను. మాయా సీతాపహరణము, రఘునాథుని విరహమును వర్ణించెను. జటాయువు యొక్క సమాచారము, రాముడు కబంధుని వధించి, శబరికి మోక్షము నొసంగిన విధము, శ్రీ రఘునాథుడు పంపాసరోవర తీరమున విరహముచే తిరుగాడుట మొదలగునదంతయు విన్పించెను. శ్రీరామచంద్రుని నారద మహర్షుల యొక్క సంవాదము, హనుమంతుని కలయిక, సుగ్రీవుని స్నేహము, వాలి వధను వర్ణించెను. సుగ్రీవుని రాజ్యాభిషిక్తు నొనర్చుట, ప్రవర్షణ పర్వతమున శ్రీరామచంద్రుడు నివసించుట, అక్కడి శరదృతువు యొక్క వర్ణన, వర్షఋతు వర్ణనను చేసెను. శ్రీరామచంద్రుడు సుగ్రీవునిపై కోపించుట, అందుకు సుగ్రీవుడు భయమొంది వానరులను అన్ని దిశలకు సీత జాడను కనుగొనుటకు పంపుట, వారందరు బిలమునందు ప్రవేశించుట అచ్చట సంపాతిని కలియుటయు చెప్పెను. సంపాతిచే కథనంతయు విని, పవన పుత్రుడయిన హనుమ సముద్రమును దాటుట, లంకను ప్రవేశించి సీతను ఓదార్చిన విధమును వర్ణించెను. అశోక వనమును పీకి రావణుని హెచ్చరించి, లంకను దహించి, సముద్రమును దాటి వానరులతో గూడి శ్రీరామచంద్రుని వద్ద కేతెంచి, జానకి యొక్క కుశల వార్తను ఎఱింగించుటయు చెప్పెను. సేనతోగూడి శ్రీ రఘువీరుడు

సముద్రపు ఒడ్డుకు జేరుటయు, విభీషణుడు వచ్చి శ్రీరామచంద్రుని కలియుటయు, సముద్రమున వారధి కట్టుటయు మొదలగునవన్నియు చెప్పెను. సేనతో సముద్రమును దాటుట వాలి పుత్రుడైన అంగదుడు దూత యగుటయు వర్ణించెను. రాక్షస వీరుల యుద్ధమును అనేక రీతుల వర్ణించెను. కుంభకర్ణుని, మేఘనాదుని బలపరాక్రమములు తెలిపి వారి వధను వర్ణించెను. అనేక రీతుల రాక్షసుల వధ, రామ రావణుల యుద్ధము రావణుని వధ, మండోదరి శోకము, విభీషణుని శోకము, దేవతలు దుఃఖరహితు లగుటయు వర్ణించెను.

సీతారాముల కలయిక, దేవతలందరూ చేతులు జోడించి స్తుతించుట, వానర సమేతముగా పుష్పకవిమానముపై నెక్కి శ్రీరాముడు అయోధ్యకు బయలు వెడలుటయు చెప్పెను శ్రీరామచంద్రుడు అయోధ్యా పురమునకు ఏతెంచిన వృత్తాంతమును కాకభుశుండుడు పలుతెఱంగుల వర్ణించెను తదుపరి శ్రీరామ పట్టాభిషేకమును వర్ణించెను. అయోధ్యా పురమును అందలి రాజనీతిని అనేక రీతుల వర్ణించెను. కాకభుశుండి చెప్పిన ఈ శ్రీరామ కథనంతయు విని, గరుత్మంతుడు పరమానంద మొంది ఈ విధముగా పలికెను.

"శ్రీరామచంద్రుని చరిత్రనంతయూ నేను వింటిని, అందుచే నా సందేహము నివృత్తమయ్యెను. కాకశిరోమణీ! నీ అనుగ్రహముచే రామచంద్రుని చరణములందు నాకు మనస్సు లగ్నమయ్యెను. యుద్ధమున నాగపాశ బంధనమును గాంచి నాకు మిగుల మోహముదయించెను. శ్రీరామచంద్రుడు సచ్చిదానంద స్వరూపుడై ఎందువలన వ్యాకులుడయ్యెనని లౌకికజనుల రీతిగా జరిగిన విషయమును కనుగొని నా హృదయమున మిగుల సందేహము గలిగెను. నేను ఇప్పుడు ఆ భ్రమను వీడి తమ అనుగ్రహమున సమాధానపరుపబడితిని. నాపై దయగొని అనుగ్రహించితివి. ఎండ యందు మిగుల వ్యాకులపడిన వాడే వృక్షపు నీడ యొక్క సుఖమెఱుగ



గలడు, నాకీ అత్యంత మోహము కలుగక పోయిన యెడల మిమ్ముల నే విధముగా కలువగలను? మీరు అనేక రీతుల గానము చేసిన విచిత్ర సుందరమగు శ్రీహరికథ నేనే ప్రకారము విన గలుగుదును? వేదపురాణములు, శాస్త్రములు ఇట్లే చెప్పుచున్నవి. ఇందు సందేహములేదు. శ్రీరామచంద్రుడు ఎవ్వరిని కృపతో జూచునో వారికే సత్సంగము ప్రాప్తించును. శ్రీరామచంద్రుని కృపచే నాకు మీయొక్క దర్శన భాగ్యము కలిగెను. మీ దయవలన నా సందేహము తొలగి పోయెను."

పక్షిరాజు యొక్క ప్రేమమయముల వినయభరితములు అయిన భాషణములను విని కాకాభుశుండి శరీరము పులకితమాయెను. ఆయన నేత్రములందు ఆనంద బాష్పములు స్రవించెను. ఆయన మనస్సు భక్తి పరవశమయ్యెను.

ఉమా! సరళ హృదయులైన బుద్ధి మంతులైన హరిభక్తులు ఉత్తమ శ్రోతలను పొంది అతి రహస్యమైన విషయములను గూడా ప్రకటించు చుందురు. కాకభుశుండి గరుడునితో మరల ఈ రీతిగా పలికెను. "ఆర్యా! నాకు మీరు పూజ్యులు. మరియు శ్రీరామచంద్రుని కృపాపాత్రులు. మీకు సందేహము గాని, మోహము గాని, మాయగాని లేదు. ఆర్యా! మీరు నాపై దయతో ఇచ్చటకు వచ్చితిరి. భగవానుడైన పరమేశ్వరుడు మోహము వైదొలగుట అను సాకుతో మిమ్ములను నా వద్దకు పంపి, నాకు ఘనతను ప్రసాదించెను. గరుత్మంతా! ఈ ప్రదేశము ఆశ్రమము గాదు. నారదుడు, శివుడు, బ్రహ్మ సనకాది మహర్షులు ఉపదేశింప శ్రేష్ఠులు. లోకమున కామము ఎవ్వరిని ఆడింపకుండెను? తృష్ణ ఎవ్వరిని మతి లేనివానిగా చేయకుండెను? క్రోధ మెవ్వరి హృదయమును జ్వలింపజేయకుండెను? ఈ లోకమున మోహము యొక్క ప్రలోభమున పడని జ్ఞానులు గాని, తపస్వులు గాని, శూరవీరులు గాని, కవులు గాని, పండితులు గాని, గుణవంతులు గాని లేరు. ధనము ఎవ్వరికి మదమును కలిగింపకుండెను? అధికారము ఎవ్వరిని

గర్విష్ఠులను చేయకయుండెను? స్త్రీ నేత్ర బాణములకు ఎవరు గురికాలేదు? త్రిగుణములచే ఉన్మాదము ఎవరికి కలుగకయుండెను? అభిమాన గర్వములను అంటని వారెవ్వరూ లేరు యౌవనజ్వరము ఎవరిని కలత పెట్టకుండెను? మమత్వము ఎవ్వరిని నాశనము చేయకపోయెను? మత్సరము ఎవ్వరికి కళంకము ఆపాదింపకుండెను? శోకము ఎవ్వరిని కలతపెట్టలేదు? చింత అను సర్పము ఎవ్వరిని కాటువేయలేదు? జగత్తులో మాయకు బలిగాని వాడెవ్వడున్నాడు?

కోరిక పురుగు వంటిది. దేహము కట్టె వంటిది. ఈ పురుగు అను కోరిక శరీరమున లేనివాడెవ్వడున్నాడు? పుత్రునిమీద, ధనము మీద, ప్రతిష్ఠపైన గల జటిలమైన కోరికలు ఎవ్వరి బుద్ధిని మలినము చేయలేదు? ఇవియన్నియు మాయ యొక్క బలమైన పరివారములు. ఇవి అపారమైనవి. వీటి వర్ణన ఎవ్వరు చేయగలరు? పరమశివుడు బ్రహ్మ గూడా ఈ మాయకు భయపడుచుండ ఇతరులు ఏమి లెక్కలోనివారు? మాయ యొక్క విస్తృతమైన సేన ప్రపంచమంతటా వ్యాపించియున్నది. కామ, క్రోధ, లోభ, మోహములుగాని సేనాపతులు, దంభము. కపటము, అసూయ దాని యొక్క పరివారము. ఆ మాయ శ్రీ రఘుపతి యొక్క దాసి అని గుర్తించి నట్లయిన అది మిథ్యయే, కాని శ్రీరామచంద్రుని దయలేక అది వదలదు. నేనిది ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. జగత్తు నంతటిని నాట్యము చేయించే ఈ మాయ ఈశ్వరుని సంకల్పముచే ఆటబొమ్మవలె ఆడుచున్నది.

శ్రీరామచంద్రుడు సచ్చిదానంద స్వరూపుడు జన్మరహితుడు, విజ్ఞాననిధి, బలవంతుడు, సర్వవ్యాపకుడు, అనంతుడు, అమితశక్తి మంతుడు, ఆరు ఐశ్వర్యములతో తులతూగువాడు, నిర్గుణుడు, మాయా రహితుడు జితేంద్రియుడు, అన్నిటిని చూచువాడు, దోషరహితుడు, అజేయుడు, దేనియందు మమత్వము లేనివాడు, మోహరహితుడు, సుఖ సంపన్నుడు, ప్రకృతికి ఆవలనుండువాడు, సర్వసముడు, అందరి హృదయమున



నివసించువాడు, కోరికలు లేనివాడు, నాశము లేనివాడు, అంధకారము సూర్యుని వద్దకు జేరునా?

రామచంద్రుడు భక్తుల కొరకై మానవ శరీరము దాల్చి, సాధారణ మనుష్య మాత్రుని వలె పరమ పావన చరిత్రను ప్రకటించెను. నటకుడు అనేక వేషములు దాల్చి అనేక రీతుల ఆడినను, హావ భావములను జూపినను, స్వయముగా ఆయన ఆ నటుడు ఎప్పుడునూ గాడు. గరుత్మంతా! శ్రీరామచంద్రుని లీలయు ఇట్టిదే! రాక్షసులను మోహ వశులనొనరించి భక్తులకు సుఖము కలుగజేయుచున్నాడు. మలిన బుద్ధి గలవాడు, విషయలోలుడు, కాముకుడు అగు మనుజుడే శ్రీరామచంద్రుని యెడ సామాన్య భావమును ఆరోపణ చేయుచున్నాడు. నేత్ర దోషము గలవాడు చంద్రుని పచ్చరంగున చూచుచున్నాడు. భ్రమ పడినవాడు సూర్యుడు పశ్చిమమున ఉదయించెనని చెప్పును. నౌకపై ఎక్కినవాడు ప్రపంచము కదలుచున్నటుల భయపడును. అంతియేగాక మోహవశమున తాను స్థిరముగా నున్నాననుకొనును. బాలకుడు గిరగిరతిరుగుచు గృహములు మొదలగునవి తిరుగుచున్నట్లు భావించును.

శ్రీహరికి మోహము గలదని ఆరోపించుట గూడా యిటువంటిదే. భగవానునకు స్వప్నమున గూడా అజ్ఞానమనునది లేదు. కాని మాయాధీనులు, మందబుద్ధులు, బుద్ధిభ్రష్టులగు మనుజుల మనస్సున అనేక విధములగు అజ్ఞానపు తెరలు అలముకొన్నవి.

కామ, క్రోధ, లోభ, మదములు ముప్పిరిగొని, దుఃఖ భూయిష్ఠ మగు గృహాలందు అసక్తులగువారు శ్రీరామచంద్రుని ఎట్లు తెలుసుకొన గలదు? ఆ మూర్ఖులు అంధకారరూపమగు కూపములోపడి మునిగి తేలుచున్నారు.

నిర్గుణోపాసన సులభమైనది. కాని సగుణోపాసనమును ఎవరూ తెలియజాలరు. అందువలన ఆ సద్గుణ భగవానుని పలు తెఱంగులైన చరిత్రలను విని మునిశ్రేష్ఠుల మనస్సు గూడా భ్రమకు లోనగును.

ఓ గరుత్మంతా! శ్రీ రామచంద్రుని మహిమ వినుడు, నా బుద్ధికి తోచినవిధముగా ఆ సుమధుర కథనుచెప్పెదను. నా కేవిధముగా మోహము కలిగెనో ఆ కథనంతయూ మీకు చెప్పెదను. ఆర్యా! మీరు శ్రీరామచంద్రునికి కృపాపాత్రులు. అందువలన మీరు నాకు సుఖమును ఇచ్చువారే. మీవద్ద కొంచమైననూ దాచవలచినది లేదు. మిగుల రహస్యమగు విషయములు గానము చేసి విన్పించెదను.

శ్రీరామచంద్రుని సహజస్వభావము వినుము. ఆయన భక్తుల మనస్సులో అహంకారమును లేశమైనను ఉండనీయడు. ఎందుకనగా అది మానవుల జనన మరణ బంధనమునకు కారణమగును. తల్లి తన బిడ్డకు కురుపులేచిన యెడల ఏడ్చుచున్నను త్వరగా నయమగుటకు ఆ పుండును చిదిపి మందు రాయును. అటులనే శ్రీరాముడు భక్తుల క్షేమమునకై అట్లు చేయును. అది ఆదిలో కొంత బాధ కలిగించినను అనంతరము ఆరోగ్యకరమే అగును. ఓ పక్షిరాజా! ప్రభువైన శ్రీరాముని భక్త వాత్సల్యమును నా తెలివితక్కువ తనమును వెల్లడింతును వినుము. నేను తరచుగ అయోధ్యా నగరమునకు వెళ్ళి వచ్చుచుందును. ఎందుల కనగా బాలరూపుడైన శ్రీరామచంద్రుడు నా యిష్టదైవము. ఆయన దివ్యలీలలను ఆలోచింపవలెనను అపేక్షతో కాకిరూపము ధరించి బాల రాముని వెంటనంటి తిరుగుచు ఆ స్వామి దివ్యసుందర స్వరూపమును సందర్శించుచు ఆయన ఎంగిలి తినుచుందును. త్రిభువన మోహనమైన ఆ ప్రభువు దివ్య సౌందర్యమును ఎంతని వర్ణింతును? ఏమని చెప్పుదును?

అయోధ్యలో రాజభవనమునకు వెనుక రమణీయమైన ఉద్యానవన మున్నది. బాలుడైన శ్రీరాముడు ఆడుతూ పాడుతూ సహోదరులతో కూడి అందు విహార మొనర్చుచుండును. ఒకానొక సమయమున ప్రభువు అత్యద్భుతమైన లీలావిలాసమును ప్రకటించెను. నేను దానిని మరువలేను. వర్ణింపలేను. శక్తికొలది చెప్పెదను సావధానముగా వినుము. కాకినై అల్లంతదూరమున ఎగురుచున్న నన్ను పట్టుకొనవలెనని బాలరాముడు



నవ్వుచు నా వైపు చేతులు చాచెను. నేను భయపడి ఆయన చేతులకు అందకుండా ఎగిరి అటునిటు పరుగెత్తి బ్రహ్మ లోకమునకు పోయి వెనుదిరిగి చూచితిని. ఆశ్చర్యము! బాలరాముని చిన్నారి హస్తములు నావైపునకే చాచి ఉండెను. ఆ చేతులకును నాకును రెండంగుళముల ఎడముండెను. మరల అక్కడనుంచి వేగముగా ఎగిరితిని. తిరిగి చూడగా మరల రెండంగుళముల ఎడమే కనుపించెను. మరల వేగముగా ఎగిరి మేడ ఆవరణములను దాటిపోయితిని. మరల ఆ రెండంగుళముల ఎడమే అగుపించెను. అప్పుడు నేను మిగుల ఆశ్చర్యపడి, భయముతో కన్నులు మూసుకొంటిని. తిరిగి తెరచి చూచితిని. శ్రీరామచంద్రుడు చిరునవ్వు నవ్వెను. అట్లు నవ్వుచుండగా నేను ఆయన నోటిలోనికి వెళ్ళి ఆయన కడుపు నందు జొరబడితిని.

అక్కడ పెక్కుమంది బ్రహ్మలు, విచిత్రలోకములు, త్రిమూర్తులు, సూర్యచంద్రులు, నక్షత్రములు, అరణ్యములు, పర్వతములు, సముద్రములు, నదులు, కాలువలు, దేవతలు, రాక్షసులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు గలిగిన లోకములన్నియు కనిపించెను. అవి ఒకదానిని మరొకటి మించియుండెను. ఒక్కొక్క బ్రహ్మాండములో నేను నూరు సంవత్సరములు గడపితిని. ఆ సమయమున శ్రీరామచంద్రుడు అవతరించి లీలలు చేయుచుండుట చూచుచూ తిరుగు చుంటిని. అట్లు అనేక కల్పములు తిరిగి ప్రభువు జన్మదినోత్సవమునకు అయోధ్యకు వచ్చి వారిని దర్శించితిని. ఇది అంతయు ఆయన యుదరములో నాకు రెండు గడియలవలె మాత్రమే గడచెను. శ్రీరామచంద్రుడు మరల నవ్వెను. అట్లు నవ్వుచుండగా నేను బయలుపడితిని. అప్పుడు నా మనస్సునకు సంతోషము కలిగెను. కాని ఆయన కడుపులో నున్నప్పుడు చూచినదంతయు జ్ఞప్తికి వచ్చి నేను దీనుడనై విలపించుటను గాంచి శ్రీరామచంద్రుడు నన్ను తన దాసునిగా అనుగ్రహించినవాడై నన్నావహించిన మాయను తొలగించెను. అంతట నా హృదయము మిగుల శాంతించెను.

అప్పుడు భగవానుడు “ఓ కాకభుశుండి! నీపై నాకు ప్రేమ కలిగినది. నీకిష్టము వచ్చిన వరము కోరుకొనుము. ధనములా! ధాన్యములా! ఐశ్వర్యములా! ఏమి కావలయునో అడుగుము. ఇచ్చెదను.” అని అనగా నేను మిగుల సంతసపడి “దేవా! మీ పాదపద్మముల యందు ఎల్లప్పుడు గాఢభక్తి కలిగియుండునట్లు వరమి”మ్మని అడిగితిని. అంత శ్రీరామచంద్రుడు “తథాస్తు” అని నన్ననుగ్రహించి దీవించెను.

మరియు ప్రభువు నాతో నిట్లు పలికెను. “ఓ కాకభుశుండీ! నేను పుట్టువాడనుగాను. అందరి హృదయములో నుండువాడను. అన్నిటిని తెలిసినవాడను. నన్ను భజించు వారి భారమున వహించువాడను పదునాలుగు లోకములు నాచేతనే సృష్టించపబడినవి. అందువలన జీవులన్నియు నాకు ప్రియములు. నా ప్రాణములతో సమానము. భక్తి గలిగినవాడు నీచుడైనను నాకు పరమ ప్రియుడు. అట్టిచో మంచి సేవకు నిపై ఏ యజమానికి ప్రేమ యుండదు?

ఒక తండ్రికి పదిమంది పుత్రులుండెద రనుకొనుము. వారలలో ఒకడు వీరుడు, మరొకడు తాపసి, ఒకడు పండితుడు, వేరొకడు సత్యవ్రతుడు, ఒకడు జ్ఞాని, ఒకడు విరాగి, ఒకడు తండ్రికి సేవలొనర్చు వాడు పితృ వాక్పరిపాలకుడు. తండ్రికి వారియందరి యందు ప్రేమ ఉండును. అయినను ఎల్లప్పుడు తన సేవయందే కాలము గడపు పుత్రుని యందు మిక్కిలి ప్రేమ యుండును.

మదము, మోహము, అహంకారము వదలి నన్ను భజించువారు నాకు మిక్కిలి ప్రియులు. నా ఆశీర్వాద బలముచే నీయందు భక్తి జ్ఞాన వైరాగ్యములు దిన దినాభివృద్ధి నందును. ఇక నీకు నా మాయా మోహములు వ్యాపించవు నన్ను పరబ్రహ్మగా తలంపుము. భగవానుని భజించనివాడు భవసాగరమును దాటజాలడు. శాంతిని బడయలేడు. నామహిమ అనన్యమయినది. అనంతమైనది. దానిని ఆదిశేషుడు గూడా వర్ణింపలేడు.”



ఈ విధముగా నాతో పలికి ప్రభువు సామాన్య బాలునివలె కనుల బాష్పములు స్రవింప తల్లివైపు చూచి యేడ్వసాగెను. అంత కన్నతల్లి కౌసల్యాదేవి పరుగు పరుగున వచ్చి చిన్నరామునెత్తుకొని కౌగిట నొత్తు కొనిముద్దాడి ఒడిలో కూర్చుండ బెట్టుకొని పాలిచ్చెను. ఇట్లు కొంత కాలము అయోధ్యలో గడపి శ్రీరాముని బాల్య లీలలు కనులార గాంచి వచ్చితిని.

“గరుత్మంతుడా! మీరు మీమీ శక్తికొలది ఆకాశమున కెగురుదురు. కాని ఆకాశము యొక్క అంతము తెలిసినవారు ఎవరును లేరు. రాముని మహిమ యట్టిదే. భగవానుని బలము అనంతము. ఆయన శక్తి గొప్పది. అంతటివారు మరొకరు లేరు. ఆయనకు ఆయనయే సాటి. గురూపదేశము లేనిది భవసాగరమును దాటలేదు.”

కాకభుశుండి మాటలు విని గరుత్మంతుడు సంతసించి “మహాను భావా! మీ ఉపదేశము వలన నాకు జ్ఞానము కలిగినది. నా అజ్ఞానము నశించినది. నా సందేహములు తీరినవి. మీరు శ్రీరాముని పరమభక్తులు. వారి గుణములన్నియు ఎరిగినవారు. కాని మీరు ఆకాశములో విహరించువారు. మీరు అయోధ్యలోనున్న శ్రీరామచంద్రునికలియుట ఎట్లు తటస్థించెను. దయతో సెలవిండు. మరియునూ “ప్రళయకాలమున లోకములన్నియు నశించునని పురాణములు చెప్పుచున్నవి. ప్రళయకాలములో మీరుగాని, ఈ ప్రదేశముగాని నశించదని చెప్పుచున్నారు. ఇది యేమి యో తెల్పుడు” అని అనగానే కాకభుశుండి గరుడునితో ఇటుల చెప్పెను. “జప, తపో, యజ్ఞ, యాగములు చేయుటకు ఫలము రాముని పాదపద్మముల యందు భక్తి కలుగుటయే గదా! నాకు ఈ శరీరమందే రామభక్తి కలిగినది. కనుక నేను ఈ శరీరమును మిక్కిలి ప్రేమించుచున్నాను పురుగుల వలన పట్టు ఉత్పత్తియగును. మనము ఆ వస్త్రమును ధరించి మిగుల ఆనందించుచున్నాము.

అందుచే మనము పట్టువస్త్రములకు మూలకారణములగు ఆ పురుగులను ప్రేమించక తప్పదు. అటులనే నేను నా యీ శరీరముపై

మిక్కిలి మక్కువగలిగి యున్నాను. జీవులు కడతేరుటకు భగవానుని భజించక తప్పదుగదా!

బ్రతుకుట, మరణించుట నా యిచ్ఛలో నున్నది. శరీరము లేనిదే ఎవరునూ ఏమియూ చేయజాలరు. అందువలన శరీరముండక తప్పదు. కనుక నేను కాకరూపమును వదలను. నేను సృష్ట్యాదినుండి అనేక జన్మల నెత్తితిని. కాని ఈ జన్మలో పొందిన సుఖముగాని, శాంతినిగాని మరి ఏ జన్మలో కూడా పొందలేదు. నేను అనేక జన్మలెత్తి నను అవి అన్నియు నాకు గుర్తు గలవు. నేను వానిని మరువలేదు. మరణ బాధను పొందలేదు క్రొత్త జన్మనెత్తు టనిన పాత వస్త్రమును వదలి క్రొత్త వస్త్రమును ధరించినట్లున్నది.

శ్రీరామ దర్శనానంతరము మాయగాని, మోహముగాని నన్ను ఆవహింపలేదు. మీకు ఇప్పుడు నా ప్రథమ జన్మ చరిత్రను చెప్పుచున్నాను. సావధానముగా వినుడు. కలికాలము ప్రవేశించగనే జనులందరు ఆధర్మపరాయణులైరి వేద పురాణములకు విరుద్ధముగా నడచుచుండిరి. ఆ దినములలో నేను అయోధ్యయందు శూద్రుడనై జన్మించి ఈశ్వరుని ఆరాధించుచుంటిని. ఇతర దైవములను స్మరింపకుంటిని. మీదు మిక్కిలి ద్వేషించుచుంటిని. నా మనస్సంతా కపటముతో నిండి యుండెను. నేను అయోధ్యయందున్నను, దాని మహిమను గ్రహింప జాలనైతిని. అయోధ్యయందు జనించినవారందరూ రామ భక్తులని యిప్పుడు గ్రహించితిని. నూటికి కోటికి ఒకరు పుణ్యాత్ములున్నను కలి కాలములో ప్రయోజనములేదు. కలికాలములో అందరూ వర్ణ సంకరులు, పాపాత్ములు, స్త్రీ పురుషులు పరస్పరము కలహించెదరు. బ్రాహ్మణులు వేదములను అమ్ముకొనెదరు. ఎవరేది చెప్పెదరో అదియే సిద్ధాంతము. విస్సన్న చెప్పినదే వేదము. శిష్యులు గురువులకు ఉపదేశము చేసెదరు. శూద్రులు బ్రాహ్మణులకు ఉపదేశము చేసెదరు. స్త్రీ, పురుషులు కామాతురులయ్యెదరు.



వరుసవావులు లేకుండ సంచరించెదరు. అందరూ భోగములతో గడపెదరు. త్యాగము లొనర్చువారు చాల తక్కువ.

కృతయుగములో జ్ఞానులైన మానవులు శ్రీహరిని ధ్యానించి ముక్తి నందుదురు. త్రేతాయుగములో జపతపోయజ్ఞ యాగాదులచే తరింతురు. ద్వాపరములో పూజలు చేసి కృతార్థులగుదురు. కలియుగములో రామనామము జపించుటచే ప్రభుగుణ గానముచే జనులు ముక్తిని బడయుదురు.

నేను చాలదినములు అయోధ్యలో నుంటిని. అచట ఒకప్పుడు గొప్ప కఱవు వచ్చెను. ఆహారము లేక కష్టములుపడి ఉజ్జయినికి వెళ్ళితివి. అక్కడ కొంతకాలముండి కొంతధనము సంపాటించి పరమేశ్వరుని ఆరాధించు చుంటిని. అచట నొక బ్రాహ్మణుడు శాస్త్రోక్తముగా ఈశ్వరుని ఆరాధించు చుండెను. మా యిద్దరికి బాగుగా పరిచయమయ్యెను. మేము ప్రేమతో పరస్పరము మాటాడుకొనుచుంటిమి. అతడు మంచి ప్రవర్తన గలవాడు. బుద్ధిమంతుడు, దయగలవాడు. ఇతర దేవతలను ద్వేషించడు. నేను మాత్రము ఆయనకు కపట భావముతో సేవచేయుచుంటిని. కాని అతడు నన్ను కన్న పుత్రునివలె ప్రేమించుచుండెను.

ఆయన నాకు శివమంత్రోపదేశ మొనర్చి నప్పటినుండి నేను నియమముగా శివాలయమునకు వెళ్ళి శివమంత్రమును జపించుచుంటిని కాని నాకు గర్వము హెచ్చెను. ఆడంబర మతిశయించెను. అహంకారము మితిమీరెను. విష్ణుభక్తులన్న ద్వేషము జనించెను. నా గురువుపై కూడా నాకు గౌరవము తగ్గెను. ఆయన కన్పించునపుడెల్ల ద్వేషమెక్కువగుచుండెను. యోగ్యుడైన ఆ బ్రాహ్మణుడు నా తలంపులను గ్రహించి అనేక నీతి వాక్యములు చెప్పి నన్ను మార్చుటకు ప్రయత్నించెను. కాని ఆయన బోధలు నా చెవిదూరలేదు. దుష్టబుద్ధిగల వారికి మంచి మాటలు చెవికెక్కవు గదా!

ఆ బ్రాహ్మణుడు ఒకనాడు నన్ను పిలిచి “నాయనా! శివుని ఆరాధించుట శ్రీరాముని ఆరాధించుటయే! శివ సమారాధనకు తగిన ఫలము శ్రీరామునియందు భక్తి అతిశయించుటయే. బ్రహ్మరుద్రాదులు శ్రీరాముని భజింతురు. నాయనా! పెద్దలను నీవు తృణీకరింపవద్దు. నీ ప్రవర్తన చక్కబరచుకొనుము” అని హెచ్చరించెను. కాని ఆయన హితోపదేశము లన్నియు నాయెడ నిష్ఫలములయ్యెను. క్రమముగా అహంకార మతిశయించి నాకు నా గురువునందు అనాదరము నిర్లక్ష్యము అధికమయ్యెను.

ఒకసారి నేను శివాలయములో కూర్చుండి శివనామము జపించుచుంటిని. అదే సమయమున మా గురువుగారు అచ్చటికి వచ్చిరి. వారిని చూచియు దురహంకారముతో నేను లేచి నమస్కరింపలేదు. గురువుగారు దయామయుడు. కనుకనే నా అవినయమును క్షమించి ఊరకుండెను. కాని పరమేశ్వరుడు నా అహంకారమును సహింపజాలక ఆగ్రహోదగ్రుడై “ఓరీ మూర్ఖుడా! గురువును అవమానించినవారు యుగయుగాల పర్యంతము నరకములో పడి నానాబాధలు అనుభవింపక తప్పదు. వేయి జన్మలు ఎత్తక తప్పదు. నీవు నీ గురువును చూచియు కొండచిలువ వలె కదలక మెదలక పడియుంటిని కావున నీవు కొండచిలువవై పోవుదువుగాక.” అని నన్ను శపించెను. ఆ భయంకర శాపమును విని గురువుగారు నాపై మిక్కిలి జాలిపడి హాహాకారము చేసిరి. నేను భయముతో గజగజ వణకిపోతిని. గురువుగారు నా కొఱకై పరమేశ్వరుని పరిపరి విధముల ప్రార్థించిరి.

“మోక్ష స్వరూపుడవైన ఓ భగవాన్! వీడు అమాయకుడు, అజ్ఞాని, మూర్ఖుడు. తెలియక తప్పుచేసెను. వీనిని క్షమించి రక్షించుము.” ఆ బ్రాహ్మణుని పలుకులు విని పరమేశ్వరుడు ఇట్లు పలికెను.

“ఓ ద్విజోత్తమా! వీని అవిధేయతకు నేను కోపించి వీనిని శపించితిని. నీ ప్రార్థన వినగానే నాకు నీపై దాక్షిణ్యము కలుగుచున్నది. కాని వీడు



చేసినది క్షమింపరాని అపరాధము. నా శాపము వృథాకాదు. ఈతడు వేయిజన్మ లెత్తక తప్పదు. అయినను వీనికి ప్రతిజన్మము నందును పూర్వజన్మస్మృతి యుండును. ఏ జన్మలోను క్లేశము కలుగదు. ఇతడు లోకములో ఎక్కడికైనను నిరాటంకముగా వెళ్ళగలడు. ఎంతటి సాహస కార్యములైనను చేయగలడు జ్ఞానులలో ఉత్తమోత్తమ స్థానము నందుకొనగలదు.

అని పలికి పరమేశ్వరుడు అంతర్ధాన మయ్యెను. భగవానుని వాక్యములు విని గురువుగారు సంతసించి నన్ను దీవించి వెళ్ళిపోయిరి.

ఓ గరుత్మంతుడా! కాలగతిని బట్టి నేను వింధ్యపర్వతములో చాల కాలము సర్పమైపడియుండి తరువాత కొన్నాళ్ళకు సర్ప శరీరమును వదలితిని. కాని ఎన్ని శరీరములు ధరించిననూ ఏమియూ బాధ పడలేదు. పాత వస్త్రమును వదలి నూతన వస్త్రమును ధరించినట్లు అనేక జన్మలు ఎత్తితిని. ఏ జన్మలో కూడా నేను దుఃఖమును పొందలేదు. ఈశ్వరుని దయవలన ఏ జన్మలోనూ పూర్వజన్మ జ్ఞానము కోల్పోవ లేదు. ఇప్పటికిని గురువుగారిని అవమానించిన దుస్సంఘటనము ఆ దయామయుడు నాపై చూపించిన కరుణయు జ్ఞప్తికి వచ్చినపుడెల్ల మిక్కిలి కుమిలిపోవుచుందును.

కడసారి నేను బ్రాహ్మణ జాతిలో జన్మించితిని. వయసు వచ్చిన తరువాత మా తండ్రిగారు నన్ను విద్యాలయమునకు పంపి చదివింప సాగిరి. కాని నాకు విద్యయందు ఇష్టము కలుగలేదు. శ్రీరాముని పాదములందు మిక్కిలి భక్తి కుదిరెను. అందుచే నాకు చదువు అబ్బలేదు. తల్లిదండ్రులు చదువుకొమ్మని ఎంత చెప్పినను విననైతిని. కొంత కాలమునకు తల్లిదండ్రులు గతించిరి. అంత నేను శ్రీరాముని స్మరించుచూ అరణ్యములందు తిరుగుచూ మునులను దర్శించి, నమస్కరించి, తెలియనివి అడిగి తెలుసుకొనుచుంటిని. అందుచే నాలో గల దుర్గుణములు చాల భాగము నశించినవి. శ్రీరాముని

ప్రత్యక్షముగా చూడవలె నను కోరిక అంతకంతకు అతిశయించుచుండెను. కొందరు మహాత్ములు, భగవానుడు, నిర్గుణుడు సర్వాంతర్యామి అని చెప్పుచుండిరి. కాని వారి వాక్యములు నాకు నచ్చలేదు. తిరుగుచు తిరుగుచు మేరు పర్వతము వద్దకు వెళ్ళితిని. అచ్చట ఒక వట వృక్షము క్రింద కూర్చుండి తపస్సు చేయుచున్న "లోమశ మహాముని"ని చూచి సాష్టాంగ నమస్కారము చేసితిని. ఆయన నా విధేయతను చూచి ఎవరు నీవు? ఎందులకు ఇచటకు వచ్చితివి? అని అడుగగా, "నేను శ్రీరామచంద్రుని స్వయముగా చూడగోరుచున్నాను. మీరు నాకు సగుణ మార్గమును ఉపదేశించి శ్రీరాముని చూపించ వలె" నని ప్రార్థించితిని.

ఆయన నిర్గుణ మతమును బోధించి సగుణమతమును ఖండించెను. నేను నిర్గుణ మతమును ఖండించి సగుణమతమును సమర్థించితిని అందులకు ఆ బ్రాహ్మణునకు నాపై మిగుల కోపము కలిగెను. ఎంతటి శాంత మూర్తికైనను అవమానము కలిగినయెడల కోపము రాకపోదు. చందనపు చెక్కయేయైనను బాగా రాపిడి పెట్టినయెడల అందుండి అగ్ని ప్రజ్వరిల్లును. అటులనే బ్రాహ్మణునికి మిగుల కోపము వచ్చెను.

"మాయావశుడైన జీవుడు ఈశ్వరునితో సమానుడు కాగలడా? అందరి హితముకోరు వానికి శత్రువులుందురా? పరుసవేది దగ్గరున్న వాడు దారిద్ర్యము అనుభవించునా? ఇతరులకు ద్రోహము చేయువాడు నిర్భయముగా తిరుగగలడా? బ్రాహ్మణులకు ద్రోహము తలపెట్టువాని వంశము నాశము కాకుందునా! ఆత్మానందము పొందువానికి కర్మల యందు ఆసక్తి యుండునా? పరస్త్రీలను కోరువానికి ఉత్తమ గతులుండునా? పరమాత్మని దర్శించిన వానికి జనన మరణ చక్రములో తగుల్కొనుట ఉండునా? నీతి లేని రాజు న్యాయముగా రాజ్యము చేయగలడా? తదేకదృష్టితో రాముని భజించువాడు పాపము చేయగలడా? ధర్మము చేయనివాడు దాతృత్వమును పొందగలడా? మానవ శరీరమును



పొందినందుకు రాముని భజింపక కాలయాపన చేయుట హేయము." ఈ విధముగా నేను అనేక ఉదాహరణములు చెప్పి సగుణ సిద్ధాంతమును నిరూపించితిని.

అందులకు ఆ మునీంద్రునకు నాపై చాలా కోపము వచ్చి "ఓరీ మూర్ఖుడా! సర్వోత్తమమైన జ్ఞాన బోధను చేసితిని. నీవు దానిని తిరస్కరించి కాకివలె ఏమేమో వాగుచుంటివి. కనుక నీవు కాకిరూపమును ధరించెదవు గాక!" అని నన్ను శపించెను. అపుడు నేను ఆ బ్రాహ్మణుని శాపముచే వెంటనే కాకి రూపమును ధరించి ఆకాశమునకు ఎగిరితిని.

శ్రీరామచంద్రుని పాదములందు ప్రేమగలవారు. క్రోధాభిమానములను త్యజించినవారై ప్రపంచము యావత్తును శ్రీరామ మయముగా చూచువారు ఇతరులతో వైరము ఎట్లు పెట్టుకొనెదరు? ఇది యంతయు ఆ ఋషి తప్పుగాదు. శ్రీరామచంద్రుడు అందరి హృదయములో నివసించువాడు. ప్రభువు ముని బుద్ధిని మార్చివేసెను. తరువాత ఆ బ్రాహ్మణుడు నాకు దయతో శ్రీరామ మంత్రమును ఉపదేశించి బాలరూపుడైన శ్రీరామచంద్రుని ధ్యానించుచుండుమని ఆదేశించెను. నేను నిత్యము ఆ మంత్రమును ధ్యానించుట వలన నాకు చక్కగా మనశ్శాంతి గలిగెను. ఆ బ్రాహ్మణుడు, నన్ను తనవద్ద కొన్నినాళ్లు ఉంచుకొని నాకు శ్రీరామచంద్రుని చరిత్రను చెప్పి ఇట్లనెను.

"నాయనా! నీవు శ్రీరామచంద్రుని ప్రియభక్తుడవని తెలిసి ఈ చరిత్ర నంతయు నీకు చెప్పియుంటిని. శ్రీరామునికి ఎవరు విముఖులో వారికి నీవు ఇది చెప్పవద్దు.

"తండ్రీ! జ్ఞాన వైరాగ్యములతో నీ హృదయము నిండియుండెను. నీవు భగవానుని భజించుచూ ఎచ్చట నివసించెదవో అచ్చటికి యోజనము వరకు మాయామోహములు వ్యాపించవు. కాల వైపరీత్యము వలన వచ్చు వ్యాధులు

నీకు ప్రాప్తించవు. భగవానుని పాదములందు నీకుగల భక్తి దిన దినాభివృద్ధి అగుచుండును. లోకములో నీకు అసాధ్యమైన పనిలేదు".

అని లోమశమహర్షి నన్ననుగ్రహించెను. నేను ముని పాదములకు సాష్టాంగ నమస్కార మొనరించి ఆయన ఆశీర్వాదము లందు కొని వారియొద్ద సెలవు దీసికొని మరల నా ఆశ్రమమునకు చేరితిని. ఇచ్చటకు నేను వచ్చి పదునేడు కల్పములు అయ్యెను. ఇక్కడ నేను ఎల్లప్పుడును శ్రీరామచరిత్రను గానము చేయుచుందును. భక్తి తత్పరతతో కూడి పక్షులన్నియు వచ్చి వినుచుండును. అప్పుడప్పుడు భగవానుడు మానవరూపము ధరించి అయోధ్యకు వచ్చినపుడెల్లా నేను వారి వద్దకు వెళ్ళి వారిని దర్శించి వారి వాక్యములను, విని ఆనందించి వచ్చు చుందును. నేను కాకి రూపము ధరించుటకు కారణమిది. రామభక్తి ఇట్టిది. అందువలన నాకు ఈ కాకి శరీరము మిక్కిలి ప్రీతి. రామ భక్తిలో ఇట్టి మాహాత్మ్యము ఉన్నది. ఇట్టి మహిమ ఉన్ననూ పామరులు దానిని తెలుసికొనలేరు. పాలకొఱకు ఇంటిలో ఉన్న కామధేనువును వదలి అడవిలో ఉన్న జిల్లేడు చెట్ల కొరకు అన్వేషించెదరు. వీరి మూర్ఖత్వమును ఏమని చెప్పుదును?

కాకభుశుండి వాక్యములు విని గరుత్మంతుడు సంతసించి "స్వామీ! ఇప్పుడు నా సందేహములన్నియు నశించినవి. రామచరిత్ర నంతయును వింటిని. కాని మిమ్ములను ఇంకొక విషయము అడుగదలచితిని. దానిని విశదీకరింపుడు. వేదపురాణములు, జ్ఞానముతో సమానమైనది వేరొకటిలేదని చెప్పుచున్నవి. మీరు భక్తిసులభమైనదని చెప్పుచున్నారు. జ్ఞానమునకు, భక్తికి భేద మెయ్యదియో తెలియజెప్పుడు''అని అడుగగా కాకభుశుండి గరుత్మంతునితో నిట్లనెను.

భక్తికిని, జ్ఞానమునకు, భేదమేమియు లేదు రెండునూ సంసారమునుండి తరించుటకు చెప్పబడినవి జ్ఞాన వైరాగ్యములు మహాపురుష లక్షణములు.



అవి చాల ప్రబలమైనవి. మాయ నర్తకివంటిది స్థిత ప్రజ్ఞులైనవారు, ధీరులైనవారు, మాయను జయించెదరు. కాముకులు, విషయవాంఛలు గలిగినవాడు, భోగులు మాయకు లొంగిపోయెదరు. మాయ భగవానుని వలన సృష్టింపబడినది గాన ఆయన దయ యుండిన గాని మానవులు మాయను జయింపలేరు. తపోధనులు మాత్రము మాయను ఎదిరించి జయమును పొందెదరు.

భగవానుని మాయ స్త్రీ రూపములో నున్నది. అందువలన భగవంతునికి విముఖులైనవారు మాయను జయించలేరు. భక్తిని చూచి మాయ భయమొందు చుండును. భక్తికొఱకు మహాపురుషులు సైతము పరితపించు చుందురు. జీవులందరూ దైవాంశ సంభూతులు. మాయావశులైన మాయా బంధములు మిక్కిలి బలమైనవి. జీవులు శుకములవలె మర్కటముల చందనమున తమంతట తామే బంధించుకొనెదరు. అవి మిధ్యయైయుండి కూడా మిక్కిలిగా ప్రతిఘటించిననే కాని విడివడవు.

ఇందులకె జపతపోయజ్ఞ హోమములనే మందులు వాడుమని పెద్దలు చెప్పియుండిరి. మాయాజీవులు అజ్ఞానమనే అంధకారము నందే చిక్కుపడి యున్నారు. కనుక శ్రీరాముని భజించినగాని ఆ మాయలు తొలగవు. నీచులకు గొప్పతనము చేకూరగనే వారిని రక్షించిన వారిని మరచెదరు. ఏలన అగ్నివలన పొగ యేర్పడును. కాని ఆ పొగయే మేఘాధిపత్యము చేకూరగనే వర్షమై తనను సృష్టించిన అగ్నిని చల్లార్చును. దారిన పడియున్న దుమ్ముపై అడుగువేసిన ఎగిరి నెత్తిన పడును. బుద్ధిమంతులైనవారు అల్పులతో స్నేహము చేయరు. నేను దుష్టుడను కనుక బ్రాహ్మణుని ఎదిరించితిని.

"శ్రీరాముని భక్తి సుందర చింతా వంటిది. అందరి హృదయములో ఉండును. అది స్వయం ప్రకాశము గలది. మోహమును దరికి రానీయదు. దాని నేశక్తియును ఎదిరించజాలదు. దాని ప్రకాశముచే ఎంతటి

గాఢాంధకారమైనను తొలగిపోవును. మద మాత్సర్యములనే మిడుతలు దానిలోపడి భస్మమగును. లోభము దాని చెంతకు చేరలేదు. దాని ప్రభావముచే విషము అమృతముగా మారిపోవును. శత్రువులు మిత్రులగుదురు. భక్తియనే మణి ఎవరివద్ద నుండునో వారికి ఆధివ్యాధులంటవు. మహాత్ములు ఆ మణి కొఱకు ప్రయత్నించెదరు. మహాత్ములుతప్ప దానిని ఎవరునూ తెలుసుకొనలేరు. శ్రీరాముని దయవలనే దానిని వారు పొందగలరు. దానిని పొందుటకు చాలా ఉపాయములున్నవి. దానికి జ్ఞాన వైరాగ్యములు రెండు నేత్రములు. భక్తిచే ఆ మణిని పొందవచ్చును. శ్రీరామభక్తులు సులభముగా ఆ మణిని పొందగలరు.

శ్రీరామచంద్రుడు సముద్రమువంటి వాడు. ఆయన భక్తులు మేఘముల వంటివారు. భగవానుడు చందన వృక్షము వంటివాడు. గాలి వీచిన సువాసన వ్యాపించును. మహాత్ములు దానిని పొందెదరు. సత్పురుషులతో సహవాసము చేయుటమేలు.

సాధువులనే దేవతలు వేదములనే సముద్రమును జ్ఞానమనే మందర పర్వతముచే మథించి భక్తి అనే అమృతమును పొందగలుగుచున్నారు. వైరాగ్యమనే డాలుచే తమ్ముతాము రక్షించుకొనుచు జ్ఞానమనే ఖడ్గముచే కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములనే శత్రువులను ఖండించి భక్తియనే విజయమును బడయుచున్నారు.

కాకభుశుండి పలికిన పలుకులు విని గరుత్మంతుడు మిక్కిలి సంతోషించెను. ఆయన కాకభుశుండికి నమస్కరించి "స్వామీ! నన్ను మీ సేవకునిగా భావింపుడు. నేను అడగబోవు ఏడు ప్రశ్నలకు దయచేసి సమాధానము లిందు–

అన్నిటికంటె దుర్లభమైన శరీరమేది?
అన్నిటికంటె గొప్పదైన దుఃఖమేది?
అన్నిటికంటె గొప్పదైన సుఖమేది?



సజ్జనులకును, దుర్జనులకును గల భేదమేమి?
అన్నిటికంటె భయంకరమైన పాపమేది?
అన్నిటికంటె గొప్పదైన పుణ్యమేది?
మనోరోగము లనగా నేవి?

నాయందు దయ యుంచి నా యీ సందేహములను తీర్చి నన్ను కృతార్థుని చేయుడు. తమరు సర్వజ్ఞులు. నా యందు మీకు పరిపూర్ణమైన అనుగ్రహము కలదు."

వినయ పూర్వకములైన గరుత్మంతుని మాటలకు కాకభుశుండి మిక్కిలి సంతోషించి యిట్లు పలికెను.

నాయనా! నీవడిగిన ప్రశ్నలకు సమాధానములు చెప్పుచున్నాను. సావధానముగ నాలకింపుము.

లోకములో మానవ శరీరము కంటె ఉత్తమమైనది మరొక్కటి లేదు. చరాచర ప్రాణులు సమస్తము మానవుని ఆశ్రయించి బ్రతుకుచున్నవి. స్వర్గ నరకములకు మానవ జన్మమే నిచ్చెన వంటిది. జగత్కల్యాణ కరములైన భక్తి జ్ఞానవైరాగ్యములు మానవ శరీరము నందే మనకు ప్రాప్తించును. ఇటువంటి మనుష్య జన్మము ప్రాప్తించియు శ్రీహరి భజనము చేయని మూర్ఖులు చేతి యందలి పరుసవేదిని పారవైచి పలుగురాళ్ళకై ప్రయత్నించు వారగుచున్నారు.

పక్షిరాజా! ధరణిలో దారిద్ర్యమును మించిన దుఃఖము మరి యొక్కటి లేదు. సకల బాధలకు దారిద్ర్యమే మూలము.

ఈ ప్రపంచములో సజ్జన సాంగత్యము వంటి సుఖము మరొక్కటి కానరాదు. సాధుసాంగత్యమే సర్వ సౌఖ్యములకు మూలమగుచున్నది.

సజ్జనులు మనోవాక్కాయ కర్మలచే పరోపకారము చేయుదురు. ఇది వారికి సహజ స్వభావము. దుర్జనులు పరులకు దుఃఖము కలిగింతురు. వారు స్వార్థపరులై పరులను హింసింతురు. సర్పములవలె, మూషికములవలె

ఆకారణముగ దుర్జనులు ఇతరులకు అపకారము చేయుదురు. దుర్మార్గులైనవారు వడగళ్ళ వంటివారు. వడగళ్ళు పంటను పాడుచేసి తాముకూడ నశించిపోవునట్లు దుష్టులు పరుల సంపదను నాశనము చేసి తమకు తాము నశించిపోవుదురు. సత్పురుషుల అభ్యుదయము చంద్రోదయమువలె, సూర్యోదయమువలె విశ్వమునకు సంతోషదాయకము. దుర్మార్గుల అభ్యుదయము కేతుగ్రహము యొక్క ఉదయమువలె లోకమునకు దుఃఖదాయకము.

అహింసవంటి పరమ పుణ్యము లేదు. పరనిందవంటి మహా పాపము లేదు. శివుని నిందించువాడు, గురునింద చేయువాడు తప్పక కప్పకడుపున జన్మించుదురు. బ్రాహ్మణనింద చేయువాడు కాకి కడుపున జన్మించును. వేదములను, దేవతలను నిందించు మూర్ఖులు రౌరవాది ఘోర నరకములలో పడెదరు. సత్పురుషులను నిందించువారు గుడ్లగూబలై జన్మింతుతు సకల జనులను నిందించు దుర్జనుడు గబ్బిలమై పుట్టి చీకటిలో తలక్రిందుగ వ్రేలాడును.

ఖగరాజా! ఇక మనో రోగము లననేవియో ఎరిగింతును. అన్ని రోగములకు మోహమే మూలము. కామము వాత రోగము. లోభము కఫ రోగము. క్రోధము పిత్తరోగము. వాత, పిత్త, కఫములు మూడును కలిసినచో సర్వానర్థములకు మూలమగు సన్నిపాత రోగము ఉత్పన్నమగుచున్నది. ఇంకనూ పెక్కు రోగములు గలవు. మమత్వము తామర; ఈర్ష్యే గజ్జి; అసూయ క్షయరోగము; కుటిలత్వము కుష్ఠరోగము; అహంకారము కీళ్ళువాపు; తృష్ణ జలోదరము.

జప తపోజ్ఞానముల వలనకాని, యజ్ఞముల వలనకాని, దాన ధర్మముల వలన కాని యీ రోగములు నశింపవు. ఈ సమస్త రోగములకు శ్రీరాముని కరుణయే మహౌషధము. రామ భక్తిసంజీవని వంటిది. ఈ భక్తి సంజీవని



యను ఔషధమును శ్రద్ధతో కూడిన సద్బుద్ధి అనే అనుపానముతో చేర్చి సేవించిన సమస్త రోగములు నశించును. మానవుడు ఆరోగ్యవంతుడగును.

రామభక్తి లేనిదే ఎంతటి చతురుడైనను కడతేరలేడు. శ్రీరాముని విమర్శించువాడు సుఖమును బడయలేడు. జలమును మథించిన నెయ్యి రాదు. దృఢభక్తి లేనిది మానవుడు సంసార సముద్రమును దాట జాలడు. భగవానుడు తలచిన దోమను బ్రహ్మను చేయగలడు. బ్రహ్మను దోమగా మార్చగలడు. కనుకనే మహాత్ములందరు శ్రీరాముని భజించుచుందురు. నేను అన్ని జన్మలు ఎత్తిన అనుభవముతో చెప్పుచున్నాను. శ్రీరామ చరిత్ర అద్భుతమైనది. అయినను నేను నీకు క్లుప్తముగా చెప్పితిని. అందరూ అన్ని వికారములు వదలి శ్రీరాముని భజించవలెనని వేదములు, పురాణములు చెప్పుచున్నవి. మీరును శివునకు ప్రియమైన శ్రీరామ చరిత్రను అడిగినారు. నేను అధమ జన్ముడనై కాకినై జన్మించినను శ్రీరాముని మరువలేదు.

నన్ను శ్రీరాముడు తన భక్తులైన సత్పురుషులలో ప్రథమునిగా నెంచెను. శ్రీరామ చరిత్రము సముద్రమువంటిది. "సంసారసాగరమును దాటవలెనన్న శ్రీరాముని తదేక నిష్ఠతో స్మరించవలెను. లేని యెడల దాటలేరు" మంగళ కరమగు కాకభుశుండి మాటలు విని గరుత్మంతుడు ఆయనకు నమస్కరించి ఇట్లనెను. "స్వామీ! మీ వలన శ్రీరాముని గుణగణములు విని కృతార్థుడనై తిని. మోహమనే సముద్రములో మునిగితేలుచున్న నాకు మీరు నావ వలె తోడ్పడినారు. అందుకు మీకు ప్రత్యుపకారము ఏమి చేయగలను? అందుకు మీకు నేను ఒక నమస్కారము చేయుచున్నాను.

నదులు, వృక్షములు, పర్వతములు, భూమి మొదలగు వస్తువులన్నియు పరులకు ఉపకారము చేయుచున్నవి. వాని హృదయములు ప్రేమమయ మైనవి కావున కవులు పొగడుచున్నారు. సత్పురుషుల హృదయములు వెన్నవంటివని వర్ణించుచున్నారు. అసలు సంగతి చెప్పరు. ఎందుకనగా వెన్న అగ్ని తాపము వలన గాని కరుగదు. పరమ పవిత్రులైన సత్పురుషుల

హృదయములు ఇతరుల కష్టములను చూచినంత మాత్రముననే కరగిపోవును.

“ఓ భక్తా గ్రగణ్యా! నీ దయవలన అన్ని సందేహములు తొలగిపోయెను. నా జీవితము ధన్యమయ్యెను. నా జన్మము సఫలమయ్యెను. నీ కృపచే కృతార్థుడనైతిని. నన్ను మీ దాసునిగా భావింపుడు.”

పార్వతీ! గరుత్మంతుడు ఈ విధముగ మాటిమాటికి కాక భుశుండి కొనియాడి నమస్కరించి ఆయన యొద్ద సెలవు తీసికొని రామనామస్మరణ చేయుచు వైకుంఠమునకు వెళ్ళిపోయెను.

“ఉమా! లోకములో సత్పురుష సమాగమము కంటె లాభ దాయకమైనది మరి యొక్కటి లేదు. అటువంటి సత్సంగము ప్రభువు దయలేకుండ ప్రాప్తింపదు.

గౌరీ! ఈ పవిత్రమైన చరిత్రము నీకు వినిపించితిని. ఈ కథను వీనులవిందుగా విన్నవారికి భవబంధములు తొలగిపోవును. భక్తజన కల్పవృక్షమై దయాసాగరుడైన శ్రీరామచంద్రుని చరణకమలముల యందు భక్తి యేర్పడును. త్రికరణశుద్ధిగా ఈ కథ నాలకించినవారికి మనోవాక్కాయ కర్మలచే ఉత్పన్నమైన సమస్త పాపములు నశించును, దానములు, ధర్మములు, వ్రతములు, జపములు, తపములు మొదలగు వానిచే కలుగు ఫలము శ్రీరామచంద్రుని చరణ కమలములందలి భక్తిచే కలుగును. శ్రీరాముని చరణములందు భక్తిగల మానవుడే సర్వజ్ఞుడు. అతడే ఈ ధరణికి అలంకారము. అతడే మహా విద్వాంసుడు. అతడే మహాదాత. అతడే ధర్మపరాయణుడు.

హైమవతీ! నీకు రామునియందు కల అచంచల భక్తిని తెలిసి కొని నీకు రామ కథను వినిపించితిని. రఘువీరుని చరిత్రము వినుటకు రామభక్తులు మాత్రమే యోగ్యులు శ్రీరాముని చరణములకు దూరమైన లోభులు, కాముకులు, దురాచారులు ఇందులకు అర్హులు కారు. ఇవి సర్వ



పాపహరము, కలికల్మష నాశకము. భవరోగ నివారకము. శ్రీరామ కథ చెప్పినవారు వినినవారు, ప్రశంసించినవారు ఈ సంసార మహా సముద్రమును గోష్పాదమును వలె దాటుచున్నారు.”

పరమేశ్వరుని పలుకులు విని పార్వతీదేవి పరమానంద భరితు రాలయ్యెను. ఆమె పరమశివుని చూచి “స్వామీ! మీ కృపచే నా సందే హములన్నియు పటాపంచలైనవి. ఓ విశ్వపతీ! మీ అనుగ్రహముచే నేను ధన్యురాలనైతిని” అని పలికెను.

జగత్కల్యాణ కారణమైన పార్వతీ పరమేశ్వర సంవాదము భక్తులకు బ్రహ్మానంద దాయకమైనది. సత్పురుషులకు సంతోష ప్రదమైనది. శ్రీరామకథ సర్వసౌభాగ్య సంపన్నము. సకల శ్రేయో నిదానము.

ఈ విధముగా ఉమామహేశ్వర సంవాదరూపమైన శ్రీరామ చరిత్రమును యాజ్ఞవల్క్య మహాముని భరద్వాజ మహామునికి విశేషమైన ఆదరముతో వినిపించెను. దీనిని శ్రీరామ భక్తుడైన తులసీదాసు “శ్రీరామ చరిత మానసము” అను పేరుతో హిందీ భాషలో రమణీయముగ రచించెను.

* * *

సమస్త దోష భంజనమును, సకల సహృదయ రంజనమునునైన
"రామ చరిత మానసము" అను మహా గ్రంథము
"శ్రీ తులసీ రామాయణము" అను నామముతో
శ్రీధరస పవిత్ర గోత్ర సంభవుడును, ఆదర్శ జీవనుడును,
శ్రీ వెంకటకోటమ్మ, నాగయ్య పుణ్యదంపతుల
గర్భ శుక్తి ముక్తాఫలమును, నిరంతర రామనామ స్మరణ పారాయణ
పరాయణుడును, సకల బుధజన విధేయుడునైన
**శ్రీ మిట్టపల్లి ఆదినారాయణ గుప్త**చే
తెలుగు భాషయందు అనువదింపబడినది.

సమస్త సన్మంగళాని భవంతు
సర్వేజనాః సుఖినో భవంతు
శ్రీరామచంద్ర ప్రసాద సిద్ధిరస్తు

* * *